శ్రీశుభమస్తు.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత
శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

ప్రసిద్ధకవీశ్వరుండైన

సిద్ధనమంత్రి ప్రణీతంబైన

# శ్రీసదాశివ రామాయణము

శిథిలంబైన బాలకాండము

చెలికట్ల నరసింహాచార్యులవారిచే పునఃప్రణీతమైన

ఈ గ్రంథరాజము

రా॥ పాలమాకుల తిర్మలరావుగారి

ద్రవ్యసహాయమువల్ల

అఫ్జల్గంజ్ హైదరాబాద్ దక్షిణ
మార్వాడి ముద్రణాలయములో ముద్రింపఁబడియె.

కాపీరేటు వెల. రు. 1-

శ్రీశుభమస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః



# రా॥ మత్మరాజు తిర్మల్ రావు పట్వారి

పాలమాకుల జాగీరు పేష్కారి

టప్పాఖాన పాలమాకుల జిలా మహబూబునగర్



—:( శ్రీశుభమస్తు ):—

శ్రీసీతా లక్ష్మణ భరత శతృఘ్న హనుమత్స మేత

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# ప్రసిద్ధకవీశ్వరుండైన

# సిద్ధనమంత్రి ప్రణీతంబైన

# శ్రీసదాశివ రామాయణము



శ్లో॥ ఆదౌరామతపో వనానిగమనం ♦ హత్వామృగంకాంచనం
వైదేహీహరణం ♦ జటాయుమరణం ♦ సుగ్రీవసంభాషణం
వాలీనిగ్రహణం♦ సముద్రతరణం లంకాపురీదాహనం ♦పశ్చాద్రా
వణకుంభకర్ణ హననం ♦ ఏతద్ధ్వరామాయణం ॥

రా॥ పాలమాకుల తిరలరావుగారి.

స్వంతద్రవ్య సహాయము వల్ల

శంఖవాహినశకం ౧౮౫౯ ఈశ్వరనామ సం॥ చైత్ర శు॥ ౧౦.

శ్రీరస్తు.

శ్రీశుభమస్తు.

—:( శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః ):—

—♦ శ్రీ శారదాయైనమః ♦—

# శ్రీ సదాశివ రామాయణము బాలకాండ

—[ పీఠిక. ]—

శ్రీకల్యాణగుణాభి రాముడగుచుఁ శృంగ రసూపంబుతో । రాకా చంద్రునిధిక్కరించు ముఖము నారిజిల్లభూజాత వా । మాంకంబందువసింప మానిజనముల్లాసింప శ్రీరామ భూ । రాకంఠీరవుడేఁ తిర్మలగుహారాయా గ్రణిశ్రేమచేఁ ॥

చ॥ కరమునపద్మమున్వెలయ కాంచన దేహముపట్టు పుట్టము । న్వరమణి కుండలంబు లును వాతెరవిద్రుమ తేజమొప్ప సీ । తరయమునారతంబు ధన ధాన్యసమృద్ధి నొసంగుచుండుగా। తిరుమలరాయధీమణికి దేవరరామరభక్తి శీలికిన్ ॥

క॥ వనరుహసంభవునకుయడ । మనుసౌందర్యంబుతోడ మధురంబగువీ । ణను బూనిశ్రుతులగూర్చెడు । ఘనవేణిని వాగ్వధూటిక దునర్చింతున్ ॥

తే॥ వ్యాసవాల్మీకి సంస్కృత వరకవులను ♦ దాస్య మొనరించి వేడుదు దార మతిని ♦ నన్నయార్యుని పెద్దనకవులనుద్దు ♦ నాంధ్రకవివృద్ధి నాయాత్మ నలరుకొఱకు ॥

క॥ పవమాననతనయభక్తియు ♦ నవరసభావంబు పావనంబగు శ్రీరా ♦ ఘవుని చరిత్రంబు సదా ♦ శివరామాయణముజెప్ప సిద్ధమనెంతున్ ॥

వ॥ అని పూర్వగ్రంథరచన కవీశ్వరాది ఇష్టదేవతా ప్రార్థనం బొనరించి యనంత రంబున ॥

సీ॥ పాలమాకులగ్రామపతులలోపల మత్స్యరాజవంశమున భార్గవ మునీంద్ర ♦ గోత్రుడాపస్తంబ సూత్రుడు వేంకట పతిధర్మపరుడు సన్నుతయశుండు ♦ వర పుత్రుగనె శేషగిరిరాయుడతనికి సహధర్మచారిణిసాధ్వితిలక♦ సింగమాంబకు సరిసేయంగ యనసూయ సతిదక్క నితరుల సామ్యమగునె ♦ అట్టిదంప తులకు సుతుడయ్యె సకల ♦ రాజ పూజ్యుండు తిర్మలరాయవరుడు ♦ సుగు ణములపేటియై యొప్పు శుభచరిత్ర♦ జానకీ బాయి వరియించె జగమెరుంగ

ఉ॥ ఆనతితోడఁగూడి సుగుణాత్ముఁడు తిర్మలరాయమహాప్రియు ♦ ల్లాసముతో
డఁజేసె బహుళంబగు ధర్మనిదానదానముల్ ♦ భూసురదేవతార్చనల
మోఘవిధివ్రత భూతయజ్ఞముం ♦ దేసరిపోవనేగె ధరతీర్థసమాశ్రియుఁడైన
యాత్రిలన్ ॥

వ॥ అట్టి పుణ్యాత్ముండైన తిర్మలరాయుండొక్క శుభకాలంబునందు ॥

చ॥ ననుబిలుపింప నొక్క సుదినంబున నేగి తదియ్యమందిరం ♦ బున సకలోప
చారముల భోజనమొప్ప నొనర్చి విశ్రమిం ♦ చిన తదనంతరంబ సప్తిశేష
పురాణకథా ప్రశంస మిా ♦ దను రఘునాథ పుణ్యచరితంబుగ దా సకౌ
లౌఘునిమ్మృతిన్ ॥

వ॥ శ్రీరామాయణ కథా ప్రశంసమిాదను నన్నుంగని యిట్లనియె ॥

తే॥ భువిని వెలికట్టి నరసింహ్మకవివరేణ్య ♦ మాకుగలకోర్కెదీర్ప మిమ్మారు
మిమ్ము ♦ బిలువనంపితి నాయంచుప్రీతినుంచి ♦ వచ్చినారిందు సంతోష
పరుడనైతి ॥

క॥ అభినవ శశిరేఖంబను ♦ శుభనాటక కృతియొనర్చు సుగుణాఢ్యుడ నా
యభిమతము దెలిపెదను వా ♦ గ్విభవంబున దానిగూర్పవే దయతోడన్ ॥

వ॥ అనిచెప్పి తనతండ్రియైన శేషగిరి రాయాగ్రణికి నొక్క సదా శివరామా
యణంబను యుద్గ్రంథంబు సంప్రాప్తంబగుటయు - దానిముద్రణ గావింప
వలయునని కోరియుండుటయు - తన్మధ్యంబున బాలకాండ శిథిలంబగుటయు
నైదారుసంపుటంబులు మాత్రము జిక్కుటయు - మొదలగు వార్తలం దెలిపి
వాగ్రంథంబు దృగ్గోచరంబుగావించి నీలయిదారు సంపుటంబులం దిమిడించి
పునఃబాలకాండ పూర్తి జేశియిచ్చిన గ్రంధంబు ముద్రణగావించి మాతండ్రి
కోరికె సఫలంబుజేశి పితృఋణ విముక్తుండ నగుమనని ప్రార్థించిన నేనును
దానిందిలకించి విప్పిచూచి సిద్ధనయను పూర్వకవి రచితంబైయుండి బాల
కాండ ప్రథమాశ్వాసాంత గద్య యందుండుటంగని నామనంబున వెంట్ర
కంబట్టి కాండత్రికవచ్చు ననుసామితంగొని యమ్మహారాయమణి కిట్లంటి॥

ఉ॥ మానుగరత్నకంబళికి మానుకవెట్టిన రీతిగాదె యా ♦ భానునిభుండు
సిద్ధనకు పాటిగ నాకవిజెప్పశెల్ల ఖిా ♦ యానతిరామభద్రుని కృపాతిశ
యంబున తోచినంత సంధానము జేతు రామచరితంబును సిద్ధనాత్మని
ల్చచున్ ॥

ఆ॥ నాకవిత్వమెంత నాబుద్ధిబలమెంత ♦ రాముచరణ సిద్ధనాముకరుణ ♦ రెంటి
యూతగొనిభరించెద నికార్య ♦ మేలచింత తిర్మరేంద్రవర్య ॥

వ॥ అని తక్షణంబ తాంబూల దక్షణలొసంగినం గొని గ్రంధంబు శిరంబునం
ధరియుంచి మద్గృహంబునకుం జని యొక్క శుభదినంబున ॥

క॥ రామునిపదపద్మంబులు ♦ నామనముననిల్పి సిద్ధనమునుంగనుచు ♦ న్నీమహ
నీయ్య చరిత్రము ♦ శ్రీ నులపద గుంభనముల గూర్చితినిలెగర ॥

వ॥ ఇట్లు శిథిలంబైన కాలకాండ నుద్ధరింపం దలంచి సిద్ధనకవి ప్రఛన్నరూప
ధరుండై నా హృదయంబు నావేశించి రచియించి యిచ్చిన నీతిర్మల
రాయుండు-తొల్లి భగీరథుండ మరవాహినిందెచ్చి పితృవర్గంబుల పునీతులం
జేశిన కైవడి నీప్రబంధంబు ముద్రిణ గావించినిజ జనకుండైన శేషగిరిరా
యుణి మనోరథంబు సఫలంబు గావించి శాశ్వత కైవల్యపదవి నిప్పించి
తాను కృతార్థుండయ్యె నిట్టి యుత్కృష్ట చరిత్రంబభిమత ఫలదాయకంబు ॥

క॥ కావున శ్రీరఘురాముని ♦ పావనచరితంబువిన్న పఠియించిన రా ♦ ఘవు
డిచ్చు భుక్తిముక్తులు ♦ ప్రావీణ్యతగానుడు నీప్రబంధము మీరల్ ॥

ఇట్లు,

వెలికట్టె నరసింహాచార్యులు



శ్రీ ర స్తు.

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీ సదాశివ రామాయణము బాలకాండ

## ౧ ఆశ్వాసము.

శ్రీ భద్రాచలవాసమందున జగత్సృష్టిన్విచారింపుచున్ ♦ తాభద్రాసన వేదికన్ జనకజాతంగూడి సౌందర్యలీ ♦ లాభద్రుండగు రామభద్రుడు గుణాలంకారు శ్రీ వేంకటా - ర్యాభిఖ్యాతుని బ్రోచు నిచ్చలును విద్యాసంపదల్మెచ్చుచున్ ॥

సీ॥ జనకాబ్ధిబొడమినజలజాతవాసిని పుడమినబుట్టినపాలతివిన్న ♦ కమలసంజాతయా కమలాస్వరూపిణి వేదవతీయనువిప్రతనయ ♦ లంకలోజన్మించు పంకజాయతనేత్రి నాగేటిచాలున నాటుకొమ్మ ♦ రామావనీభర్తరమియించు సుజ్ఞాని శ్రీ మహిళాంశసంజీవనియ్య ♦ సీతలోకైకమాతయాసీరకేత ♦ వంశ సంజాతకీడాబివంశమంశికి ♦ వేంకటార్యునికిచ్చునవీనభద్రి ♦ గజతురంగాది సౌభాగ్యకాంతినెపుడు ॥

క॥ సేనాధిపశఠగోపుల ♦ శ్రీ నాథమునీంద్రుదలచి సేవించెదయా ♦ మునవాని యుడయువరులను ♦ మానకమదిదలచుచుందు మద్గురువరులన్ ॥

ఉ॥ ప్రాకటపాపసంచయము బాపురఘూత్తముకీర్తిమున్ను వా ♦ ల్మీకముని ప్రణీతము సమీరసుతాద్రి కుమారిమానసా ♦ నీకములందునిల్పి కడునిష్టమెయింజపియించుదైవసు ♦ శ్లోకుడు రామభూవరు యశోనిధి చిత్రిచరిత్రి మిప్పుడున్ ॥

వ॥ సకలాఘనిరసంబును మనోవాంఛితార్థదాయకంబును జన్మసాఫల్యంబగునని తలంచి సదాశివరామాయణంబు తెనుంగింపందలంచి॥

క॥ నాకవిశకన్య నెప్పుడు ♦ చేకొనిధరియించునట్టి శీలుడు పుణ్య ♦ శ్లోకుడు నెవడగునని వ్యధి ♦ వేకువకడనిద్రలేక విసగుచునున్నన్ ॥

క॥ అత్రేయగోత్రమున నవ ♦ విత్రముగాజననమందె విష్ణుమతల స ♦ న్మిత్రుడు ప్రణతార్తిహరుం ♦ డత్రిసముడు భాష్యగురు మహానసికుండున్ ॥

వ॥ అట్టిపవిత్రంబైన మహాత్రిరువంశంబునందు ॥

శా॥ శ్రీరామానుజసాంప్రదాయమునకున్సిద్ధాంతనిర్వాహకుం ♦ డారామేశ్వర హైమగోత్రధర మధ్యక్ష్మోణిశోభాదుర్మతా ♦ చారారణ్యదవానలుండు బహు

శిష్యాచార్యవర్యుండుగాం ♦ శ్రీశాదార్యకులాలవాలుఁడు కిడాంబీవేంకటాచార్యుఁడు ॥

వ ॥ ఆమహనీయుఁడొక్కనాఁడు ॥

సీ॥ గజవాజిసందోహ కాల్బలంబులతోడ శకటపూరితవస్తుచయముతోడ పాకభాండంబుల భారసంపూర్ణతండులసూపపడ్రసాదులునువివిధ ♦ శాకగోమాహిషసంఘంబు పరిచారికాజనంబులు చుట్టుకలసినడువ ♦ పండితబృందంబు పలువిధవైష్ణవసముదాయములు వెంటచనుదెంచునుండ ♦ కాహళంబులుశ్రీచూర్ణ ఘనవరంబు ♦ రోదసీనిండమణి మయరుచులవెలుఁగ ♦ పల్లకినిఁ నెక్కి చామరప్రభలు నిగుడ-కరుణ వేంచేశె నేనుండు కాపురముకు ॥

క॥ చనుదెంచెనుగురుడనవిని ♦ మనమునసంతోషవార్ధి మగ్నుఁడనగుచు । స్వజనసందోహముగూర్చుక ♦ వినయంబునపురము వెడలి వేడుకమీరన్ ॥

వ॥మంగళవాద్యంబులు రమణీయ్య వేషధారులగు వేశ్యాంగనలు ముత్తైదువలు బ్రాహ్మణపుణ్యస్త్రీ సమూహంబులు పండితనికరంబులు సామంతజనంబులు నావెంటబలసినడువ నెదురుచని సాష్టాంగంబుగా నమస్కరించి తదాశీర్వచనపరిభావఫలకాంక్షిత శరీర పరవశత్వంబున నమ్మహానీయ్యుని కాంతివిశేష సుధారసంబు నయనంబులస్వీకరించి నెదురుకొని తోడితెచ్చి గృహద్వారంబున పల్లకిడించి నిజపాదుకలు పాదారవిందంబుల సమీపంబుననుంచిన నలంకరించి కరకమలంబులు ముకుళించి వినయుండనై ముందరనడువ నావెంట చనుదేర వేత్రిహస్తులు సందడిమరల్చుచుండ సుందరరాజహంస గమనంబున మద్గృహంబునకు వేంచేసి నాచేతనస్కరింపంబడి పాదార్ఘ్యాద్యుపచారంబులు స్వీకరించి యొక్కరమ్యస్థలంబున రత్నకంబళంబునందాసీనుండై యుండ ఖర్జూరపత్రి నిర్మితయుపస్తరణంబుల నితరజనంబులెల్ల నివసించియుండిరంత తనచుట్టు పండిత వైష్ణవబృందంబులు కలసినివసించియుండు సమయంబున తారకామధ్యగతుండగు సుధాకరుని డీకరించు తన్మూర్తియందు నాలోచన చకోరబులు ప్రసరింపంజేసి కరయుగంబులు ముకుళించి యిట్లనివిన్నవించితి ॥

చ॥ గుడిశపవిత్రియున్యో మదికోరికలెల్లనుదీరె మీరలీ ♦ యుడకరుదెంచి మమ్ముల కృతార్థుల సేయుటముంచిదన్యోరా ♦ కడకుపరిమోదమందితి యఖండదయాంబుధిసజ్జనప్రియా ♦ తడవుకదానునింటను యథావిధిపూజల స్వీకరింపుమా॥

వ॥ అనిప్రార్థించి తత్క్షణంబ వాజివారణ మహిషగోవృషాదఘంబులు సమకట్టతగువారి నియోగించి మత్సముయవర్తనంబున మజ్జన భోజన తాంబూల ప్రక్చందనాదుల సకలజన సమేతంబుగా తగురీతి భక్తిపూర్వకంబున నడిపి యొక్కరమణీయ్యస్థలంబునిర్మించి యమహుపుడను నాస్థాపించి పాదంబులొత్తుచు ప్రియపూర్వకముగా

నిట్లంటి ॥ క॥ నామనమునందు సదాశివ । రామాయణ మాంధ్రకవిత రమ్యముగా వి । ద్యామహిమ జెప్పబూనితి । కోమలశబ్దార్థ మధురగుణ గణ మమరన్ ॥

వ॥ దానికిందగిన కృతిపతింగానక భద్రాచల రామభద్రుండు మత్కులదైవం బయ్యున్న నతనిచరితం బతనికిచ్చిన రసవంతంబై యుండదని యోచన సేయుచున్న నామనోవాంఛితంబు సమకూర్ప నీ రసమర్థులు సమయంబున నరుదెంచితిరి సందేహంబునకు తగినవరుని రూపించి నన్ను కృతార్థుం జేయుమని ప్రార్థించిన యమ్మహానుభావుండు ॥ క॥ బుద్ధిసుర మంత్రియగు నో । సిద్ధనవరమంత్రి వినుము జెప్పెదమాకీ । శుద్ధచరిత్రము కృతిగా । సిద్ధించును యిహము పరము జెందుయశంబున్ ॥

వ॥ అని మదియ్యసందేహంబు నివర్తించి మత్కృత రామచరిత్ర కవిత్వ వధూనాయకుండు తానేయగుట నిశ్చయించి యానాడు మద్గృహంబున నుండి మరునాడరుణోదయానంతరంబున సకల సముదాయ సమేతంబుగా శిష్య సంచారబునం జనియె నేనును ॥ క॥ గురుడానతిచ్చు తెరగున । వర శ్రీభద్రాద్రిరాము వరుని చరిత్రం । బరయగ కిడాంబి వేంకట । గురునకు యర్పించినాడ కోరిక వెలయన్ ॥

—:( షష్ఠ్యంతములు. ):—

క॥ శ్రీవైష్ణవ కులభూషణ । పావన శ్రీరంగరాజ పాదయుగళ రా । జీవ మకరంద షట్పద । ద్రావిడనిగమార్థవేది తత్వజ్ఞనిధీ ॥

క॥ రామానుజసిద్ధాంతక । రామలకనిదాన వైష్ణ వాగమసుజ్ఞా । నామధుర కావ్యనాటక । కోమలభాషాంతశబ్ద కోవిదగణ్యా ॥

క॥ అత్రికులాంబోనిధి జై । వాతృక తిరుమంత్రరాజ వాక్యార్థ రహ । స్యత్రయ చరమశ్లోక ప । వితృ వ్యాఖ్యానధుర్య వేంకటవర్య ॥

వ॥ నావిన్నవించు సదాశివరామాయణ కథా సారంబవధరింపుము ॥

—:( కథాప్రారంభము ):—

ఉ॥ శ్రీకర మొప్ప నైమిశము శేఖరతన్నుకబర్హిశకోకిల । ప్రాకటమాధురీ ధ్వనుల పాదపభవ్యలతాంత సౌర భే । గ్యాకరషట్పదీగరుత ఝంకరణావృతమైన గాలి పై । సోకినహాయిగా నిమర సౌఖ్యడు తాపసబాలబృందమై ॥

చ॥ అలరెదురాజహంసములు నావననుండు సరోవరంబు లం । దొలికులజేరి సారసపు తూండ్లగదల్చిన లేచిముందు లో । పల మకరంద పాన మధుపంబుల సంఘము మీదికేగి నం । కులరొదసేయు మేలుకను గుల్మలతాశయులైన తాపసుల్ ॥

సీ॥ పులితేళ్లగమి యొక్క పొలమునదిరుగాడు ♦ కరులుసింగంబులు గలసి మెలగు ♦ కడువేడ్కమార్జాల కంబులుపాలించు మూషికసంతతిమోదమలర ♦ నీలకంఠంబుల నీడునఫణులెత్తి చక్షుశ్శ్రవంబులు చలగుచుండు ♦ మెకములమెడలపై మేకలగుంపులు కొమ్ములగోకుచు జిమ్ముచుండు ♦ సహజవైరంబులేక విశ్వాసముగను ♦ మృగసమూహంబు లీరీతిమెలగుచుండ ♦ తాపసులధర్మభావంబు తరమెపొగడ ♦ శౌనకులభాగ్యమెంతని సాటవలయు ॥

వ॥ అట్టి మహానియ్యు సకలతాపస శరణ్యంబై విలసిల్లు నైమిశారణ్యంబున దీర్ఘసత్రంబు సలిపెడుశౌనకాది ఋషిపుంగవులు సుఖాసీనులై యున్న సూతపురాణికునింగనుంగొని ॥ చ॥ సకలపురాణముల్వినుల సత్యచరిత్రములెల్లవింటిమ ♦ యకుటిలతేజ భవ్యసుకృతాత్ములనన్వినియుంటి మట్టివ ♦ ల్మికభవుడాదియౌ మునుల మేయగుణాకరులైన సూర్యవం ♦ శకుల పవిత్ర చిత్రకథసారముల న్వినియుండి రెల్లెడన్ ॥ వ॥ అట్టి గాథలయందు ॥ ఉ॥ పావనమైన రాఘవుని ధన్యచరిత్రమమోఘపుణ్యసం ♦ భావనమంచుచెప్పుదురు పద్మభవాదుల కెల్ల పూజ్యమై ♦ దేవమునీంద్ర సంఘములు దివ్యముగాకొనియాడదాట చే ♦ నీవచనప్రభావ రమణీయ్య సుధోక్తుల నానతియ్యవే ॥

క॥ రామాయణంబువినగన ♦ మామనమున వాంఛబొడమె మౌనీంద్రదయాగ్రామణివివరింపుము శ్రీ ♦ రామకథామృతముచాల రమ్యతనొందన్ ॥

వ॥ అని ప్రశ్నసేయంబడి సూతుండు వాక్చతుర సమేతుండై శౌనకాదుల నెల్లంగలయం గనుంగొని ॥ క॥ కనువారికెల్ల జెప్పగ ♦ వినువారికి మోక్షమబ్బు వేదంబులె రా ♦ మునిచరితమయ్యె రాముడు ♦ ఘనుడగు వేదాంత వేద్యగముడయ్యెగదా ॥ ఉ॥ తారకమూర్తిరామ చరితంబుకలౌఘ నివారకంబు సం ♦ సారవిముక్తికారణము సారతరంబగు శబ్దశాస్త్ర శృం ♦ గారభయానకాది రసకర్పనమై విలసిల్లు భక్తమా ♦ దార ఫలప్రదాయకము తాపనివారకమై తనర్చెడున్ ॥

వ॥ కావున మీరలు నన్నడిగిన రామాయణ కథామృతంబు వినగోరితిరి జన్మసాఫల్యంబయ్యె వినుండు ॥

ఉ॥ శ్రీగిరిజాధినాయకుని శృంగవిభూషణ రాజతాద్రివై ♦ రాగుల కాటపట్టు సురరాజముఖామరకోటికెల్ల సం ♦ యోగమునుగుదప్రాపమద యోగిజన బుల కాలవాలమై ♦ సాగరఫేనక్షీర ఘనసారసుధాకర కాంతితుల్యమై ॥

ఉ॥ లోకపవిత్రమై సకలలోకముకెల్లను వందనీయ్య మ ♦ స్తోక మహీజపక్వ ఫలసుందరకుంజ లతావితాన పు ♦ ష్పాకరబిల్వచూత తిలకార్జునదాడి మనింబ

ద్రాక్ష జం ♦ బూకదళీ కపిత్థ సురపొన్నలగున్నలచే ప్రకాశమై ॥

ఉ॥ కందరమందిరంబుల వికాసముగా శివకన్నెగుంపులం । దందవసించి కీర
ముల కాటలపాటలశైవ గీతము । లొప్పొంపుగనేర్పి యాడుదురు ఫుల్లసరోజమరంద
పానయుం । దిందిరశీలకాంతి చికురేందు ముఖ బ్జవిలాసనేత్రలై ॥

చ॥ గిరిశలమేరులెల్ల పరికింపగనొక్కెడ గూడికాల్వగా । పొరలుచు బారి
చుట్టుకొని భూమికి జారుచునుండ జూడగా । హరుశిరమంటి జాహ్నవి ప్రసవంతిక
తొల్లిభగీరథుండు యీ । ధరణికిదెచ్చునప్పటి విధంబుగకన్పడుచుండె వింతయై ॥

తే॥ బిల్వరుద్రాక్షతరువుల బెంచిగిరిని । భూతనాథునకర్పింప మునులునిత్య ।
శివసహస్రార్చనంబులు సేయువారు । నగుచు పొలుపొందె రజితాద్రి యందముగను ॥

శా॥ ఆకైలాసగిరీంద్రమధ్యమున నిత్యానందరూపుండు వి । శ్వాకారంబున
పార్వతీప్రియుడు నిచ్ఛావృత్తిరూపంబున । న్నాకారిప్రముఖామరుల్ ప్రమథులున్ ప్రా
ర్థించి సేవింపగా । రాకేందుజ్జ్వల రత్నవేదికపయి న్రాజిల్లుచుండెన్గడున్ ॥

సీ॥ గణనాథుడొకవంక కనుసన్న మెలగుచు శీఘ్రమ్మునుగ పనుల్జరపుచుండ ।
వీరభద్రుండొక్క వేదికపయ్యుండి రజితభూధరమును రక్షసేయ । కార్తికేయుం
డొక్క కాష్ఠానువర్తియై క్రతుభుక్కు భువనసంగతులు జెప్ప । కాలభైరవుడందు కడ
పటిద్వారంబు కడనుండినూతన గతులనరయ । భృంగిచండీశ్వరులు నిజబిరుదులొత్త
నందికేశ్వరుడెదుట సానందుడగు । నతులాసర్వాంగ కాళికా సతినిగూడి । శివుడు
మాణిక్యగద్దియ చేరియుండె ॥

వ॥ అట్టి సమయంబున అష్టదిక్పాలకాది సిద్ధముని గంధర్వ ఖేచరప్రమథ భూత
గణ జేగీయమానుండై యున్న భవునుద్దేశించి భవాని యిట్లనియె ॥

క॥ శ్రీరామరామ యనుగుణ । సారంబగు నామమెపుడు జదివిన పదియా ।
నారుహరినామములసరి । జేరుఫలంబనుచు మున్ను జెప్పితివీశా ॥

—:( పార్వతి శ్రీరామాయణ ప్రశ్న సేయుట ):—

ఉ॥ రాముడనంగనెవ్వడు పరాత్పరుడా హరి తేజమా విశా । ధాముడతండు
రాజవరుడా పరమేష్ఠి సమానవర్తియా । నీమహనీయ్యరూపు ధరణీతలమందుదయించి
మించెనా । రామకథాప్రపంచ మధురంబు చెవింగొన వాంఛనొందితిన్ ॥

వ॥ అని రామావతార కథాసూచనంబు వినంగోరి తన్ను విచారించిన మనంబున
శ్రీతారక పరబ్రహ్మమూర్తియైన రామమూర్తిందలంచి యొక్క ముహూర్తంబు కించి
దున్మీలితనేత్రుండై తన్మయత్వంబున పరమానందంబు ననుభవించి పిదప చిత్తంబు
స్వాయత్తంబు గావించుకొని ప్రియురాలింజూచి యిట్లనియె ॥

తే॥ సకలవేదాంత తత్త్వాతిశయముగల్గి । యున్న వాల్మీక మౌనీంద్రు డున్నతంపు । కావ్యముగనట్టురచియించె గాన రామ । చరిత మేకద పరలోకసాధకంబు ॥

వ॥ ఐహికాముష్మిక ఫలసాధనంబైన శ్రీ రామాయణ మహామంత్ర రహస్యంబు వినగోరి మేలుచేళితి నదియును కావ్యులు కావ్యంబనియు పౌరాణికులు పురాణంబనియు నేతిహాస కులితహాసంబనియు మాంత్రికులు మంత్రశాస్త్రంబనియు పలుకుచు రట్టిమహాత్మ్యుని చరిత్రంబు నాతంబుపినుపించెద సావధానంబున వినుమని యిట్లనియె ॥

ఉ॥ రావణు బాధచేత సురరాజిహరింగన క్షీరవారిధిం బోవగప రియార్చిగని పొందుసపుత్రక పౌత్రబంధులం । జావగ మొత్తెతన్న సురసంఘమటంచు వచించి వెన్కనే । దేవుడు రాముడై మొదటి దేవతలం దెగటార్చె వింటివే ॥

క॥ హరిరూపు రాముడయ్యెను । పరమార్థరహస్య నిగమ పాఠములెల్ల । స్వరయుగ రామాయణమను । వరచరితంబయ్యె మధుర వాణిరో వినుమా ॥

వ॥ అనిన గౌరియిట్లనియె ॥ క॥ రావణుడెవ్వడు వానికి । దేవతలకు వైరమేమి తెరగునగలిగెన్ । శ్రీవరుడు వానిజంపుట । కేవిధమున రాముడనగ నెచటంబుట్టెన్

వ॥ దేవా రావణాదుల వృత్తాంతంబును వాని పూర్వోత్తర చరిత్రంబును దేవతలకు వానికింగల వైరానుబంధన ప్రకారంబును రామజన్మ చరితంబును వానిసంహరించిన తెరంగు విస్తరించి వివరింపుమని యడిగిన దాక్షాయణికి దక్షాధ్వర ధ్వంసకుం డిట్లనియె ॥ క॥ నాలుగుమోముల వేలుపు । మూలముగ నస్సృష్టికెల్ల మొదటియుగమునన్ । చాలగ తొమ్మిదిబ్రహ్మల । నేలుగబుట్టించెసృష్టి సేయగతరుణీ ॥

వ॥ దక్షకర్దమ కశ్యప భృగుపులహుండు నా మొదలగు ప్రజాలతునయందు పులస్త్యుండను ప్రజాపతి హిమనన్నగ ప్రాంతంబున తృణబిందుని యాశ్రమంబు చెంత జితేంద్రియుండై ఘోరంబగు తపంబుసేయుచున్నంత ॥

ఉ॥ ఖేచర కామినీమణులు కేళివిలాసముతోడ నయ్యెడ । స్వేచనియాటపాటలను వెక్కసమానటులం జరింపగా । చూచి పులస్త్యమౌని సురసుందరులన్ శపియించె నెవ్వరుం । జూచినతన్ను చూలు నిలచున్నడు చోద్యముగాగ నిచ్చటన్ ॥

వ॥ అనిశపియించిన ॥ క॥ నలినజజుడిటుశపించిన । నులుకుచు కాంతాచయంబు పోయ్యనచట న్నిలువక ఖేచరమార్గము । వలనంజనిరంబుజాక్షి వారని భీతిన్ ॥ వ॥ అంతబాక్కనాడు తృణబిందు రాజాత్మజ సఖిజనంబులంగూడి సమీపంబగుటంజేసి పులస్త్యాశ్రమంబున క్రీడలకుం దొరంగి ॥

ఉ॥ పువ్వులుగోయుచు న్వలుగు మొత్తము లన్నదలించిరాలచే । గువ్వచు చేతులెత్తగ గరుత్తులలేపిక ఖగంబులేగగా । నవ్వుచు వెన్కబోయి విపినంబునతాపము

జెంది మోఁలినా । జవ్వనులేగిచూచి రోశహారుతరంబగు పుష్కరాశయిన్ ॥

క॥ కనియందు డాసియాడుచు । వనరుహములదెంచి చలులు వదలకనీటన్। ఘనముగనీదుచు భూవర । తనయుందిగనాడిచనిరి తమగృహములకున్ ॥

వ॥ నృపకుమారియు జలాశయంబువెడలి దంకూలంబు ధరియించి కమలంబులెత్తుకొనిగ్రిగి యాశ్రమంబున కరుదెంచుచు ॥

క॥ తృణబిందుని పుత్రికయందణగి తపంబాచరించు నట్టిపులస్త్యున్ । ననుమధ్య చూచి చూలున । వణకుచు తనతండ్రిజేర వచ్చెన్ భీతిన్ ॥

క॥ వచ్చినపుత్రిక గనుగొని హెచ్చినయవమానలజ్జ హేతుకమగు నీ। తుచ్ఛపు పనియొనరించితి । విచ్ఛలవిధినీకు చెల్లునే నలినాక్షి ॥

వ॥ అనిన లజ్జావనతాననయై శిరంబువంచి కన్నతండ్రి కిట్లనియె ॥

క॥ ఏపాపమెరుగ(జూడము నాపాలిటిదైవమాన । ననుగనుగొనుమా రేపకడ నాపులస్త్యత । పోవనంబునకు తిరుగ బోయితితండ్రి ॥

వ॥ దైవంబెరుంగుం గాని నావలనమైన కార్యంబొక్కటియులేదు దైవమాయనో నేబోయినవేళ గుణమో నచ్చటి యోషధుల చిత్రంబో యరుంగ గాదు యీగతి శిద్దించియున్నదని భయాకులత వదనారవిందయై పలుకుచున్న పుత్రింగని తృణబిందుండు తన తపోవిశేషంబున జరిగిన వృత్తాంతం బంతయు నెరింగి సంతోషిత స్వాంతంబున కుమారిరత్నంబున కిట్లనియె ॥

ఉ॥ తల్లీ ! ధన్యుడనైతి నీవలన మత్కాంక్షంబు శిద్ధించె నా । యుల్లబందుం బ్రహృష్టమయ్యె కులము । న్నెప్పారిజన్మించితీ వల్లన్ జేరిపులస్త్య తీక్షణమునన్ నాజిత్యదుస్సాధ్యమా । హ్లాదభవ్యంబగు చూలుదాల్చితి తపోహేలావతున్ బ్రంహ్మా మున్ ॥ వ॥ అని తత్క్షణంబ కూతుఁదోడ్కొని పులస్త్య బ్రింహ్మపాలికిన్ జని వందనంబొనరించి కన్యకామణిచే మ్రొక్కించి యంజలిబద్ధుండై యిట్లనియె ॥

చ॥ తెలియక మత్కుమారి చనుదెంచినశాపవశంబుచేత నీ । వెలతుక గర్భమయ్యె రమణిన్ బరిచర్యకు స్వీకరింపుమా । కులసతిగాగలందులకు కోరిసుతన్ గొని వచ్చినాడ నా । పలుకులు చిన్నబుచ్చకను ప్రార్థన । గైకొనవే దయానిధీ ॥

క॥ అనియప్పగించియప్పుడె మునునిభుడే తెంచె యాశ్రమము జేరంగన్ । మాన మలరగ పతిసేవల । వనితామణి నిలచియుండె వాంఛదలిర్పన్ ॥

—:( విశ్రవబ్రింహ్మ జన్మ ప్రకారము. ):—

వ॥ ఇట్లనన్య భావమై పతియందు చిత్తంబా యత్తంబుగావించి సకలోపచారంబుల సేవింపుచున్న సతింగాంచి పులస్త్యుండొక్కనాడు ॥

మ॥ ధవళాక్షి ననుజూడ చూలునిలచెఁ దానఁ మదీయశ్రుతుల్ శ్రవణానంద ముగాగ వింటిగనుకఁ శశ్వత్తపోమూర్తి విశ్రవుడఁ నామముగల్గి తేజమున మత్తాన్యుండు శాంతుండు మా ధవుపాదాబ్జమరందపాన సుగుణోద్దాముండు భద్రాత్ముడై॥

వ॥ జన్మించి యనేకసంతానంబుల బడసి పితామహుండును మాతామహుండును సంతసింప సకలవిద్వజ్జన జేగీయమానుండై వర్ధిల్లునని వరంబొసంగిన నమ్మౌని నీయుకుడు సంతసం బొంగియుండె నంత॥

క॥ శుభదివసమందు రవిసన్నిభుని శ్రవమాని మానినీ మణిగనియెఁ। శుభ యకులవర్థనునిహిఁ గ్రీభవుఁ బరమేష్టితుల్యు కేవలశాంతుఁ॥

వ॥ కనిసంభ్రమించుయు పలాలనాదుల। బెనుచుచున్నంత దినదిన ప్రవర్ధమానుండై యబ్బాలకుండు తండ్రివలన నుపనయనసిద్ధింబొందిన ధ్యయనంబు శేయుచు

ఉ॥ బాల్యమునందె మానమున బ్రహ్మమయుండయి యోగవిద్యసా। ఫల్యము సేయ తానితరబాహ్యసుఖంబుల నెల్లమాని నై। ర్మల్య మనంబుతోడని గమంబులు చాలశతి చితండిఁకిఁ తుల్యుడటంచునిచ్చలునుతో యమువారును తింపనిత్యముఁ॥

క॥ జననిజనకులయాజ్ఞఁ జని వనమున యోగ నిష్టసంపుచున్నఁ। విను వారికి కనువారికి మనములు సంతోషమగ్న మానసులయ్యెఁ॥

క॥ ఈవిధమునవి శ్రవముని గావించెడు తపము మెచ్చి కన్యకనివ్వఁ గావచ్చె భరద్వాజుడు దేవినీ తండ్రినిన్ను దెచ్చినమాడ్కిఁ వ॥ దానిపేరుదేవ వర్ణినియనంబ్రసిద్ధనొందిన తన్వీరత్నంబు నిజాత్మజుడొడ్కొని తెచ్చి రెండవస్వాహాపతింబోలితే జరాభిరాముండై తపంబుసలిపెడు విశ్రవ బ్రహ్మర్షికిజని భరద్వాజుండిట్లనియె

గీ॥ దేవవర్ణిదీని దేవిగానీకిన్వ తలపుబుట్టి నాదుతనయనిందు తోడితెచ్చి నాడ తోయజము భివరియింపుమయ్య జనకునెనుట తంత్రిడీ

వ॥ అనిపలికిన విశ్రవుండు పులస్త్యమునీం ద్రునొద్దికింజని భరద్వాజుండు తెల్పిన సందేశంబు వినిపించి తదనుమతివడసి తల్లికడకేతెంచి ఆయమ యనుజ్ఞంగైకొని యద్దేవవర్ణినిం బాణిగ్రహణం బొనరించి మామను సత్కరించి యనిపి నిజసతీయుక్తుండై గృహస్థధర్మంబుల నడపుచుండె కొంతకాలంబునకు। కుబేరజననము॥

ఉ॥ ఆముని చక్రవర్తికిని యాసురవర్ణిని కింగుబేరుడు। ద్దామయశుండు బుట్టెనను తామరసోద్భవుడేగుదెంచి। తన్నామ మొనర్చె నైశ్రవణ నామము విశ్రవపుత్రు కౌటచే నీమహానీయుడుత్తరపు నేలికయైనెగడెందుముండటఁ॥

క॥ అని నిర్ణయించి చెప్పుచు మనమున దీవించిచనియె మందిరమునకుఁ తన యున కుపనయనాదుల నొనరించెను విశ్రవుండు యువతె యుతుడై॥

వ॥ ఇవ్విధంబున వ్రతబంధనుంగావించి వేదవేదాంగ సకలశాస్త్ర పరిచయుం జేసి తపంబునందు నియోగించిన నైశ్రవసుండు జనకునాజ్ఞ తపోవనంబునకుం జని యుగ్రంబైన తపస్సు మూడువేలేండ్లు జరిపియున్నంత॥

ఆ॥ కమలభవుడు మెచ్చికానరాచను వెంచి। యదుటనిలచియున్న యపరిమిత తపము। లేచినిలచి సాగిలబడి సాష్టాంగ। మొరగి భక్తి సమ్మతముగాగ॥

వ॥ ఇట్లనిస్తుతియించె॥ మ॥ ధరవార్యంబులు దిక్కులెల్ల గ్రహములున్ తారలఱదిక్పతు। ల్సురలు న్మర్త్యులు యక్షరాక్షసభూమి స్తోమంబు విద్యాధరు। ల్గిరులున్నబ్బ వాయువగ్ని జలముల్గీర్వాణలోకంబులు। న్పరమేష్టీభవదియ్య శాసనమున్భద్రంబుగా నర్తిలున్॥

వ॥ దేవా సకలజంతు జాలంబుల సృష్టించి కర్మకాండబులం గల్పించి పంచభూతాత్మకంబైన ప్రపంచంబుకెల్ల నాధారభూతుండవై మొదట దేవతనైమ్మజ్జనక పితామహుండవైన నీకు ప్రాంజలినై నమస్కరించెదనని పలుకుచున్న పౌత్రుజూనాలోకించి వత్సా భవదియ్యంబైన తపోనిష్టకు మెచ్చితి నిట్టియుగ్రంబైన తపంబునెవ్వరుం జేయంజాలరు సంతుష్టుండనై వరంబులివ్వవచ్చితి కోరుమనిన ప్రపితామహునకు నాసమం డిట్లనియె॥ తే॥ ధనపతిత్వంబు మరియు నుత్తరదిగీశ। మునుసదాలోకపాలక భోగము మర। నిచ్చికృపతోడగావుము నెపుడు నీదు। పదయుగంబులు సేవింతు పద్మగర్భ॥

క॥ అనవిన తెంచిన మనమని। గనివరములనిచ్చి పుష్పకంబను పేర। స్తనరిన విమానరాజము। ధనపదిగీశత్వమొసగి తానిట్లనియెన్॥

వ॥ కుమారపూర్వదక్షిణ పశ్చిమంబులకు శక్రయమ వరుణుల నేర్పరించియుండితి నాలవదిక్పతివై ధనాధిపత్యంబున నాయొసగినది మానరాజంబమోఘంబయిన యదినవెచ్చటికింజన నిశ్చయించి యభీష్టించిన తక్షణం బచ్చటికిజనుచుండు నెప్పటికెంత జనంబులుగూరుచుండిన నాకరిస్తలంబు మిగిలియుండు విశ్వకర్మ నిర్మించి మాకొసంగిన నీతపంబునకు మెచ్చి నీకిచ్చితి శుభంబులంబడయుమని దీవించి తామరచూలినిక్కపు జగంబునకుంజనియె కుబేరుండునుమరలి నిజాశ్రమంబునకుం జనుదెంచి తల్లిదండ్రులకు వందనంబాచరించి యిట్లనియె॥

సీ॥ మీయాజ్ఞవనజజు మెప్పించి వరములు గైకొని వచ్చితి కమలభవుడు। ధననాయకత్వముత్తర దిక్పతిత్వంబు గా మగమగు పుష్పకంబు పేర। బరగు విమానంబు బహుమానముగ నిచ్చి చనియెనుగాని నెచ్చటను నిలత। నాసముయ్యది యనునుపాగ్ర లేమరచితి జనకమీరైనను జప్పవలయు। పోరులు లేకున్న నిలచుట వీలుపడదు। గానయోచించి మీకిష్టమైనదాని। నేర్పరించిన యందుండి నిపటికెప్పుడు। సన్నుచును

బోవుచుందును వరుసతోడ॥

వ॥ అని కుమారుండు జెప్పిన సంతోషిత స్వాంతుండై పులస్త్యనందనుండు నిజ నందను నుద్దేశించి॥

శా॥ లంకాద్వీపము మున్ను రక్కసులకున్ లాగైన రాజ్యంబున । జింకన్న వ్వుర నేలుచుందుము సదాయక్షేశ్వరత్వంబుతో । సంకష్టంబున విష్ణుబాధతనులై సర్వంబు సంహరించియే । వంకంబోయిరొకాని భీతిమతులై వారందు లేరిప్పుడున్॥

వ॥ పాలకశూన్యంబైన యప్పట్టణంబు గైకొని నిరాటంకంబుగా నేలుచు నీయిష్టంబైన యప్పుడెల్ల నిచ్చటికిం జనుచుంబోవుచు మా యుల్లంబులు పల్లవింపంజేయుచుండుమని నిదేశించి తత్క్షణంబున లంకారాజ్యంబునకు కుమారుని భిషేకంబొనరించి పంపించెనని వినుపించిన హిమాద్రిజాత హేమనగ చాపధారికిట్లనియె॥ తే॥ లంకలోపల

—:( మాల్యవదాదుల వృత్తాంతము ):—

మున్నుండి లావు మెరసి । విష్ణుభయమున నందుండ వెరచి చనిర । టను చు జెప్పితి వ రలెవ్వని కులంబు । వారు లంకాపురం బెట్లువారికబ్బె॥

వ॥ వారలు విడచిపోయిన నప్పట్టణంబున కుబేరుండెట్లుండె పదంపడి రావణాదులకెట్లు లభించె మున్నుండిన రక్కసులు రావణకుంభకర్ణుల కంటె నెక్కుడు వారలుందుర వినయనై ప్రార్థింపుచున్న నాకు నీకథ వస్తరించి చెప్పుమని యడిగిన శివుండు ప్రియకాంత కిట్లనియె వినుము చతుర్ముఖుని సృష్టిలోఁగల రాక్షసగణంబుల యందు హేతిప్రహేతియను ప్రసిద్ధిజెందిన రక్కసులిద్దరందు హేతియను వానికి విద్యుత్కేశుండు బుట్టినట్టి విద్యుత్కేశునకు సుకేశుండు బొడమె నాసుకేశునకు మూడగ్నులంబోలి మాల్యవంతుండు సుమాలిమాలియను పుత్రత్రితయంబు జన్మించి

ఉ॥ ముగ్గురువారుగూడినలు మోములవేలుపు గూర్చితత్తపో । యగ్గిని ముండ సేయుచును యండకు వానకు సీతబాధకున్ । మ్రగ్గక ఘోరనిష్ఠలను మానకసల్పగ వారిమూర్ధ్నము । ల్భగ్గునమండి జ్వాలలు నభంబుననిండి జగంబుఱుంచినన్॥

వ॥ వారితపంబునకు సంతుష్టుండై విధాత్రుండు పొడసూపి వరంబులు వేడుమనిన॥

ఆ॥ మాకు వరములివ్వుమన సేనిపరులతో । నెదురులేని జయములిమ్ము దేవ । సృష్టికర్తలోక సేవితపదపద్మ । భారతీశసృష్ట భక్తపోష॥

ఆ॥ అనిన వారికోర్కులన్నియు నొసగిదీ । వించి చనియెనా విరించనుండు । ప్రబలగర్వమునను బలలాశిత్రితయంబు । మించి జగములాక్రమించి రపుడు॥

వ॥ ఇట్లాక్రమించి మాల్యవంతుండు విశ్వకర్మ రావించి హిమవన్నగంబుపై నంగాని హేమాద్రి యంతైన నొకపట్టణంబు నిర్మించి మాకొసంగుమనిన నతండు॥

ఆ॥ దేవనాథుకొరకు దేదీప్యమానపుహా । నగరమొకటి జేసినాడ తొల్లి ।
యిప్పుడదియ మీకు నొప్పుగ శృంగార । భవనమందు నిలుడు భాగ్యమహిమ ॥

వ॥ అదియును నిరువదివేల యోజనల విస్తారంబు నానాదివ్యమణిమయసౌధంబుల పొలపు
నుంగలిగి దక్షిణ వారాశిమధ్యంబున త్రికూటాద్రి సమీపంబున లంకానామంబుగలది
యందుండి సకల సౌభాగ్యంబులగు భోగంబు లనుభవింపుచు సురలకుంబైన చూడరా
నశక్యంబైయుండు నందు ప్రవేశింపుడని చెప్పి విశ్వకర్మ నిజనివాసంబునకుజనియె
నంత మాల్యవ దాదులప్పుడ ॥

మ॥ చనినై వాసము జేసిరందు విటపిచ్ఛాయానుకూలంబున । ఘనశ్రేయంబు
సముద్రమున్నొకటిగా గంభీరమైయ్యుండి కాం । చన సౌధాగ్రపు మానసపంక్తులను
నిచ్చాభర్త్రి క్రీడింప చం। దనకర్పూర విశేషవాసనలచే తన్మించు సాంబ్రాణిజ్వాలా ॥

క॥ అందు సుఖంబుండగ సా । నందయుగుచు నర్మదాఖ్య నారీసుమయు ।
న్నందనల ముగ్గురనితన । బృందారక వైరులనక ప్రీతినిచ్చెన్ ॥

వ॥ తాను గంధర్వ స్త్రీయయ్యును తల్లిపెంపున రాక్షసులకు కన్యకలందార
బోశిన వారలు జ్యేష్ఠాను క్రమంబున ముగ్గురిని ముగ్గురు నన్నదమ్ములు వివాహంబు
లై యంత్తమన్నించి సర్వసుఖంబు లనుభవింపుచు లంకారాజ్యంబున నుండిరని చెప్పి
సదాశివుండు మరల నిట్లనియె ॥

ఆ॥ అసురులట్లు సతులయానంద సుఖవృత్తు లనుభవింపుచుండ సందడికిని ।
క్రమముగాగ సుతులు కన్యలు జన్మించి । వృద్ధిబొంది రెల్ల విధములందు ॥

వ॥ ఇవ్విధంబున మాల్యవదాదిమూర్తిత్రయంబు సంతానసౌభాగ్యవిశేషంబు
లుంగలిగి ధూర్తచేష్టలకుందలపడి ॥

సీ॥ మానుల బాధించి దీనుల వేధించి సాధుజనంబుల చావగొట్టి । గరుడ గంధ
ర్వాది కాంతులు మాయించు సురసంఘముల నెల్ల చరలనుంచి । దిక్పాలకుల గొట్టి
తెరవులుబడనెట్టి యక్షసద్ధ్యుల నొక్క యడనుగట్టి । తాపసవరులను దండించి జప
హోమ నిష్టజనంబుల కష్టపెట్టి। ధర్మ మార్గంబులెల్లను ధాడిజేసి । లోకపాల
కులము మేము మాకుసకల । పూజ లొనరించుడని భేరిభోరుకొలిపి । దానవులు లోక
ములకెల్ల తామయైరి ॥

క॥ ఇటులమ్మాల్యవ దాదులు । భటవర్గముదోలి జనుల బాధయొనర్పన్ ।
నెటుదోచక నిందాదులు । వటపత్రశయాను జేర వాగిరిభీతిన్ ॥

మ॥ చనిగోవిందుని పాదపద్మములకు న్సాష్టాంగమర్పించి యో । వనజాతే
క్షణ మాల్యవంతుడను జవాతంబుతో గూడి మా । కున నోగ్రింబగు శాసనంబు

మహోగ్రాత్ములై శిక్షలన్ । దనుమాడందలఁ బెట్టినాడుహరి మాదుఃఖంబు వారింపవే ॥ చ॥ అని మొరసేయు దేవతల యాదరితో మురసూదనుండనున్ । వనజభవుండు వారికిన వారితమైన వరంబులిచ్చుటన్ । మనమున శంక లేక దునుమాడెద సాధుల సజ్జనంబులన్ । చనుడిగ వారినందరిని జంపుదు నొంపుదు నింతలోపలన్ ॥

వ॥ అని యభయంబిచ్చి దేవతల నంపించి వారిజోదరుం డసురమర్దనంబునకు ద్యుక్తుండయ్యె నిచ్చట ।

ఉ॥ మాల్యవదాదులిట్లసురమర్దను వార్తల నాలకించి వాం । ఛల్యమనస్కులై యపుడు చాలగరోషకషాయతాత్ములై । తుల్యుడెవీడు మాకు సరిరాగునె మూర్ఖదేవతాళికి । న్సైల్యక వాక్యమిచ్చెనట తెంపునమమ్ముల జంపనెంచియున్ ॥

వ॥ అని తమలో మాటలాడుచున్న గుణగ్రాహులై మాల్యవంతుండు తమ్ముల కిట్లనియె ॥ ఉ॥ వింటిరె తమ్ములార మును విష్ణునితో మనవంటిదానవు । ల్కంటకమూని యుద్ధమున గాసిలి మృత్యువునొందువారల । గ్గంటిమి వానితో తొడరి కానగ. రాదు జయంబు వానికి । న్నంటలు గ్రమ్మ చక్రమును మారక మానక కైదువుండుటన్ । వ॥ మనకు నధికులైన శంబర వృత్రనముచి శుంభనిశుంభ మధుకైటభులను నామంబులం బ్రసిద్ధులైన దైత్యదానవ కులంబువారు మడసిరి మనమనగ నెంత మూరక వానికి శరణంబు జొచ్చి బ్రతుకుదమని మరియు నిట్లనియె ।

ఆ॥ రాక్షసులము మనలరక్షించు టదియెట్టు । లనగరాదుగా ప్రహ్లాద దనుజ భక్తుడైన నతని పాలనసేయడే । మనము శరణుజొచ్చి మనుట మేలు ॥

వ॥ అని పలికిన ఉ॥ అగ్రజుమాటల న్విని మహాగ్రహ వృత్తిసుమాలి మాలియ । త్యగ్రమనస్కులై మనకునోట మిగుల్చురె దైత్యవైరిచే । జాగ్రతనుండి సైన్యమున పాటగబంపి బలంబుతో మహా । దగ్రతలంక నాల్గడల ద్వారముల ద్దగు వారినుంచినన్ ॥

వ॥ యట్టి శత్రువులకసాధ్యంబగు నీపురంబు నొక్క విష్ణుండేమి సేయగలండని కృతనిశ్చయులై మాల్యవంతునకు ధైర్యంబిచ్చి పట్టణంబునాల్గెసల వీరరాక్షస కోటి కాపుంచి తాము యుద్ధసన్నద్ధులై యుండిరంత ॥

మ॥ అపుడా విష్ణుడు శార్ఙ్గధారియును చక్రాబ్జంబులంబూని ప । క్షిపతి నెక్కి విహాయసంబున జగజ్జేగీయమానుండై లంక జేరి । పటిష్టంబగు శార్ఙ్గ ముక్తశరము శ్రేణికట్టులగ్నిపివే । గపరేతాత్ములజేసె రాక్షసుల లంకాద్వార పాలాతతిన్ ॥

శా॥ అంతన్మాల్యవదాది రాక్షసులు క్రోధావేశులైవచ్చి దు । ర్దాంతప్రక్రియ ఖండకాండముల మాయాయుద్ధ సన్నద్ధులై । బంతంబుల్పచరింపుచు న్నిగల

క॥ బంగారుప్రతిమవలెతన । చంగటనిలచున్న కైకసంగనిముని మా । తంగని భయాననీవె వ । రంగనవచియింపు వచ్చినట్టి తెరంగుఁ ॥

క॥ అనివిశ్రవుండుబలికిన । వనజాయతనేత్రిమాని వరునకు వినుపిం । చెను జనకునాజ్ఞ మిమ్ముల । గనిసంతానంబు వడయఁగా మునినాథా ॥

వ॥ సుమాలియనువాని పుత్రిక పుష్పోత్కట చెల్లెల గర్భాదానంబు ప్రసాదించి పుత్రవతిఁ జేయవేయని ప్రార్థింపుచున్న రాక్షసాంగనంగని పౌలస్త్యుండిట్లనియె ॥

క॥ వినుసంజకడను యరుదెం । చిదహేతున బట్టినీవు చెడురక్కసులం । గని యదవన వినిభీని । మనమున సంకోచనుడర మానినిబలికెఁ ॥

క॥ నీయంతవానిపతిగాని । మాయపు రక్కసులగనిన మానినులందుఁ । హేయనగుచుందు నీసరి । ప్రియపు పుత్రికులనిమ్ము । భవ్యవిచారా ॥

వ॥ అనుయమ్ముద్దియ పలుకులకుం గృపాకలితుండై నీకు ముగ్గురుకొడుకు లొక్కకూతురుం బుట్టుదు రందు కడగొట్టువాడు ధర్మశీలుండును శాంతుండును పరోపకారియునగు తక్కినముగ్గురు దుష్టతములౌదురని దానికిగర్భంబు ప్రసాదించిన ॥

క॥ పదిమాసంబులుదాటగ । పదితలలును రెండుపదుల బాహువులును కెం । పొదవెడునేత్రంబులు పవి । రదములుగల నొక్క పెద్దరక్కసుగనియెఁ ॥

రావణ కుంబకర్ణాదుల జన్మప్రకారము.

చ॥ మాయనువిశ్రవుఁగలసి మానినిగర్భముబూని యొక్క నం । దరగిరి తుల్యదేహుసిత దంష్ట్రికరాళము తాస్యునీల కం । బరధర వర్ణదీర్ఘకర పాదవికారు మదేభశౌర్యు కం । దరసమనాసికావివరు దాంప్రశిరోజ మహోదరుంగనెఁ ॥

వ॥ తదనంతరంబున నమ్మహామహుని ప్రసాదంబున నొక్క కూతురుంగని పిదప ॥ క॥ కడగొట్టువానిపుత్రుని । బడసెన్మరహితు నిశాంతు బాంధవప్రియునిఁ । విడువకధర్మంబుల యడ । కడునిష్టమెయాచరించు కరుణాత్మకునిఁ ॥

వ॥ ఇట్లు సంతానంబులం బడసియున్న విశ్రవుండు జేష్టునకు దశగ్రీవుండనియు రెండవ వానికి కుంభకర్ణుండనియు మూడవ వానికి విభీషణుండనియు కూతురునకు శూర్పణఖయనియు నామకరణంబులు నిర్దేశించి జాతకర్మాదులం జరిపి ॥

ఆ॥ విశ్రవుండుసుతుల విద్యాధికులజేసి । శాస్త్రచయములెల్ల చాలజెప్పి । వేదవిహితకర్మ విధములబోధింపు । చుండెవంశగతుల నోజవిడక ॥

వ॥ అంత ॥ శా॥ బాలక్రీడల పంక్తికంఠుడు మహా పాపాత్ముడై మానులఁ । చాలన్బాధలసేయు ఖేచరులపై సామర్థ్యముఁ జూపుచు । న్జాలింబెట్టుచు పుణ్యభూములను నిస్సారంబుగావించు స । ద్వోల్లాసంబున కుంభకర్ణుడు సహాయుండై తనుం జేరగఁ ॥

ఆ॥ అన్న బోనరించుధూర్తత కాత్మనలరి । నవ్విభీషణుడాప్రతిష్ఠ యందరికిని । శాంతిసేయుచుబతిమాలు సరసగుణుల । మార్గమిటులు నడుగద సర్వమంగళాత్మా ॥

వ॥ అనిచెప్పి పరమేశ్వరుండు మరియు నిట్లనియె నట్లు సంతానంబులం బడసి కైకసిపతియొద్దన యున్నంత నొక్కనాడు ॥

తే॥ యక్షనాథుండు పుష్పకమధివసించి । చంద్రికపాలికిజనుదెంచి దాస్యమెరగి । తల్లిదీవనగైకొని తక్షణంబ । లంకజేరెను తేజో మృగాంకలీల ॥

తే॥ వానిగనుగొని కైకసివారిజాక్షి । మచ్చికలరగసుతుజూచి హెచ్చరించి ॥ చూచితేయన్న మీయన్న సొగసునిటుల । కలిమినీయుంమ నెన్నడు గాంతునొక్కొ ।

వ॥ తపంబునం బడయరానిది యొక్కటిగలదే నీయనుగు తమ్ములంగలసి తపంబుగావించి యఖిలవైభవంబు సంపాదించి నామనంబు సంతసింపం జేయుమని యాజ్ఞాపించిన తక్షణంబ ॥

క॥ జననికివలగొని తమ్ములు । జనుజేరగతక్షణంబ జయమును భావం । బున తపముసేయు తలపున । చనిరొ గోకర్ణముసకు చతురత వెలయన్ ॥

సీ॥ చనిసోదరులతోడ వనజసంభవుడన భక్తులపాలిటిపారిజాత । మీవసంబున నట్టి దేవునిగూరిచి తపమొనరించిన ధాతమెచ్చు । ననిచెప్పి వేశ్వేర సందరికిని యాశ్రమంబులుగల్పించి మౌనులగుచు । కడునిష్టతపములు గావింపుచుండంగ భూమియాకాశంబు పొగలునిండె । నంతదశకంతు డొకసహస్రాబ్దములకు । శిరము ఖండించి హోమంబునేసిమరల । నొక్కవైవత్సరంబుల కుగ్రమైన । ఘోరజపనిష్టసలిపెను క్రూరుడగుచు ॥

వ॥ ఇట్లొక్కొక్క సహస్ర సంవత్సరంబులకొక్కొక్కతలగా తొమ్మిది శిరంబులు ఖండించివేల్చి పదియవ సహస్ర సంవత్సరంబున ప్రధాన శిరంబుఛేదింప సమకట్టి యగ్నిమండపంజేశి చంద్రహాసంబు చేతంబూని ధాతమనంబునందునిల్పి ॥

ఉ॥ కాంచనగర్భసృష్టికిని కారణదైవమవై జగంబుల । న్నెంచగరాని జీవతతినెల్ల సృజింపుచు వాటికెల్ల ప్రా । పంచిక కర్మలందెలిపి భద్రముగాగను బ్రోచునట్టి నీ । యంచి తపారమార్థ సుగుణంబులనే భజియించి వేడెదన్ ।

వ॥ అయిన నాయందు కృపరాక యున్నది యీదశమ శిరంబు వేల్చెద నంతటికైన నీమనంబు సంతసింపకయున్న నాదురదృష్టంబని యెంచెదనని ఖడ్గంబు శిరంబుపై వేయసమకట్టనంత ॥

క॥ ధూమంబు వెడలెదశ దక్షిణంబులయందు భీతిసురలందరు వా । గ్విభ మాపతి చేరంజని । కామసమతి పంక్తివదను తపమునమాకున్ ॥

వ॥ భీభత్సంబగు సంతాపంబుగల్గి నిలచుట కసాధ్యంబై శరణాగతులమై యరుదెంచిన మమ్ము కటాక్షించి వాని తపోనివారకంబు గావింపుమని ప్రార్థింపుచున్న యమరుల యడంగరుణించి విరించి తక్షణంబ ॥

క॥ గోకర్ణాశ్రమమున కు । న్నాకమలభవుండు వచ్చె హంసారూఢుం । డై కసి నిజ పుత్రా । నీకముకరుణించి తపము నెరవేర్చుటకై ॥

వ॥ వచ్చి దశకంధరుని కరంబు తన కరంబునంబట్టి నింత సాహసంబు సేయం జను నే ప్రాణంబులుండి నంగద సకలభోగంబులీ దేహంబునకుం గల్గు ప్రాణంబు వదలిన దేహంబు నిరర్థకంబుగదా విశ్రవనందనా నీతపంబునకు మెచ్చితి కోరినవరంబులిచ్చెద యడుగుమనిన దశగ్రీవుండు ॥ ఉత్సాహ ॥ కమలగర్భనిన్ను నేడుగంటి సఫలమయ్యె నా । యమల తపము వరము వేడుచున్న సంతసించితి । న్నమరయక్ష సిద్ధ సాధ్యులందు నాకురణ జయం । బు మరణమును లేని దివ్యపుణ్య దేహమివ్వవే ॥

వ॥ అని యభ్యర్థించిన దశముఖునకు సమర్థ్యంబు దక్క తక్కిన సకలలోక దిగ్విజయంబు లొసంగి హోమంబున వ్రేల్చిన శిరంబులు యప్పటి యట్లనుండం జేశి తదనంతరంబ విభీషణునొద్దికేగి వత్సా తపంబునకు మెచ్చితి వరంబు వేడుమనిన నతండిట్లనియె ॥

క॥ మిముగంటి నింతకంటెను । సముమైన వరంబుగలదె సర్వాధ్యక్షా । క్రమమున నామనమెప్పుడు । క్షమయందే నిలచు నటుల కరుణించుమికన్ ॥

వ॥ దేవాభవదీయ్య దర్శనం బమోఘంబు గావున వృథాగా నేరదు బ్రహ్మాస్త్రంబు కృపసేయుమని వరంబు వేడిన అట్లె యొసంగిన తనితో నిట్లనియె ॥

ఆ॥ నీమనంబు మిగుల నిర్మలమై యుండు । గాన బ్రహ్మశరము గలిగెనీకు । నెపుడు ధర్మబుద్ధినిచ్చితి భవదియ్య । శాంతమునకు మదినిసంతసించి ॥

మ॥ అని దీవింపుచు కుంభకర్ణు కడకున్నా భ్రాత విచ్చేశి యో । దనుజాధీశ్వర మెచ్చితిన్ తపముచేత న్సర్వముంగల్పితి । వని వాణీశుడు బల్కగా నిలచిదివ్యానంద సంపూర్ణుడై । వినుతించెన్భయ భక్తినమ్రిడగుచు న్వేదోక్తమంత్రంబులన్

వ॥ అప్పుడతనికి వరంబులు కరుణించిన సర్వంబులకు మృతంబు దాపిన తెరంగగునని విచారించి దివిజులొక్క మాయంగల్పించి యతని హృదయంబునం బ్రవేశింప జేశిన నతండు ॥

క॥ వరమిచ్చెదేని యప్పుడు । పరమానందంబుతోడ బాయని నిద్ర । న్నరదుగపాణ్మాసాబుల । కిరవుగనొకనాడు యన్నమివ్వుమిజాలున్ ॥

వ॥ అని వేడుకొనిన వరంబులిచ్చి విధాత్రుండు నిజనివాసంబునకుం జనియెనంత

ముగ్గురొక్క దిశంజేరుకొని కుంభకర్ణుండు నిద్రగోరిన చందంబునకు దేవతల మాయోపాయంబని చింతించి గతించిన కార్యంబునకు వగవనేలయని నిజాశ్రమంబు చేరంజనుదెంచి తల్లి దండ్రులకు నమస్కరించియున్నంత కొంత రాక్షస సమూహంబు లుంగలసి కొలచియుండిరంత॥ కవిరాజ విరాజితము॥ మరగున నుండి సుమాలియునం తర మార్గముగాగ నిమంత్రులతో। సరగునబోదము సాధ్వినికైకసి సంతతి వీరత శోధనులై। మురయుచు రాక్షసమూకలు గొల్వగ మోదముతోడుత నుందురటా। హరియొనరించిన యాపద వారికి నంతయు దెల్పుత మంచునడిన్ ॥

ఆ॥ పాములెల్ల గూడి పాతాళముననుండి। ధరకునరుగుదెంచు తెరగుదోప। దనుజగుంపులెల్ల తగమాల్యవంతుని। గలసివచ్చెపంక్తి కంఠుకడకు॥

వ॥ ఇట్లరుగుదెంచిన మాతామహాది సర్వబంధుజనంబులకెల్ల వందనాసనార్ఘ్య పాద్యాదివిధుల నాచరించి సత్కరించి యందుండ నియమించి కలసియుండిరంత కొంత కాలంబునకు సుమాలి యొక్కనాడు దశగ్రీవుంజూచి॥

క॥ అన్నాదశకంధర మీ। రున్న యడకు వచ్చి చేరియుండితి మెన్నా। ళ్లున్నను సౌఖ్యమెనొక తెర। గున్నది వినవలయు దాని యూరటమతివై॥

క॥ తగ విశ్వకర్మ లంకా। నగరము నిర్మించె నొకటి నాకముసరి యం। దుగరిమ మెరయగనుంటిమి। పగగొని సురహరి వరుల బాధల నిడుచున్॥

క॥ బాధలకోర్వక దేవత। లా ధరణీ ధరుని కడకునరిగి తెలుప స। క్రోధనుడై మమ్మందర। వేధించిన సుతలమునకు వెళ్లితి మనఘా॥

వ॥ అప్పట్టణంబు శూన్యంబైయున్న నిప్పుడు మీయన్న మనుష్యధర్ముండు పాలింపుచున్న వాడు నామదానాదులచేత నాపురంబాక్రమింప నీవయర్హుండవు దానింగైకొని మమ్మందర రక్షింపుచు తేజస్కుండవై ఆపన్నముద్ర మగ్నులముగు మమ్ముద్ధరింప సమర్థుండవని పలికిన దశవదనుండు తాతకిట్లనియె॥

క॥ అగ్రజుడేలెడు పురమును। దగ్రితజని విడువ మన్న ధర్మంబగు నా। నిగ్రహముగూడదనుచు। దశగ్రీవుడు బలికెనంత శాంతముతోడన్॥

క॥ మఱికొంత కాలమిటువలె। నరిగిన నొకనాడు నాప్రహస్తుడు దశకం। ధరుతో నిట్లను విక్రమ। పురుషులకా సవతితల్లి పుత్రులపొందుల్॥

మ॥ అదిగాకన్ భవదగ్రజుండకట లంకాపట్టణంబేలె నా। ముదగన్ సంతుగ నీవుబ్రోవవలదా మోమాట నీకేల పో। వ్రదమాతండది యొప్పకున్న బలిమిన్ బోరాడివెళ్లించి మా। హృదయానందము నేయుమయ్య మదిలో హేయంబుగా నెంచకన్॥ మ॥ అనిబోధింప ప్రహస్త మాటలకు నాహ్లాదంబునుబొంగి భోగన

భేరీరవ మొప్పగా వెడలి మంత్రిల్గొల్వ లంకాపురీ । వనభూదేశముజేరి యందువిడి యన్వాకుర్చిచ్చి సేనానితో । చనుమాకిన్నరనాథుజేరియును వాచారత్తి శోభిల్లగ౯ ॥

క॥ సీతమ్ముడు దశకంఠుడు । బాత్రితలతో వచ్చిలంక పాలించుటకై । మీతలపు దెలసిరమ్మని । ప్రీతిందోతెంచెవనుమి । ప్రియవచనముల౯ ।

వ॥ అని సామంబున వందనాది సత్క్రియ లాచరించి ప్రియపూర్వకముగా తెలనాడిరమ్ము వినకయున్న యప్పటిమార్గంబు చూతమని బుత్తెంచిన నిజసోదరీ పుత్రుండగుటంజేశి సేనాధిపత్యంబు నంగీకరించినవాడు గావున ప్రహస్తుండు ప్రశస్తంబై గుహ్యకేశ్వర పాలితంబైన లంకానగరంబు ప్రవేశించి పేరోలగంబున గద్దియపై గంధర్వ ప్రముదాకరకలిత కంకణ క్రేంకారనిన దవింజామరానిలముఖ పద్మజల బిందు సందోహంబులింక పెద్దకొలువై యున్న రాజరాజుంగని నమస్కరించి కరాంజలియై యిట్లనియె ॥ క॥ దశకంధరునకు సేనా । పశమునవర్తించునట్టి వాడను మీతో కుశలంబడిగిన పిమ్మట । విశదంబగునొక్కవార్త వినుమనిచెప్పె౯ ॥

క॥ మనమాతామహులేలిన । మునులంకారాజ్యవిభవ మును విష్ణుని చే । తను నోడి సుతలమాదున । చనిడాగిరిపిదప మీవశంబుననుండె౯ ॥

వ॥ కొన్నినాళ్లు నాయత్నంబున పాలింపందలంచితి యిందుల క్షేమనియదగని మీతమ్ముండు విచారించెనని ప్రహస్తుండు వచియించిన ధనదుండు వానికిట్లనియె ॥

క॥ సంతోషమయ్యె తమ్ముని । చెంతకుజనుదెంచినిట్లు చెప్పదమని నా । మంతనమునదలచగ తా । నింతలో నినుదోలిచాల హితమొనరించె౯ ॥

వ॥ ఇప్పుడే సపరివారంబుగా నిశ్శంక లంకవదలి చనచున్నవాడ రమ్మని సందేశంబునిర్ణయించి తత్క్షణంబ పుష్పకారూఢుండై తండ్రిపాలికింజని దశగ్రీవుని తెరంగెరింగించి జనకాపట్టువదలి చెట్టులేనిపిట్టనైతి నెట్టిచోటనిలతు నానతిమ్మని యడిగిన విశ్రవుండు కుమారున కిట్లనియె ॥

క॥ దశకంఠునితోబోరగ । పశమాపరమేష్ఠివలన వరములు గొన్నా । దుశమించుట మంచిది నీ కుశలంబే నెపుడుమదిని గోరుదుపుత్రా ॥

ఉ॥ కావుననీవుబోయి విషకంఠమునిం బొడగాంచి వేడు నా । దేవుడు భక్తవత్సలుడు తెల్లముగా రజితాద్రి యందు సం । భావన జేశినిల్పు కడు భద్రముగానని చెప్పి యంపె నీ । తోయవనుజూపి విశ్రవుడు తోయరుహాక్షు మదియ్యసన్నిధి౯ ॥

తే॥ అతడుచనుదెంచి వందనమాచరించి । నెలవుదయసేయుమన్న మున్నలక యనెడు । నగరమొక్కటిగలదు మాయగ సమీప । మునవసింపుచుటంచు యద్ధనదు నంపి ॥ వ॥ అల కాపురంబు పాలితసంజేశి తదిమొదలు విత్తేశుండు మత్సఖుండని

ప్రసిద్ధనామంబునం జెలంగెనని చెప్పిన గౌరీసతి ధవునకిట్లనియె ॥

క॥ పదపడి దశకంఠుడు తన । కెదురెవ్వరు లేక లంక నేలిన తెరగు । న్వదలక జగముల నెల్లను । గదనంబున జయముగొనిన కథవినవలతున్ ॥

వ॥ దేవా యానతిమ్మని యడిగిన జగన్మాతకు శివుండిట్లనియె నట్లు ప్రహస్తుండు విత్తేశువలని ప్రత్యుత్తరంబు గొనిచని దశకంఠున కెరింగించి నతని పలాయనంబునుం జెప్పిన పరమానందభరితుండై యప్పుడు కదలి ॥

సీ॥ మాల్యవంతుండు సుమాలి ముదించిన గజవాహనంబుపై కదలిరాగ । తల్లికైకసియు ముత్యాలపల్లకి నెక్కి తండ్రిలపజ్జను తరలి నడువ । మంత్రులు శృంగార మావుల పై నెక్కి సేనతో ముందట చేరి కొలువ । తమ్ములు నిరువంక ధవళచామరములు వీచుచు ముదముతో వెనుక నిలువ । చారుతరమైన స్వర్ణాద్రి మీరునట్టి । తేరుపై నెక్కి సామ్రాజ్యధీశుడగుచు । పంక్తికంఠుండు తనసర్వబాంధవులతో । వేడ్కలిగురొత్త లంకప్రవేశ మయ్యె ॥

వ॥ ఇట్లు ప్రవేశించి ॥

—:( రావణుండు మాల్యవదాదులతో లంకం బ్రవేశించుట ):—

తే॥ మాల్యవంతుండు మున్ను సుమాలి వెన్క । మంత్రివర్గంబు గలసి సామంత వరులు । నబ్ధిజలములు నభిషేకమాచరించి । పట్టభద్రుని జేశి రప్పంక్తిముఖుని ॥

వ॥ ఇవ్విధంబున దనుజరాజ్య విభూతికిం దగిన నాయకత్వంబానంగినం గైకొని తాతలతల్లుల తమ్ముల నెల్ల నరయుచు మహావైభవంబున లంకారాజ్యంబు సేయుచుండి తల్లియనుమతంబున ॥

క॥ అలవిద్యుజ్జిహ్వుండను । పలలాశను కాలకేయ బాంధవ్యునకున్ । జెలియలు శూర్పణఖాఖ్యను । కలిమికిదగు పెండ్లిజేసె కైకసియలరన్ ॥

వ॥ అంతనొక్కనాడప్పౌలస్త్యుండు ద్యానవనంబునకుం జని యచ్చోట మృగంబులం బరిమార్చి యెదుర చనుదెంచు నొక్క కన్యకాయుక్తుండైన మయుంగాంచి నీ వెవ్వండవు యీ కన్యకామణి యెవ్వరు యీ మృగసమృద్ధంబైన వనంబున నేల గృమ్మరియెదవు యెరింగింపుమనిన మయుండిట్లనియె ॥

మ॥ దానవవిశ్వకర్మను సదానొనరించెద శిల్పికర్మచం । దానకు మెచ్చి దేవతలు తామరసాయత నేత్ర హేమయ । న్మాననిదెచ్చి యిచ్చిన సమాహితచిత్తుడనై కడంతుక। న్మానకయున్న దానికి కుమారులు నిద్దరు కూతురొక్కతెన్ ॥

వ॥ సంతానంబు గలిగిన యనంతరంబ నా హేమ దేవతాహ్వానంబున సురలోకంబునకుం జనియె నేనును యక్కాంతా వియోగ పరితాపంబున తపంబు సేయుచుండి

మండోదరియను నిక్కన్య నెవ్వరికైనం దగువరునకిచ్చి వనంబునకుంజన నిశ్చయించి నిటవచ్చుచుండితి నీవెవ్వఁడ వీకన్య దగునేని పాణిగ్రహణం బొనర్పుమని మయుండు పలికిన దశవదనుండు ॥

ఆ॥ తండ్రి విశ్రవుండు తాత పులస్త్యుండు । తండ్రితాత నాపితామహుండు ।
[illegible]రుపంక్తిముఖుడ ప్రియము వ్యాపికాంత । భార్యగా వరింతు పరిణయమున ॥

వ॥ అని చెప్పి మయుండోడుకొనివచ్చి యాకన్యం బరిగ్రహించి మామను బహూకరించి పంచి యనంతరంబ ॥

క॥ బలిపుత్రి తనయమృకు కుం । తలవజ్రజ్వాల యనెడు ధవళాక్షిని పెం । డిలి జేసె కుంభకర్ణున । కెలమిన్బంధువులు మెచ్చ నిచ్చారతుఁడై ॥

వ॥ శైలూషుండను గంధర్వుని పుత్రికయగు సరమయను దానిం దెచ్చి విభీషణునకుం బాణిగ్రహణం బొనరించి సకలసంపద్వైభవంబున మండోదరిం గలసి సౌఖ్యంబున నోలలాడుచునుండ నంత ॥

క॥ మండోదరిగర్భంబున । ఛండపరాక్రముఁడు పుట్టె శక్రాదులకు । న్గుండియ లదరగ రోదసి । నిండ పయోధరములీల నినదము చలగన్ ॥

వ॥ మేఘారావంబు సేయుచు జన్మించిన పుత్రునకు మేఘనాథుండను నామం బిడి సంతసింపుచుండె పదంపడి యద్దశాననుండు ॥

క॥ తపసుల గొట్టుచు మానుల । కపకారము సేయు విఘ్నదనువార్తలకు । న్నెపమొన్నుచు భూసురులను । కృపలేక యడంచుచుండు కినుకె దగదర ॥

వ॥ ఇవ్విధంబున దుష్టచేతలకు మొదటివాడై లోకంబెల్ల పీడింపం దొరంగిన విని వైశ్రవణుండు కోపించి యొక్క దూతముఖంబున ॥

మ॥ తగు నా దుష్టతనంబు నీవలన సంతాపించె లోకంబు వే । రు గమింపన్ కడు పిన్ననై యకట తండ్రుల్ తాతలుండంగ నే । ను గురుత్వంబున తమ్ముఁడంచు భయముం జూపింపకుండంగ నీ । మగపాండిత్యము జూపజాలి సరేమాంబోట్లకా నౌదలన్ ॥

క॥ అని చెప్పి దూతనంపిన । పనివిని యదనంచువాడు బాహాటోపం । బున లంకఁ జేరి దశముఖు । గని వందనమాచరించి గౌరవమొసగన్ ॥

వ॥ మనుష్యధర్ముండు జెప్పిన సందేశంబు వినుపించి మఱియు నిట్లనియె ॥

సీ॥ దశకంఠ యీ యన్న తగని కార్యము సేయ వలదని చెప్పినవాడు వినుము । ధర్మంబు
తప్పుట తగదని పల్కిన దూతవాక్యంబులఁ దోషమెంచి । కరవాలమున వాని ఖండింప
బోయిన పిన్నత[illegible]ండు విభీషణుండు । దూతవధ్యుఁడు గాడు తొలగుమటంచు ప్రార్థన సేయ
నక తత్కంఠసీమ హత । మాచరించి యల ప్రహస్తునిదిలకించి । పెద్దవాడు నాకు బుద్ధి జెప్పి

వ॥ అనిబహిర్ముఖులు విన్నవించిన హంసవాహనా రూఢుండై లంకకేతెంచి రావణుచే సన్నుతుండై మఘవుని చెరవిడిపించి నిజేచ్ఛంజని యవ్వృద్ధశ్రవుండు విన్నం బోయి నిజమందిరంబున సుంజనియెనంత॥

చ॥ ఇటువలె పంక్తికంఠు డమరేంద్రుని గెల్చి ధరాధినాథు ల। న్కుటిల మనస్కుడయి నెదిరి ఘోరతరంబగు సాహసంబు ల। న్బటురథ వాజియోధముఖ భద్రగజాబులతో జయింప సం। కటపడిరెల్ల భూవరులు కావని యవ్వరు లేక యుండుటన్॥ క॥ అని చెప్పి శివుడు హిమగిరి। తనయంగని యిట్టులనియె ధవళా యతలో। చన పంక్తి కంధరుండొక। దినమున కైలాస నగము దిక్కరు దెంచెన్॥

క॥ చనుదెంచి రజత భూధర। మునుగొని చన లంకలోన పూజలు గావిం। పను దలచి పర్వత ముక్రిం। దను కరములజాచి ప్రోథతను విలసిల్లన్॥

క॥ కదలింప దలచెనంతట। పదనఖమున గిరినియొత్తి పట్టిన నతడు। న్వదల క పెకలించెను కడు। మదమొనగ సురంగ లక్ష్యమా నష్టులకున్॥

వ॥ అప్పుడు వానివింశతి కరంబులు కుధరంబు క్రిందన నగిపడ నొండి కోండ పదంబుచేత నొత్తిన తోత్రయుంజాలక పెద్దగొద సేయుచు వేదంబులకెల్ల పదక్రమంబులని యడుభాగంబులనుతీ యించెనంత నయ్యా సురచేసిన సామర్థ్యంబునకు మెచ్చి హస్తంబులు వదలించితి రవంబున జగంబులెల్ల కంపింపజేయు కతంబున రావణుండను నామంబు ప్రసిద్ధంబయ్యె నదియల్లన వెరింగిన కథయే కదనవ్వాలివర్తనంబు వినుమని పరమేశ్వరికి పినాకధరుండిట్లనియె॥

చ॥ అమరులవైరి యీ విధమునందరి రాజుల బాదదోలి మో దమున పురంబుజేరి సుఖతత్పరుడయ్యెను యజ్ఞభుక్సమా। జముచతురాస్యు జేరజని సాగిలి మ్రొక్కినుతించిదేవ మా। శ్రమ వివరింప వచ్చితిమి రావణదైత్యుని బాధమాన్పవే॥

చ॥ అలగిసమస్త లోకముల నారడి బెట్టి సురేంద్రు గెల్చె భూతలమున గల్గు శూరులను దార్ఢ్యులులేరు మరేమి జెప్ప నీ। కులమున నిట్టి దోషముల కుర్వడి గట్టి నవాడు లేడు యీ। వలచుజనించె మీవరమ వారితమయ్యెను మాను పెట్లకో॥

చ॥ అని మొరసేయు నిర్జరుల కంబుజసూతివచించె రావణుం। డనుపమఘోర నిష్ట తపమాచరణంబొనరింప గోరికల్। మనమున గోరినట్టులను మానము లేక యొసంగ వాడు దు। ర్జనులనుగూడి దౌష్ట్యమున రాయిడిబెట్టె సమస్తదిక్కులన్॥

వ॥ అని వచియించి తత్క్షణంబు సుమనస్స మూహంబులతో వెడలి పాలకడలి సమీపంబునకుంబోయి యూర్ధ్వముఖులై యిట్లని విన్నవించిరి॥

చ॥ భువనములార్తి జెందగను పోషణసేయుటకై యనేక మా। ప్రవిమల

సర్వాంగ సుందరు పరమేశ్వరు విశ్వమయుంజూచి తద్దర్శనానందపూరిత చేతస్కులగుచు గుంపులుగూడి పాకశాసనాది నిలింపులు కరాంబుజాత సంఘటిత నిటల తటులై యిట్లని నుతియించిరి ॥

సీ॥ సర్వేశ సర్వాత్మ సర్వభూతాభావ సర్వజ్ఞ పద్మేశ సర్వసాక్షి । సర్వ కామప్రద జగదీశ్వరచ్యుత సర్వామరార్చిత సర్వవేద్య । యజ్ఞేశ యజ్ఞాత్మ యజ్ఞ స్వరూపక యజ్ఞసంరక్షక యజ్ఞమూర్తి । యజ్ఞప్రరూప మహాదియజ్ఞాభివందిత యజ్ఞ భుక్పాలన యజ్ఞనిలయ । యజ్ఞనాయక కామితయజ్ఞ ఫలద । యజ్ఞభోజన యజ్ఞ కృత్యజ్ఞసాక్షి । సరసిజనాభ భూజయయానందమూర్తి । పరమ హంసాభి వంద్య యోపరమపురుష ।

ద॥ దేవా సహస్రశీర్ష సహస్రాస్య సహస్రనేత్ర సహస్రపాద సహస్ర నామధేయ సహస్రమూర్తి అనేకాద్భుత దర్శన అనేకమాల్యాంబరాభరణ ధారణ అనేకాయుధ అప్రమేయ జగద్భరిత పరబ్రహ్మ చిత్స్వరూపక పరమాత్మ అనంత వీర్య అనంతాగమవేద్య అనంత కల్యాణగుణ పరిపూర్ణ సనాతన అనంతమయ ఆది దేవ అనంతశయన అనంతమూర్తి నిరాకార నిర్గుణ సగుణ దేవదేవ పరమపవిత్ర పరాపర పరమస్వరూప వేదమయ మనోమయ కాలమయ త్రయీమయ తుభ్యంనమోనమః॥

సీ॥ అంబరానిలగ పావకాంబు ♦ న ♦ వసుంధర లెవ్వని కాత్మలై యొసగు చుండు లోకంబు లెవ్వనిలో నవిలీనమై సృష్టిచె వెలపట జేనిలచు । సర్వతనదులతో బ్రహ్మాండ మెవ్వని యాధీనమున భద్రమై వెలుంగు । గ్రహతారకంబుల గణము లెవ్వని యాజ్ఞ రేయును పవలు చరింపుచుండు । నట్టి సర్వేశ్వరుడవు ప్రత్యక్షమై తి। ప్రకట మాయాపదలు దీర్చుమయ్య పద్మ । పత్రనిభనేత్ర లక్ష్మీశ బహువిచిత్ర । చారు తరగాత్ర సుజ్ఞాన సచ్చరిత్ర ॥

క॥ రావణుబాధల కోర్వక । నీవిధమున యార్తితోడ నేతెంచితిమ । యీశ వరద కరుణజూడుము దేవతలకు దిక్కునీవ దీనశరణ్యా ॥

చ॥ అనివినుతించు దేవతల కామధుసూదను డార్త రక్షకుండను వినుడయ్య లార వనజాసనుడా పలలాశినేతకున్ । మనమున గోరుకొన్నటుల మానవకే నిచ్చె వరంబులందు సా । ధునయము మానిలోకముల దుఃఖనిమగ్నుల జేశెహ్రింపై ॥

వ॥ వాడును సర్వదిగ్విజయంబు నొందికొనిన రవానరుల మాత్రంబు లెక్క సేయడయ్యె గాన మానుషాకారంబున వనచర సహాయుండనై యతని సంహరింపగల వాడ కావున మీమీయంశంబులచే ఋశ్యమూక పర్వత ప్రాంతంబున కపుల నుత్పన్నంబు గావింపుండు ॥

క॥ కలికాలమున దశరథుండను । భువనము రక్షింపుచున్న భూవరు నెడ నే । నవతారమెత్తి మిము గాని । కృపముగ వధియింతు పూర్వదేవాధ్యక్షున్ ॥

వ॥ అని యభయంబొసంగి కమలాక్షుండంత హితుండయ్యె నప్పుడు నిలింపులు గుంపులు గొని రావణుండు మృతుండగుట నిశ్చయంబని సంతుష్ట మానసులై నిజనివాసంబులకుం జని భగవదవతారంబునకై యెదురుచూచుచుండిరినవంశచరిత్రంబు వినమని కాళికి తత్ప్రియుండిట్లనియె ॥

కం॥ ఇనతనయుడునై వస్వత । మనువునకు దయించె నొక్క మానవ నాథుం । డను సమగుణుడిక్ష్వాకుం । డిన కులమున నాది పురుషుడితడయ్యె సతీ ॥

వ॥ ఇతండయోధ్యయను నగరంబు పాలించెనది మొదలు సూర్యవంశంబు

—:( ఇనవంశ రాజుల చరిత్రము ):—

రాజధానియయ్యె నట్టి పట్టణంబేలిన రాజులనెల్ల యెరింగించెద వినుము ॥

ఆ॥ కొడుకుపుట్టె మనువు కొడుకగు యిక్ష్వాకు । కుక్షి లోన నొకడు కుక్షి యనగ । కుక్షియనగ । కుక్షియుదరమున వికుక్షియనగను । జననమందె తండ్రి జనకుడుబ్బ ॥ వ॥ అట్టి వికుక్షికి బాణుండుదయించె బాణున కనరణ్యుండతనికి పృథుండు పృథునకు త్రిశంకుండు త్రిశంకునకు దుందుమారుండు దుందుమారునకు యువనాశ్వుండు వానికి మాంధాతృడు నతనికి సుసంధి సుసంధికి ధృవసంధియా రాజునకు భరతుండా భూపాలునకు అశితుండమ్మది నీకాంతునకు సగరుండు జన్మించె నాతనికిద్దరు పత్నులందు పెద్దభార్య కసమంజసుండు రెండవ దానికి యరువదివేల పుత్రులంబడసి రాజ్యంబు సేయుచు ॥

చ॥ క్రతువనరింప వజ్రితురగంబు హరించుకపోయి కాదనముం । డతుల తపంబునేయు వనమందున గట్టె యథేచ్ఛనేగ భూ । పతిగని ఋత్విజుల్సవన భంగము గల్గెను వాజిలేమి నీ । సుతులను బంపుఘోణి నివసుంధర లోకలయంగజూడగన్ ॥

వ॥ అని యాజకులానతిచ్చిన షష్టి సహస్రతనయులందోలవారు నలుదిశలంబరికించి ధరందవ్వి చని సుతలంబున కపిలముని సమీపంబున గుర్రంబుండుటగని యతండె నశ్వహారుండని బంధింపందలంచిన నమ్మునికనులు విచ్చి చూచినంత యరువదివేల సగరసుతులు తత్క్షణంబున భస్మంబైకూలిన ॥

క॥ తడవాయె సుతులు రాకకు । పుడమిన్ ఘోటకము వెదకబోయిరి నాత । త్తడి జిక్కకున్న మరి నెయ్యెడ నెవ్వరి చేతజిక్కినేమైరొకదా ॥

వ॥ అని చింతించి బాల్యంబున పౌరబాలుర నెల్లన్గొనిపోయి సరయూనదిం బారవైచుచు దుష్టక్రియారంభుండైన యసమంజసుండను రెండవ పత్నిసుతుని

పురంబు వెడలందొబ్బి తత్పుత్రుఁడగు నంశుమంతునిం బోషింపుచుండ నటం జేశి సమీపంబుననున్న యతనిం గనుంగొని ॥

క॥ క్రతుభంగ మొదవెనిట నీ । పితరులు ఘోటకముజూడ పోయింజని రా । కతడ నిరిరేమి హేతు వో । దృతమత్రివైనీవుబోయి తెమ్ము హయంబున్ ॥

వ॥ ఇట్లు పౌత్రున కాజ్ఞాపించిన యంశుమంతుండు నతిశీఘ్రంబున వెడలి నిజ పితృవ్యుల మార్గంబునంజని యశ్వంబు నుంగని భస్మరాశులై కూలియున్న తండ్రు లంజూచి దుఃఖింపుచున్న యతని పాలికి గరుత్మంతుండు చనుదెంచి యిట్లనియె॥

ఆ॥ తండ్రులెల్ల జరిగినైన మోక్షంబున । వారికొరకు నిల్లువగవ నేల । భస్మ దాశిగంగ పావనజలముల । ముంచవారికెల్ల ముక్తిగల్గు ॥

వ॥ కావున మత్కగిని తనయులగుటం జేశి నీకెరింగించితి నికార్యంబు నీవలన నేయుంపంజను దెంచితి తండ్రీ వియద్గామి నీసలిలంబు ధరామండలంబునకు దెచ్చి వారి పునీతులంజేయుమని దీవించి పక్షీశ్వరుండరిగిన యనంతరంబ ॥

తే॥ హయముగొని పోవక్రతువు సమాప్తిజేశి । సగరుడాయంశుమంతుని సర్వ పట్ట । భద్రుగావించి సంసారబాహ్యుడగుచు । ముక్తినొందెను దేహవిముక్తుడయ్యు

వ॥ అంశుమంతుండు నిజవంశానుగతంబైన రాజ్యంబు సేయుచు గంగావతర ణంబున చింతంబూని కాలగతింజనియె నతనిపుత్రుండు దిలీపుండును ॥

క॥ సురనదిజలములచేత స । గరతనయుల పావనంబు గావింపుగ నే । తెరగు న సమకూరునొ నా । తెరమున ననుచుండి యతడు తనువుం బాసెన్ ॥

వ॥ ఆదిలీపతనయుండైన భగీరథుండనువాడు ॥

చ॥ తపమొనరించి దేవనది ధారుణికింగొని తెచ్చి తాతల । న్నపగతదోషులై దినమునందు నశాశ్వత సౌఖ్యమంద గా । కపిలుని కోపవహ్నిబడి కాలిన భస్మము ముంచెనీటిచే । నృపమణి కీర్తిగాంచె ధరణింగల రాజులకెల్ల మేటియై ॥

వ॥ అట్టి భగీరథునకు కకుత్సుండు కకుత్సునకు రఘువురఘునకు కల్మాష పాదుండు కల్మాషపాదునకు శంఖణుండు శంఖణునకు సుదర్శనుండు సుదర్శనునకు యగ్నివర్ణుండు యగ్నివర్ణునకు శీఘ్రగుండు శీఘ్రగునకు మరువు మరువునకు ప్రశుశ్రుకుండా రాజసత్తమునకు అంబరీషుండు నాయంబరీషునకు నహుషుండు బుట్టె॥

క॥ నహుషుని సుతుడు యయాతియు । మహనీయుడు సకలలోక మాన్యుండ గుచున్ । బహుసౌఖ్యమందె రాజ్యము । గృహధర్మమువదలకుండ క్రీడారతుడై ॥

వ॥ ఆయయాతికి నాభాగుండు జనించె నతనికజుండు బొడమి రాజ్యంబు పూజ్యంబుగా నేయుచు ॥

ఆ॥ వంశ్రీరఘున జడసె పద్మాప్తవంశంబు । తేజరిల్లె సుతుని దేహకాంతి ।
యజుడు సంతసించి యాత్మజునకు । జాతకర్మనడపె మిగుల కాంక్ష జేసి ॥

—:( దశరథుని చరిత్రము ):—

వ॥ విప్రులకనేక భూహిరణ్య దానాదులొసంగి పుత్రజన్మోత్సవంబునంబొంగి యుండెనంత ॥ సీ॥ సకలరాజాధి రాజసముల నణగించి వసుధనైకొన్నట్టి వాడెవండు । శంబరాసురమాయ సంగ్రామమున దైత్యవరులనే పరిగించు వాడెవండు । భగవంతుడే భూమి పతిగర్భమందున వరపుత్రుడై పుట్టువాడెవండు । తపనకులంబున తనకీర్తిలతికల స్వర్లోక మెక్కించు వాడెవండు । యట్టి దశరథ భూపాలుడజుని తనయుడజుడు దశరథునకు సుతుడైన యటుల । వృద్ధిబొందుచునుండె వివేకవినయ । రమ్యగుణశాలి దశరథ రజపాళి ॥

వ॥ ఇట్లు వృద్ధిబొందుచు దినదిన ప్రవర్ధమానుండై యున్నతనయునకు రాజ్యతంత్రంబునందు నియోగించి యజ భూపాలుండు తపోవనంబున కుంజనియె ॥

తే॥ రాజ్యమేలుచు దశరథరాజు వేట । తమకమొదవనాటి నొక్కడ ధనువు దాల్చి । సరయునది ప్రాంతవనిజేరజని యతండు । మృగములను జాసవిహరించె మిహిరకులుడు ॥ వ॥ ఇవ్విధమున యనేక మృగంబులంజంపుచు రాత్రిందివంబుల సరయూనది సమీపతరుగుల్మల తాదులయందు విహరింపుచు నొక్కనాడమ్మహానది యందర్ధరాత్రంబున జలంబులయందు బుడబుడ యను శబ్దంబు వినవచ్చిన మత్తగజంబులు పిపాసార్థంబు సరయూనది జలంబులు ద్రావుచున్నవని నిశ్చయించి శబ్దభేది బాణంబు సొడగివేసిన వేటుతోడ హాభగవంతాయను శబ్దంబు చవులంజొర బారిన నదరిపడి దిగ్గున నచ్చోటునంటంబోయి బాణవేదనచే పొరలాడుచు నాయాసపడుచు రక్తసిద్ధాంగుండైయున్న యొక్క వనప్రస్థానుండగు ఋషింగని భయంబందియతని సమీపించి నిలుచుండెనంత ॥

ఉ॥ చూచియతండు రాజునను చోద్యమ నన్నిటు బాణవేదనం । దోచిత్రివేమనందు నొక ద్రోహము జేశి యరుంగనైన సం । కోచములేను తల్లి జనకుండును చీకులు వారికెవ్వరుం । బ్రోచెడువారు లేరనుచు పొక్కెద ప్రాణము నీకు దక్కగ ॥

ఉ॥ వారలడప్పిదీర్పుటకు వారిగొనంజను దెంచి యీక్రియ । న్మారణమంద గావలసె మానవనాయక వారికింత యీ । నీకముబోశి ప్రాణములు నిల్పుమునీకు యశంబుగల్గు నీ । నేరముగాదు పూర్వమున నే నొనరించిన కర్మయేసుమీ ॥

వ॥ సమీప వటవృక్షంబుక్రింద కావడిందించినవాడ నందు మజ్జన కుండు దేవీసహితుండైయున్నవాడు కుంభవలంబులంగొనిపోయి వారలకిచ్చి జలపానంబొన

రించినపిదప యీవృత్తాంతం బేర్పడం జెప్పుమని యానాథూత్త ముండెరింగించిన యప్పుడ తజ్జలకుంభంబు నెత్తుకొని వారలున్న వటమహీరుహంబు కడకేతెంచిన పాదంబుల ధ్వనివిని పుత్త్రుండ కాఁదలచి యంధవృద్ధుండిట్లనియె ॥

ఆ॥ తనయనీవుబోయి తడవయ్యె మీతల్లి । దప్పిగొనియె దవిలి చాలతల్లడిల్లె ।
గుడ్డివారి మమ్ముఁ గొని తెచ్చి యీ తీరు । జేసితయ్య మమ్ము బాసితండ్రి ॥

వ॥ అని వగఁజెంది యాక్రోశించు యాంధమిథునంబునకు పంక్తిరథుండు మౌనంబున జలంబులివ్వంబోయిన వారలనుమానంబున తనయా యని మున్నూరు చ్చరించి పలుకకున్న నీవెవండవు మాసుతుండెచ్చట నున్నవాడు పలుకరించిన మాటాడవదియేమన్నా యని పలువరించుచున్న వృద్ధ దంపతులకు రాజిట్లనియె ॥

క॥ క్షత్త్రియుడను కమలాప్తుని । గోత్రంబున బుట్టినాఁడ కుటిలాత్ముఁడ మీ ।
పుత్త్రునిశరమున మృగమని । ధాత్రింబడ వైచినాఁడ తాపసులార ॥

వ॥ సరయూనది జలంబుల కుంభంబు పూరింపుచుండ బుడబుడయను శబ్దంబు విన్నంత గజంబను జిఘాంసచే బాణ ప్రయోగంబుగా వించియనంతర బవచ్చికనుంగొని పశ్చాత్తాపంబున చింతించితి గతజలసేతుబంధనంబుగాదే మీరలు నన్ననుగ్రహించి యీనీరంబులు స్వీకరింపుండని పలుకుచున్న రాజువచనంబులు వజ్రపాతంబులై హృదయంబులుభేదింప నయ్యిద్దరుమూర్ఛంబడి కొంతవడికిదెలసి యిట్లని విలపించిరి ॥

ఉ॥ కన్నులులేక యీ విధము కష్టమునొందుచు నున్న మాకు యా । పన్న నివారకుండవయి బాణముచే మృతిబొందితక్కటా । యెన్నడుజూడబోలు నిర హేతుక మయ్యెన చావుగల్గె మా । యన్న దయాంబురాశివి గదన్న మము న్నెడబాసి తేమనా ॥

వ॥ ఇవ్విధంబున ॥ క॥ పలవింపుచుమూర్ఛలచే । యిలబడి హాపుత్త్రయంచు నేడ్చుచు మాకీ । యలవటమాన్చెడులారలు । కలరా సుతనీవుపేర్చిత గతికింబోవన్ ॥

వ॥ అని శోకింపుచు దశరథుంజూచి నరేంద్రా మాపుత్త్రుండు పడినచోటికి మమ్ముం గొనిపొమ్మని దీనాలాపంబులం బల్కిన యాపలుకులు తన కర్ణంబులకు ములుకులక్రియ వేధింప నక్కావడి నెత్తుకొని యచ్చోటికేతెంచి పడియున్న పుత్త్రకళేబరంబుజూపిన మూర్ఛనొంది హా పుత్త్ర హా పుత్త్రయంచు కళేబరంబంటుచు నొకరి నొకరు గట్టిగంబట్టుకొని హృదయతాడనంబు లాచరింపుచు శిరంబున పాంసు లెగజల్లుకొనుచు యాక్రందనంబున తనయునుద్దేశించి యిట్లనిరి ॥

క॥ సగరదిలీపభగీరథ । జగతీశులసత్పథంబు సయ్యనసీవు । న్నగనంభవించు గావున । నిగమాంతవిచారదత్త నిశ్చలచిత్తా ॥

వ॥ అని దీవించిరంత నక్కుమారుండు దశరథునితో రాజేంద్రా నీవు బ్రహ్మ

హత్య పాతకంబు సంభవించెనను భయంబుగందకుము నేను బ్రాహ్మణుండగాను వైశ్యునకు శూద్రస్త్రీయందు బుట్టినవాడ శరవేదన యోర్వరాకయున్నది బాణ మోక్షణంబు గావింపుమనిన నతండట్లుచేయ జీవంబులవదలి యంతరిక్షంబున దివ్య విమానరూఢుండై రెండవ సూర్యునింబోలె ప్రకాశింపుచు దివంబునకరిగె నిటన యిద్దరువృద్ధులు పుత్రశోకంబు పట్టంజాలక రాజునుద్దేశించి ॥

క॥ సుతుజంపిమాకు బహుతర । వెతలంబెట్టితివిగాన వినుమీ క్షత్రియ నీ । సుతు బాసి పుత్రశోకము । కతమున నీతనువు గాయగా నగుమీదన్ ॥

వ॥ అని శపియించి నయ్యుభయులు ప్రాణంబులం బాసి లోకాంతరగములైరి పదంపడి దశరథుండు పిన్నంబోయి నగరంబు చేరంజని రాజ్యతంత్రంబుల నడపుచుండి క్రమంబున కోసలరాజ నందనయైన కౌసల్య సుమిత్రుని పుత్రికయైన సుమిత్రను కేకయరాజ కన్యకయైన కైకేయిని వివాహంబులై సుఖంబున నుండెనంత ॥

క॥ దశనిభయానలగు నా । కాంతలతో కలసిదినము గడపుచునట భూ । కాంతునకొకసతికైనను । సంతానముగలుగదయ్యె చాలగకొరతన్ ॥

క॥ మంత్రనయమున బహువిధముల । చింతింపుచునవ్వసిష్ఠు చేరంజని తా । నెంత ధనవంతుడైనను । సంతతిలేనట్టిరాజ సత్తముడెలమిన్ ॥

వ॥ పరలోకదూష్యుండగుంగాన పుత్రుంబడయు నుపాయంబు సేయుమని ప్రార్థించిన కులగురుండగు వసిష్ఠుండును వామదేవుండునుం గలసి రాజునకిట్లనిరి ॥

సీ॥ సవనంబుసేయుము జగతీశహయమేధ ఫలమున సంతతిగలుగువినుము । సరయూ నదీప్రాంత సర్వంసహాదున్ని శాలలేర్పడగట్టి సర్వమునుల । బ్రాహ్మణక్షత్రియ వన్యులశూద్రుల పిలపించివారలప్రీతి జేసి । యన్నదానంబుల నందరతృప్తుల గావించి శుభయుక్తకాలమందు । హయమలంకృతిగావించి నట్టివిడువ । వలయురక్షకుడొకడు రావలయువెన్క । తిరిగిసంవత్సరంబుకు దెచ్చి సవిధ । ముగనయజ్ఞంబు సేయంగ నగునరేంద్ర ॥

వ॥ అదియును వసంతఋతుప్రయుక్త కాలంబగు చైత్రంబాసన్నం బగుచు వచ్చుచున్నయది సంభారంబెల్ల సవరించి పత్నీయుతుండవై దీక్షగైకొని తురంగంబు విడచు నదియని పురోహితులు వచించిన సమీపంబుననుండు సుమంత్రుంజూచి యిట్లనియె ॥

తే॥ తురగమేధంబుగావించు కొరకుదీక్ష । శాలలేర్పడ గట్టించు సరయునదికి । నుత్తరాభిముఖంబుగ యూపములను । నాటి సంభారములను నచ్చోటనిలిపు ॥

వ॥ ఇట్లు నిదేశించిన సుమంత్రుండు సర్వంబాయత్తంబు గావించి రాజున

కైరంగించిన పురోహిత సహితుండై యాగశాలం బ్రవేశించి శుభలగ్నంబందున పత్నీ సహితుండై దీక్షగావించి తురంగంబువదలి వెన్కరక్షకుల నియోగించిపంపి హోమ క్రియలాచరింపుచుండె నక్కడ హయంబువెడలి ॥

ఆ॥ తిరిగితిరిగి ప్రాచిదిశనుండి దక్షిణ । దిక్కునరసివరుణదేశమరిగి । యుత్త
రంబుజూచి తత్తడిజనదెంచె । పట్టుకొనెడుభూమి పతులులేమి ॥

వ॥ ఇవ్విధంబున నొకసంవత్సరంబునకు చనుదెంచిన హయంబు యూపస్తంభంబున బంధించి త్రిశతయూపంబులయందు పశుస్థాపనంబులుగావించి ప్రాతస్సవన మాధ్యందిన తృతీయ సవనంబులనెడు సంఖ్యాకంబులగు హోమంబులు వ్రేల్చుచు నప్పటప్పటికి జనంబులధికంబై యన్నపానాదుల తృప్తిజెందనివారులేరు సకలరాజ సమూహంబు చనుదెంచి దశరథనరేంద్రునిచే సత్కరింపంబడి తన్మఖంబు వేడుకం జూచి సంతసింపుచుండిరి మరియును ॥

క॥ ఆహుతులకొరకుదేవత । లాహూతులగుచువచ్చి హవ్యంబులు తా ।
మేహరియింపుచునుండిరు । నాహరిహయముఖ్యులైన యదితికుమారుల్ ॥

వ॥ ఇట్లు దేవతలెల్ల ప్రత్యక్షంబునం గొనుచుండ సంపూర్ణశాలితండులో దన భక్ష్యభోజ్యాది షడ్రసోపేత ఖాదనంబుల యథేష్టదక్షిణల యుక్తమంత్రంబుల ప్రయుక్త తంత్రంబుల నభిమతసౌఖ్యంబులం జెన్నొంది మఖంబునిర్వర్తింపుచు కర్మకలాపంబై యనేకక్రతువిభాగంబైన సంకేతంబుల హోతాధ్వర్యూద్గాతలచే నిర్మాణింపంబడిన శాస్త్రప్రకారంబున కౌసల్యపరిచరింప దశరథుండు కృపాణంబున నయజ్ఞాశ్వంబు విశసనంబుగావింప యాజకులచేత సంగహోమసమాప్తంబుగావించి ప్రభూత ధనధాన్య సమృద్ధంబై నిర్విఘ్నపరిసమాప్తంబగుచునుండె నందువసిష్టవామదేవులు॥

తే॥ పుత్రికామ బుగల యిష్టిపురుషసూక్త । మంత్రములచేత వేల్వగ మంద
గతిని । వహ్నిలోనుండి రెండవ వహ్నికరణి । యజ్ఞపురుషుండుప్రత్యక్ష మయ్యెనచట॥

క॥ పాయసపాత్రము చేగొని । జాయలకిమ్మనుచుతను జనపతికిచ్చెన్ ।
శ్రీయుతుడై కౌసల్యకు । పాయంబునసగముదేవ పాయసమిచ్చెన్ ॥

క॥ తక్కినయర్ధములోపల । మక్కువకైకకుసుమిత్ర మానినులకు తా ।
నక్కరసమముగనిచ్చుచు । చిక్కిన శేషముసుమిత్ర చేతికినిచ్చెన్ ॥

వ॥ ఇట్లద్దివ్యపాయసంబు నమ్ముగ్గురు రాజపత్నులు ప్రాశనంబుగావించి యారూఢ గర్భస్తులై యుండిరంత ॥

చ॥ క్రతువుసమాప్తిజేసి యుదకంబులస్నాన మొనర్చిపూర్ణయా । హుతి
నొనరించి యాజకుల కొక్కరికొక్కక రాజ్యమిచ్చి భూ । పతిసవనార్థమై యఘరు

పార్థివముఖ్యులకెల్లవస్త్రము లొసగి పుష్పమాల్యము లిచ్చి పురరాజు నుతింపగ నంపెనందరన్ ॥

వ॥ ఇక్ష్వాకువంశజ దశరథుండు ॥ సుగంధి ॥ ప్రాజసిద్ధమైనచాల పుణ్యభూమి యయ్యెనన్ ॥ యాజకాళితోడ [illegible] యజ్ఞకర్మహోమముల్ ॥ * సి * రాజశేఖరుం [illegible] పౌరకలంబు [illegible] ॥ భ్రాజమానులగుచుదేవ రాజసన్నుతింపగన్ ॥

క॥ [illegible] మఖంబులు ॥ [illegible] నమరవధూటుల్ ॥ పతిసంగరతిసుఖంబుల ॥ గతియరుగనుండ్రు కొంత కాలంబ [illegible] ॥

క॥ అలతమసాతటమున భూ ॥ తలనాథునినిల్పబడిన తద్వ్యాపంబుల్ ॥ విల సిల్లగ దర్శిరము ॥ పులకితరోమాంచమైన పొలుపుసనుండెన్ ॥

వ॥ ఇట్లుగావించి యతులధర్మాచారంబున నిజరాజధానియగు నయోధ్యా పురంబు పాలింపుచు సుఖంబుండెనని పలికి త్రిపురదమనుండు మరియు నిట్లనియె ॥

ఉ॥ అంతవసంతముజ్వలిత మయ్యెనుకోసలమాధవీల తా ॥ త్యంతనికుంజపుంజ లలితాఖిలపుష్పసుగంధ శోభితా ॥ శ్రాంతపయోజదివ్య మకరందచిరంతన పానమోది తా ॥ స్వాంతమధువ్రతప్రకర ఝంకృతసాంద్ర దిగంతరాళమై ॥

చ॥ జలములచెంతనుంచి జలజాతపరాగముగాంచి కైరవం ॥ బులను నటించి పుష్పతతి పొందొనరించితదీయ్య సౌరభం ॥ బలరుచుగ్రోలిమించి వనమల్లజరించి నమందలీనమై ॥ వెలయుచువానిసంగతుల వీచెనుగాలి ప్రమోదశాలియై ॥

చ॥ కలువలు సంతసింప రతికాంతునిచిత్తముపల్లవింప నా ॥ కులతనొరంగి యుబ్బుచు చకోరకపంక్తులు ప్రస్తుతింప న ॥ ల్లలితగతిందనచున్ కమలంబులమోముల కాంతిడింప జా ॥ రులుతలడింపవాశ శధరుండుప్రకాశము నొందెనయ్యెడన్ ॥

ఉ॥ బంధురమాధవీలతల భాసిలిడోలికలందుదూగి స ॥ ద్గంధముగ్రోలిచిత్తము వికాసమునొందగ సంచరింపుచున్ ॥ పాంథజనాళి యంతయు విపద్దశజందగ జేసె మోహియు పు ॥ ష్పంధయహంక్తిఝుమ్మనుచు [illegible] నెల్లవేళలన్ ॥

చ॥ సురచిరపల్లవప్రసవ శోభితసాంద్ర రసాలశాఖల ॥ స్థిరవుగ విశ్రమింపుచు తదియ్యసమంచిత వైభవోన్నతిన్ ॥ బరమముదంబునన్ బాదలి పాంథజనావళిభీతిజంద గా ॥ కరమనురక్తిగూయు కలకంఠకదంబము లవ్వనంబునన్ ॥

సీ॥ రమ్యకాసాంత రంగనినాదంబు లమరంగ భేరివాద్యములుగాగ ॥ పంకజ మకరందపాన సేవిముఖ ఝంకృతుల్గానంబుసరణిజూప ॥ కమనియ్యనరవీల కంఠసందో హాయా నంబునృత్యాంబు చందంబుదెలుప ॥ శుకనికరంబుల ప్రకటరవంబులు కైవార మొనరించు కరణిదోప ॥ పౌరపికములుశౌర్యంబు ప్రస్తుతింప ॥ కేతకీప్రసవకుంతంబు

కేలబూని । యిక్షుకోదండమెక్కిడి పూచిప్పుష్ప। బాణముల కేలబూని మోహాభావజుండు॥

చ॥ అతివిభవంబుతోడ మలయానిలమత్తగజంబునెక్కి నం । తతజయశీలుడై యువజనంబుల చిత్తము గాథసేయగా । ప్రతిన వహించి లోకముల పై దనశౌర్యము వెల్లడింపగా । నతడాగి వేటవెళ్లె హృదయంబున సంభ్రమ మగ్గలంబుగాన్ ॥

వ॥ మరియును ॥ క॥ అరుణప్రసూనశోభిత । కురువకనికరంబుదనరె కోమలి మగుచున్ । మరునకు *న* హారతులెత్తిన । కరణిన్ ప్రసూన వనసీకాసము తెలమిన్ ॥

ఉ॥ ఆ మధుమాసమందు వనులందరు చల్లని నీడదాపునన్। వేమరు సంచరింపుచును వేసవికాలము దాటుచున్నదో । కోమలదేహమంతటను క్రొత్తగ తాపము లుప్పతిల్లె మా । కేరుట నారువాయువట నేగెను దక్షిణమంటి బాలుడై ॥

వ॥ అనుకొనుచు సీతోపచారంబుల చందనలేపనాదుల మల్లికా కుసుమవాసనల శృంగారవనవిహారంబుల నదీనదంబులయందు సికతాతలంబుల దీర్ఘంబైన దివాకాలంబులు గడపుచున్నంత ॥

క॥ హరిశంఖచక్రశేషుల । పరతేజము దశరథేశు పత్నులయుదరాం । తరముల యందున జేరెను । పరమాన్నముతోడ గలసి । భగవన్మయమై ॥

వ॥ ఇట్లసురవధార్థంబు మానుషాకారంబున భగవంతుండా రాజపత్నుల గర్భస్థుండై యుండెనంత ॥

—:( దేవతాంశంబులచే వానరులయుత్పత్తిచరిత్ర ):—

క॥ వనజజుడు జాంబవంతుని । ఘనముగ సృజియించె పెద్దకాలాంజనశై । లనిభంబగు దేహము గల । వనచరముల కెల్ల మొదటివాడై చెలగన్ ॥

సీ॥ ఇంద్రుండు వాలిని యినుడు సుగ్రీవుని సురమంత్రి తారుని వరుసగనిరి । నీలు డగ్నికిబుట్టె నేర్పరి నలుడును కపిబుట్టె నా విశ్వకర్మ కెలమి । యుక్కటవరుణున కాసుషేణుడుగల్గె । ధనదుండు గంధమాదనుని గనియె । వాయుపుత్రుడై వర్ధిల్లె మారుతి పర్జన్యునకు శరభ కపిబుట్టె । ద్వివిద మైందులు నశ్వినీదేవసుతులు । గయుడు బుషభుండు వినతుండు । గవయుడనగ గరుడ గంధర్వ కిన్నరసురల యంశ । మూలనా జనియించి రాబుఋశ్య మూకమునను ॥

వ॥ ఇట్లుజనియించి తమకు వాలిసుగ్రీవులు యేలికగా నిర్ణయించుకొని రామసహాయంబుకొరకు నిలచియుండిరింక రామజన్మప్రకారంబు వినుము ॥

క॥ నవమాసంబులునిండగ । ప్రవిమలమతులైన రాజపత్నులయందున్ । దివమునగలిగెను శ్రీహరి । వివరింపగకళలు నాల్గువిధముల తరుణీ ॥

వ॥ అంత కౌసల్యకు ॥ మ॥ మధుమాసంబున శుక్లపక్షనవమీ మధ్యాహ్న

—:( శ్రీరామజన్మ వృత్తాంతము ):—

కాలంబులో । విధిప్రార్థింపగబుట్టెరాము డనగావిశ్వంభరుండైన చ । క్రిధరుండంత పునర్వసుకర్కటక లగ్నంబందుసిక్ష్వాకు వం । శధరాదీశులకెల్ల తేజమెసగన్ శశ్వత్ప్రభా వోన్నతిన్ ॥

క॥ తనకులమున భగవంతుడు । జననంబందుటనుజూచి జలజాప్తుడు పా । వన మయ్యె వంశమనుచు గ । గనమునవిలసిల్లె మధ్యగతుడై యపుడున్ ॥

వ॥ ఇట్లు మనుకులంబెల్ల ప్రకాశంబగునటుల చతురానన నాదిసురల కొసంగిన వరంబు బల్మిమానవాకారంబున కౌసల్యాగర్భ సంజాతుండై కమలాక్షుండున్నంత కయికయు పరంబునందు ॥

క॥ చక్రాంశంబున భరతుడ । వక్రపరాక్రముడు సూర్యవంశంబున భూ । చక్రపతియగుచు పుష్యమి । నక్రమమునమీనలగ్న జనితుండయ్యెన్ ॥

వ॥ అనంతరంబున సుమిత్రకు ॥

ఉ॥ శేషునియంశలక్ష్మణుడు సేవకుడై హరిదాస్యమంద నా । శ్లేషజనించె కర్కటక శీతమృగాంకుడు తేజమందగా । భీషణశంఖ రాజకళ శత్రునియప్పుడ పుట్టెనెరి నం । తోషణుడయ్యెతాయమళ సోదరులన్ కనె నాసుమిత్రయున్ ॥

వ॥ ఇట్లు యమళగర్భంబున శత్రుఘ్నుండు బుట్టినప్పుడు పుత్రచతుష్కంబు గలిగి చతుస్సముద్ర ముద్రితంబైన భూవలయంబు సంప్రాప్తమైన నంతియసంభ్రమ మనోరథుంలై దశరథుండు వసిష్టపురోహితుని రావించిన ॥

చ॥ గురుడరుదెంచి యాతపన గోత్రజులందిలకించియప్పుడే । సరగుశజాత కర్మములు చక్కగజేశె నరేంద్రుడంత భూ । సురులకు గోహిరణ్య పరిశుద్ధనవోదన పాయసాదులం । బరమ లనిచ్చెభూరిగను పర్వాలుపుణ్యాల వానగుర్యగన్ ॥

వ॥ అట్లు జాతకర్మానంతరంబున నామకరణంబుల నుపక్రమించి జేష్ఠాను పూర్వకముగా రామలక్ష్మణ భరతశత్రుఘ్నులను నామంబులు నిర్దేశించి యరుంధతి ప్రియుండరిగిన యనంతరంబున బాలకులు దినదిన ప్రవర్ధమానులై పెరుగుచు ॥

సీ॥ జతగూడి రాముండు సౌమిత్రిభరతుండు కడగొట్టుతమ్ముని గలసివేరు । వేరుగాచండ్లాడవేయుచు సామంతపృధ్వీశసుతులను బిలువనంపి । ఘోటకంబులనెక్కి వేటలాడుదమంచు పులుగులవెంబడిబోవుచుండి । కరులనారోహించి సరయూనదీతట మార్గులకేగబ్రాకి కేకలిడుచు । జలములోదిగి వెనువెంట జతలగట్టి । దాగిమూతల నాడుచు సాగియురుగు । వారివెనుకొని బెదరించు వారునగుచు । బాలలీలలదశరథ

బాలులెలసి ॥

మ॥ నగుచున్నేగుచు దూకుచున్బిలుచుచున్నానాప్రకారంబులన్ । నేగరన్వే
యుచు బంతులన్ తమలో తామెంతయైన పోరాడుచు । న్నగుచుత్రొక్కుచు పూలు
రాల్చుచు మహానందంబుతోగూడి చా । లగ రాజన్య కుమారునొక్క వెంటలా
డుచున్వేడుకన్ ॥

క॥ బాలక్రీడవినోదా । మూలంబున దేహమలరి ముదముగ జన భూ । పాలా
గ్ర సుతుడు తనుగని । చాలగ నెనువెంట ప్రీతి జననికుమారుల్ ॥

వ॥ ఇవ్విధంబున రామచంద్రుం డనుజసమేతుండై వినోదంబులు సాలించి
మందిరంబు ప్రవేశించి లక్ష్మిచే నివేదింపంబడిన క్షీరాన్నములు భుజియించి సుఖంబుండి
రంత నొక్కనాడు ॥

క॥ కోసలపతిసుత తనయుని । కోసము క్షీరోదనంబుగొని కట్టింబు । ల్బా ।
సుఖగుటకీడ నాతని । బాసురముఖమందుదోచె బ్రహ్మాండంబుల్ ॥

వ॥ మరియును ॥ సీ॥ బ్రహ్మాండములు ద్వీప పర్వతనదులు భూమ్యాకాశ
ములు సచరాచరంబు । లగు భూతనికరంబు లబ్ధులు నక్షత్ర గ్రహములు ఖేచరగణ

—:( విశ్వరూప సందర్శనము ):—

ము రుద్ర । గణములు యక్షరాక్షస ముఖ్యగణములు గరుడ గంధర్వాది గణము
మర్త్య । గణములు శివసోమ కంజాప్తవాసవ యమప్రచేతసుడుత్తరాధిపతియు ।
పావకుండు నిఋఋతి పవన వసువు । లాది గాగలలోకంబులన్నిటిని । పుష్కరజు
డందు విలసిల్లె పులహదక్ష । క్రతుపులస్త్యాదినవ ప్రజాపతులతోడ ॥

వ॥ ముఖంబుననింద్రుండును కంఠంబున రుద్రుండును వక్షంబున లక్ష్మియును
దరంబున చతుర్ముఖుండును రోమంబుల నోషధీతతులును శల్యంబుల సప్తకుల పర్వ
తంబులను నేత్రంబుల సూర్యుండును లలాటంబున పావకుండును ప్రాణంబుల వాయు
వు భ్రూమధ్యంబున క్రోధంబును హృదయంబున శాంతంబును మనంబున చంద్రుండు
ను శ్రోత్రంబుల దిశలును శిరంబున స్వర్గంబును కటిప్రదేశంబున మర్త్యలోకంబును
పాదంబుల పాతాళంబును అవయవంబుల సకల ప్రపంచబులుంగల్గి కనుల కగోచరం
బై చూడశక్యంబుగాక రవికోటి సంకాశంబై యొప్పుచున్న యబ్బాలకు నీక్షింపం
జాలక నిమీలిత నయనయై కౌసల్యాదేవి తనమనంబుననిట్లని వితర్కించె ॥

మ॥ భ్రమయో తెల్యను స్వప్నమో మరియు నిర్బాలుండు పుత్రుండొలే । కను
మాత్రత్వములో వెలుంగుపరుడో కల్యాణచారిత్రుడో । సుమనస్సాధకమైన నైజగుణ
[illegible]

మోహనరాగా ।

వ॥ అని మహాశ్చర్య మగ్నమానసయై యిట్లనిధ్యానించె ॥

శా॥ మూలంబైన విరాటరూపమిది నామాహాంబుచే పుత్రుడీ । బాలుండంచు భ్రమించియుంటి మదిలో పద్మాక్షు నాభాగ్యమం । దీలీలల్లన్నియు జూచితింక తెలసెగా వాసుదేవాది దే । వాలక్ష్మీపతి రామచంద్ర కరుణా వారాశియై బ్రోవుమా ॥

మంగళమహా శ్రీవృత్తము ః శ్రీమహిళవక్ష సరసీరుహవిలోచన నవిశేష మణిభూష ణవికాసా । హేమమయ చేల నిరహేతుక కటాక్ష పరమేశ పరదాస జనపోష । కామజన కాచ్యుత వికారభయదూర నృపకారణ శరీర కులసోమా । రామ రఘు రామ సురరాజనుత నామ బుధరంజిత పదాంబుజ జనేశా ॥

వ॥ ఇట్లనన్యభావంబున నేకచిత్తయై ధ్యానంబు గావింపు జననికి గాఢంబైన మోహంబు కల్గజేసిన పుత్రవాత్సల్యంబున అజ్ఞాన దశంబొంది యప్పటియట్ల భుజియింపంజేసె నవ్విధంబున ద్వాదశపరిమిత వయస్కులై రామలక్ష్మణ భరతశత్రుఘ్నులున్నంత దశరథుండు ॥

క॥ తనయుల కుపనయనాదుల । నొనరింపగ నవ్వసిష్ఠు నొయ్యన రప్పిం । చిన వచ్చి వామదేవుని । తన వెంటం గొనుచు ధాత్రీధవుని జేరగా ॥

వ॥ చనుదెంచిన నిజపురోహితులకు సంభావనాది సత్క్రియలాచరించి గద్దియల యందు గూర్చుండ నియమించి కరంబులు ముకుళించి యిట్లనియె ॥

తే॥ బాలులకు నిండె ద్వాదశాబ్దంబులిపుడు । వేదమంత్రాధికారుల యాదరమున । నేయుడని రాజు ప్రార్థింప నేయవలయు । గ్రీష్మఋతువందు నని యెరిగించి రపుడు ॥ వ॥ తత్కాలంబునకెల్ల సంభారంబులెల్ల సిద్ధపరచి యుండునదియని చెప్పి యరిగిన సుమంత్రున కావిధం బెరింగించి ॥

చ॥ నగరమలంకరింపు నరనాథుల విప్రులమాని బృందముల్ దగబిలుపింపు మంగళ విధానములెల్లను యాచరింపు మేలుగ శుభవాద్యముల్ చెలగ లోపలి మందిరమందు చక్కగా । మృగమద లేపనంబులను మేలగు కట్టడముల్ ఘటింపుమా ॥

వ॥ అని యానతిచ్చినంత సుమంత్రుండు గృహంబెల్ల శృంగారంబు గావించి మకరతోరణంబులు మాణిక్య దీపంబులు వైడూర్యమణు లలంకరించిన పతాకంబు లెత్తించి సకలంబు నాయత్తపరచి ప్రాగ్దక్షిణ పశ్చిమోత్తర జనులనెల్ల రావించి వసిష్ఠానుమతంబున రాజున కెరింగించి ॥

—:( రామాదుల ఉపనయన వృత్తాంతము ):—

క॥ సుముహూర్త కాలమందున । గుములైమునులెల్ల రాజకుంజరు నెదుటన్ ।

క్రమమున యుపవీతము లా | గమ మంత్రపురస్సరముగ కంకణములం దమరన్ ॥

క॥ ధరియింప జేసి వైశ్యా | సరునకు మ్రొక్కించి వేల్చి నలుగురికిని భూ | సురపుణ్యాంగనలిచ్చిరి | మురియుచు హారతులు రాజ ముఖ్యుల కెలమిన్ ॥

వ॥ అనంతరంబ రాజేంద్రుండైన దశరథుండందరికి తగిన రత్నాభరణంబులు పట్టుపుట్టంబులు స్వర్ణదక్షిణల నిచ్చి షడ్రసోపేతంబులైన యన్నపానాదుల సంతృప్తులం జేసి పంపించె నవ్వటువులు విద్యాభ్యాసంబున కుపక్రమించి ॥

సీ॥ వేదంబులును క్షత్రవేదంబు బహుతర భేదంబు యుద్ధవినోదములను | రథగజతురగాది వృథనంబు నడపించు తెరగులు వ్యూహసంధిత్వ తయును | శరమోక్షలాఘవ శబ్దభేదక బాణ సంధాన దృఢముష్టిసాధనములు | గదయష్టి తోమర కరవాలముద్గరము సలశూలప్రయోగములను దెలసి | ద్వంద్వసమరంబు సముముష్టి చందములను | దండసామాద్యుపాయ విధానములను తెలసి ధీరతపరుల సాధించుటయును | మొదలుగాగలవన్ని సమ్మోదమొలర్ప ॥

క॥ అరువది నాలుగు విద్యలు | యరువదినాలుగు దినంబు లందున నాము | గ్గురి తోడగూడి రాముడు | చిరయశుడై నేర్చె కడు విచిత్రముగాగన్ ॥

వ॥ ఇట్లు రాజులకు ముఖ్యంబైన ధనుర్వేద మంత్రతంత్రక్రియారూపకంబైన యథర్వణ విద్యాప్రవీణులై సుజ్ఞానవంతులై జననీజనక సేవాపరులై సత్యసంధులై నిరతానంద మనస్కులై యొప్పుచున్న తనయులంజూచి దశరథుండు పరమానందంబు నంబొంగి యుండె భగవంతుండైన శ్రీమన్నారాయణుండు రాక్షస వధార్థంబు రవికులంబున పంక్తిరథునకు పుత్రుండై జన్మించుట యెఱింగి గాధిపుత్రుండైన విశ్వామిత్రుండొక్కనాడు ॥

సీ॥ సృష్టికిప్రతిసృష్టి జేసినతనప్రజ్ఞ నఖిలామరులుగొనియాడుచుండ | బ్రహ్మత్వమునుబొంది పారీణతకుమౌని బృందంబులాశ్చర్య మందుచుండ | ఘనుడంబరీషుండు మానుసేయునరమేధమున శునశ్శేపు జీవనమొసంగి | సశరీరమున దేవ సదనంబు కరిగెడు సవనంబుజేసి త్రిశంకు నృపతి | శాశ్వతంబైన రెండవ స్వర్గమందు | నిలిపి సత్కీర్తిగాంచిన నియమశక్తి | పరుడు కుశవంశ వరసీత కరుడుగాధి | నందనుడువచ్చె సాకేతనగరమునకు ॥

క॥ చనిదశరథ భూపాల స | దనమున కేతెంచి సర్వధరణీధవ మం | దనుడైన రాజుగని తన | మనమున సంతోషజలధి మగ్నుండయ్యెన్ ॥

వ॥ దైవమానుష బలసంపన్నుండైన దశరథేశ్వరుండు కౌశికున కెదురేతెంచి సాష్టాంగంబొనంగి నమస్కరించి తోడితెచ్చి విధివిధానంబునం బూజించి గద్దియపై

నివసింపఁజేసి వినయపూర్వకంబుగా నిట్లనియె॥

ఉ. ధన్యతనొందె నాకులము తాపసచంద్రమ నీవు రాకడ। న్మాన్యుఁడనైతి భూమిఁగల మానవనాయకులందు నేఁడు నా। మాన్యుఁడ వేమునీశ్వర సమాహితచిత్తతపస్సుచేత రా। జన్యముఁబాసి బ్రహ్మఋషి సత్వమునొందఁగలేదె పూర్వమున్॥

వ॥ దేవాధవదివ్య సందర్శనంబునం జేసి కృతార్థుండనైతి నీ వేమిటి కరుదెంచితి వట్టి కార్యంబు మస్సాధ్యంబైన యాచరించెద సెలవిమ్మని పలుకుచున్న రాజుంగని విశ్వామిత్రుండు॥

చ॥ సవనము సేయుచుండఁగ నిశాచరులిద్దరు విఘ్నకర్తలై। హవనము వేళవచ్చి వినుమంతట రక్తముజల్లి రాలచే। జవమున రువ్వి ఋత్విజుల చాలఁగ బాధలచేసి పోదురీ। సవనము నిర్వహింపుటకు సాధ్యము నీకగు నంచువచ్చితిన్॥

వ॥ అది యట్లుంటివేని॥ ఉ॥ రామునిఁబంపు నాక్రతువు రక్షణసేయుటకై ధరేశ సం। గ్రామములోన దేవముని కంటకులన్వధియించి శూరత। న్నీమహనీయ్య కీర్తి ధరణీతలమందున నిల్పు శ్రీస్వామిని తోడితెచ్చెదను సయ్యనచింతిల నేలనీమదిన్॥

క॥ కుశికసుతుఁడిట్టుల బలికిన। దశరథునకు మనమునఁగలఁచి ధైర్యము చెదరన్। దిశలెల్ల దిరుగుచును పర। వశమయ్యెను మేనుమూర్ఛవచ్చె తనంతన్॥

వ॥ కొంత వడిమూర్ఛను వసియుండి తనలోఁ తాను తెలివినొంది యజతనూజుండు కౌశికున కిట్లనియె॥

క॥ ఎవ్వనివారలు రాక్షసు। లెవ్విధమున క్రతువుజెరుప నేటికి చదుగల్। క్రొవ్వినబలమున నెంతటి। జవ్వనులో తెలుపుమాని చంద్రముఖింకే॥

తే॥ ఇవ్విధంబున బలుకు నరేంద్రుతోడ। కౌశికుండనువిను దశకంధరునకు। ననుగుమంత్రులు మారీచుఁడను సుబాహు। నామములను ప్రసిద్ధులు నరవరేణ్య॥

వ॥ అనిన దిగులొందిన చిత్తంబుత్తలపడి దీనానుండై కరంబులు బిశికికొనుచు కోసలాధిపతి కుశికాత్మజునకిట్లనియె॥

ఉ॥ ఎక్కడి రావణుండు సురలెవ్వరు గెల్వఁగలేరు వానికిన్। జిక్కనివారు లేరు మునిశేఖర రాఘుడు పిన్నకుర్రనే। దిక్కుమరుంగలేడు పరదేశము పంపఁగలేను నా యడన్నక్కువయుంచి కోపమొద మానుము మానుము రాముపైనమున్॥

ఉ॥ సేనలతోడవచ్చి వధజేసెద రావణమంత్రి యుగ్మమున్। దీనశరణ్య మ్రొక్కి వినుతించెద యర్వదివేల యేండ్లకున్। భానుకులంబు వర్ధిలఁగ బాలుఁడు రాముఁడు బుట్టె వాని యెడఁబైనను దోలి యొక్కక్షణమైనను తాళఁగలేను వింటివే॥

క॥ అని తెగనాడిన కౌశికు। డనియెన్ రవివంశరాజు లాడినమాటల్।

మున దప్పియుండ రెవ్వరు । నినుదక్కగ చోద్యమయ్యె నీకగు శుభముల్ ॥

క॥ చేసెదనంటివి యంతటి । ఘాశించకు కార్యమైన కలదాయిటులన్ ।
దేశముతో సుఖముండుము । వాశిగనే బోయివత్తు వసుధాధీశా ॥

వ॥ అని కోపంబున విశ్వామిత్రుండు బోయిన చింతాపరుండైయున్న రాజునకు వసిష్ఠుడు నీ దుండీట్లనియె ॥

ఆ॥ ఆడితప్పరాదు యంతటి వాడికి కౌశికుండు కోపఘనుడుమున్నె । మొదట మాటలిచ్చి పిదపలేదంటివి కూడునయ్య రాజకుంజరులకు ॥

వ॥ అదియునుంగాక విశ్వామిత్రుండు రాక్షసుల వధీయించు సామార్ధ్యంబు లేసి వాడుగాడ నీపుత్రహితంబు దలంచి యిటులరుదెంచి యున్నవాడింక నొక్క రహస్యంబు వినుము.

ఉ॥ రాక్షస బాధచేత సురరాజ జనార్దను జేరబోయి ప । ద్మాక్షముకుంద రావణునిదాడికియోర్వగ లేమటంచు వే । దాక్షరసూక్తులన్ బొగడ యంభుజనాభుడు నీకుపుత్రుడై । యక్షుజుడవ్యయుం డమలుడాఖ్యుడుపుట్టె జగంబుబ్రోవగన్ ॥

వ॥ ఇంకా విశేషంబువినుము ॥

క॥ రామత్రితయంబనగను । భూమినిహరిరూపములను బుట్టగమొందే । రాముడు భార్గవకులమున । శ్రీమహితుండగుచు బుట్టె జితనృపకులుడై ॥

క॥ రెండవరాముడునృపకుల । మండనుడై పుట్టె నీ కుమారుండగుచున్ । ఖండన మున దైత్యుల కో । దండముతో వధయొనర్చు తాపసహితుడై ॥

వ॥ మూడవవాని జెప్పెద నాకర్ణింపుము ॥

ఉ॥ అంబుజనాభుకగ్రజుడనంగను ద్వాపరమందు కాంతి మీ । రంబలరాముదేవుడన రాజకులంబునబుట్టబోవు మో । దంబునపాపదానవ వధంబొనరించుప్రలంబవైరి ♦ నీ । లాంబరుడిద్ధతేజు డుహలాయుధుడీరఘురాముడే సుమీ ॥

ఉ॥ కావునసీరఘూద్వహుని గాధితనూజునివెంటపంపు మో । భూవరసూన పుండనుచు బుద్ధిదలంపకు మాదిమూర్తిగా । భావమునం గణింపు పరిపంథి నిశాచరులన్ధించి ధా । త్రీవలయంబునే లితడు తెల్లమిచక్రిమ ధైర్యధుర్యుడై ॥

వ॥ అనిచెప్పిన భూనాయకుండు ప్రముదిత స్వాంతుండై గాధినందను వెంట రామచంద్రునిబంపుట కొడంబడి యమ్మునీంద్రుని వరలంబోద్రించి యొక్క కల్యాణ పీఠంబునం గూర్చుండబెట్టి కృతాంజలియై యిట్లనియె ॥

ఆ॥ బాలుడగుట రామభద్రుమహారణ్య । మునకు బంపలేని మోహాము నను । బలుకవలసె నిట్లుబహువిధంబులను నా । తప్పునైచుమయ్య తాపసార్యా ॥

తే॥ అనిమూనవనాయకుడాడిన స ద్వచనయోక్తులకాతడు వేమరుహృ। ద్వనజంబునమెచ్చుచు తద్దయునయ్యెన వంకజుతోడుత నిల్చియిట్లు॥

మ॥ విపులాకీర్తినిరంతరంబుసుఖులై వీరావనీపాల కా। ధిపకోటీరవిరాజరత్నవిలసద్దివ్యప్రభశ్రీకు పా। దపయోజంబులయున్నివారిమొసఁగన్ ధర్మంబులే వేళలన్। విపరీతంబులుబుట్టకుండఁగను యుర్వీచక్రముంబ్రోవుమీ॥

వ॥ అనిపల్కిన గాధినందనుని వచనంబులకు ప్రహృష్టాంతరంగుండై దశరథభూనాథుండప్పుడు॥

ఉ॥ పంకజపత్రనేత్రుని శతభానుజసన్నిభగాత్రుని యోగిహృ। త్పంకజచంచరీకు పరిపంథిమహోగ్ర సురాళినాయకుం। బంకజమిత్రభాసితు శుభప్రదునా రఘురామచంద్రు దా। నంకతలంబునందిడి ప్రియంబుననాతనితోడ నిట్లనున్॥

క॥ చనురామచంద్ర నీ। వజ్జను లక్ష్మణుడేగుదేర సరభసమున నీ। మునిపతి యాగముగావఁగ। ననిక్రిమ్మరయక్కజేర్చి యుపనిపుడంతన్॥

చ॥ కరమనురక్తినాశ్రిత నికాయవిపద్ఘనపాపభంజనో। త్కరమునితాంతమానిజనతాపనివారణకారణాతిభీ। కరముననుగ్రపత్త్యనికకంధరఖండన శౌర్యభీషణా। కరమగురాముసత్కరము గైకొనియమ్మునిచేతికిచ్చె దాన్॥

వ॥ అంతఁగాభీర్యసముద్రుండగు రామభద్రుండు సకలగుణ విచక్షణుండగు లక్ష్మణుండు తోడరానంతఃపురంబునకుం జని యచ్చటసద్గుణమతల్లులగు తల్లులకు నమస్కరించి వారిచేత ననుజ్ఞాతుండై వచ్చి విజ్ఞానవిశిష్టుండగు వసిష్ఠునకు మ్రొక్కి కామరాగవివర్జితుండగు వామదేవునకు వందనంబాచరించి వారలచేత ననుమతి గైకొని తండ్రికిం బ్రణమిల్లిన నతండు మరలంగ్రుచ్చియెత్తి కౌగలించి కన్నులనానంద బాష్పంబులు దొరంగ కౌశికునుద్దేశించి యిట్లనియె॥

క॥ ఓమునినాయక యీరఘు। రాముని పాదములు తామరలకున్నెనయౌ। భీమశిలకంటకావృత। భూములనడువంగఁ గంది పోకకయున్నే॥

ఉ॥ నాకిని కౌశికుండు నరనాథునకిట్లను నిమ్మహాత్ముడా। దేవహితార్థమై యరుగుదెంచిబలీంద్రుని వేడిమున్న ప్ర। ధ్వీవలయంబుగొల్చిన త్రివిక్రముడౌటయు నీవెరుంగవా। క్ష్మావరయిట్లు బెంగి పలుమారునుదీనికి చింతయేటికిన్॥

వ॥ అనిపలికి॥ సీ॥ పోయివచ్చెదమయ్య భూపాలశేఖర। చిరపుణ్యమూర్తి వేంచేయుమయ్య। భద్రమయ్యెడునీకు భానుకులోత్తమ వందనంబయ్య పావనచరిత్ర। కృపయుంచుమా మీద నృపకులమండన సైరింపుమా తప్పు సదయహృదయ। యిదినిమిత్తముగ మీయింటికి * న * వచ్చితి భాగ్యంబుగల్గెను భాగధేయ। రామునెడబాటు

మనమలరారుచుండు । కోటిమిహిరుండమూర్తిమై కొనుచుయుకట । భూరిగుణసాంద్రి
దశరథ భూపచంద్రి । తపననిస్తంద్రికౌశిక తాపసేంద్రి ॥

వ॥ ఇత్థంబునం బలుకుచున్న యవసరంబున లక్ష్మణుండు వెంటరా రాముండు ధనుర్ధరుండై విశ్వామిత్రువెంట నాటిపోవుచుండ ॥

ఆ॥ అంతరిక్షమునను సమయలుకుసుమవ । ర్షణంబు గురిసిరంత రాఘవేంద్రు ।
సంపెనొంతదూర మవనిపైనడచుచు । మగిడికొలువుజేరె మనుజులంత ॥

వ॥ ఇట్లు విశ్వామిత్రుండు రామలక్ష్మణసహితుండై సాకేతపురంబు నిర్గమించి పోయెనని చెప్పి హిమవన్నగపుత్రికిం దిరారమణసఖుండు జెప్పెనని సూతుండు శౌనకాదులకుం జెప్పిన తర్వాతివృత్తాంత మెట్లనిన ॥ ♦ సి ♦ శా॥ పారావారగభీర భూరి సకలప్రజ్ఞారగాధీశ నా । నారత్నోజ్వలహేమభూషణల సన్నారాయణాష్టాక్షరి సారస్వామృతపానవైష్ణవ మహాశాదానరాధేయ విద్యారాశీవభవప్రభాఖిల బుధేంద్రానీకసంసేవితా ॥

క॥ ఆత్రేయ గోత్రపావన । వృత్రాసుర దమనవిభవ విశ్రుతయశసా । దత్రయపారంగత స । త్పాత్ర సదావాసహృదయ పంకజమిత్రా ॥ మంత్రిస మకతాళవృత్తము ॥ వరగుణప్రసిద్ధ సర్వవైష్ణవాఘమస్తకా । భరణ కల్మషాంబుద ప్రభంజనా । హిరణ్యభూ । ధరసమానధైర్య చారుధర్మ ధర్మనందనా । హరికృపా కటాక్షవీక్షణార్జితార్యరక్షణా ॥ గద్య ॥ ఇది శ్రీభద్రాద్రిరామభద్ర వరప్రసాద కవితా విచిత్రగిరుమ రామామాత్యపుత్ర ఆపస్తంబసూత్ర గౌతమగోత్ర ప్రసిద్ధసిద్ధనమంత్రి ప్రణీతంబైన శ్రీ సదాశివరామాయణంబను మహాకావ్యంబునందు నైమిశారణ్యవర్ణనంబును శౌనకాదులు సూతునివలన శ్రీరామకథా ప్రపంచంబు వినగోరుట కైలాసవర్ణనంబును దాక్షాయణీ సంప్రశ్నంబును శివుండు శ్రీరామావతార సూచనంబు సేయుటయును విశ్రవసు జన్మప్రకారంబును కుబేర దశముఖ ఘటకర్ణ శూర్పణఖ విభీషణుల జన్మక్రమంబును రావణాదులు గోకర్ణంబున తపంబు జేసి పితామహుని వలన వరలబ్ధులగుటయు సుమాలిమాల్యవంత ప్రముఖ నిశాచరులు దశకంఠు నాశ్రయించుటయు లంకా ప్రసంగంబును లంకాపహరణంబును కుబేరునకల కాపుర ప్రాప్తియు మయదర్శనంబును రావణకుంభకర్ణవిభీషణుల వివాహంబులును కుమారోత్పత్తియు దిగ్విజయంబును సురలు చతురాననపురస్సరులై క్షీరసాగరంబు చేరంబోయి పుండరీకాక్షుని స్తోత్రంబు సేయుటయు వారలకు శ్రీమన్నారాయణుండు ప్రత్యక్షుండగుటయు ఇనవంశసంభవులగు రాజులచరిత్రంబును దశరథ జన్మంబును దశరథుండు మృగయాసక్తుండై వనంబునకుంజని యజ్ఞదత్తుండెగవేసి

శాపంబునొందుటయు పుత్రకామేష్టియు దేవతులు తమతమ బాలక్రీడలును భగవంతుండగు రామభద్రుండు కౌసల్యకు విశ్వరూపంబు జూపుటయు నుపనయనక్రమంబున విద్యాభ్యాసంబును కౌశికాగమనంబును కౌశికుండు మఖరక్షణార్థంబుగా రామచంద్రునిం బనుపుమనుటయు దశరథు చింతనంబును దశరథుండు వశిష్ఠుని వలన పరతత్త్వంబుగా నెరింగి గాధేయుని వెంట రామలక్ష్మణులం బనుచుటయునను కథలంగల బాలకాండ ప్రథమాశ్వాసము ॥ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## బాలకాండ ద్వితీయాశ్వాసము.

—:( ప్రారంభము. ):—

శ్రీమహిళామణి వరపద । తామరస మకరందభృంగ ద్రావిడ నిగమాం । త్రా
మహితగుణ విలక్షణ । యామునముని భక్త వెంకటాచార్యవరా ॥

వ॥ విన నవధరింపుము సూతుండిట్లు చెప్పి శౌనకాదులకు మరియు నిట్లనియె ॥

క॥ కౌశికముని వెంబడి । దశరథసుత యుగ్మమిట్లు తండ్రియనుజ్ఞ । వశు
లై పోవుచునుండిరి । దిశలెల్లను గప్పి వారితేజము వెలుగన్ ॥

వ॥ ధనుఃఖడ్గ తూణీరధరులై పోవుచు అర్ధయోజనమాత్ర దూరంబైన సరయూనది సమీపించి విశ్వామిత్రుండు రాఘవునకిట్లనియె ॥

క॥ జలములవారిచిరమ్మిక । బలవంతంబైన రెండు ఫలవిద్యల నీ । కలఘు
మతీ వివరించెద । తొలగును క్షుధ నీరువట్టు తోరుజలెల్లన్ ॥

వ॥ దానం జేసి దేహంబునకు తాపంబు నివారించు నిద్రాజాడ్యంబులు వదలి పోవుబుద్ధి కుశలంబగునని యావిద్యల నుపదేశించినాటి దినశేషంబును రాత్రి యచ్చటనే వసియించి ॥

క॥ తృణశయ్యల రాఘవ ల । క్ష్మణులిద్దరు మౌనితోడ శయనించిరి భా ।
షణముల లాలింపగ దిన । మణి యుదయంబయ్యె నా కుమారకులంతన్ ॥

వ॥ విశ్వామిత్ర ప్రబోధితులై మేల్కాంచి ప్రాతరాహ్నికంబులం దీర్చి ప్రయాణంబుల నడచుచు నవ్వనంబుగనుంగొని రాముండత్తపసికిట్లనియె ॥

ఉ॥ యెవ్వరి దీవనంబు నిరహేతుకమై జనశూన్యమైదియు । న్నెవ్వరులేక
యుండుటకునేమి యుపాయముగల్గె నన్న నో । పువ్విలుకాడుమున్ను శివపూర్ణత
మోజ్వలపావకంబుచే । నివ్వనమందు భస్మమయి హీనతనంగము బాసెనిచ్చటన్ ॥

వ॥ కారణంబేమంటేని శివుండు గ్రతపంబు సేయందొడంగిన దేవతలనంగుని ప్రేరేపింప నతండు రుద్రుని తపోభంగక్రియలాచరింప లలాటనేత్రంబు దెరచిన తదుద్భవవహ్నిచే భస్మంబగుచు నిచ్చోట యంగంబు వదలిన కతంబున యంగ

దేశంబనుఖ్యాతిగాంచె నేడిచ్చటనేయుండి చేపుపోవుదమని యచ్చటి మునుల దర్శించిన మాత్రంబు వారలు ।

తే॥ పాద్యమర్ఘ్యంబులిచ్చి యపారమహిత । గాధినందను బూజించి గౌరవమున । వనజసంమ్మతమైన భోజనముబెట్టి। రామలక్ష్మణులకు ప్రేమ రంజిలంగ

వ॥ ఆతిథ్యంబొసంగినం గైకొని నాటి రాత్రి యచ్చట వసియించి మరునాడరుణోదయంబున పయనంబై పోవుచు ॥

క॥ సరయూగంగా సంగమ మరయుచు నదివాటి పోవునప్పుడు విని యే । న్భరమైన శబ్దమొక్కటి । నరుడుగ రాముండు మౌనికని యెన్నరలన్ ॥

క॥ ఇదియేమి శబ్దమిచ్చట । వదలక వినవచ్చుచుండె వారనిరవధిన్ । నది మధ్యనెచట బుట్టెనో । నదికీన గావలయు జెప్పుమని యడుగుటయున్ ॥

క॥ కైలాసశిఖరమందున। సలిలజ భవుడొక్క మానససర సనగా। కలిపించి ధరకు వదిలిన । జలముల శబ్దంబువలన సరయు గలసెన్ ॥

వ॥ సరయూసాగర సంగమంబను పేరంబ్రసిద్ధి వహించిన పుణ్యక్షేత్రంబు వందనంబాచరింపుమని వచించిన రామలక్ష్మణులు నమస్కరించినది యుత్తరించి దక్షిణ పథంబున నడచుచుయొక్క యాశ్రమంబుగని రామచంద్రుండు విశ్వామిత్రున కిట్లనియె ॥

ఉ॥ వారణవానరాయుతము వ్యాఘ్రమృగేంద్ర వరాహఖడ్గవి । స్తారమృగంబులు । న్బలువిధంబులవాడి మనింబచూత మా । ఖర్జూరలవంగ ద్రాక్షతరులు న్మక కోకిల నీలకంఠ ము । ల్దారుణమైన యాశ్రమ విధానము యెవ్వరిదో వచింపవే ॥

వ॥ అని ప్రశ్న సేయుచున్న నరేంద్ర సూనునకు విశ్వామిత్రుండిట్లని చెప్పె పూర్వకాలంబున సహస్రాక్షుండు వృత్రవధంబాచరించిన బ్రహ్మహత్యా పాతకంబు వెంటంబడిన మహర్షులితని కీయాశ్రమంబున పాతకంబు దొలంగంజేశిరి కావున॥

క॥ మలనిర్మోచనమయ్యె న । స్థలమగుటంజేశి దేవతా తతిమున్నున్ । మలదకరూశంబను పేరులబెట్టిరి సుప్రసిద్ధ రూఢములయ్యెన్ ॥

చ॥ మలదక రూశదేశముల మానవులన్ వడి జిక్కబట్టుచున్ । బలిమిని తాటకీయనెడు పాతకరాక్షసి హింససేయ భా । ధల దొలగింపలేక తమదారలతో పను వెత్తిపోయి భూ । తలమున నచ్చటచ్చటనుదాగి సుఖించిరి వింటెరాఘవ ।

వ॥ ఇప్పుడు। క॥ ఘోరాటవి నా తాటకి। మారీచుండ నేడు తన కుమారునితోడన్ । జేరవలసియుంది యున్నది। మారణమొనరింపు జనసమాజము పేర్మిన్ ।

వ॥ అనిపలికిన రామభద్రుండు॥

క॥ తాటకియన్పసిసతికిని | పాటవ మెసయింపనేమి యా రాక్షసికిన్ | సాటి గలవారలేమి ని | యోటమిగలిగించనింత యోధులు లేమెన్ ॥

వ॥ దాని పూర్వవృత్తాంతంబు వినుపింపుమని యడిగిన విశ్వామిత్రుండు లక్ష్మణాగ్రజునకిట్లనియె తొల్లి సుకేతుండను యక్షుండు గలడతండు సంతానంబు లేక చతుర్ముఖునిం గూర్చి తపంబాచరించిన మెచ్చి పదివేల యేనుంగుల బలంబుగల కామరూపిణియైన నొక కన్యనిచ్చి పోయిన తత్ప్రభావంబున నీతాటకి జన్మించి పెరుగుచున్నంత॥

క॥ సుందుండని యనువానికి | నందనదగ దారబోసె నారీమణి వా | నిందగ సేవింపుచునొక | నందనుమారీచుగనియె నంయుభయదూరున్ ॥

వ॥ అంతకొంత కాలంబునకు సుందుండగస్త్యునిచే మృతినొందిన తత్ప్రకారం బెఱింగి యాతాటకసుత సహాయయై నగస్త్యునిం పరిభవింప నరిగిన నతండలిగి రాక్షసులుగా శపించిన వారప్పుడి యడంబ్రవేశించి నిర్జనంబుగావించి యున్నవారు దానిం దెగటార్చి యీవనంబు నిర్భయంబు గావింపుము॥

ఉ॥ లోకహితంబు సేయ విధిలోపమొనర్చిన లేదు పాతకం | బాకతినాంగి బట్టి తెగటార్పుము నావచనంబు పాంచె నీ | రాకడ మేలుగల్గె ముని బ్రాహ్మణ బాధల మానుదేవతా | నీకము కెల్ల మేలమరె నిక్కము భాస్కర వంశమండనా॥

వ॥ అదియునుంగాక గోబ్రాహ్మణ హితార్థంబు సేయు పాతకంబైనను పుణ్యంబుచేకురు తొల్లి లోకంబెల్ల హరింపందలంచిన విరోచనునందన మందరయనుందాని నిందుండు బరిమార్చె మరియు నింద్రునిం బొరిగొన యత్నంబు సేయు భృగుపత్నిని విష్ణుండు రూపుమాపె నిట్లనేక పురుషసత్తములు నారీవధంబుచేసి పరహితంబాచరించి దోషంబులం బడకున్నవారు నీవును స్త్రీవధజనిత పాతకంబునందలి యనుమానంబు వదలి దీనిం బరిమార్పుమని పలికిన రామచంద్రుం డమ్మునీశ్వరునకిట్లనియె॥

—:( తాటకా సంహారము. ):—

చ॥ జనకుని యాజ్ఞబూని తమజన్నముగావగ వచ్చినారమో | దినకరతేజ నేమిపని దీర్పుమటన్నను సేయువాడ యా | మినిచర జంపుటెంతపని మీశలవయ్యెన జాలునిప్పుడే | కనుగొనుచుండ నిశ్చయముగా వధియింతు శిలీముఖంబునన్॥

వ॥ అని బాణాసనంబు నారిబిగించి జ్యాశబ్దంబు దిశల భేదింపం జేసిన సమీప గుహాస్థాయియైన తాటక మహాక్రోధంబునం జనుదెంచి॥

ఆ॥ యక్షతనయ నొక్క వృక్షంబు గొ తెచ్చి | విసరి రాముపైన వేయనతడు |

బాణయుగ్మకమున భస్మంబుగావించె । దానవులిగి మనుజభవ్యునిపైన ॥

వ॥ శిలావర్షంబు గురిపించి యంతర్ధానమై పైపైరాలు వరపింప దొరంగిన కోపించి రాముండు ॥

ఆ॥ శబ్దభేదమైన శరములతాటకి । మర్మమెల్ల జించి మంటలెగయ । జేయు చున్నపెద్ద శిఖరంబుచేతను । యత్తుకొనుచువచ్చి తత్తరమున॥

వ॥ రఘువల్లభుమీద వైవంగడంగిన ॥

క॥ శరమొక్కటి యురమున భా। సురముగ నాటంగనేయ సురలెల్లను నొచ్చ రువందతన్నుకొని యా । సురభామిని ప్రాణములను సుడిబడివిడిచెన్ ॥

చ॥ అపుడు పురందరుండు సకలామర సంఘముతోడవచ్చి యోజపితుల సార్వ భౌమ కృపసత్తముడీ రఘురాముడింపు వా॥ వపుమనుజాశి జంపి వనపావనమున్గొ నరించగాన నీ । తపమున బొందునట్టి శరదైవముల న్నుపదేశమివ్వుమా ॥

వ॥ ప్రజాపతియైన భృశాశ్వతనయ సాధకంబులవెల్ల నెరింగింపుమని చెప్పి దేవేంద్రుండంతర్ధానంబు నొందె నవ్వుడు విశ్వామిత్రుండు రామునింగనుంగొని యీ రాత్రి నిచ్చట వసియుంచి రేపు యుదయానంతరంబున పోవుదమని తాటకా వనమందు సుఖంబుండి పరదివసంబున ॥

క॥ రవియుదయానంతరమున । ప్రవిమలమతియైన రామభద్రున కొసగెన్ । జవయుక్తములగు శరముల । నివహము గాధేయుడంత నిశ్చలయుక్తిన్ ॥

వ॥ అందు దండచక్రంబును కాలచక్రంబును విష్ణుచక్రంబును ఐంద్రాస్త్రం బును వజ్రాస్త్రంబును బ్రహ్మశిరంబును మోదకీ శిఖరీయును గదాద్వయంబును ధర్మపాశంబును కాలపాశంబును వారుణపాశంబును శక్తిద్వయంబును అశనిద్వ యంబును పినాకాస్త్రంబును నారాయణాస్త్రంబును ఆగ్నేయాస్త్రంబును వాయ వ్యాస్త్రంబును హయశిరంబును క్రౌంచాస్త్రంబును కంకాళంబును ముసలంబును కపాలంబును వైద్యాధరంబును నందనంబును ప్రస్వాపనంబును ప్రశమనంబును సౌరం బును దర్పణంబును శోషణంబును సంతాపంబును విలాపంబును దమనంబున దుర్ధ ర్షకంబును సన్మోహనాస్త్రంబును పిశాచాస్త్రంబును మొదలగు సకలాయుధంబు లొసంగి మరియును సత్యవంతంబును సత్యకీర్తి ధృష్టంబు మొదలుగాగల యుప సంహారంబులిచ్చిన రాముండు లక్ష్మణ సహితుండై గ్రహించి యున్నంత ॥

తే॥ ఇచ్చినటువంటి శస్త్రంబు లెదటనిలచి । తలచినప్పుడ వత్తును ధరణినాథ యనుచు వలగొని పోయిననచట రాము । డపుడు గాధేయుతోడ నిట్లనియెమరల॥

చ॥ ఇచటివనంబు పూర్వమున నెవ్వరిదో యరుగంగ జెప్పు మీ। కెచటను

యజ్ఞకర్మముల నెప్పుడు విఘ్నము గల్గుచుండు మీ । రుచనియు దీక్షగైకొనని రోధక వర్గము నెల్ల వత్సరో । నటవధింతు వారి నవయంబకయుగ్మము చేత శూరతన్ ॥

వ॥ వినుమిందువదనయని యడిగిన దాశరథికి కౌశికుండిట్లనియె ॥

మ॥ బలవంతుండు విరోచనాత్మజుడు సంపన్నుండు దోశ్శక్తిచే । బలభేదిప్రముఖామరప్రతతి కుంభద్వేషియై నాక వా । సులనాసీకయడంచి తానె ప్రభువై జూపట్టె నిందాద్రిమ లా । కులతం బొందియరణ్యదేశముల సంక్షోభించి రావేళలన్ ॥

వ॥ అంతలోన నదితియైన దేవమాత కశ్యపుండైన నిజపతిం జేరి ॥

ఆ॥ బిడ్డలెల్ల నవతిబిడ్డలచే చెడి । యడవిపాలుబడిరి యకటమదికి । వంతమానుటెట్లు వరద నా పాలిటి । దైవమిట్లు జేసె తాళగలనె ॥

వ॥ అని దుఃఖించిన కశ్యపుండు నదితికి పయోవ్రతంబు నుపదేశించి యొక్క సంవత్సరంబు పూర్ణంబగు వరకు నిందయుండి నెరవేర్చిన భగవంతుండు నీయుదరంబున వామనుండై జన్మించి బలిని వంచించి నిందుని కమరరాజ్యం బొసంగునని చెప్పిన నాయమయు నిచ్చట వ్రతంబు సిద్ధిబొందిన కతంబున సిద్ధాశ్రమంబను ప్రసిద్ధి వహించె వినుము ॥

క॥ హరివామనుడై యదితికి । సరగున భాద్రపదశుక్ల శ్రవణర్క్షమునన్ । సురరక్షణకై బుట్టిన । పరమానందంబు నొందె బ్రాహ్మణమునముల్ ।

క॥ బలిమూడడుగుల భిక్షము । వలనం దెల్లోకమెల్ల వచించిదయా । కలితుండై త్రిదశేశ్వరు । వలనికి స్వర్లోకపదవి వశమొనరించెన్ ॥

వ॥ ఇదియే మదయ్య క్రతుదేశంబని చెప్పుచు సిద్ధాశ్రమంబు చేరంజను నంత నచ్చటి మునులు నెదురుకొని రామలక్ష్మణసహితుండగు గాధినందనుని పూజించిరంత ॥

ఉ॥ యజ్ఞము సేయబూని సమయంబగు దీక్షవహించియున్నత । త్వజ్ఞుని గాధిపట్టిగని దైత్యులు నెప్పుడు వత్తురేమొయా । కాగ్నను సంగడంచు పరమార్థముగా రఘురాముడన్న వే । దగ్గుల మౌనిబృందములు నచ్చట రాముని తోడనమ్రులై ॥

ఉ॥ మౌనము బూనినాడసుర మర్దన గాధిసుతుండు ఖర రలీ ! కాననముందు జూడఘన కాయులు నారవ నాడువత్తురా । మానవభోజులిద్దరినువ్రాంవము నొందక సాయకంబులన్ । బూనివధించి మా క్రతువు పూర్ణఫలంబు వహింప వేడయున్ ।

క॥ అనిపలికిరపుడు రాముడు । ఘనకోదండంబుచేత గైకొనిశరముల్ మును గూర్చినిలచె తమ్ముడు । మనమలరగ నతని నెంక మాటునునుండెన్ ॥

వ॥ ఇట్లు సవనరక్షణార్థంబు రామలక్ష్మణులు షడహోరాత్రంబులు కాచియుండిరప్పుడు ॥

సీ॥ సవిధులు స్వకృత్యవ సహితాజ్యపూర్ణమై చన్నొందిహోమాయంబుచెలగు చుండె। ఋక్సామయజురాదులేకమత్యంబుగా నాహుతుల్ చేశెవ రనుదినంబు। సకలఋషీశ్వర సంఘంబుక్రితుధర్మ విధములవేళ్వెర విన్నవింప। హోత్రవహ్నియందిన పరగత్రుక్రియ్యంబు నిలయను సవన బులాచరింప। వహ్నిధూమంబు వెడలి నభ్యాప్తి। మండలమునిండిపారె నమందగతిని। కౌశికుడుసేయు యజ్ఞవిఘ్నంబు సలుపు రక్కసులుతేచిపోయి రాచక్కటికిని॥

—( కౌశిక యాగరక్షణ. ):—

క॥ ఆకాశమార్గమున చని। వీకన్ రుధిరంబు యజ్ఞవేదికపై। తోల్దాకున కురియగనప్పుడు। కాకుత్స్థుడు వారివిధముగాంచి యలుకతోన్।

మ॥ శరసంధానముచే సుబాహుశిరమున్ జక్కాడిమారీచు ని। న్నరుతాస్త్రంబునసేయ నాతడు వియన్మార్గంబునంబోయి యా। శరధింగూలినచూచి దేవతలు విశ్వామిత్రు పూజించి దా। శరథింగాంచిరి మౌనిపుంగవులు తచ్చారిత్రము ల్మెచ్చుచున్।

వ॥ అప్పుడు నిర్విఘ్న పరిసమాప్తంబై కౌశికమఖంబు చెల్లించి॥

క॥ ఈవిధమున క్రితురక్షణ। గావించి నరేంద్రసుతుడు గాధేయునితో। మావలనసేయు కార్యము। లేనైనను గలుగదెలుప వేయనిపలుకన్।

వ॥ ఇట్లు పలుకుచున్న రామునింగని మునిబృందంబు లిట్లనిరి॥

క॥ జనకుడు మిథిలేశ్వరు నిం। టనుగల దొకధనువుదాని డాయంబోవం। జన దెవ్వరికైనను నీ। వనఘా చూడంగవలయు నకార్ముకమున్॥

వ॥ అదియునుంగాక మైథులుండు జన్నంబుసేయుచున్నవాడు మేమందరమచ్చటి కేగందలంచి యున్నవారమందులకు మా వెంబడి రావలయునని చెప్పి విశ్వామిత్ర పురస్సరులై రామలక్ష్మణులతోడ రాచనుచుండి రప్పుడు రాముండు గాధి పుత్రున కిట్లనియె॥

క॥ ముందెవ్వరుండు రిచ్చటి। కందువఫలతరులు చాలగాగనుపించెన్। విందుసకలంబు జెప్పు మ। రందస్వీకార భృంగరవము చెలంగన్।

పంచపాదిచంపక॥ అనవిని మౌనిశేఖరుడు నారఘురామునితోడ నిట్లనున్। మునుకుశుడంచు నొక్క నృపముఖ్యుడు నుండగవాని కగ్రనందనుడు కుశాంబకుండ తని తమ్ముడుగా కుశనాభుడుండె నా। తని కుదయించి రప్పుడు శతంబుగ పుత్రిక

లోక్కనాను వా। ననుమతితోడకేళి వనమందు విహారము సల్పుచుండగన్ ॥

క॥ సర్వాత్మకుడగు వాయువు । యుక్తీపతి సుతలకడకు నొయ్యన కామం బోర్వక చనుదెంచి తన । న్నూర్వార వరియించుమనె వినోదపరుండై॥

పంచచామరం॥ ప్రభంజనుండిటన్న రాజబాలలెల్ల గూడుక । స్వభర్తృ రేందప్రు యిట్లుబల్కనొయ్యయవకానె మాయడన్ । శుభంబులేను మాకుతండ్రి చొప్పులేక యుండజార భర్తృగోరు కొన్నగాదు రాజధర్మ పద్ధతిన్॥

క॥ అవిగాకనీవు జనులకు । హృదయంబులసంచరించు నీశ్వరుడవు గా । సుద తులము నీకుమాయడ । నోదవునె సౌఖ్యంబు నూరకుండుము తండ్రీ॥

వ॥ అని నిరాశగా తెగనాడిన కోపించి।

క॥ వాయువు త్వరగావారల । కాయంబుల రత్నిమాత్రిగా నొనరించెన్ । కూయిడుచు వారుతండ్రి ని । డాయంజని భీతితోవడంకుచు నిలువన్॥

వ॥ అరత్నిమాత్రంబైన శరీరంబులు మీ కెట్లు సిద్ధించెనని యడిగిన తండ్రికి సర్వంబు నివేదించిరంత నప్పుడు బ్రహ్మదత్తుండను గంధర్వస్త్రీకి బుట్టిన రాజవరున కిచ్చిన నతండు వారిస్పృశించిన మాత్రంబున విరూపంబులు వదలి సురూపంబులతో ప్రకాశింపుచున్న బ్రహ్మదత్తుండంవర వివాహంబై సుఖంబున నుండెననుచుచెప్పి విశ్వామిత్రుండు రామునకిట్లనియె ॥

క॥ ఆకుశనాభుని తనయుడు । నా కుంజనకుండుగాధి నయముగబుట్టెన్ నేకుశికవంశజాతుడ । కాకుత్థకులేంద్ర రామకరుణాధామా॥

వ॥ మరియు నా తోడబుట్టువు సత్యవతీయను ప్రతివ్రత సశరీరంబున స్వర్గంబునకుంబోయి నదీరూపకమై కౌశికీయను ప్రవాహంబు హిమవన్నగ ప్రాంతంబునం బారుచుండు నేనును భగినీయందలి స్నేహంబున హిమవంతంబున తపంబు సేయుచున్నవాడ ఈసిద్ధాశ్రమంబున రాకడవలన తేజస్సంపన్నంబై వెలింగె నావంశ విస్తారంబు దేశచరిత్రంబునుం జెప్పితి నింక యర్ధరాత్రి బైయున్నది నిదురించి రేపకడ బోవుదమని సకలఋషి సంఘుంబులంగూడి విశ్రమించిరి రామలక్ష్మణులు నిదురించి మేల్కాంచి ప్రాతరాహ్నికంబులం దీర్చి మానులకు వందనంబాచరించి ప్రయాణంబై పోవుచు ॥

క॥ శ్రీరంజిల్లగ గంగా । తీరంబునకరిగి మౌనిదేశికులంతన్ । సారంబైన పవిత్రపు । వారిం దగగ్రుంకిజలము వారిచిపిదపన్ ॥

వ॥ జపంబులంజేయుచుండిరంత రామలక్ష్మణులు స్నానంబాచరించి మాధ్యాహ్నికంబులాం జరిపి మునులకు నమస్కరించి యున్నంత॥

క॥ రాముడు విశ్వామిత్రుని । తో మఘరిపు పాదతీక్ష్ణతుల్యంబగు గం। గా మహిమలెరుగ జెప్పుమని । నీ మృదువాక్యముల వర్ణనీయ్యం బనరన్॥

వ॥ అదియునుంగాక గంగా స్రవంతి త్రిపథగామినియను ప్రసిద్ధ వచనంబు వినంబడునది యట్టుల వినుపింపుమని యడిగిన కౌశికుండు॥

సీ॥ తొల్లి భాగీరథి తుహినాద్రి సుతయయ్యు కార్తికేయుని మున్ను గన్న విధము । పిదప భగీరథు పితృ భస్మరాశిపై పొరలి పారిన యట్టి పుణ్యకథయు । సుత లంబులో భోగవతియను నామంబుచాత ప్రసిద్ధమౌ చరితమెల్ల । వినుపించవిని రాముడనుజ సమేతుడై మునిపతిగొనియాడి ముదముతోడ । లోకపావనియును సుర లోకని మ్న । గాథరిత్రికి జనుదెంచు కారణంబు : వింటిమావిష్ణు పదికను గొంటి మవల । సాగినను వంగ వలదె నిచ్చానురక్తి॥

వ॥ అని గమనోన్ముఖులై యనేక నదీనదంబులు పర్వతంబులుదాటి చనుచు విశాలనగరంబు సమీపించి యీ పురంబెక్కడిది యవరివంశంబు వారు పాలింతురు యరింగింపుమని రఘువీరుండు గాధికుమారునడిగిన నతండు॥

చ॥ అమరులు పూర్వదేవతల నైనపరాభవ మోర్వలేక నా । కమువిడనాడి శార్ఙ్గధరుగానగబోయి నుతించిదేవ మా । కు మఱియు నేడిదిక్కు గనుగొంటివి మా విధమెల్లనంచు పా । దముల సమీపమందుబడి తద్దయు శోకమునందవారలన్॥

వ॥ కనుంగొని విష్ణుండు మీరలీసమయంబున వారితో వాత్సల్యంబు సంపాదించి క్షీరసముద్ర మథనయత్నంబు సేయుండని తద్విధానంబెఱింగించి పంచినవారలు దైత్యదానవులతో విశ్వాసంబుగ యుండి క్షీరసాగరమథన యత్నంబునకు ద్యుక్తులై॥

క॥ మందరగిరి కవ్వముగా । పొందుపరచి తరచుచుండ పుట్టెను విషమున్ । ముందుగ పురహరుడంతను । యందముగ మ్రింగెజగము లాశ్చర్యపడన్॥

వ॥ మఱియు నైరావతంబను గజంబును నుచ్చైశ్శ్రవంబను హయంబును కౌస్తుభంబను మణియు లక్ష్మియను కన్యకయు కల్పంబను వృక్షంబును చింతామణి యను కామఫలదాయియు కామధేనువను గోవును చంద్రుండను సుధాకిరణుండును యమృతకలశంబుచే బూనిన ధన్వంతరియు నీవిధంబునంజని యించిన॥

క॥ హరిమోహిని రూపంబున । సురలకు నమృతంబుబోశి సురవైరులకున్ । విరసంబు గలుగజేశిన । దారమునకై యోహటించి దోర్దర్పమునన్॥

ఆ॥ అసురులెల్లపొంగి నాదిత్యవరులపై । కసిమసంగిదాక గాసురాళి । యమృతమత్తపానమలదితి సుత । బలము నెల్ల నొంచి పట్టియకట॥

ఉ॥ దర్పకమైలర్ప దేవతతి దానవమూకల త్రిశలోకముం । జేర్పగనోర్వలేక హతశేష నిశాచరవర్గ మంతటన్ । నేర్పులుమాని నద్రికల నేలకు బారి యడంగియున్న మే । లోర్పుదొరంగి మొక్షమున హాయనుచున్ దితి సాక్షుజేరగన్॥

క॥ పోయితనవారు నిందుగ్రిస్ । గాయిడికోర్యంగలేక రాజ్యంబులపై । పోయిరి నాగతియట్టిల । కోయనివిలక్షింప వరుడు కులసతికనియెన్॥

ఉ॥ మానినియేలచింత విరుమా పురహూతుని జంపునట్టుగా । సూనుడు గల్గునీకు విధిచోదితమైన వ్రతంబుసేయు నీ । కాననమందటంచు నిజకాంతకు తాను పదేశమిచ్చె నే । మౌనవృద్ధైనగాని సతివాయకుపోబడకుండ నుండునేః

వ॥ అని చెప్పి విశ్వాంతుండు రఘువరా । త్రిలోక నాయకుండైన నింద్రు నంతటివాని సంహారంబొనరించు సంతానవాంఛ గోరిన భార్యకుతగదని చెప్పలేక విధ్యుక్తంబుగా మంత్రోపదేశంబుజేసి కశ్యపుండు నియమంబు లుపదేశించి చనిన దితీదేవియు నయ్యాశ్రమార్గంబున వ్రతంబుసంకల్పించి సేయుచున్నంత పురందరుండెరింగి॥

క॥ తల్లికి పరిచారకుడై । యల్లన నేతెంచి కుశములప్పులు ఫలముల్ । మెల్లనగొని తెచ్చును దితి । యుల్లము రంజిల్ల సేవలొప్పంగ జేసెన్॥

వ॥ అంత నొక్కనాడు దితి దైవోపహత చిత్తయై సంజకడయాను చిత్తంబు నకరపాదశౌచంబుమాని పాదంబుల దిశమూర్ధంబుబెట్టి నిదురించిన సహస్రాక్షుండు॥

క॥ గర్భంబున జొరబడి తానర్భకు పవిధారవేయ నంతట దితియున్ । దుర్భ మైలేచిన గని స్వర్భువ నాధీశ్వరుండు నయ్యన వెడలెన్॥

వ॥ వెడలి తనయపరాధంబు క్షమించుమని ప్రార్థించిన దితి తనస్వయంకృతాపరాధంబని యెంచి చింతమాని నక్కుమారు ఖండించునప్పుడు రోదనంబుసేయ మారుదమారుదయని సప్త ఖండంబులుగా విభజింపంబడి యుండుటం బట్టి వీరలు సప్తమారుతంబులు వీరల సహోదర స్నేహంబు నబద్ధాను దాగుండవై యుండుమని నిర్దేశించి యదేఛంజనియె నట్లు పురందరుండు కృతార్థుండై మరుత్తుల వెంబడించి దివంబునకరిగె నద్దేవి వ్రతంబుసల్పిన దేశంబిది యిందు ఇక్ష్వాకుసుతుండు అలంబసుండనువాడు జన్మించె నాతనికి విశాలుండు గల్గె నతండీపురంబు నిర్మించె నట్టి విశాలునకు హేమచంద్రుండుబుట్టె నతనికి సుచంద్రుండుగల్గె వానికి ధూమ్రాశ్వుండతనికి సృంజయుండు వానికి సహదేవుం డమ్మేదినీపతికి కుశాశ్వుండా రాజునకు సోమదత్తుండా భూపతికి కకుత్స్థుండు కకుత్స్థునకు సుమతిబుట్టె నాసుమతి యిప్పుడీ నగరంబేలుచున్నవాడు యీరాత్రి నిచ్చటవసియించి యుషఃకాలంబున మిథిలాపురంబున కరుగవచ్చునని విశాలపురంబునకుబోయిన ।

తే॥ సుమతియురువెంచివారలజూచిభక్తి। సంభ్రమంబునఁబూజించిసరసవచన। ములనుచుతిజేశితత్సుజ్ఞమూర్తులైన ధ్రాశికునితోఁడ ననిమెఁబూకాంతుఁడెలమి॥

ఉ॥ ధన్యతగ్రామధ్యశుఁడైనసమానుఁడనీనురాకచే। మాన్యతనొందెఁబీరెవరు మంగళరూపులుదెల్పుమన్న నా। జన్యునితోడఁగౌశికుఁడు రాముఁడులక్ష్మణుఁడన్ ప్రసిద్ధమౌ। ధన్యులుసత్యసంధులగు దాశరథుల్ సుగుణాఢ్యులిద్దరున్॥

వ॥ అనిచెప్పిన సుమతి యత్యంతప్రియంబున వారల సత్కరించి రాజోపచార విధానంబున యాతిథ్యంబొసంగిన నందరయ్యామినిగడపించి ప్రాతఃకాలంబున యనుష్టానంబులుదీర్చి నరేంద్రునామంత్రణంబాచరించి పోవుచున్నమార్గంబున లక్ష్మణాగ్రజుండు గాధేయుంగనుంగొని॥

క॥ జనరహితంబై యున్నది। వనమెవ్వరిదో యెఱుంగవలెననియడుగన్। మనుకుల చూడామణితో। మునిపతిచంద్రుండు మోదముననిట్లనియెన్॥

ఉ॥ గౌతముఁడన్ తపస్వి కలకాలమహల్యనుగూడి యిచ్చటన్। ధాతమనస్కుఁడై తపము తప్పకసేయుచునుండి యొక్కనాఁ। డాతనుమధ్యనుంచి జలమాడఁగఁబోయిన మౌనిరూపుఁడై। నాతినిఁగూడెఁదేవపతి న్యాయముమానియనంగ తంత్రుఁడై॥

వ॥ ఇట్లు బిడౌజుండనంగ పరవశత్వంబున మాయా మౌనియై యహల్యతో సంభోగించి తనరూపుజూపి యరిగిన॥

ఉ॥ స్నానముఁజేశిగౌతముఁడు సయ్యనయాశ్రమభూమిజేరి ల। జ్జాననయై వసించిన యహల్యనుజూచితపఃప్రభావ స। ధ్యానముచేనెలంతుక విధానముతప్పకఁజూచి యప్పుడే। కాననసీమరాయివయి కన్పడకుండుమటంచు దిట్టినన్॥

వ॥ అని యంతనిలువక సురపతియండకోశంబు జారుపడినట్లుగా శపియించిన నప్పుడుసురలెల్ల నింద్రునకుసహాయంబుగా యగ్నిముఖంబున మేషాండంబులఁ బెరికి తెచ్చి సమర్పించిన నదిమొదలు నింద్రుండు మేషాండుండయ్యె యహల్యకు దశరథ సూనులీవనంబు నెప్పుడుప్రవేశింతు రప్పుడునీకు శాపమోక్షణం బగునని చెప్పి గౌత ముండు తపంబునకుం జనియె॥

క॥ గౌతమసతియిప్పుడు నీ। భూతలముననుండి సర్వభూతంబులకున్। రాతిగ గనుపడుచుండును। నాతినిఁగాసేయురామ నరశార్దూలా॥

వ॥ అనుచు రామలక్ష్మణులతో విశ్వామిత్రుండవ్వనంబు దరియంజొచ్చె నంతలో॥

మ॥ తనుశృంగారముదోప గౌతమసతీ ధన్యాత్మయైరామచం। ద్రునికారుణ్య కటాక్షవీక్షణములం దుశ్శీలతంబాశి స। య్యనమౌనీంద్రులవెంటనంటిచను మౌనీగా

మానుషుండైన శ్రీ । పతి తా కామునకు నంగజనియె న్స్వామాక్షి భక్త్యాత్మయై ॥

క॥ ఏమని చేసెద దశరథాత్మజ । పదసరసీజాతములకు పాద్యం బిచ్చెన్ । ముదమున గంగానదియుం । దుదయించెనొ పట్టి విమలయుదకంబుల చేన్ ॥

వ॥ ఇట్లు పదంబులు కడిగి శిరంబు పైజల్లుకొని భక్తిపరిభ్రమంబున కరకలిత ముకుళయై యిట్లనియె ॥

ఉ॥ నేటికి ధన్యనైతి ధరణీధవ గౌతము డాడినట్టి యా । మ్మాటలు సత్యమయ్యె వనమందున దృశ్యత నుండియుండి యి । చ్చోట భవత్పదాంబుజము సోకిన తద్రజపూతనయ్యె నీ । పాటిగ శాంతనైతి నిను పారగ జూచి కృతార్థనొందితిన్ ॥

క॥ రామా దశరథనందన । శ్యామలరుచిగాత్ర దివ్య శరచాపధరా । కోమల పదయుగళావృత । ప్రేమా గుణధామ దైత్య భీకర నామా ॥

వ॥ అని వినుతించి వారల యనుజ్ఞవడసి గౌతమునిగూడన్ జనియె నప్పుడు కౌశికుండు మిథిలానగరంబు సమీపంబున యజ్ఞవాటంబు దరియం జొచ్చియున్న ॥

క॥ జనకుడు విశ్వామిత్రుని । గనియెదురుగ నేగి తెచ్చి కనకాసన మం । దును గూరుచుండ నియమిం । చి నను యధిష్టించె రాజశేఖరుడంతన్ ॥

వ॥ రామలక్ష్మణ సహితంబుగా తక్కిన తాపసుల నెల్ల తగినపీఠంబుల నాస్థాపించి శతానందపురస్సరంబుగా సత్కారార్హ పూజలంగావించి కుశికాత్మజున కిట్లనియె ॥

ఉ॥ పావనమయ్యె నామఖము బ్రహ్మమయాత్మక నీదు రాక చే । రావటమే శుభంబు దినరాజవిభాసితులైన యట్టి యీ భావజరూపులెవ్వరొకొ బాలమృగేంద్రము । లట్ల పొల్కెనే । తావున నుండి రో యరుగ తాపసపుంగవ దెల్పు నావుడున్ ॥

వ॥ అనిన విశ్వామిత్రుండిట్లనియె ॥

చ॥ దశరథ రాజనందనులు తాటకిమారణమొందజేసి నా । వశమున చేరి జన్న మును పాలన జేసి సుబాహు జంపి తా । ద్భుతుడగు తాటకేయునతి తీవ్రశరంబున బారదోలి నీ । రశికులు గౌతమాంగనను రాతిని నాతిగ జేసి పిమ్మటన్ ॥

వ॥ నీయజ్ఞంబును శివధనుస్సును జూడవచ్చిరి వీరల నామంబులు రామలక్ష్మణు లని పలుకుచున్న విశ్వామిత్రు వాక్యంబుల శతానందభణితుండై మిథిలేశ్వరుండు మరియు నిట్లనియె ॥

చ॥ కులము పవిత్రమయ్యె మదికోరిన కోర్కె ఫలించె దేవతా । కులవలె బాలు లిద్దరతి సుందర రూపులతోడ తెచ్చి నా । కలవడి పూజకర్హులు మహాత్ములు నిందిర యుపేంద్రు లట్ల పీ । రెలమిన యోధ్యలో దశరథేశ్వరు భాగ్యము నెంచ శక్యమే ॥

వ॥ అని పుణ్యంబున వీరల దర్శించితినని పలికెనంత శతానందుండు విశ్వామిత్రుం

జూచి ॥ క॥ మా తల్లి భాగ్యమెంచగ । నాతరమా శాపమోక్షణము గల్గె శుభో । పేతయయి పతినిగలసెను రాతిం జడురూపుమారి రామునిదయ చే ॥

వ॥ అనిపలికి రాఘవునిదిక్కు ముఖంబై ॥

ఆ॥ చాలమేలుగల్గె సంయమివెను వెంట । వచ్చి రక్కసులను వ్రచ్చినావు । జననిరాతబాపి నవసంబు గనుగొన । వేడ్క వచ్చితీరు విమలమతులు ॥

వ॥ అదియునుంగాక పూర్వంబు రాజర్షియై పిదప బ్రహ్మర్షిత్వంబు సంపాదించిన యిమ్మహానుభావుని యాశ్రయించి మేలుచేసితి రదియంతయు నెరింగించెద వినుమని యిట్లనియె ॥

క॥ ఈవిశ్వామిత్రునికథ । భూవలయమునందు పవిత్ర మోదములొదవున్ । నేవివరించెదవినుము ధ । రావిభులందొకడు గాధిరాజనియుండెన్ ॥

వ॥ అట్టిగాధికి విశ్వామిత్రుండు జన్మించి తండ్రియనంతరంబున మహీపాలనం బొనరింపుచు ॥

చ॥ జనవిభు డొక్కనాడు తనసైన్యము వెంటనటింపనేగి తో । వనుగ వెనవ్వసిష్ఠు నిజవాసము జేరగబోయి సేనలా । వనమునడించి వెక్క పరివారముగొల్వగ లోన యోగి పా । వనపదపద్మయుగ్మముల వందనమంచు శిరంబుమోపినన్ ॥

ఉ॥ ఆవిభు నత్తిమౌని వరుడాయతపీఠమునందునుంచి సం । భావన జేసి రాజవర భాగ్యముగా భవదియ్యరాక నా । పోవునవిల్చియున్న తిథిపూజలనందియరుంగుమన్న నా । భూవరుడాత్మబొంగి తమపూజకుపాత్రుడ గాదటందునే ॥

వ॥ అని తక్షణంబ వసిష్ఠమునీంద్రుండు కామధేనువుంబిలిచి విశ్వామిత్రరాజేంద్రునకు తగినవిందులుగావింపుమని యాజ్ఞాపించిన యప్పుడ ॥

సీ॥ మధురసంశిష్టమా మైరేయమునుగాడ రుచులపదార్థమా రుచవిగల్గ । భక్ష్యభోజ్యాదికఫలశాఖమడ్రిన సంయుక్తమగు లేహ్యసారములను । శాల్యోదనము సుధాతుల్యమా క్షీరాజ్య కలకచూర్ణక శాయ కములతోడ । లాజేక్షురస సమూల ములకందమిళింద దధికుల్యయుతమగు తాపహరము । తురగవారణములకు సంతుష్ట ముగను । తృణజలంబునసమృద్ధనదీయుతంబు । లగుచు నెవ్వరికెవ్విధ మగునటులను । గాధిసుతు విందుగావించె కామగవియు ॥

ఉ॥ ఎల్లజనంబులంగలసి నెల్లవిధంబులతృప్తిబొంది గో । తల్లజమీవసిష్ఠునకు దానమొసంగినవారలెవ్వరో । నుల్లమునెంతసిల్లె సరసోదనముఖ్యపదార్థసృష్టి చే నెల్లర తృప్తి జేశె పసువెంతటికల్మి వసిష్ఠమౌనికిన్ ॥

క॥ ఈపసువసగినజాలను । నాపసుశతమిత్తుబ్రహ్మనందనునకు ము । న్నే పగిది

నైనయడిగెద | నాడిదపఁ జూడఁదలఁచు నతనిగుణంబుల్ ॥

వ॥ అని బహుప్రకారంబులం బ్రార్థించి వసిష్టునిం జేరి యిట్లనియె ॥

ఆ॥ మొదవు నిమ్ము నాకు మునినాథ గోశత | కంబు నిత్తు ననుచు గాధిసుతుడు | బలుక నవ్వసిష్ఠ బ్రహ్మర్షి యనియేల వలదు మాకు దీని వదలను మిమ్మ ॥

చ॥ అనిన విని గాధినందనుడు నశ్వములున్గజములు సహస్రి గో | ధనములనిత్తు మాకు నొక దానికిని రకనింతయేల యో | చనయని పల్కగా నిటుల సాధ్యము గాని వివాదమేల నా | ధనము సమస్త ధర్మముల దైవిక మార్గము బాయ లేనిక ॥

వ॥ అనినం గోపోద్దీపితమానసుండై విశ్వామిత్రుండు భటులం జూచి బల్మి బట్టి తెండితండు నేమి సేయంగలవాడని యాజ్ఞాపించిన క్రూరులగు భటవర్గంబు రజ్జువుం బంధింపం బోయిన నక్కామధేనువు కట్టుదప్పించుకొని వసిష్టుపాలికిం జని యిట్లనియె ॥

క॥ అపరాధమేమి జేసితి | చపలులకీదగునె నన్ను సంయమినాథా | తపమున సహాయముండెద | కృపతో విడిపింపుమయ్య కితవుల బాధన్ ॥

చ॥ అని మొరసేయు కామగవి కప్పుడు మౌనిపురందరుండనున్ | వినుశబళా బలాన నవివేకుడు రాజు కడంగి పట్టె నా | యనుమతి లేక యన్నగవి హాయని వాలమెదిర్చెనంత లో | తనువునఁ బుట్టె మ్లేచ్ఛతతి దారుణశస్త్ర కృపాణపాణులై ॥

వ॥ ఇట్లుద్భవించి తత్క్షణంబ విశ్వామిత్రుని సేనలనెల్ల భస్మంబు గావించిన యలిగి ॥

మ॥ ఘనశస్త్రాస్త్రబలంబునన్ బొలిచె నగ్గాధేయుఁడా కామదో | హినికిం బుట్టిన మ్లేచ్ఛజాలముల హాహాయంచు వాసిష్టదే | నుసపీనంబుగ దేహముం ద్రుళ్ళిపె ముష్కం బోలె మ్లేచ్ఛు | ల్పుళిం | దనికాయంబు కిరాతకుల్యవన సంతానంబు రోమంబులన్ ॥

వ॥ ఇట్లు పైపై ననేకజాతిభేదంబులైన వీరలుద్భవించి విశ్వామిత్రు రథగజతురగపదాతివర్గంబుల రూపుమాపిన కోపించి హిమవన్నగప్రాంతంబ్బునకుం జని శివునుద్దేశించి తీక్ష్ణంబగు తపంబాచరించిన ॥

తే॥ హరుడు ప్రత్యక్షమై కోరు వరమనన్న | కరుణ మంత్రాగమంబు సాంగంబుగాఁగ | భసితధర కాలగళదయ నొసగుమనిన | కోరినట్టులిచ్చె నా వాడికొండ ప్రభుడు ॥

వ॥ ఇవ్విధంబున చంద్రశేఖరునివలన ధనుర్వేదంబు సాంగోపాంగంబుగా ననుగ్రహింపబడి యప్పుడే వసిష్టాశ్రమంబున కరుదెంచి పావకబాణంబు ప్రయోగించిన ॥

ఆ॥ సాగి యగ్ని పర్ణశాలలపై బ్రాకి | మడఁ జొచ్చె మౌనిమండలంబు | నవ్వసిష్టశరణమన్నవేడగా బ్రహ్మ | దండమెత్తి నెమరుదాకి యార్చె ॥

వ॥ ఇవ్విధమున యగ్ని జల్లారిన విశ్వామిత్రుండుగ్రుండై మందుమ వరుణ వాయవ్యపిశాచమోహన పాశుపతాదియస్త్రంబులు పైపై ప్రయోగించిన వాని

నన్నిటిని బ్రహ్మదండంబుచేత వసిష్ఠుండు మాయించిన ॥

ఆ॥ బలియుడగుచు రాజు బ్రహ్మాస్త్రముచివోసి । విశ్వమానిపైన వేరగుపడక । పట్టిమ్రింగెనేమి పలుకుదు రఘువరా । భూతగణము లెల్లపొంగిపోవ ॥

క॥ మ్రింగెరుబ్రహ్మాస్త్రము ముని । పుంగవుడా బ్రహ్మతేజ మునకున్నరిదేః । వెంగలిక్షత్రియకులమే । నంగలసెడ బ్రహ్మఋషిమనోద్యోగశక్తిన్ ॥

వ॥ అని నిశ్చయించి సీతనగరంబునకుం బోయి యచ్చటనియమంబున తపంబు సేయుచున్న చతుర్ముఖుండు చనుదెంచి రాజర్షివైతి వెమ్మని వరంబొసంగిన మెచ్చక నెప్పటియట్ల తపంబాచరింపుచుండె తమ్మిమాలి తననెలవునకుం జనిమొనంత ॥

ఉ॥ సత్యజయోత్సుతుండన త్రిశంకుధరావరుడొక్క నాడు తా । నిత్యవిభూతి

—:[ త్రి శం కో పా ఖ్యా న ము ]:—

నొందగ మనీషదలంచివసిష్ఠుపాలికిన్ । భృత్యునిరీతిగాజనియు భేదగుణాకరదేహస్వర్గ మున్ । మృత్యువులేకబోవునటు మేలగుజన్మముసేయు వేదమున్ ॥

వ॥ అనిసశీర స్వర్గప్రాప్తిగోరి జన్నంబుసేయించుమనిన నియ్యాగం బెవ్వరుం జేశినవారులేరు యసాధ్యంబైన కార్యంబు మావలనకానేరదని వసిష్ఠుండుబల్కిన నమ్మహాత్ముని కుమారులకడకుంజని ॥

క॥ గురుపుత్రులారదివమున । కరిగెద దేహంబుతోడ నట్టిమఖంబున్ । పరికించి సేయుడది మీ । గురుడదిగాదనుచుబలికె కోపముతోడన్ ॥

వ॥ కావున మీరైన యనుగ్రహించి సశరీరస్వర్గప్రాప్తంబు గావింపుడనిన వారలు నికార్యం బెవ్వరివలనకానిది యేలతలపెట్టెద వూరకనగరంబునకుం జని సుఖివైయుండుమని వాక్రుచ్చిన గురుసుతులంగని ॥

క॥ శిష్యుడనైయరుదెంచిన । పేర్మియములేకిట్లుబలుక ప్రియమయ్యె శతా। యుష్యులరైయుండుడు నా। శిష్యత్వము వేరుగురుని చేరునుకడకన్ ॥

వ॥ అని పలికిన ॥

క॥ వాసిష్ఠులెల్లనృపుగని । దోసములిటులాడతగునె దుష్టాత్మకనీ । వాసిచెడి యంత్యజుడవై । రాసముదయమందునుండ రాకంజడుమా ॥

క॥ తిట్టనయప్పుడభూపతి । గట్టినవస్త్రంబునల్ల గనుమైమీదం బెట్టిన । యాభర ణంబుల । చట్టాయసతేజమప్రశస్తత నొందెన్ ॥

క॥ ఛ డాలరూపుడగు భూ । మండలపతివదలిరెల్ల మంత్రులులజ్జా । త్మండ గుచు వేగకౌశిక । డుండుదపోవనికిసేగె నొప్పనిమతితోన్ ॥

మ॥ చనిగాధేయునిపాదపద్మములకున్ సాష్టాంగమర్పింప నా । యనరాజేం

దుష్టి జూచి చండాలుల నీయంగంబునై కల్మ ము । మ్మెను యేకారణమున్న సర్వమును
రాజేంద్రుండు వినుపింపగా । వినిచింతింపగనేల భానుకుల వాపిరత్నముంజూడుమా ॥

వ॥ అనియుద్యానంబునంగల మునులనెల్లరావించి త్రిశంకుకోర్కెదెలపిన నమ్మును
లెల్ల నీగాధేయుండు సమితకోప్రధనుండు నిశ్వామిత్ర్యంబున కనుకూలింపకున్న శపించునను
భయంబున నాపదసహాయంబు గావింప నమ్మఖంబు సాగించి హవిర్భాగంబు కొన్ను
దేవతలనాహ్వానంబు సేయ రాకయుండిరంత ॥

ఆ॥ వినివసిష్ఠసుతులు వేగచండాలు । క్రతువునందు రాజు కర్త కర్త । ఋత్విగాదు
గాశికుండంబుతో స్వర్గ । మేగకున్న నెచటికేగవలెనో ॥

వ॥ అని యుల్లసంబాశిరసవిని కౌశికుండు వారల నిహాసులగమ్మని శపియించి
భాగార్థదేవతలు రానందునలేచి సుక్రుస్రవంబులు చేతంబట్టి త్రిశంకున కిట్లనియె॥

క॥ నాతపము శ్రేష్ఠమైనను పురు । హూతున్న జేరంగదోలనుమ్యక్కుండ చూ ।
పితి స్వర్లోకము గనుగొను । మాతరుణిగులాగ్రిగణ్య మాయనిమాపర ॥

వ॥ త్రిశంకుండును స్వర్లోకంబు తెరవునంజనుచుండ ॥

చ॥ పొడగని పాకశాసనుడు పొమ్మధరకురు శాపభ్రిష్ట నీ । యడను
వశింపనీవ తనునేయని దోర్ణిక్కిన కూయటంచు । వచ్చెడు నరనాథుజూచి నృపశేఖర
నిల్పుము నీకు స్వర్గ మే ర్పడగను సృష్టి జేతునని బ్రిహ్మకునూరుగ జేశెనాకముక ॥

వ॥ అందు నక్షత్రిమండల గ్రిహంబులతో సప్తఋషి స్థానంబుల గల్పింపం
దొడంగిన త్రిదశులేతెంచి యో మహాత్మా చాలు పునస్సృధానంబుకూడునే త్రిశంకుండు
నిందుండగా నీస్వర్గంబున నిలచునట్లు సేయంగలవారము చాలింపుమని చపిరాయ
వని వత్రినక్కడ స్థాపించి రెండవ త్రిశంకు స్వర్గంబని పేడి యమరులు నివాసంబులకు
బోయిరంత విశ్వామిత్రుండచ్చోటు బాశి యుదయపర్వతంబున తపంబుసేయు
చుండెనప్పుడు ॥

అంబరీష చరిత్రిము.

సీ॥ అంబరీషుడుతొల్లి హయమేధ మొనరింప నశ్వంబు మఘవుండుదపహరించె ।
యంతఋత్విజులు ప్రాయశ్చిత్త మొనరింప నరపశువెమ్మన్న నరవరుండు । కదలి
భార్గవఋచీకమునీశు సుతనమ్మమనిన జేష్ఠుని నివ్వనని వచించె । యతని పత్ని
కనిష్ఠసుతునివ్వనని పల్కె మధ్యముండదివిని మనసునొచ్చి । తండ్రి జేష్ఠునికడగొట్టు
తనయుతల్లి । నివ్వకుండిన మధ్యముండెందు బోవు । నే నక్రితుండ నయోధ్యనేత
మఖము । పశువునైపోయి కైవల్య పదము గంతు ॥

వ॥ అని మధ్యముండైన శునశ్శేఫుండను వాడు క్రితువుల్కంబున నీ జనకుల

కర్పించి యంబరీషుని వెంబడి రథారోహణంబు జేసి వెడలి మధ్యాహ్నంబున విశ్వామిత్రుండు తపంబొనరించు పుష్కరక్షేత్రంబునందు గడకిన॥

ఉ॥ తల్లియు తండ్రి యున్నవదలి తన్ను సహోదరుని కమ్ముకొను చే ! నెల్లన మర్పదుఃఖమున నేత్రాంబుదంబుల వ్రాలియున్న మేనల్లుని లేపి కౌశికుడు నాదరమున్న భయంబొనంగి నీకెల్ల శుభంబులే గలుగునేల భయంపడ పోవసీసుతా॥

క॥ అని చెప్పి యప్పుడే తన । తనయుల రావించి యత్తరిన నాడుచు దీనిన్ । ముని తనయుని రక్షించి న । వనపశువై హోమము రాజపద వెనువెంటన్।

వ॥ అనిన వారిట్లనిరి :

క॥ పరసుతుల రక్షచేయుట । కొరకై నిగర్భజాత కొడుకుల మమ్మున్ ! నర పతికిచ్చిన నవ్వరె । కరుణంగల జనకులిట్లుగలరే జగతిన్।

వ॥ అనిన మండిపడి వారలనెల్ల జాతిభ్రష్టులరై పొండని శాపంబిచ్చి శునశ్శేపునకొక్క మంత్రంబు నుపదేశించి యూపస్తంభంబున బంధించునప్పుడి మంత్రంబు పఠియించుమని చెప్పిన నతండా మంత్రంబు గైకొని యంబరీషునితోడ నయోధ్యాప్రవేశించిరి నప్పుడు ఋత్విజులు శునశ్శేపుని యలంకారంబు గావించి యూపంబున బంధించి తే॥ చలగెనంబరీషు జన్మంబు నరపశు । యుక్తముగుచు హోమమొప్ప చుండె । భార్గవేయుడంత పఠియించె నమ్మంత్రి । మహిమచేతవచ్చె మఘవుడంత॥

వ॥ అంబరీషుంగని రాజేంద్రా నీమఖంబు బహుగుణ ఫలంబయ్యెనీ విప్రుని విడచి పుచ్చుమని చెప్పి చనిన చిరంజీవుండవై యుండుమని ఋత్విజులతని వదలి సాంతంబై యజ్ఞంబుచే తేజరిల్లు నయ్యంబరీషుం దీవించి చనిరంత గాధినందనుండు నింకొక్క యెడకుం జని తపంబు గావింపుచుండె॥

క॥ పరమేష్ఠి సురలతోడుత । నరుదెంచి మునీంద్రుతో మహాఋషివై భూ । సురలందు పూజ్యతయు నా । దరణంగలవాడవౌదు తపమింకేలా ।

వ॥ అని పలికిన బ్రహ్మర్షి శబ్దంబు సంప్రాప్తం బైనంగాని తపంబు చాలించనని యుద్దేశించితినని దేవ జ్యేష్ఠుండు దేవతలతో నంతర్ధానంబునొందె నిక్కడ॥

క॥ మేనకయను పరమాప్సర । కాననమున సంచరింప గనిమోహముచే । దానింగలసి తపంబులు । మాని సహస్రాబ్దములును మాయంబడియెన్ ।

వ॥ ఇట్లు బహుకాలంబు దానింగలసి సుఖంబు లనుభవించి నొక్కనాతుంగని తెలివందిన తపంబెల్ల నిరర్థకంబయ్యెనని విచారించి దానింబోవంబనిచి యుత్తర పర్వతంబునందు తపంబు సేయుచుండె నప్పుడు॥

క॥ దేవపతిరంభ నంపిన । నావనజదళాక్షి కౌశికాశ్రమమునకున్ । పోవగ

పొడగన నెటులే । లావచ్చెను మరలి బొమ్మ లావణ్యవతీ॥ వ॥ అనిన॥

ఆ॥ వికటవచ్చిరంభ చేష్టలు సేయంగ । కోపగించి గాధిసూనుడు దాని । శైలిగా శపించె శిలయుగల సహనము పూత్రి మాయ పొందువడునే॥

వ॥ ఇట్టి ప్రయత్నంబున రంభ శాపంబునొంది భయంబు నంజని యనంతరము నిశ్చయుండై॥

ఆ॥ ఊర్ధ్వబాహుడగుచును చ్వాసమాగించి । వాతభక్షణంబు చేత నిలచి । హృదయమందు చలనమింత్తైన లేకుండ । నుగ్రతపము సేయుచుండెనచట

వ॥ ఇట్లు ఘోరంబైన తపంబుసేయుచున్నంత బలభేదియనేక విఘ్నంబులాచరింప నన్నిటికిం జలింప ధీరుండైయుండె తత్ప్రభావేశము మూడులోకంబులంటి మంట లెగయ తాపంబున కోర్వక త్రిదశులందరు కమలసంభవునొద్దికేగి విన్నవించిన॥

ఆ॥ కదలి సురలతోట కౌశికమునివద్ది । కేగి హంసవాహుడిట్టు లనియె । భద్రమయ్యె లెమ్ము బ్రహ్మర్షి వైతివి । గాధితనయ విమల కాంతినిలయ॥

వ॥ మరియు బ్రహ్మవేదంబు నక్షత్రవేదంబును ఓంకారవషట్కారాది షట్కర్మాధికారుండవైత్తి లెమ్మని పలుకుచున్న పరమేష్టికి విశ్వామిత్రుండు వందనంబాచరించి ముకుళితకరుండై బ్రహ్మపుత్రుండైన వశిష్ఠమౌని యిట్లుపలుకవలయు నంతవరకీ తపంబుచాలింపనన నిలింపులు వసిష్టమునీంద్రు చెంతకుంబోయి ప్రార్థించి తోడితెచ్చి బ్రహ్మర్షివైతి లెమ్మని పలికించిన నప్పుడు గాధేయుండు వసిష్టునకు నమస్కరించె కమలగర్భుండు నమర్త్యులతో సత్యలోకంబునకుంజనియె వింటివే రామచంద్ర గాధిసుతుండింతటి ప్రభావంబుగలవాడని శతానందుండుజెప్పిన సభవారంతయు విస్మయంబంది విశ్వామిత్రుంగాంచి యాడిరంత జనకుండమ్మునికిట్లనియె॥

ఉ॥ తాపసవర్య నేటికిల ధన్యుడనైతి మహాత్ములైన నీ । భూపకుమారులిద్దరును పూజ్యులునైరి విశేషవృత్తి మీ । దాపునవచ్చి బాలకులు దైత్యవధంబొనరించి దేవనా । శ్రీప శుద్ధి సేయుటకు చేరగబోరి భాగ్యమయ్యెగా॥

వ॥ అనిన విశ్వామిత్రుండు మిథిలాధిపుంజూచి ఈనాటికి నొక్క విడిదలందుండి రేపురాగలమని చెప్పి నమ్మహీశుండంపిన గృహంబునందు వసియించి ప్రభాతంబున॥

క॥ జనకుడు పేరోలగమున । జనులెల్లను వచ్చి కొలువ సయ్యన బిలపిం । చెను కౌశికముని రాముని । పినతమ్మునితోడగలసి ప్రియమునరాగ॥

ఆ॥ వచ్చి జనకునాజ్ఞ వెచ్చెన మణిమయ । స్వర్ణపీఠమంబు సంయమీంద్రు । డెలమి రాజసుతుల నిద్దరితోనుండె । నజునినింద్రమనువు నట్లుమెరసి॥

ఉ॥ రాముని తేజముగ్గనగ రాజముఖుల్ చనుదెంచి ప్రేమతో। శ్యామలరూపు జూచి గుణసారములెల్ల గ్రహించి యప్పుడే। నోముఫలించె రాజునకు నూతన మన్మథ సుందరుండు నీ। రాముని సీతగాంచిన విరానవరింపక యూరకుండునే॥

వ॥ అనిన యందొక్క చెలియ యిట్లనియె॥

మ॥ పికవాణీమన రాజుశైవ ధనువున్ భేదించు నెవ్వాడు వా। నికి సీతం దగ నిత్తునంచు మును వేనిర్బంధముం జేసె నూ। రక లేకున్న గుణాభిరాముడగు నీ రాముండు భూజాత మా। నక చేబట్టిన సంతసించు పురిలోనం గల్గు శ్రీసంఘముల్॥

వ॥ అనిన నింకొక్క చేడియ యిట్లనియె॥

క॥ రాముడు శివకార్ముకమును। సామజముం జెరకువిరచు చందంబున ప్రా। గ్గామతి భంగము సేయును। భూమిజ గూడుక నయోధ్య పురముం జేరున్॥

వ॥ ఇది మదీయ్యంబైన శాసనంబు నింక జానకీమనంబు రామునియందు కామించు తెరంగు సేయుదునని రాజాంతఃపురంబునకుం జని సభకురా ప్రయాణంబై యనేక సఖీజనపరివృతయగుచున్న సీత నుపలక్షించి యిట్లనియె॥

మ॥ మగువా భానుకులుండు రాముడవ శ్రీమంతుడు నయోధ్యాధ్య మే। లుగ రక్షించెడు పంక్తిస్యందనునకున్ లోకంబు కీర్తింప నూ। నుగపుత్రుండయి పుట్టినాడుగద నీ నోమెల్ల సాఫల్యమై। నెగడెన్ చూడుము మారసుందరుని తన్వీ రాజచూడామణీ।

తే॥ యెందరో వచ్చి శివధను వెత్తలేక। పోయిరిన్నాళ్లుగాని యీ పురుష రత్న। మునకు సరియైన వానినేముందు జూడ। లేదు వెనుకటివారిలో లేమ వినుమా॥

వ॥ ఇతండు తప్పక పినాక కార్ముకంబు భంగంబు గావించి నిన్నుం బాణిగ్రహణంబొనరించు తప్పదు నా పలుకులాలకింపుమని చెప్పి నిజమందిరంబునకుం జనియె యనంతరంబ తనతో గూడిన సఖీజనంబులయందు నొక్క నారీరత్నంబు సీతకిట్లనియె॥

క॥ అమ్మా రాముని బాడగన। కమ్మని విలుకాని కన్న ఘనసుందరుడౌ। తమ్ములను బోలు నేత్రము। లిమ్మహిలో పురుషులెవరు నీడగువారే॥

సీ॥ కనులరంగారంబు కమలాక్షునకు సరి బాహువులాచతుర్బాహుసమము। వక్షంబు శ్రీవత్సవక్షున కెనయగు కంఠంబు భాతి వైకుంఠుపగిది। పదములకాంతి శ్రీపతిపాదముల పోల్కి శ్రవముల విష్ణుసుశ్రవములట్లు ముఖసౌష్టవంబెన్న పురుషోత్తముని గతి వర్ణంబు హరినీలవర్ణావలము। తరమె పొగడగ దశరథతనయుసాగసు। కోటిమన్మథులొక్కవంక గూడిమనిన। సాటిసేయంగ జనునె యాసచ్చరిత్రు। డినకులాబ్ధి కైరవహితుడనుమ్మ॥

క॥ జలజాక్షుడు సురప్రార్థన । వలనం దశరథుని గర్భవాసంబున భూ । తల మున రామసమాఖ్యను * సి * పొలుపుగ నరరూపుదాల్చి పుట్టగబోలున్॥

క॥ ఆతరణికులుడు భువన । ఖ్యాతిగ సీనాథుడైన గారీవాణి । శ్రీతరుణినీ సమమే । ఖ్యాతిన యాభోగభాగ్య సంపద కలిమిన్॥

వ॥ అనియు నేకభంగుల నాయింతనవదన రఘునందనను సౌందర్యంబు శ్రవణానందంబుగా వినుపించినవిని జనకరాజనందన ముహూర్తమాత్రంబు తడసి సఖీజనంబులకు బోవ నియోగించి యతిత్వరితంబున॥

క॥ మునుతనతోడను రఘురా । ముని ముచ్చట జెప్పినట్టి ముదితను బిలువం । బనిచి బహుమానపూర్వక । మున దానింగారవించి ముదమున బలికెన్॥

క॥ తరుణీ రఘురాముని సుం । దర రూపము నీవ్ర జెప్ప నామదిలో నా । పరిపూర్ణాంగుని గ్రక్కున । నరసెదననునట్టి కోర్కె యధికంబయ్యెన్॥

వ॥ కావున నాజగన్మోహనుని గనునట్టి తెరంగెవ్విధంబున సంఘటించు నెరింగింపుమనిన నాసుధాంశుముఖి సౌధతలంబెక్కి కౌసల్యాసంతసుండు కొలువు కూటంబుననునికి యెరుంగంజెప్పిన॥

క॥ రతిరాజదంతిగతి శ్రీ । సతివిధమున దివ్యమృగము చందమున తటి । ల్లత మాడ్కి మోహిని దేవతకైవడి జనకతనయ వారని ప్రేమన్॥

సీ॥ ఘనతరామూల్యముక్తా యుక్త భాసుర కమనీయ్య కనకాంశుకంబు గట్టి । కుముదాప్తునందు నర్ధముబోలు నొసలను పొలుపొందు కస్తూరిబొట్టుదిద్ది । అళిసంఘములకు నెనయై యొప్పి విలసిల్లు వేణీభరంబుపై విరులుజుట్టి । కటకకేయూర కంకణ కుండలాంగద ముఖ్యభూషణములిమ్ముగ ధరించి । రాజవదన నూత్న రాజీవలోచన । కంబుకంఠి హంసగమన కుంద । రదన సిమ్హమధ్య మృదులపల్లవపాణి । చారుసుందరాంగి కీరవాణి॥

సీ॥ తాటంకరోచులు ధళధళక్కన చెక్కుటద్దంబులందు నృత్యంబు సేయ । నుత్తుంగ ఘనపయోధరభరమున కౌగక కౌనసియాడుచుండ । యానవేగంబున నాశుగధ్వజతుల్యమై పయ్యెదతూగియాడ। మంజీరకింకిణీ మహనియ్య రావంబు ప్రబలమై దిక్కుల ప్రతిఫలింప । ముద్దుమోమున చిరునవ్వు మొలకలొత్త । లీలడాకేల పుష్పమాలిక జలంగ । తనరనొకకేల సఖియకై దండబూని । సదమలాంచితమణిమయ సౌధమెక్కె॥

సీ॥ కమనీయ్య నీలమేఘశ్యాము భానుకులాంబుధి సోముదయాభిరాము । సలలిత మకరకుండల మండిత కపోలు భాసురచారు విస్ఫారఫాలు । నతులి తానఘ్యు

రత్నాంగద కటక కేయూర మంజీర కోదండ ధారు ! కంబు కంఠకుల సత్కంజాతలో చనునిందసుందరముఖు కుందరదను ! దివ్యసుకుమార రూపుని దివ్యచాపు ! భావ భవసన్నిభాంగు శోభాతరంగు ! రమ్యగుణసాంద్రు దశరథ రామచంద్రు ! కనియె నాసీతకన్నుల కరువుదీర ॥

ఆ॥ అప్పుడు ॥ క॥ కనురెప్పలిడక తప్పక ! మనుకులపతి సుందరంబు మది మెచ్చుచు వా ! రని ప్రేమజూచుకతనన్ ! జనకాత్మజయందున నిమిషత్వము దోచెన్ !

సీ॥ అంతనాక్రియవసుధాత్మజ తారక సంఘంబులోనున్న చంద్రునట్లు ! సకలావనీపాలసమ్మతిలోపల భాస్కరకులప్రభునిగాంచి ! యతనిసుందరమున కధిక సమ్మోదంబు మనములోపల జెనగొనగ నేత్ర ! యుగళ మొయ్యనమోడ్చి రామ విధంబున జొక్కుచు వేగమచ్చోటు వాసి ! యనుగు దెంచె విమలయశుడైన యార * స * ఘువరుని మగడుగాగనల చియుండె ! పద్మనయనసీత భార్గవిముదు శార్ఙ్గి ! వలపులోన జిక్కు పడినయట్లు ॥

వ॥ ఇట్లు చలాత్మజ ప్రితాతమున్నెంటైన రామచంద్రమూర్తియందు బద్ధానురాగయై తిన్ననివాంసగమనంబున జనాంతికంబుగా సభాంతరభాగంబున తెరలోపలికిం జనుదెంచి తండ్రియనుమతివడసి యొక్కయున్నతపీఠంబున వసియించియుండె జనకుండు గాధినందనునకిట్లనియె ॥

క॥ తాపసకులమృగలాంఛన ! యేవని తెలవిచ్చెదరో తెలుపుడేనొనరింతున్ నీపాదరజముసోకి శు ! భాపాదితమయ్యె నాదు భవనముకలిమిన్ ॥

క॥ జనకుడు పలికినకౌశిక ! మునిమానసమలరి మోదమునసిట్లనియెన్ ! మనునిభుడు రాముడాశివ ! ధనువుంగనిచ్చగించె ధరణీనాథా ॥

క॥ శివకార్ముకమెత్తిన భూ ! ధవునకు పుత్రికనొసంగ తద్యంబని మా ! నవకోటివినగనాడితి ! భువనైకవదాన్యజనక భూజనమాన్యా ॥

వ॥ అమ్మహానీయ్యా సాధనంబు దెప్పింపుమని పలుకుచున్న సంభ్రమాంతరంగుండై యప్పుడ ధనుశ్శాలకరిగి ॥

క॥ పదివేవురుబలవంతులు ! కదలింపగలేకచాల కష్టంబున యా ! పదనొందగ దెప్పించెను ! హృదయానందమున పౌరులెల్లజలంగన్ ॥

వ॥ ఇట్లు దేవరాంతుండు మొదలగు రాజులచే పూజింపుచుండి ప్రశంసైన చంద్రశేఖరుని శరాసనంబు సభయందునిలిపిన గని విశ్వామిత్రుని కనుసన్న రాఘవేశ్వరుండు లేచి ధనువున ప్రదక్షిణంబుగావచ్చి యశ్రమంబున ॥

చ॥ ధనువును చేతబట్టి బరదర్పనిలప్పశరంబుగూర్చి సా ! మునవగదీశినొంప

—:( శివధనుర్భంగము ):—

గను మందకొనై పురభంగము య్యో భో । రునసురమందు భుల్ మొరసె రూఢిగసీతను । రాముడేలు నం । చపురిజనంబులెల్ల జనకాత్మజమానసముత్సహింపగన్ ॥

వ॥ ఇట్లు ధనుర్భంగంబు గావించి నిలచియున్నసమయంబున ॥

క॥ ధామంబునుండి వెలివడు । సోమునిగతిజనకరాజ సుత తెరమాటున్ । ధా
మము వెడలుచు రఘుకుల । శ్రీమహితుని మెడను వేసె చేసుమమాలన్ ॥

వ॥ అనంతరంబ ॥

సీ॥ జనకుండుసంతోష జలధితాండవమాడి యప్పుడుగాధేయు కనియెనురల । భూజాత శ్రీరామపురుషోత్తమునకిత్తు దశరథేంద్రుని వేగతరలి రమ్మ । టంచుదూతను బంప్రుమనగ విశ్వామిత్రుడానందభరితుడైయనియె జనకు । తోడనీబుద్ధికితుల్యంబుగల వాని సంపుమయోధ్యకునాజుకడకు । ననివచింపగమైథిలుండనిచెదూత । శీఘ్రయానంబు గొనిచని చేరియచట । విన్నవించినదశరథవిమలయశుడు । సవ్వసిష్ఠునిబిలిపించె నపుడుచలగి ॥

చ॥ చనియెవసిష్ఠమౌని నృపుసన్నిధికింపగుపూజజేసి నా । జనకుడుదూతనంపిన విచారముజెప్పినసంతసించి కా । దనకనరేంద్రపాయి వినయంబునగూడివిదేహరాజనం । దన మనరామచంద్రునకు దారగనైకొనవయ్య రాఘవా ॥

క॥ జనకునిసమ్మంధమునకు । మనకులముపవిత్రమయ్యె మానవపతి నీ । యను మతి సుమంత్రిముందర । గొనిపాదమిథిలాపురంబుకు ముదమలరగన్ ॥

వ॥ అనిచెప్పిన ధనాధ్యక్షునింగని ధనంబుతో సకలసన్నాహంబులు పయనంబై వెడలునటుల నాజ్ఞాపించి సుమంత్రినాలోకించి ॥

క॥ గాధేయుడు బాలకులను । సాధించుకపోయితనదు జన్నంబునకున్ । బాధలు మాన్పుక జనక । ప్మాధవుపురి చేరనరిగి సయ్యనచటన్ ॥

వ॥ రాముని చే శివధనుర్భంగంబు గావింపం జేసి సీత యనియెడు కన్యకనిశ్చయించి మనలరాగలందులకై దూతంబుత్తెంచినాడు కావున ॥

చ॥ వినుముసుమంత్రిమైథిలుని వీటికిబోవగసర్వసేనలన్ । ధనమునుపౌరులున్న కల దానజనంబులుబంధువర్గమున్ । మునులునువిప్రసంఘములు మున్నగువారలతోడ గూడి పో । వనుసమకూర్పుమంతయును వారిజబంధుదయంబు లోపలన్ ॥

క॥ అంతఃపురమందుగలనృప । కాంతలనెక్కించుశకట కరితురగములన్ । కుంతధరభటులుగొల్వగ । చెంతంగమన్నించునటుల సేయుముకడకన్ ॥

వ॥ అని యాజ్ఞాపించిన సుమంత్రుండు ధరణీధవునాజ్ఞ సర్వపరివారంబు తో

నయోధ్య వెడలి ॥

ఆ॥ నడిచె దశరథేంద్రు నాగాశ్వరథభట । పాదరజము మిన్ను పదమునంట । సంత తమునసదులు సర్వంసహాధర । కాననములు దాటి కదలి రాగ ॥

వ॥ ఇట్లు నడచి రమ్యస్థలంబుల విడియుచు మెల్లనిపయనంబుల విదేహరాజ్యంబు దరియంజొచ్చి మిథిలాపురంబు సమీపంబున నిలచి దూతముఖంబున తమరాకయెఱింగించిన జనకుండు శతానందపురస్సరుండై యెదురుచని వందనాలింగనాద్యుపచారంబులం దోడి తెచ్చి విడిదలం దువసింపం జేసి సర్వోపచారంబులం బూజించె నప్పుడు ॥

తే॥ రామలక్ష్మణులతోపంక్తిరథుని కడకు । కౌశికుడు వచ్చె సంభ్రమ కలితుడగుచు । నాటిదినమెల్లగడపి సద్వీటియందు । చేపకడనంతశృంగార రీతులమర ॥

క॥ జనకుని సభ జేరంజని । ధనకనకసమృద్ధమైన తద్వైభవంబుల్ । గని సంతసించె దశరథ । జనపతి మునిహితసుతాప్త సంఘంబులతోన్ ॥

వ॥ అంత మిథిలేశ్వరుండు శతానందుంగూడి రచ్చకేతెంచి సకలామాత్యబంధు పురోహితసహితుండై యున్న దశరథభూపాలుం బూజించి యొక్కయుచితాసనంబునం దాసీనుండై యమ్మహీపాలుంగని యిట్లనియె ॥

క॥ ఇందుధరు కార్ముకము మా । మందిరమున పూజగొనుచు మా పెద్దలకున్ । ముందుగనుండెను కులగత । మందున నావరకు జరుపనయ్యె నృపాలా ॥

వ॥ ఇప్పుడు ॥ ఉ॥ మాకు ధరిత్రియందు నొకమానిని పేటికయందు లబ్ధమై । సాకుచునుండ నొక్కదివసంబున కార్ముకమెత్తె లీలగా । చేకొని యప్పుడే యుడుపశేఖరుచాపము నవ్వ నెత్తునా । రాకుమరుండు నీసతి వరంబగుభర్త యటంచు బల్కితిన్ ॥

వ॥ అది మొదలనేక రాజవరులేతెంచి నిమ్మహాధనువు నెత్తలేక మ్రానువడి పోవుచుంద రిప్పుడు మాభాగ్యంబున ॥

క॥ మీతనయుడు రఘురాముడు । ప్రీతిం జనుదెంచి ధనువు ఫెళ్లున విరచెన్ । ఖ్యాతిగ మా పుత్త్రిక యగు । సీతకు మగడయ్యె శుభముచే ధరణీశా ॥

వ॥ అదియునుంగాక ॥

ఆ॥ లక్ష్మణునకు మహితలక్షణ యూర్మిళ ♦ మద్ద్వితీయపుత్త్రి మంగళాంగి ♦ దారబోసియిత్తు దశరథభూపాల ♦ సుగుణజాలభద్ర సుభగశీలా ॥

వ॥ ఇంకా నొక్కవిన్నపంబవధరింపుము ॥

శా॥ నాతో బుట్టినవాని నందనులు తన్నారీమణీయుగ్మముల్ ♦ చేతోజాతసమాన మూర్తులగుచున్ జెన్నొందు కైకేయి సం । జాతుండున్ కడగొట్టుపుత్త్రుడగు నాశత్రు

ఘ్నుడున్ వైభవ । శ్రీతోఁ బెండిలిపై చలంగుదురు మా చేదారబోయంగడున్ ॥

అట్టి కన్యకల నామంబులు మాండవీ శ్రుతకీర్తియని నిర్ధారణ సేయువారు అనుగ్రహించి వివాహంబులు యథావిధిగ జరుగునట్లు గావింపుమని ప్రార్థించి తత్క్షణంబ సాంకాశీపురంబున తమ్ముండగు కుశధ్వజుని రప్పించుటకు దూతంబు బంపించిన ॥

క॥ వచ్చె కుశధ్వజుఁ డప్పుడు । హెచ్చుగ సంతోషవార్ధి నీదుచు జనకుం । డచ్చుపడి నాదరింపగ । సచ్చరితుఁడు దశరథేంద్రు సమ్మోదముతో ॥

వ॥ ఇట్లువచ్చి యందరుఁ గలసియుండిరంత నా జనకుండు దశరథ ధరణీభర్తం గని ॥

క॥ మీ మా కులనామంబుల నీమానుగ జెప్పవలయు నేకతమున శ్రీ రాముని భరతుని లక్ష్మణ । నామంబు సుమిత్రపిన్న నందనుతోడన్ ॥

వ॥ అనియుచ్చరించి సుముహూర్తంబు నిశ్చయించి నలువురికి గోదానవ్రతంబులు గావింపుమని పలికిన జనకరాజు వాక్యంబు లాలకించి దశరథుండు వసిష్ఠమునీంద్రుం గని ॥

క॥ చెప్పుము రవివంశంబున । తప్పక జనియించినట్టి ధరణీశుల వా । రెప్పుడు మిము నేలికీర్తిన్ । జొప్పుసెయున్నట్టివారి సుభగమనీషన్ ॥

వ॥ అనిపలికిన వసిష్ఠుండవ్యక్త పరబ్రహ్మంబు మరీచి మరీచికి కశ్యపుండు కశ్యపునకు దివాకరుండతనికి వైవస్వతమనువు మనువునకు ఇక్ష్వాకుండు మొదలగు రాజులుత్పన్నం బగుచు దశరథ భూపాలుండు జన్మించె నమ్మహానీయునకు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులను నలువురు పుత్రులుద్భవించి రీపవిత్రంబైన కులంబు మనువంశంబని సూర్యవంశంబనియు ప్రసిద్ధి వహించె నింక మీ కులం బభివర్ణింపుండని పలికిన జనకుండు ॥

చ॥ నిమియను చక్రవర్తి ధరణింగల రాజుల కెల్ల మేటి నా । సుమహితశాలి నందనుడు శూరుడు నమ్మిథి యాతఁ డీపురిన్ । క్రమమున నేర్పరించి యలకాపుర సామ్యము గాగ నేలె మా । లముగ దవాని పేరు మిథిలాపురమంచు వచింతురందరున్ ॥

వ॥ అట్టి మిథికి ప్రథమజనకుండను జనకునకు ఉదావసుం డతనికి నందివర్ధనుండు వానికి సుకేతుండు సుకేతునకు దేవరాతుండు దేవరాతునకు బృహద్రథుండు బృహద్రథునకు మహావీర్యుండు మహావీర్యునకు సుధృతి సుధృతికి దృష్టకేతుండు దృష్టకేతునకు హర్యశ్వుండు హర్యశ్వునకు మరుండు మరునకు ప్రతింధకుండు ప్రతింధకునకు కీర్తిరథుండు కీర్తిరథునకు దేవమీఢుండు దేవమీఢునకు విబుధుండు విబుధునకు మహీంద్రకుండు మహీంద్రకునకు కీర్తిరాతుండు కీర్తిరాతునకు మహారోముండమ్మహీపతికి స్వర్ణరోముండా రాజునకు హ్రస్వరోముండా భూపతికి నేనును నా భ్రాతయగు కుశధ్వజుడును నిద్దరుసుతుల ముద్భవించితిమి ॥

క॥ జనకుడ మిథిలనేలితి । దనర కుశధ్వజుడు నేలె తగ సాంకాశ్యం । బను పురము

విభవ మెసగగ । తనయులు నలుగురు నికాస తనుముఖనేత్రల్ ॥

వ॥ సీతయనియు ఊర్మిళయనియు మాండవియనియు శ్రుతకీర్తియనియు వారల నామంబులు పేరలు నలుగురు మాకన్యలను మీపుత్రులు నలుగురు పాణిగ్రహణంబు గావింపం గవలయునని పలికెనప్పుడు శతానందుండు ॥

క॥ గోదానములొనరించిన । మీదట నవ్వారివాహకార్యమె మొనరింపన్ । రాము చనిసుతులకొరకై । భూపై తానేయుమయ్య పుణ్యాహంబుల్ ॥

క॥ నాందీముఖశ్రాద్ధాదుల । నందగతి జనకజనకు మందిరమున శ్రీ । కందళితహృదయులై యా । నందంబున సుప్రయోజనంబులు జరుగున్ ॥

వ॥ ఇట్లు శతానందుండు పలికె యనంతరంబ జనకుండు పురంబెల్ల శృంగారించి శీఘ్రంబున తరలిరాగల దంటకుం దశరథభూపాలునకుం జెప్పనంపిన ॥

చ॥ అలజనకుండు పంచిన మహాత్ములతో విడివాటుచేరి నం । దనులను గూర్చి గోవుల సవాత్సకలు భూసురాళికిన్ । మునులసహాయమందు వర ముఖ్యగదానము జేసి వెన్క శో । భనసుముహూర్తకాలమున భద్రగజంబు సలంకరింపుచున్ ॥

వ॥ మంగళవాయిద్యంబులు చెలంగ పుత్రచతుష్టయంబు నానాలంకార సౌందర్యదంత చతుష్టయంబు నైరావతదీప్తి విస్తారకుంజరేంద్రంబు నధిష్ఠింపజేసి జనకరాజ శోభనమందిరంబు ప్రవేశించునప్పుడు ॥

క॥ కేకయసుతుడరుదెంచెను । సాకేతమునుండి జనకు సదనంబునకున్ । కైకేయి వరుడు గనితన । రాకడకున్ సంభ్రమాభి రాముండగుచున్ ॥

వ॥ కుశలంబడిగి యాదరపూర్వకముగా నెచ్చటనుండియరుదెంచితివని పలికిన యుధాజిత్తుండు దశరథుం జూచి రాజేంద్రా మీ క్షేమంబరయుటకై నయోధ్యకుం బోయి తంద మీరు మీనందనులవివాహంబులకై నిటయరుదెంచినారనవిని నిమ్మిథిలకరుదెంచితినని చెప్పెనప్పుడు వసిష్ఠమునీంద్రుండు ॥

శా॥ కల్యాణంబగుమంటపంబున యలంకారంబుగా నక్షతల్ । మాల్యంబుల్ ఘృతలాజదర్భసమిధల్ మాణిక్యనీరాజనై । ర్మల్యాంబైతగునంకురాఢ్యములు ధూమ్రస్థనపాత్రంబు సా । కల్యంబున్ సమకూర్చియుంచె శుభపీఠారంభుడై వేదికన్ ॥

ఉ॥ వేడుకతోడ సర్వపృథివీపతిపుత్రచతుష్టయంబు జే । రాడెడుశాలువల్ మెరయ సుందరశోభనమంటపంబునన్ । గూడియలంకరించు నవకుందసుగంధము లీనుచుండగా । చేడియలెల్లవచ్చి వరశ్రేష్ఠులపూజ లొనర్చిరయ్యెడన్ ॥

వ॥ ఇట్లు వరపూజలు గావించి మంగళపీఠంబులపై వసియింపంజేసి వసిష్ఠుండు జనకమహారాజుం గని యిట్లనియె ।

క॥ దాతవుమీకొరకై మా । భూతలనాథుండుకోరి పుత్రికభువన । ఖ్యాతిగ కన్యాదానము । చేతోయనియెనరుదూచు శ్రీయుతమతియై ॥

వ॥ అనినజనకుండు వసిష్టమునికిట్లనియె ॥

క॥ ఎవ్వరుదాతలుప్రతిగ్రహు । లెవ్వరుతనరాజ్యవిభవ మెట్లోనటుల । న్న వ్వసునాథీపుడిచ్చుట । నవ్వలి కార్యంబునడుప నగుకుతకమ నగా ॥

వ॥ అటియుచుండగాక వివాహమంగళాలంకృతులై సిద్ధముగానున్న మాకన్య కల రావించి విద్యుక్త పాణిగ్రహణోత్సవంబులం గావింపుమనిపలికి యప్పుడ కన్యల రప్పించిన ॥

సీ॥ గాంగేయమయరత్న కలితపల్యంకికా రోహమైశుభమార్గరుచులుదెలుప । ధవళాదపత్రసందాయకహస్తులై నియవంక సేవకులెగసినడువ । ముందటభూసుర ముత్తై దువలుపెండ్లి పాటలువింతగా బాడుచుండ । గణికాంబుజాక్షులగణము న ర్తనసేయ కవి గాయకులు వేడుకలువచింప । గంధగజశుభ్రవరతురగంబులలర । సకలవాయిత్యముల పురస్సరముతోడ । స్వర్గసురరాజకుసుమవర్షంబుగురియ । సీతచనుదెంచెతోబుట్టు చెలులగూడ ॥

క॥ పల్లకిదిగినొకచేడియ । పల్లవకరమమరబట్టి పదములనిడుచున్ । మెల్లనకల హంసమువలె । చెల్లెండ్రనుగూడిసీత జేరగవచ్చెన్ ॥

వ॥ ఇట్లుశృంగార రాజహంసంబు చలువుననరుదెంచి కల్యాణమంటపంబున మణిమయ స్తగిత స్వర్ణపీఠంబుపై తమ్ములతోగూరుచున్న శ్రీరఘుస్వామి సౌందర్య సుధారసంబు తనకెరిగంటిచూపుల నాస్వాదించి యతండుమరల తనశృంగా రంబవలో కింపుచుండ సిగ్గుదోప నొక్కపార్శ్వంబున యనుజులతోనిలచి యాచరించు తెరం గరయుచున్న చిన్నిముద్దులకన్నియ జనకేశ్వరుండెత్తుకొనితెచ్చి రామాభిముఖంబుగా స్వర్ణపీఠంబునం గూర్చుండంజేసిన నమ్మోదితమనముందు సంతోషహార్దిత రంగంబులు పైపై పొరలిపార నారాజకంఠీరవుని కెదురుగద్దియపై వసియించియున్న సీతందనకరం బున జూపుచు శ్రీరామమూర్తికి జనకుండిట్లనియె ॥

క॥ ఈసీతనాదుకూతురు । భాసురరవితేజఏమె పాణిగ్రహణం । బీసమయ మందుసేయుము । నీనహచరియగుచునుండు నియతాత్మకయై ॥

క॥ అనిచెప్పుచును శ్రోదకమునకన్నియ నారబోశె మునిసంఘము దీవనలిచ్చి నేసలిడగను । మనువంశవిభూషణునకు మైథిలుడంతన్ ॥

వ॥ ఇట్లుదారబోశిన ॥

క॥ శిరివక్షోజయుగంబున । నిరతేముశృంగార చేష్టనెర పెడువర సు । దరమగు

నీరజములసరి । కరమునజనకాత్మజాత కరముం బట్టెన్

వ॥ ఇవ్విధంబున సీతారామ పాణిగ్రహణానంతరంబున లక్ష్మణభరతశత్రుఘ్నుల యూర్మిళ మాండవి శ్రుతకీర్తియను వధువుల వరుస చే పాణిగ్రహణంబులు సలిపి యనంతరంబున వసిష్ఠశతానందులు ॥

ఉ॥ అంకురమంకురింపుచు రయంబున వహ్ని ప్రతిష్ఠచేసి యా । లంకరణంబొన ర్చి ఘృతలాజల హోమము వేల్చియగ్నికిన్ । శంకప్రదక్షిణంబులను జేసియొనర్పు డటంచు నానతి । య్యంకరముల్ గ్రహించి స్వకరాత్మజలాక్రమ మొనరించినన్ ॥

వ॥ వధువరులు వీతిహోత్రునకు నాదంపతిచతుష్టయంబును వందనంబాచరింపం జేసి సాయంప్రాతర్హోమంబు లాచరింపుచు దినచతుష్టయానంతరంబున శేష హోమంబులుగావించి విధ్యుక్తక్రమంబున వివాహంబులుజరిపి ॥

చ॥ అరణమొసంగనెంచి బహు వల్లుర కెల్లమతంగజంబులన్ । తురగములున్ర థంబులును తోమరపాణులకాల్బలంబు సుం । దరలలితాబ్జనేత్రిలగు దాసిజనంబులు దాసకోటి యుం । బరములుదివ్యరత్నమయ భాసురమౌక్తిక కంఠహారముల్ ॥

వ॥ మరియు ధవళఛత్రంబులు ధావళ్యచామరంబులును విమలకనకమయ శిబి కాందోళికంబులు మణిమకుటంబులు మకరకుండలంబులు గోసహస్రంబులును వేర్వేర నందరకుసమముగానిచ్చి ॥

క॥ శ్రీరామనామముదిగ్ధ । భూరమణుండైనజనక పురుషోత్తముడా । శూరుం డగు దశరథునికు । మారాగ్రజకిచ్చె నతిసమంజసమతియై ॥

వ॥ ఇట్లు వివాహానంతరంబున విశ్వామిత్రుండు జనకదశరథుల నామంత్రణంబు వడసి వారిచ్చుపూజలంగైకొని నిజనివాసంబగు యుత్తరపర్వతంబునకుం జనియెనప్పుడు పంక్తిరథుండు సాకేతపురప్రయాణంబునకు శెలవసంగుమనియడిగిన జనకుండు ॥

ఉ॥ వచ్చిననాటనుండి శుభవర్తనలెల్లను దీరెనేటికిన్ । ముచ్చికమీరుమేము తగుమాటల సంతసమొందుచుండ లే। దిచ్చటకొన్నినాళ్లు వసియించినమీద నయోధ్య కేగగా । వచ్చునటంచుచెల్పగను వారిజబంధుకులుండు నచ్చటన్ ॥

వ॥ నిలచియుండెనని చెప్పిన గరళకంఠునకు గౌరీమణికిట్లనియె

తే॥ సీతభూజాతయనెడు ప్రఖ్యాతిగలను । కారణంబేమి ధరకెట్లు గలిగెనుకల జనకభూపతికేరీతితనయయయ్యె । దేవ యీచిత్రకథలెల్ల దెలుపవయ్య ॥

క॥ అనియడిగినగౌరికి పా । వననాక్షీతిలకసీత వనితామణి భూ । తనయయన నుండిపదపడి । జనకాత్మజయైనచిత్రి సత్కథవినుమా ॥

వ॥ తొల్లి రావణుండు దిగ్విజయంబు సేయుచు భూతలంబెల్ల దిరుగాడుసమయంబు

బున నొక్కరమ్యస్థలంబున వేదవతియను మునికన్యక యత్యంత నిష్ఠహరింగూర్చి
తపంబుసేయుచున్న నచ్చోటికి దశకంఠుండు చని ॥

ఉ॥ దానివిశేషసుందరము తప్పకచూచిహరింపనెంచి యా । దానవముఖ్యుఁ
డాతబసి తాపసకేగి నిదేటితత్వమో । మానినిరూపసంపదల మానిచి ఘోరతపంబు
నీక్రియం । బూనినసౌఖ్యమేవిధము పొందెదు మానుము వెఱ్ఱిచింతలన్ ॥

క॥ రావణుఁడందురునను నీ । సేవకులోఁగొనినసుఖము చేకురునిటు ర । మ్మా
వనితయనుచుబలిమిన్ । కావరమునదానిగవయఁగానుదినెంచెన్ ॥

ఉ॥ ఆసురనైరిచేష్టలకు నప్పుడెకోపము లుప్పతిల్లగా । భూసురకన్యకాతిలక
బోయెనుదూరమురావణుండు మే! రాసల కేరబోయి చలి నట్టిబలంబునబట్టుకున్న స ।
దాగ్నిసముజెందివాని పడదాపెరుకోధత రాగ్నిమండగన్ ॥

ఉ॥ ముట్టితివేలహీనసను మోహముచేతసు దేహమేల నీ । పట్టునజీవముల్
వదలి పంకజనాభునిశూశినీకులం । బట్టివధింపజేతునని యగ్నినిముందగజేసిదానిలో ।
నట్టిప్రవేశమయ్యె హరినాత్మదలంపుచు బాలదేహముల్ ॥

వ॥ వాడును యవమానమనస్కుండై ప్రమదాజనంబుల ధైర్యంబున కచ్చెరు
వందుచు నిజపురంబునకుంబోయె నత్తాపసాంగనయు ॥

ఆ॥ తనువుబాసిపోయి దైవవశంబున । లంకలోనసరసిలలితమైన । పంకజంబు
నందు బాలయైవసియించె । రావణునకుచేటు రాదలంచి ॥

వ॥ అంత దశకంధరుండు । భుజంగప్రయాతము । పురా రాతికిన్నిత్య పూజా
విధానంబు రాజిల్లగా సేయ పువ్వుల్ హరింపన్ । సరాన్ సరోజాతనంపెంగలున్ సే ।
వరాజిందగన్ దోల వారంతలోనన్ ॥

క॥ సీతగలమడుగులోపల । నాతుకులై పూలుగోసి నవియల్లను సం । కేతముగు
చోటనుంచిన । ప్రీతిన్ రావణుడుగారి ప్రియునర్చింపన్ ॥

ఆ॥ పూలనెల్లనెత్తి పూజింపవోడగాను । భక్తిచేతశివుని భావమందు । నిలిపి
నామములను బలుకుచునొక్కొక్క । దళము వేయుచుండె దశముఖుండు ॥

క॥ దశకంఠుకమలంబుల । పశుపతినర్పించుచుండ పద్మంబున సా । దృశ్య
యగు లక్ష్మింబోలిన । శిశువక్కతిఁగలుగపువ్వుచే భరువైనన్ ॥

ఉ॥ అచ్చెరువందిపుష్కరము నప్పుడెవిప్పితదంతరంబునన్ । లచ్చికిసాటియైన
వవిలాసినిబాలికెగాంచివేగమే । తచ్చరితంబులన్నరయ దానవవిప్రులబిల్వబంచి వా ।
రిచ్చుఫలాత్మతల్ గొని సురేంద్రవిరోధి వచించెవారితోన్ ॥

క॥ ఈబాలామణిమననగ । రాబాహ్యసరోవరంబు రాజీవమునన్ । పూ బాణు

తేజవలెనే । చేబరువైపోకముందీనిచే మసకెల్లన్ ॥

మ॥ శుభమే తాబుధవేత్తలార చెపుడాశుభాంగియీబాలికన్ । విభవంబొప్పగ రక్షసేయువలె నావిశ్వాసమేపారగా । ప్రభవించెంగమలంబునందు తెలియన్ పద్మాక్షి ముందెవ్వరిన్ । విభుగాఁబొందునొ తల్లిదండ్రులెవరో విన్పింపుఁడద్యంతముల్ ॥

వ॥ అని ప్రశ్నసేయుచున్న నిశాచరనాథునకు బ్రాహ్మణులొక్కముహూర్తంబు యోచించి యిట్లనిరి ॥

క॥ మదిరాక్షివలనలంకా । సదనంబులఁగూడిరక్షస్సంగముతో । వదలక దహనంబగు న । య్యాదనుజాధీశ దీన నాపదగలుగున్ ॥

ఆ॥ వనితబుట్టినట్టి వార్తలువిన నిష్టమేమివినుమురాక్షసేంద్ర మున్ను । తపము సేయుచున్న తాపసబాలక । బలిమిచేతనీవుపట్టుకొనిన ॥

వ॥ నీచేతనవిడిపించుకొని యగ్నింబ్రవేశించి దేహంబువదలి నీకుమృత్తిగాలంకం జన్మించియున్నది దీనింజంపుటకు శిశుహత్యారూపకంబైన పాతకంబుసిద్ధించుం గావున నొక్క యుపాయంబువినుము ॥

ఆ॥ పెట్టెలోనబెట్టి గట్టిగాబిగగట్టి । జలధిలోనవిడువ సాగిపోయి । మునుగ కున్నెపెట్టె మున్నీటిలోపల । భీతిదొలగుచిన్ని బిడ్డవలను ॥

వ॥ అని యుపదేశించిన దశముఖుండొక్క పెట్టియందెప్పించి యబ్బాలనందు పదిలంబుగానుంచి సూత్రంబులచే గట్టించి రాక్షసకింకరులవలన రత్నాకరంబున వేయించి నిశ్చింతుండై యుండె పెట్టియు తరంగంబునంబడి మునుగక వాయువశంబున మిథిలానగరసమీప భూమింజేరి మృత్తికచేకప్పంబడి నెవ్వరికింగానరాక ధరియం దణంగి యుండెనంత ॥

క॥ జనకుడుజన్నముసేయుట । కనిభూమిందున్నచుండ గావాగలిము । క్కున దగిలికొనియెపెట్టియ । గన్పించెనుహాలికులకు గ్రక్కునవారల్ ॥

మ॥ చనిభూకాంతునితోడజెప్పిన మహాశ్చర్యంబుతోనప్పుడే । మునులున్మంత్రులు పౌరులుంగదలి సంపూర్ణాత్మకోత్సాహులై । వెనువెంటంజనుచుండవచ్చికనె యుర్వీగర్భమైవెల్గుచుం । దనసమ్మంధముమృత్తికాయుతము చిత్రంబైననాపేటికన్ ॥

వ॥ కని డాయంజని యప్పేటికందెప్పించి యందరిముందరంబెట్టించి మునుల యనుమతంబునం దెరపించినయందు ॥

క॥ కంధిసుతబోలునొక పు । ష్పంధయనిభచికురదాని యందునకళలన్ । సంధిలుశిశువుంగని ॥ సి ॥ మది । బంధురముదితాత్ములైరి పరమమునీంద్రుల్ ॥

వ॥ అంతనాజనకక్ష్మావరుండు ॥

ఉ॥ పెన్నిధిగాంచినట్టి కడుపేదవిధంబుననాత్మబాంగియా । కన్నియనప్పుడెత్తుకొని కౌంగిటజేర్చి ప్రమోదమొప్పగా । గ్రన్ననస్నాతుడై యధిక రమ్యదుకూల విభూషణావళుల్ । చెన్నుగదాల్చిభూజనులు సేయునుతుల్ గైకొంచుగారతన్ ॥

వ॥ ధరణీసురవరులకు గోభూహిరణ్యరత్న గజతురంగాందోళికాది దానంబులొసంగి మంగళతూర్యంబు లుప్పొంగ నబ్బాలామణిందోడ్కొని నిజసదనంబు ప్రవేసించి పురోహితాయుక్తుండై యక్కుమారీరత్నంబునకు లాంగలసంజనిత యగుటం జేసి సీతయను పేరిడి భూదేవోత్తములం గాంచి మహాత్ములారా యిక్కన్యకా తిలకంబునకు జాతకంబునిరూపింపవలెననిన వారలిట్లనిరి ॥

సీ॥ మనుజేశయీసుకుమారాంగియతిధన్య యదిజబోలెకల్యాణవతియు । వలనొప్పవాసరస్వతిబోలెసత్కళా వతియునుభార్గవివలెనెయతుల । సౌభాగ్యవతియునిర్జరమాతృకయుబోలె సుప్రజయునునిందిరవతీబోలె । కడుభోగవతివిచక్షణయు నరుంధతి తెరగునపతితపతివ్రతయు । నగుచువర్ధిల్లునీయవ్వ యఖిలలోక । మాతయంచిత భూరివిఖ్యాతిత న । మేతయీ యిందుముఖికిలక్ష్మీవరుండు । వరుడుగాగలవాడు ధ్రువంబుగాను ॥

వ॥ అని జాతకర్మంబుజెప్పిన జనకుండావిప్రులపూజించి వారలనిజమందిరంబులకు బోవంబనిచి సుఖంబుండెనంత నక్కన్యకయు దినదినప్రవర్ధమానయై యొక్కనాడు సఖీజనంబులం గూడుకొని బాణాసనాగారంబునకుం జని ॥

క॥ బలసూదనాదియాది । త్యులువిస్మయమందునటుల యుర్వీసుతయా । కుల-భూధరంబుచలవున । విలసిల్లెడు విల్లుదాబ్రవీణత నెత్తెన్ ॥

వ ఆసమయంబున ॥

క॥ ధరణిసుతయిప్పుడెత్తిన । వరచాపంబెక్కువెట్టు వరబలుడేయీ । తరుణాబ్జ పత్రనయనకు । వరుడగునిజమరుచుగగన వాక్కుబలికెన్ ॥ [margin, illegible]

తే॥ యిట్లుబలికిన నమ్మిథిలేశుడలరి । పరగన శివుని భావమందు, [illegible] నరాజంబు నెక్కువెట్టు । నతనికేనిత్తుబాలిక ననియెన

క॥ జనకుండునెపమొనర్చుట । జననాథతనూజులెం చనుదెంచి శరా । మెత్త నోడియరిగిరి । మనకులదాధనుపు ననిమి మనములరంగన్ ॥

వ॥ అవనినందనం జేకొనియెనని చెప్పి నెండియున్నిట్లనియె నట్లుజనకునిం ప్రార్థనం గొన్నిదినంబులు మిథిలలోనుండి యంత ॥

సీ॥ అజసూనుడొక్కనాడమ్మిథిలేశుని యనుమతిగైకొని యాతడనుప । నిజవధూయుక్తుడై నిఖిలసేనలుబంధు మిత్రులుసచివులు మేదినీశ । సంఘంబుతనతోడ

చేతనున్న కార్ముక ♦ మాచక్రిధరుండుబట్టె నాదియుగమునన్ ♦

వ॥ పూర్వంబున దేవతలు హరిహరాదులు బలాబల పరీక్షార్థంబై యుద్ధంబులు సేయుంపందలంచి బ్రహ్మచేధనువులు సమానసారముగా సృష్టిసేయించి వారలకిచ్చి సంగరక్రియారంభులను గావించిరంత విష్ణుండధికుండై శివుండు కొరతవడియుండె నప్పుడు సంగ్రామంబులుచాలించి శైవంబగు ధనుస్సు మైథులునకు సంప్రాప్తంబై జనకునింటఁబడియుండె నీచేభగ్నంబయ్యె వైష్ణవధనుస్సు ఋచీకుండు మొదలగువారి నుండి భార్గవులెల్లధరించి యిప్పుడు నాస్వాధీనంబై యున్నది యిది కార్ముకంబు విరచిన భంగి దీనిం భంగంబుగావింపుము లేకున్న నాతో ద్వంద్వయుద్ధంబునకు సన్నద్ధుండగుమని పలుకుచున్న పరశురాము వచనంబులాలకించి రఘురాముండు ॥

ఉ॥ కార్ముకమందిరాఘవుడు గ్రక్కున నారి బిగించితోడనే। భస్మవిభూషితంబులగు బాణములందమరించినొంచె న। త్కార్ముకలాపజాలి గరకంఠశరాసనభేది రాముడా ధర్మమునెత్తినంచు జమదగ్నికుమారుని మోముచూడగన్ ॥

వ॥ అప్పుడు క॥ జమదగ్నిసుతుడు రాముడు। క్రమమున గర్వంబు మాని కాకుత్స్థునితో। సమమైనధనువులను న। క్రమమున విరచితివినీవు సనుమెవ్వరోకో ॥

వ॥ పూర్వంబు క్షత్త్రియులనెల్ల వధియించి సిద్ధరామండలమెల్ల కశ్యపమునీంద్రునకు దానంబొసంగితి నింకభూతలంబున నిలచుటకుతగవులేదు పోయివచ్చెదనని చెప్పి ప్రదక్షిణంబుగా తిరుగుచు భార్గవుండరిగిన యనంతరంబ రఘువీరుండు వినమ్రులుండై నిలచియున్నతండ్రికిట్లనియె ॥

ఉ॥ భార్గవుడేగె గర్వమెడబాసి మహేంద్రముజేర సైనికా। వర్గము యోధ్యకున్నడువవచ్చు భయంబది యేల సత్క్రియా। మార్గుల కేలయాపదలు మానక యుండు భవత్ప్రతాప సం। సర్గముచేజయంబగుట సాధ్యము తండ్రిచలింపనేటికిన్ ॥

వ॥ అనివచియించుచున్న రామచంద్రుని వచనంబులాలించి పంక్తిరథుండానందభరితుండై కుమారునింగౌగలించుకొని యిట్లనియె ॥

క॥ భృగువరునెట్లుజయించితి। వగణితశూరుండు రాముడనగా మనకున్। జగమెరుగు మృత్యువాతని। నుగతనమేరువ్యోకాల మహిమ విధంబున్ ॥

వ॥ అనిపలికి కుమారుని పునఃపునరాలింగనంబుల యానందబాష్పజలాభిషేకం బొనరించి సేనల నడువనియోగించి ॥

ఉ॥ చేరెనయోధ్యపట్టణము సేనలతోడ పతాకశోభితా। గారములున్న శేషజనకల్పితద్వారబహిఃప్రదేశ శృం। గారనిబద్ధతోరణ వికాసితమౌక్తికచూర్ణరంగవ। ల్లీరచితంబు భవ్య కదళీయుత స్తంభ విరాజమానమై ॥

సీ॥ ఏవీధిగనుగొన్న నిభరాజమదసిక్త కర్దమశీతసంకలితమగుచు । యేసౌధ మీక్షింప హేమకుంభ ప్రభా సంకీర్ణగోపురజాలమగుచు । యేదిక్కు జూచిన హిమ కరమణిపీఠి కలనొప్పు వేదికాస్థలములగుచు । శేతావృజకికింపసింధురాకమునికి వాస యోగ్యంబైన వసుధయగుచు । వకుళమందారమల్లికా నికరపుష్ప । తరులతావాల మైన మందిరములగుచు । సాగరోపమభేయ విస్తారవిపుల భూషణంబగుసాకేతపురము నొప్పె ॥

వ॥ ఇవ్విధంబున నలంకారంబుచే శోభిల్లుపురంబు ప్రవేశించు సమయంబున ॥

ఆ॥ పౌరులెల్లగూడి బహుళమంగళతూర్య । నినదములుజనంగ మనములలర । యెదురువచ్చి కాంచి రిక్ష్వాకుకులసుధా । కరునినిశిచరాంత కరుని హరిని ॥

వ॥ ఇట్లు నాగరులెల్లంగలసి బహుమానంబులిచ్చుచు భూసురాంగనలు నివాళింప నెదురొక్కని పురద్వారంబు దరియంజొచ్చి రాజమార్గంబునం బోవునప్పుడు ॥

క॥ జనకజరాములపైకుం । దనళినచామంతిజాజి తగు చంపక చం । దనసితుళ కుసుమములు బో । రనగురిసిరి మేడలెక్కి రూపమసీమ ॥

వ॥ ఇట్లు సౌధంబులయందు నిలిచి పురజనంబులు పుష్పవర్షంబుగురియ మంద గమనంబున నగరుప్రవేశించి రథంబులందిగి లోపలిమందిరంబునకుంజని ॥

సీ॥ భూసురాశీర్వాద పుణ్యాహములతోడ పుణ్యసువాసినీపూజతోడ । పూజాష్టలోమాని బుధసత్తములతోడ విబుధులుపైజల్లు విరులతోడ । విరులదండలుజుట్టు వేశ్యాంగనలతోడ । వేశ్యాంగనలగానవిధముతోడ । విధము రాజిల్లించు వేదమంత్రముతోడ మంత్రతంత్రక్రియా మహిమతోడ। మహిమతపయోగనిష్ఠ సమాహితుండు హితపురోహితుడగుబ్రహ్మసుతుడు రాజ । సతులుసతులతో మాగధ నుతులునొప్ప నొప్పుగాజేరెరాజ గృహోత్తమంబు ॥

వ॥ ఇట్లువసిష్ఠుండు నారాజకుమార వధూవరుల నూతన గృహప్రవేశంబు గావింపంజేసి పదంపడి నిశ్శేషంబుగా కార్యంబులెల్ల సక్రమంబుగా జరిపియున్నంత ॥

ఉ॥ విందులుబెట్టెరాజు పృథివింగలమానవకోటికెల్ల సం । క్రందనవైభవం బెసగ రాజులనెల్లబహూకరించి వా । రింటగనంపిమానులకు ప్రీతిగబ్రాహ్మణ వైశ్య పాదజా । బృందముకెల్లకానుకలు పేదలకిచ్చియనంతరంబునన్ ॥

క॥ లేదనకసాధుజనులకు । మోదంబునదశరథేంద్ర భూపాలుడు న । త్యాదరమునవస్త్రంపీ । నోదనములనిచ్చియుంపె నుత్సాహమునన్ ॥

చ॥ సుతులకు వేరు వేరుగను సుందరమందిరముల్ఘటించి నీ । సతులనుగూడియుండ్ర సరసంబుగదాసిజనంబుగొల్వ సం । తతవిభవాభిరాములగు ధారుణిపాలకుమార శేఖ

రుల్ । హితమతులైనభక్తిఁగ మక్ష్మాపతియాజ్ఞ చరింతురెప్పుడున్ ॥

వ॥ ఇట్లానందభరితులై కొడుకులుకోడండ్రు నెల్లప్పుడు ననుకూలంబుగా భక్తిపరిచరింప నొక్కనాఁడు భరతుంజూచి యిట్లనియె ॥

క॥ మీమేనమామ కేకయ । భూమీశ్వరుఁడు కడునీవు బోవుటనడిగెన్ । క్షేమము నబోయివారల । ధామంబున కొన్నినాళ్లు తగనుండుమలన్ ॥

వ॥ శత్రుఘ్నుండుతోడ రాజని మీమాతామహుని మనంబురంజిల్ల కొన్నిదివసంబులుండి పదంపడి నాచే నాహ్వానంబు సేయంబడి పునరాగతుండవు గమ్మనిచెప్పి యుపాజ్ఞ్యనకు బహుమానంబు గావించియంపిన భరతుండు తల్లులకుతండ్రికి యన్నకు వందనంబాచరించి యాలింగనంబొనరించి శత్రుఘ్నుండు వెంబడిరా కేకయపురంబునకు మాతులునివెంబడిం జనియె దశరథుండు సంతోషమానసుండై ధర్మంబుదప్పక భూపరిపాలనంబు సేయుచుండె మరియును ।

ఉ॥ రాముఁడువిష్ణుఁడవ్యయుఁడు రాజకులాంబుధి పూర్ణచంద్రుఁడా । భూమిజ లక్ష్మియేజనక భూపతికిన్ సుతయయ్యెవింటివే । తాముపురావదంపతులు దైవతకార్య వశంబుచేత నీ భూమినిమానవాకృతిగ బుట్టిరినూతనులైన దంపతుల్ ॥

వ॥ అనియుమహేశుఁడు పార్వతీసతికి రామచరిత్రంబు వ్యాఖ్యానంబు జేసిన తెరంగున సూతుండు శౌనకాదులకుంజెప్పిన తద్వాతీవృత్తాంతంబడుగుటయు ॥

శా॥ పారాశర్యవచస్సుధాకలిత శబ్దబ్రహ్మతత్త్వార్థవి । స్తారోదారసుపర్వ భూజబహుళ శాస్త్రజ్ఞధర్మాన్వితా । ధీరాభాబ్ధివిచారఖండన గుణదివ్యప్రభావాప్ర సం । గారంగాఖ్యవికుంఠధామ భజనాకల్యాణ సంధాయకా ॥

క॥ ఆచార్యపురుషవర పూ । ర్వాచార్యవిశేషసూక్తి యాదరణమతీ । ప్రాచీన వంశవైదిక వాచాపరమార్థసుగుణ వైష్ణవసుజనా ॥

మాలిని॥ సరసవచనసారా । శాస్త్రవిన్యాసకారా । పరమతజితశూరా పావనాంతర్విచారా । ధరసురజనమాన్య ద్రావిడామ్నాయపూర్ణా । హరిచరణ శరణ్యాహ్యాత్మ విద్యాప్రవీణ్యా ॥

గద్య ॥ ఇది శ్రీభద్రాద్రి రామచంద్ర వరప్రసాద లబ్ధకవితావిచిత్ర యాపస్తంబ సూత్ర శ్రీరుమనామాత్య పుత్ర గౌతమగోత్ర ప్రసిద్ధసిద్ధనమంత్రి ప్రణీతంబైన శ్రీసదాశివ రామాయణంబను మహాకావ్యంబునందు అంగదేశచరిత్రంబును తాటకాసంహారంబును విశ్వామిత్రుండు రామునకు శస్త్రాస్త్రంబులొసంగుటయు వామనచరిత్రంబును రాముండు మారీచసుబాహులనోడించి గాధేయునియజ్ఞంబు గాపాడుటయు కుశవంశ చరిత్రంబును క్షీరసాగరమథన కథనంబును మరుత్తులజన్మప్రకారంబును సుమతి చరి

త్రంబును అహల్యా శాపవిమోచనంబును విశ్వామిత్రుండు రామాదులతో జనకుని యజ్ఞసదనంబున కరుగుటయు జనకసంభాషణంబును శతానందుండు రామునకు విశ్వామిత్రుని చరిత్రంబుజెప్పుటయు విశ్వామిత్రుండు తపంబు సేయుటయు త్రిశంకోపాఖ్యానంబును అంబరీషచరిత్రంబును మేనకాసమాగమంబును రంభశాపంబునొందుటయు విశ్వామిత్రబ్రహ్మత్వప్రాప్తియు ధనుర్భంగంబును దశరథాగమంబునుసీతాకల్యాణంబును సీతాజన్మప్రకారంబును పరశురామ సందర్శనంబును అయోధ్యాపుర ప్రవేశంబును భరతప్రస్థానంబును ననుకథలంగల బాలకాండ ద్వితీయాశ్వాసము సర్వంబును సంపూర్ణము ॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

—:( శ్రీసీతారామచంద్ర పరబ్రహ్మణేనమః ):—

# అయోధ్యాకాండము ఆరంభము

శ్రీరామచంద్ర పాదం । భోరుహషట్పద వరేణ్య బుధసన్నుత శ్రీం । గారాకార సుచరిత వి । హారామ హోదార వేంకటాచార్యవరా ॥

వ॥ విన నవధరింపుము సూతుండు శౌనకాదుల కిట్లనియె । నట్లు దశరథ భూనాయకుండు రాజ్యంబు సేయుచుండి యొక్కనాడు॥

సీ॥ సకలభూనాయక సందోహము వసిష్ఠ వామదేవాదులు ప్రేమదనరు। బాంధ పుత్రమిత్రులు పరిజనవర్గంబు కవులు విద్వాంసులు గాయకులును । వందిమాగధులు చెన్నొందెడు హితులును సందష్టమయ్యు నాస్థానమునను । దనరంగ నిందునియును పునరత్న సింహాసనమునను నెయ్యంబు మీర । పరగకొలువిచ్చి కూర్చుండి పటుతరోక్తి । మనములో పలనధిక సంభ్రమ మెలర్ప । నఖిలజనములువినుచుండ నయ్యరుంధ । తీ ప్రియునితోడనంచితస్థిలినిబలికె॥

చ॥ ఇరవుగధారుణీస్థలము యేలితి సూనులగాంచి తిఁ మహీశ్వర నివహంబులఁ దగిన సంగతి చేసరిగొంటి భూరి భీ । కరతర శత్రువర్గముల కయ్యములందుల బిల్కుమార్చితిఁ । పరగగ దానధర్మములు బాల్పడి చేశితి పెక్కు భంగులఁ॥

క॥ అరయదనిశితి ధరణీ । భారంబున వృద్ధనైతి భావములోనం । గోరికయొక్కటిగలదిక । వారకనది చిత్తగించ వలయును మీరల్ ॥

వ॥ అది యయ్యెడియుం జేసి ॥

చ॥ పరమదయావిధేయుని శుభప్రదునార్తశరణ్యమూర్తి భా । సురతర చారుకీర్తి పరిశుద్ధగుణాఢ్యుని సత్యసంధు నం । బురుహహితాన్వయాంబునిధి పూర్ణసుధాంశుని రామచంద్రుని । స్థిరమతి రాజ్యభారకుని జేసె దనంచు దలంతు నాత్మజుణ్ ॥

వ॥ వసిష్ఠ వామదేవాదు లట్లయనుమతించిరి తక్కిన సభగల యట్టివారలం దరును పరమానందభరితులై రి యంతనాభూపాలుండు రామచంద్రుని రావించి యుచితాసనంబున గూరుచుండ నియమించి గొంతవడికి నతనితో నిట్లనియె॥

మ॥ క్రతువుల్ జేసితి ధాత్రియేలితిని లోకఖ్యాతిగా శాత్రవ। ప్రతతిం దోలితి నాహవాంబునను శుంభద్విక్రమంబొప్పగా । వ్రతముల్ ధర్మములాచరించితిని శేవణ్ వేరుపెంపెక్కితిణ్ ! సుతులణ్ మిమ్ములగాంచితిణ్ ఘనుల వంశోద్ధారులం ధీరులణ్॥

గీ॥ రామరఘురామ సద్గుణస్తోమ పుణ్య। శ్యామరిపు భీమ దేవతాసార్వభౌమ యింకధరయేలగానోప నెలమినిన్ను । రాజుగా జేతు మహిత సామ్రాజ్యమునకు॥

వ॥ అని మరియును॥

సీ॥ పరకాంతరతి దలంపకు జూదమాడకు పానంబుగూడదెప్పట్టులందు । వేటలాడగబోకు మాటలాడుతరి పరుషవాక్యంబులు బలుకకుండు। మపరాధమునకు తగినట్టులదండింపు మెల్లవేళలను నీయుల్లమునను । ధర్మమార్గింపుము ధరణిలోప్రజలచే నరినోవ్వగొనకుము నవనిసురల । దైవతములంచు దలపుము తలపులోన । మంత్రిజనములు నాప్తులు మహితగతుల । చెప్పినట్టివి నీతులు చవులజొనుపు। మహితజనముల నమ్మకు మరయ నెందూ ॥

క॥ కరుణదలుకొత్త దీనుల । నరయుచు రక్షించుమెట్టి యహితుండై నా । శరణనివచ్చిన గావుమి । ధరణీశులకదియు విహిత ధర్మంబగుటణ్ ॥

గీ॥ సురుచిరంబగునెల్లి శుభదినంబటుగాన । నేమమొదవు కొరకు సీలమాత్మ । దనర జనకరాజతనయతో గూడంగ । నుపవసించియుండు మురుగుణాఢ్యా॥

వ॥ అని పల్కి రామచంద్రుని నిజనివాసంబునకుంబోవ నియోగించి సుమంత్రునింబిలచి పట్టణాలంకారంబు సేయ నియోగించిన॥

సీ॥ ఘనతరరాజమార్గంబులు వీధులు మహనీయ్య యాస్థాన మంటపములు। నుచితస్థలంబులు యొప్పగా గావించి కస్తూరి నలికి విఖ్యాతిగాను । ప్రవిమల మౌక్తికరంగవల్లులుదీర్చి కుడ్యంబులోనర కుంకుమలుబూసి । ప్రకటిత మాణిక్యపల్లవంబుల తోరణంబులు మేలుకట్లలవరించి । హేమకలశంబులెత్తి యయ్యెడల మిగుల । జి

రులువాకిలియంతయు చలువ్రదనర । యఖిలజనులకు నానందమతిశయిల్ల । పుర ముశృంగార మొనరించి రురురయమున॥

వ॥ ఇట్లు పట్టణాలంకారంబు గావించి దుందుభి రవంబులు మంగళతూర్యంబులు జలంగ సకలమంగళద్రవ్యంబులు దెప్పించిరి రామరాజ్యాభిషేక మహోత్సవంబు గనవట్టి యొప్పె దశరథుండు వేగుటకు యెదురు సూచుచుండెననంత॥

క॥ దైవయోగమున నిర్జర । భూవల్లభుకడకు రామభూపతు కడకున్ । దేవ ముని యరుగుదెంచెను । దేవహితార్థంబుబూని తెరగొప్పంగన్॥

వ॥ ఇట్లుచనుదెంచి యుచితసత్కృతులు వడసి దేవారితో విన్నవించుటకు నొక్కరహస్యంబున్న యది యవధరింపవలయునని యద్దేవముని యతనికడ్గరి యొరులెరుంగక యుండ మెల్లన నిట్లనియె॥

చ॥ అనఘచరిత్ర నీయరుగనట్టి రహస్యములేదు నిక్కమై । నను వినుదేవ వల్లభుడు నన్నిటు బంచిన నేగుదెంచితి । య్యనఘుని విన్నపంబుగ దయామతివై విననాదరించి యే । యనువున నానతిచ్చెదరొ నమ్మొయిబాయ్యద నంచునిట్లనున్॥

సీ॥ దశకంఠుచేత బాధలజెంది విసివి నిర్జరసంఘములగూడి యరుగుదెంచి । క్షీరసముద్రంబు జేరి మీకెంతయు మొరయిడకడు దయాపరుడవయ్యి । రవికులంబున దశరథభూవిభునకు రామాఖ్యచే నుదయించి యసురవరుని । దండించి మీకు మోదంబుగావించెద ననియానతిచ్చిన యవ్విధమున । నెదురు సూచుచునున్నార మిదివరకును । నమ్మహాదైత్యు దెగటార్చి యశ్రమమున । మమ్మురక్షించు కార్యంబు మదిదలంచు । శ్రితజనాధార జానకీ చిత్తచోర।

మ॥ ధరణీ భారముబూని రాజవయి మోదస్ఫూర్తి బాలింపుచున్ । నరనాథుల్ గొలువంగ మీరలు మహానందంబు సంధిల్ల సు । స్థిరతన్ భోగములందు చుండినను మాదీనత్వమున్బాపి యా । దురి తాత్మున్ దెగటార్చి బ్రోచుటకు నాథుండెందు నుంగల్గునే॥

క॥ జలచర నరమృగరూపము । లలవడ ధరియించి మీర లరసిబ్రోవగా మెలగుదును కరుణజిప్పిన । వలదని వారింపగలమె వనరుహనయనా॥

వ॥ అనియనేక భంగుల నిద్రవివిన్నపంబుగా విన్నవించిన యాదయానిధి యిట్లనియె।

చ॥ వరుగుమునింత సెప్పవలదే నుదశాస్యుని గీటడంచి ని । జకులకు మేలొసంగు వ్యవసాయము బుద్ధిదలంచినాడ న । త్తెరగొనరించునంతకు మదింబరికింతు నె భోగపుంజముల్ । ధరణితలాధిపత్యమును తాపసవర్య యొకప్పుడేనియున్॥

క॥ సందేహింపకు మనుచు పు । రందరునకు జెప్పె పంక్తిరథుడనుపగ నీ । పెందల వనమున కరిగెద । నిందులకిది గురియమిథ్యయే బలుకుదునే॥

వ॥ అని యానతిచ్చి వీడుకొలిపిన నారదుండరిగె యాదయానిధి తలంపు తెలియం జెప్పిన నింద్రుండు సాంద్రానందచేతస్కుండై మహేంద్రమాయ నుద్దేశించి నీవయోధ్యాపురంబునకుం జని మందర కైకలందావేశించి రామభద్రుని రాజ్యాభిషేక విఘ్నంబాచరించు నట్టిబుద్ధి ప్రవరింపం జేయు మిదిలోకహితార్థంబు గాని యొండుగాదని యానతిచ్చిన యట్లచని వారియిద్దరియందు బ్రవేశించియున్నంత రఘురాముని పట్టాభిషేక విఘ్నంబాచరించుటకు నుద్యుక్తయై పూర్వవైరంబు దలంచి మంథరయను నది కైకకిట్లనియె॥

గీ॥ కైకసీమీద దశరథక్ష్మావరునకు । బత్తిగలదని చెప్పుదు బహువిధముల । మతినిబరికింపగ తడగ్రమహిషిమీద । కరుణగల్గిన యట్టులగానరయ్యె॥

క॥ కాదేనితనదు రాజ్యం । బాదయతో నేలయిచ్చు నవనీశ్వరుడ । త్యాదర మొప్పగ కౌస । ల్యాదేవి తనూజునకు నవాంబుజనేత్రా॥

గీ॥ సవతితల్లి పట్టి సర్వ సర్వంసహా భారమెల్లదాల్చి పాకవైరి । యట్లవిభవ మొందునకట మీభరతుండు । కుందుచుండ వలసె ఘోరదశను॥

చ॥ అనుటయు వెచ్చనూర్చి హృదయంబున బుట్టిన చింతబొక్కుచున్ । వనజదళాక్షితోడ బలవంతపుదైవము చైదులిట్లుగా । యని తలయూచి యాయువతి నాదరమొప్పగ గాంచి దానితో । నని యొతలంపులోన వెరవారయలేక విచారయుక్తయై॥

చ॥ అరయగ పుణ్యశీలుడు గుణాఢ్యుడు రాముడు పెద్దవాడు బం । ధురతర విక్రముండతని దూరముగా నొనరించి పిన్నయౌ । భరతుని రాజుజేసిన నృపాలుడు బంధులు నార్యులోర్తురే । మరియొక నేర్పుగల్గిన క్రమంబున నాకెరిగింపు మంథరా॥

వ॥ అని పల్కి తనకుతొల్లి భూపాలుండొసంగిన వరంబులు దానివలన జ్ఞాపకంబు గావించి॥

క॥ తలకొంగు ముడిచి నొపలం । గలయంగస్తూరిపట్టెగానిడి మదిలో । పల బిట్టుచింత సేయుచు । పలుమరు బొరలుచును నవనిపై బడియుండెన్॥

వ॥ అంత దశరథభూనాథుండమాత్య బంధువర్గంబుల నిజనివాసంబులకుం బోవనియోగించి తానునభ్యంతర మందిరంబునకుం జని యచ్చటగేకయరాజనందన విహరింప మికిమనస్తాపంబునొందుచు పరిచారికులవలన నమ్మగువయున్న దిక్కెరింగినవాడై యచ్చటికిం జారబోయి భూతలంబునంబడియుండుటకు విస్మయంబంది

మొగంపు పైగప్పుకొనిన చీరంబు దనకరంబునం దిగిచి కన్నీరుమున్నీరుగానుండు నా యిగురు బోఁణింగాంచి యిట్లనియె॥

క॥ అలివేణి యివ్విధంబున । నలుగంగతమేమి నీకు నవహితమునుదిర । దలకే కనుఁబ్రొద్దొరి । తెలియంగా బలుకు మున్న తెరగునవాకున్॥

వ॥ అనిపల్కి యమ్మగువ కరంబులు దనకరంబుల నవలంబించి లేవనెత్తి తొడలపై గూర్చుండం బెట్టుకొని కన్నీరుతుడిచి నిమనోరథంబు యెఱింగింపు మనప్పుడది యతనికిట్లనియె॥

క॥ నరవరోత్తమ పూర్వము । వరయుగ్మమొసంగితీవు నలరుగ వానిం । గరుణింపుమిప్పుడనుడా । తరుణికి వశవతియగుచు దశరథుడనియెన్॥

వ॥ మగువా నీమనంబునకెద్ది యిష్టంబట్ల యొసంగెద వేడుమనిన నది యిట్లనియె॥

గీ॥ జనవరోత్తమ వరములొసంగెదేని । రామచంద్రుని బంధురారణ్యమునకు । బంపుమిప్పుడ చతుర్దశాబ్దంబు లొకటి । భరతు నవనీశు జేయుమా పరగ నొకటి॥

క॥ అనియిట్లు కైక బలికిన । విని దశరథభూవిభుండు వేగమమూర్ఛ న్మునిగి యొక కొంతవడికిన్ । తను దానయ తెలిసియపుడు తనసతి కనియెన్॥

చ॥ తగుతగ విట్టుబల్కులని తాల్మిమనంబున నిల్వలేక ము । జ్జగములలో పలంగలుగు సారసనేత్రలు బ్రువ్వదిట్ట నీ । తెగువకుజొచ్చి పల్కెదు వె ధీజనవంద్యుని రామభద్రు భ । ద్రగుని వివేకరమ్యగుణ ధాముని కానకునంప నేస్తునే॥

ఉ॥ తల్లులలోననీయెడ ముదంబున మిక్కిలి బత్తిసల్పు రం । జిల్లు నిజానుజన్ములను చిత్తములోపల నొక్కరీతి గా । నెల్లడ గారవించు భార పెట్టుకొకాని యరుంగ రమ్యుయో । కల్లరి వైరఘూద్వహు జగన్నుత నిమ్మెయి బల్కబాడియె॥

క॥ మతిమంతుడు గుణవంతుడు। చతురుడు సద్ధర్మపరుడు శాంతుడు దాంతుం । సతుల ప్రీతాపుడగు రఘు । పతియెడనిటువలచితేని పాపముసుమిమ్మా॥

వ॥ అని మఱియును॥

చ॥ కువలయనేత్రి నీహితవుగూర్చిన సూనుడుగాని శ్రీరఘు । ప్రవరుడు యిట్లువానియెడ బల్కిన మెత్తురె నిన్ను నక్కటా । ప్రవిమల నీతిశాలియగు రామునిపో మునివృత్తినంచు భూ । ధవులు నాసించునట్టులుగ ధారుణి కానకునంప ధర్మమే॥

క॥ అనుటయుమదిలో రోషము । జెనగొనగా కైకబల్కె పృథివీవర రా ।

కానకుమునివై । యెటుగతినవ్వుడు రాము డొప్పినమదితోఁ ॥

ఉ॥ నీవిటుఁబల్కి దేమిటికి నెమ్మనిపుత్రకుఁడుండ నా ఫలం । బేవిధిమీరు పంచి నను యేనటులాగున వాతధర్మమా । నీవనజోద్భవాండమున నెవ్వడమాత్యుని యుక్తి బూని నం । భావనగాంచు రాఘనుడె పాపవిముక్తుఁడు ధర్మపద్ధతిన్ ॥

క॥ పదునాలుగేండ్లు కాదాక । పదునాలుగు వేలుగోరి పంచిననేని । హృదయా నందముతో నె । మ్మదికానలనుండువాడ మాఇతభక్తిన్ ॥

మ॥ జనయిత్రీ విను నీమనంబునకు హర్షంబర్థిం గోరునా । పనియేనట్టిస్వధర్మమున్విడచి స్వల్పంబైన యీరాజ్య మిా । దనుగాంక్షింతు నె భోగపుంజముల యాశం బొందు నేపోను నీ । వనుమానింపకు నావ్రతంబిదియ తథ్యంబింక వెయ్యేటికిన్ ॥

క॥ నాయట్టిసుతుఁడుగల్గిన । మీాయనుమతినడువవలదె మిక్కిలిభక్తి । న్నే యాచరింపకున్న న । పాయంబగుజూపెధర్మ పథమున కెందున్ ॥

గీ॥ తల్లిదండ్రి పంపుతాత్పర్యయుక్తుడై । యఘికనిష్టబూని యాచరించ । నట్టి వానిజన్మమదియేల వాడె జీ। వన్ముక్తుండు నిజముపసుభయంను ॥

వ॥ అదియట్లుండె నింకొక్కవిశేషంబుజెప్పెద ॥

చ॥ పగమక్కృపాలుడాఢ్యుడన పాయబలుండు వివేకదుర్యుడు । బుధహహి తాన్వయాంబునిధి పూర్ణసుధాంశుడగణ్యపుణ్యుడీ । శ్వరసమవిక్రముండు గుణవంతుడు శాంతుడుపాపభేది మా । భరతుడతండురాజగుట భాగ్యముగాదెతలంచిచూచినన్ ॥

క॥ వరబలుడాతడయోధ్యా । పురియేల నెకాదునిఖిల భువనంబులు దా । పరిపాలింపసమర్థుఁడు । పరమాప్తుడువాడు నాకు భక్తుడుసాధ్వీ ॥

వ॥ అనిమఱియును ॥

చ॥ జననివరంబువేడెనల సత్యముమైకొనితండ్రిబంపగా । వనమునకేగియుండు డట వంశశిరోమణిభల్లమయ్యెద్రినా । యనుజుఁడుధాత్రియేలునట నచ్చుటనన్మునిపాద పద్మ వం । తనమట యిట్టిమేలు ప్రియదంబుననందక రిత్తబుత్తునే ॥

వ॥ అని కేకయరాజనందన ప్రమోదాయత్తచిత్తంగా వించి శోకసంతప్తుండై దీర్ఘనిశ్వాసంబులుచ్చుచు ధరాతలంబుపైబడియున్న దశరథభూనాథుఁడగ్గరికేవ నెత్తి దండప్రణామంబులాచరించి ముకుళితకరకమలుండై యాతనివదనం బాలోకించి యిట్ల నియె ॥

ఉ॥ తాత్మవరదీనిమాత్రమున తాపరితాపమరణ్యభూమిన । ప్లైవశియింపగా జనద నిప్పుడిదేభరతుఁ ధరిత్రికా । తేవనుగట్టిపట్టము ఘటింపగజేయుము నైకకోశే నీ । భావములోనసూనృతము బాయగనీకు మొకప్పుడేనియున్ ॥

గీ॥ సుతులబడయవచ్చు చొప్పడరాజ్యంబు । బడయవచ్చు ధనముబడయ వచ్చు । ననఘసత్యవాక్యమున మెలంగినయపుడు । యఖిలసౌఖ్యకరములందవచ్చు॥

వ॥ అదియట్లుంటేని రాజ్యంబుదిగనాడి దారాపుత్రవిక్రయంబుగావించి యనేక విపద్దశలకోర్చి దిగంతకీర్తిఁ విశ్రాంతుడయ్యె కావున నీవునసత్యపాలుండవై కైకే యికి మున్నొసంగిన వరంబు లుత్తరంబుగా నిప్పుడొసఁగఁగూడుననిన నట్టి వాక్యంబులకు మారుబల్కకయున్న జనకునకు వలగొని మ్రొక్కి కైకేయి పాదంబులకు ప్రణమిల్లి యరణ్యగమనోన్ముఖుండైన కుమారుని నీక్షించి యారాజేంద్రుండు శోకసంతప్తచిత్తుండగుచు సుమంత్రుని రావించి యతనితో నిట్లనియె॥

సీ॥ అనఘాత్మ రామచంద్రుని రాజ్యవిభవంబు కనుగొన నోర్వక కైకగనలి । యీకృత్రిమము జేసెనెంతయు నడికోర్చి యేమనగలదింక యిట్టి రాజ్య । మంతయు దా ననిజాత్మజుపోడి పాలించ నెమ్మది బ్రతుకనిమ్ము । సాకేతమునగల సర్వజనంబుల గజరథభటతురగముల నిఖిల । రత్నరాజిగొనుచు రఘువరువెంట నీ । వరుగువిపిన మునకుననుడు భరత । జనని రోషమొదవ జననాథుతోడ నో । మాటపక్కి పల్కె నుద్ధృతముగా॥

గీ॥ నరవరోత్తమ యటేని నాకదేల । యేనుగనుగొనరఘువీరుడిచట వల్క । లాంశుకంబులు ధరియించి యతివిధమున । జడలుదాల్చికనడవికి జనగవలయు॥

వ॥ ఇందులకొడంబడజాలవేని మిథ్యావచనుండవు గమ్మనుండు దశరథుండు క్రిమ్మర మూర్ఛాగతుండయ్యె నయ్యవసరంబున రామచంద్రుండు కైకేయి గనుంగొని॥

శా॥ అంబాభూవిభునింత పల్కుదురె తథ్యంబేను నీకోర్కెఁ జందం । బేజేసెద జింతజాయక ప్రమోదంబాత్మలోనుంచి శీ । ఘ్రంబే తేరగబంపు వల్కలములే గైకొందు నిర్యాణ ఖేదంబొక్కించుక లేదు నామది నయోధ్యంబాసి యుల్లేఖుడన్॥

వ॥ అని మరియును॥

క॥ అడవికి జనుటయెకాదీ । యొడయడు నియమించెనేని యోడకొందున్ । కడిగాగరళంబైనను । కడలిమైన జొత్తునిల్తు కార్చిచ్చుపయిన్॥

క॥ నాకునసాధ్యంబులు మ । ల్లోకంబులలేవుగాన లోనన్నివృత్తిన్ । గైకొని మెలగుటలెంతది । శోకసులునుతింపబోయి వచ్చెదతల్లీ॥

వ॥ అనిన సాంద్రానందంబు నొంది యక్కేకయరాజనందన తపోవేష యుక్తంబులగు వల్కలాంశుకంబులు మొదలుగాగల యవిదెప్పించి రఘుచంద్రుని ముందరంబెట్టించిన నతండు ముఖంబునందొంటికంటె తెలివిదోప తక్షణంబ సురభి

ప్రసూనగంధ బంధురంబగు వేణిబంధంబును నవ్యమృదులచారుచేలంబును ననఘ్యా భూషణంబులు దివిచిజటావల్కలాంశుకస్ఫటికాక్షమాలికెలు ధరియించి పరిలిప్త చందన పంకంబుమడచి నిర్మలభసితంబలదికొని కైకేయికి నేత్రానందకరంబగునట్లు రాజర్షి వేషంబుగైకొని యెనంత నప్పోథంబంతయు జనకి రాజనం్వ కనుంగొని లజ్జావన తాననయు శోకవ్యాకులచిత్తయగుచు గద్గదికస్వరంబున ప్రాణవల్లభున కిట్లనియె ||

క|| అనఘాత్మక నీవెంటం ♦ జనుదెంచెద విపినమునకు సత్కృపతోడ ♦ ననుగాంచి సమ్మతింపుము ♦ నినుబాయంజాల నొక్క నిముషంబైనన్||

చ|| అనుటయు రామభద్రుడు దయారసముప్పతిలంగ నప్పుడా ♦ జనకతనూజ మోముగని చారుసరోరుహనేత్రి నిక్కమీ ♦ వనిన తెరంగునిన్ను దిగనాడిచనన్ విహితంబుగామి నా | మనమునదెల్సి నాడని దిమజ్జన కాజ్ఞయుదైవ హేతువున్॥

వ॥ కావున నాకునిట్లరుంగంబనియున్నది దుఃష్టమ్ముగొరగ యుక్తంబగు నర ణ్యంబునకు నెవ్విధంబున జనుదెంచెద వదియునుంగాక।

సీ॥ అమరాహితులు దరుచందు వర్తింతురు దుర్గమంబులు జనుమార్గములు ను | లలిమీరగందమూలంబుల భ్యాగతశ్రేణి కొసంగగాజిక్కినట్టి | నాహారముగ గొని యాయాసమునదోర్చి కొనియట జంటులందున వసింపు | చును తృణశయ్యల చొప్పడ బవళింపుచును దురంతక్లేశమనుభవింప | వలయు నెండకు మంచుకు వాన కోర్వ | వలయునిక్కము జూవనవానమిట్టి | దీవు సుకుమారదేహివి యెట్టులోర్వ | జాలెదవు పోలదీమాట చంద్రవదన॥

సీ॥ అనిపల్కు రామచంద్రుని వాక్యములకును క్షోణీతనూజ యసూయజెంది| జననాథనీకుమజ్జనకుండు నీకిచ్చె కరుణాపరుండవు గాయటంచు | నిట్టివిధంబాత డెరుగడుగాబోలు నదియటులుండె వైశ్వానరుండు | సాక్షిగాగైకొన్న సహధర్మ చారిణి నునిచియొంటిని జననుచితమగునె | నిముషమేనియు నినుబాసినిలువనోప | నత్యమీమాటరిూపద సారసంబు | లావ వినునాకు నీయయోధ్యాపురంబ | దేల భోగంబులేల మేనేలసెపుమా॥

క॥ నీవు వెలియైన భోగము | లేవిధమున ననుభవింతు నెరిగింపుము రా | జీవాక్ష ధర్మమార్గము | నీవెరుగని యదియుగలదె నిక్కంబనుడున్॥

గీ॥ సానుకూలుడయ్యె జనకజరాకలన కపుడు దానినెరిగి | యన్నజార వచ్చి లక్ష్మణుండు వందనం బొనరించి | వదలకేను వెంటవత్తు ననుడు॥

వ॥ అతండతనికిట్లనియె॥

గీ॥ పరమహితుడు నాకు భరతుండు నీకంటె | భక్తుడతని యడలభక్తి గల్గి

గొలిచియుండుమనుడు క్షోణిజాధిపుపల్కు | లకును నియ్యకొనక లక్ష్మణుండు॥

గీ॥ అనఘనీవు మానివయ్యు నడవికి జన | నిచటనుండనాకు హృదయమెట్టుల
గొలుపుమేను మిమ్ముగొల్చియే తెంచెద | నాజ్ఞయొసగు మోదయానిధేయా॥

వ॥ అని భక్తిభంగులవేడికొనిన సుమిత్రానందనుని మనోవృత్తికి నచ్చుచు వంది యగుంగాకయని సమ్మతించి యప్పుడు॥

చ॥ రవికులవార్ధిసంజనిత రత్నము దివ్యవిరాజమూర్తి భూ | ధవకుల చక్రవర్తి వసుధాతనయా హృదయాబ్జవర్తి యై | రవిహితతుల్యకీర్తి మునిరాజమనోరథ పూర్తిదుష్టశా | త్రవ సమవర్తి రాఘవుడు తండ్రిని దగ్గర జేరినమ్రుడై॥

వ॥ దండప్రణామంబు లాచరించి చతుర్దశాబ్దంబులు చతుర్దశవారంబులట్లుగా వనవాసంబుగడపి యరుదెంచెదనని యారడంబల్కి కైకకు ప్రణమిల్లి యచ్చోటువాసి యవనినందన సుమిత్రాత్మజులం గూడుకొని కౌసల్య పాలికింజనుదెంచెనంత నక్కడ నయ్యతివ యతని పట్టాభిషేక సంభ్రమంబు చిత్తంబునం దళుకొత్త నందులకు విఘ్నంబు చెందకుండెడునట్లు విహితోపవాసంబుగైకొని దేవతాప్రార్థనంబు జేయుచుండి తనూజుండయ్యెడకు వచ్చుటవిని పుణ్యాంగనలంగూడి మంగళద్రవ్యంబులం గొని యెదురేగి యతనింగనుంగొని॥

క॥ యిదియేమి తండ్రినీవీ | యవనునమునివేషధారివై వచ్చుట నా | మది కిం జిత్రింబయ్యెడు | విదితంబుగ నీతెరంగు వినుపింపగదే॥

గీ॥ అనిన రామచంద్రు డవ్విధంబంతయు | నెరుగజాయ కౌసలేంద్రతనయ యగ్నియందు గ్రాగినట్టి సూదులు జోల | మోపినట్టులయ్యె మూర్ఛనొందె॥

వ॥ అంత నచ్చేరువనున్న కాంతలు భయభ్రాంతలై యరుదెంచి శిశిరోపచారంబుగావింప పెద్దతడవునకుం దేరి తనలోనిట్లనియె॥

సీ॥ తనయుడు కానకు జననెట్లు గనుగొందు కనుగొందు నెన్నడు మరలి రాక | నాపుణ్యమిది కాన నాపుణ్యజనుల సంఖ్యలు పాపచిత్తులు మెలగుచుండ్రు | వారిలో నేరీతి వర్తించు వర్తించు పంచాస్యభూధార భల్లుకశర | భాదిమృగంబులందనిశంబు వానిచేభయము జెందక నెట్లు బ్రతుకగలుగు | కలిగెబో నాకు తొలిజన్మఫలము నేడు | నేడనగనేమి దైవంబు నాడెవ్రాసె | నాడు దీనికి నెవ్వరినాడ నేల | నేలకైయుంతె బుట్టబోనిక్కముగను॥

వ॥ అని వెండియు॥

క॥ తనసుతుడన నాసుతుడన | గనువేరుంగలరె యకట కైకేయి మదిం | గను పెంచుకొనియెగా కీ | యనువున సద్గుణములెల్ల వారశిబోవ॥

సీ॥ కలనైన పొరుపెరుంగను గైకయా సుమిత్రా పుత్రులందు నాతనయునందు గలకూర్మితోనుండు తలపులో తలపులో ధర్మదేవతయును తానెరింగి। తేజాలు దీనికి తెలుపుడు జాయగా నేటికి యేటికి యిటులకైక ; తనబుద్ధిలోపల దలపక రాముని మునివృత్తిగైకొని వనములోన । నుండబొమ్మనె భరతుడు నుర్వినేలు।చుండ సీరుకు గన్గొని యోర్వలేక । సహితమొనరింపనిక్కమ యహితుడైన । నిట్టి పాపంబు నకు నొడిగట్టుకొండె॥

గీ॥ భరతుడేమి రామభంద్రుడైతేనియు । నేలయేలునందు కేలనిమ్ము। నాకు సంతసంబె నీ కుమారకు వన । వాసమునకు మదినివగతుగాని॥

చ॥ పతికృపగల్గెనేని నరపాలక వర్గము బారదోలి యీ। క్షితితలమెల్ల గాంక్ష మయిజేకొని యేలగరాదె దాసుఖ । స్థితిని నరేశుమన్ననలచే విలసిల్లి యనేక రత్న రా । జితఘనభూషణ ప్రతతి చెల్వుగ బెట్టగరాదె కైకదా ॥

క॥ ఈకుటిలత్వంబేటికి । మైకొనె కృపయించుకేని మదిలేకసయో। నా కొడు కుశాంతగుణ ర । త్నాకరుడౌ పెరిగి యెరిగి యఘసంయుతమై

వ॥ అని పల్కుచు నిట్టూర్పులుచ్చుచు కొంతవడికి నిజనందను ముఖారవిందం బాలోకించి॥

సీ॥ సవతిగావునను మచ్చరమాత్మబూని యీకరణిదావేడెనే కైకవరము । కామాంధకారుండు గావున సతిమీది మమతచే నొసగెనే మనుజనాథు । డఖిల మంత్రులు నయోధ్యాపురిజనుల్ వారి పై నెయ్యమాటందుల కియ్యకొనిరె । నృప వరులెల్లన నీతియెరిగియు నుర్వీశునకులోగి యూరకుండిరి । తండ్రి నీవైనగాని మీ తండ్రితోడ । పలుకగారాదెభ్రాతృదాభరతుడేల । నిమ్మవనవాసమునకు నేనేగ నొల్ల । తల్లిదిగనాడియిదినాకధర్మమనుచు ॥

క॥ తనయానీవిటులాగున । వనవాసముసేయబోవ వలనుగనదికా । ప్రాణి యుండంగాశక్యమే । వినుమేక్రియనైనమేను విడచెదనింక ॥

వ॥ అని పెక్కుచందంబులంగుందు జనయిత్రింగనుంగొని తల్లియిట్లేలవగచెద విదిదైవకృతంబు భూనాథ కైకలేమిసేయుదు రిది నెపంబుగా న నరణ్యంబునకుబోవుటకు నిమిత్తంబుగల్గియున్నది నీవింక మనంబుననొందుదలంపక యాజ్ఞాపింపుము పోయివచ్చె దననిన నప్పుడు ॥

చ॥ మనమునపుత్రతెంపెరిగి మాటికిబొక్కుచుపాపిదైవమీ । యనువున వైరులంగలశె నక్కటరాముడునన్ను డించి దా । జనగదలంచె నెయ్యది విచారము నేనికనెందుజొత్తు నేమనిమునియుందు కైకవదనాంబుజమేక్రియ గాంతునిచ్చటన్ ॥

వ॥ అని పెక్కుభంగుల దలపోయు కౌసల్యకు రామచంద్రుండు మ్రొక్కి వం
గాఁగలించుకొని డగ్గుత్తికతో నెల్లవేల్పులం బేర్కొని దక్షిణహస్తంబున రక్షగట్టి నీరాజ
నంబిచ్చి కుమారా నీకు నెల్లవెంట భద్రంబగు పోయిరమ్మని యాశీర్వదించి వినమితోత్త
మాంగుండగు సౌమిత్రి నేనునివిరి బాష్పాకులలోచనయై యున్నా మీ యన్న వెంట
నరుగందలంచితే మేలాడ వెసపోయిరమ్మని పల్కిన తదనంతరంబ॥

సీ॥ కోడలు మ్రొక్కినఁ గౌఁగిలించుచు నక్కున నుంచి యయోధ్యక్షితిజనకన్యపతి | యీ
రాఘవునకు నిన్నిచ్చుచో నిరవంద నాశ్రితపరితోషభావలయ మీత | జేలు నిక్కంబని
యిచ్ఛలోఁ దలఁబోకె గాని యీ రీతి నిక్కైకవృత్తి | మనుకాయగలదని మదిదలంపండయ్యె
తానొంకుదలచినదైన మొకటి దలచుననువార్తలిప్పుడు తథ్యమయ్యె | నేని జాయంగ
గలవారలెందులకును | వగలఁ బొందంగ పనిలేదు వారిజాక్షి | పోయిరమ్ము శుభంబులు
పొందెదీవు॥

ఉ॥ చెప్పెడిదేమి రాఘవుని చిత్తమెఱింగి మనంబునందు నీ | వెప్పుడు భక్తిగల్గి
జగమెల్లను నిన్ను నుతించునట్లుగా | నప్పగ సేవ సేయుము హితోక్తులు బల్కు మొకప్పు
డేనియుఁ | గప్పురగంధి వేసరకు కర్కశ కాననసీమలోపలఁ॥

సీ॥ అనిపల్కి యధిక దుఃఖార్ణవమగ్నమై మరగెడు జనని నామంత్రణంబు |
గావించి రామభూకాంతుండు సీతయు సౌమిత్రితోడ రా సత్వరమున | ప్రమదంబుతో
సుమిత్రాదేవి పాలికి చనుదెంచి మ్రొక్కి యాసాధ్వితోడ | తత్క్రమం బెఱిగింప ధరణి
పై బడి మూర్ఛ మునిగి యొక్కింత సేపునకు దెలసి | భరితశోకజనితపరితాపదందహ్య |
చిత్తయగుచు వగలచే గృశింపు | చుండె పెక్కుగతుల నూరార్చి పిమ్మట | నంత
లక్ష్మణుడు ప్రియంబుగదర॥

వ॥ మ్రొక్కుటయు నతనియాలింగనంబు జేశి కుమారా నీవు నురఘువతుని
వెంట నరుగందలంచితే యని యిట్లనియె॥

క॥ జలరుహనాభుడు రాముడు | కలశాంబోరాశికన్యకామణిసీతా | లలనవివి
న బయోధ్యగ | దలపుము చిత్తమున జను ముదము చేకూరుఁ॥

వ॥ అనిపల్కి జనకరాజనందన మ్రొక్కినం బొక్కుచు నక్కునం జేర్చి కన్నుంగ
వలన పారవారికణంబులు గురియ యిట్లనియె॥

గీ॥ నళినలోచన కేళి వనంబులోన | వెలదులనుగూడి విహరించు వేళయందు |
కందునీ పదయుగ్మంబు కాననమున | నడుచుతఱి పొక్కబొక్కవే యడదలోన॥

క॥ కొలయోగ కైకదానిటు | వలెనింకేమనగ గలదు పాపపువిధి యా | పొల
తుక నెకూడెనిజమే | ఖలులకు నెందునుసహాయ కత్వంబనుటల్॥

వ॥ అనిబహువిధంబుల వగచి కొండొకవడికి దీవనలిచ్చి పోయిరమ్మని వీడు కొల్పెనంత ॥

క॥ అనుజుడు జనకజయుం దో । జనుదేరగ రాజమాని చందంబున మో । మున తెలివిదోప రాముడు । మను జేశు గృహంబు వెడలి మనమలరంగన్ ॥

వ॥ వచ్చు నవసరంబున నరుంధతీ దేవితన జీవితేశ్వరుం జూరవచ్చి మునీంద్రా యిక్ష్వాకు కులంబున నిట్టి యొప్పమి వాటిల్లిన మీరలుపేక్షించుట యుచితంబకదా యనవుడ తండు జ్ఞానదృష్టిం జూచి యిది దైవకృతంబు నునఘుడీనికి వగవంబని లేదని పలికెనంత రఘుపతి యామునిదంపతులకు బ్రణమిల్లి వారల యనుజ్ఞవడసి సత్వరంబునా ॥

గీ॥ చారుచాపబాణసంఘంబు ధరియించి । పురము వెడలిచనగ పురజనములు పరిజనంబు నిఖలబాంధవా మాత్యులు ♦ నతనితో నచనుచు నప్పుడనికి ॥

ఉ॥ ఏమనఁ జ్చునీ దశరథేశలి సూనృతమబ్బు నంచు దా । భామినివాక్యములన్విని కృప రహితత్వ మంబూని సద్గుణ । స్తోమునిభానువంశకధి సోమునిరాముని వైరి గోత్రిసు । త్రాముని నెట్లుబొమ్మనియె దైత్యమృగాశ్రియమైన కానకున్ ॥

సీ॥ సవతిపై గల్గుమచ్చరమున గేకయ నరపాలసుతరఘునందనునకు నహితంబు గావింప నాత్మలోనూహించి యుక్తిసాధించెనే యొక నెపమున । తానునావిధమున ధర్మబాహిరుడయ్యె కామాంధకారంబుకతన జేశి । పుత్రరత్నము నీదిమైత్రివిసర్జించి యిట్టిసాహసమునకియ్యకొనియె । కైకననగనేమికారణంబింతకు । మూలమెల్లధరణిపాలవరుడె । నిక్కమితనివంటినిర్దయు లెందును । గలరెయరసిచూడ క్ష్మాతలమున ॥

క॥ యీరఘువంశాంబుధిలో । క్రూరుండితడుదితుడయ్యె కృచ్ఛితవృత్తిన్ । క్షీరాంబోధిజనించిన । ఘోరంబగునట్టి కాలకూటముపోలెన్ ॥

సీ॥ ఎవ్వడువినకుండనింతికియన్నడో వరమిచ్చినాడటవనితదాని । నిపుడు వేడిన దట యీ కున్నతనకది పాతకమటరామభద్రుబిలచి । యవనిసురోత్తము లఖిలభూపాలక పుంగవుల్ బాంధవుల్ భూజనములు । వినుచుండ రాజ్యంబుననుబ్రతిష్ఠించెద నని నిన్న బల్కి నేడాలిమాట । లాలకించియడవి కనుచుటయఘము గా । దటతలంపనిట్టియధిక పుణ్య । బోలఘనులుగలరె భువనత్రయంబున । తథ్యమితడుతన్ను దానపోలు ॥

క॥ కొడుకులులేరనితా బె । క్కిడుములబడికొన్నినాళ్ల గీనందనులన్ । బడసి సతిమీదివలపున । విడిచనుదయమాలినిట్టి వెంగిలిగలడా ॥

వ॥ అని మరియును ॥

క॥ సుతులకురోయకదా నీ । గతిద్రోహముదలచునట్టి కట్టశిఖరణీ । పతిమనల

మనగజూచునె । వెతలింతేకాకయనుచు వెండియుతమలోన ॥

సీ॥ తనయాడునరపాల తనయులుధరయేలు చుండగా శక్తిహీనుండపోలె । నీ తండ్రజనియెడు హేతువొద్దియెకాని పోలగాతానాత్మబుద్ధిలేని । బాలుడేనేడిరు బది మీదనైనను రెండేండ్లవాడతిధన్యు డెవ్వరేమి । సిద్ధక్రియలనిట్టు కేశిరోయటువలె గాదేని రాజ్యంబుకైకపట్టె । కిచ్చిపోవదలంచు నేయివ్విధమున । జటలువల్కములుదాల్చి సాధు వృత్తి । వలనుమీరంగ వెంగలివాని కరణి । తనకునిదియొక్క సత్యశాసనమటంచు ॥

క॥ అనివెండియురఘురాముని । గనుగొనిశోకంబులాత్మ గనలుకొనంగా । కనుగవనశ్రులుదొరుగగ । తనువులువడకంగనధిక దైన్యముతోడన్ ॥

సీ॥ హరినీలముల కాంతి దొరయుచుండెడు మేను మేనిసుందరము ప్రసూనశరుని । బుట్టజేశినయదిపోలునుబోలుపో నీతనిముఖముపూర్ణేందుశతము । శతముఖభూజనం జాత పల్లవముల సరివచ్చునీతని చరణయుగళ । మిభతుండములతోడ నెనయగునీతని కరయుగులసంతోషకరమొసంగు । నితనికనుగొన్న కనుగొన నితడుసర్వ । లక్షణంబుల పొగ్గు యీలాగునితని । తపసిబాగులుగైకొనివిపినమునకు । జనువిధంబేలవిధియించె ననజభవుడు ॥

సీ॥ అసదృశోన్నతవిక్రమాటోపధుర్యుడై తనరునీమేటికాతపసిసాబగు । కమ నియ్యయక్షకర్దమచర్చితంబగు నీతని మేనికాభూతిపూత । యతులితహేమదివ్యాం బరంబులుదాల్చి వర్తిలునితనికావల్కలములు । వరచారుమణిహార ధరుడీతడిమ్మహా ఘనునకాయిస్ఫటికములపేరున్ । రాజసంసేవ్యమానుడై రమ్యభర్మ । మంటపంబుల కొలువుండు మహితభద్రి । మూర్తియీధన్యుడీతనికాధూర్తమృగ ని । శాటసంయుక్త గహనసంచారభూమి ॥

గీ॥ అతిమృదులనవ్యపుష్పశయ్యాతలంబు । నందువేడుకబవళించునట్టియితని । చారుకోమలగాత్రమేచందమునను । నలవడగనేర్చుతృణశయ్య నరసిచూడ ।

క॥ తరుణారుణాబ్జములతో । నరిపోల్పగవచ్చునితని చరణంబులుదు । ష్కర మగు గహనపథంబున । నరుగుతరింబొక్కకున్నె హాజగదీశా ॥

వ॥ అనివెండియు ॥

ఉ॥ కైకవరంబువేడెనన గారణమేమిధరాతలేశ్వరుం । డాకమలాక్షికిచ్చెనని యాడగనేలవనప్రవాసమున్ । మైకొనినట్లుబాలకుని మూఢికనికార్యమెరుంగలేక లో । కైకశరణ్యమూర్తియగు నీరఘురాముడనంగనేటికిన్ ॥

ఉ॥ ఇంతకుమూలమబ్జభవుడేమరియొక్కడుగాడు జానకీ । గాంతులిరాజ్య వైభవము గన్గొనిమోర్వగలేకనాత్మలో । నెంతయువంతగుంది వెరవెద్దియుగాకన

కకెట్టిదు ♦ శ్చింతజనింపచేసెనుకు చేష్టలనాత్మలోయందనుగుణ్య చిత్తగన్ ॥

అనిమఱియును ॥

సీ॥ ఏకాతపత్రమై యీచతురాంబోధి వలయితంబైన భూవలయ మీత ♦ డేలు చుండగ మనమీపట్టణంబున సుఖముండికన్నులజూచునట్టి ♦ ఘనమైనపుణ్యంబు మును పటిప్రుట్టంగ నాచరింపంగలేమైతిమరయ ధర్మేతరులముసిద్ధంబట్లుగాదేని ధరణిజాధిపు డిట్లు తపసిసాబగు ♦ బూనిరాజ్యంబుదిగవాడి కానకుండ ♦ ఏవ్వదురవస్థజూతుమే యీవిధమున ♦ కఠినమానసులైనరాక్షసకదంబ ♦ మట్టులనుహృదయమునదైన్య మతి శయముగా ॥

వ॥ అన్నిపల్కుచు పౌరజనులందరు రామచంద్రునివెంట నరుగుచు గటకట నొందుచుండిరంత దశరథభూనాథుండు కుమారరత్నంబు లడవికిం జనువిధంబునకు దుఃఖింపుచు సుమంత్రునిరావించి రామునకురథంబునొనిపొమ్మని నియమించిన నతం డాయితంజేసి తెచ్చి రఘువరునిముందటనునిచి దేవా భవజ్జనకుండు దీనిపై నెక్కిపొమ్మని పుత్తెంచెననుండు మంధస్మితముఖారవిందుండై సీతాలక్ష్మణసహితుండై యారోహణం బుగావించి పౌరజనులుదీనాననులై తనయరదంబు పజ్జంజనుదేర నయోధ్యానగరంబు వెలువడె నయ్యవసరంబున జనకరాజనందన ముందరగానవచ్చు నుద్యానవనంబు గనుంగొని ॥

గీ॥ తనదుకమనియ్యకరమున ధవ్రనిబాహు । మూలమొదుచ్యనుదువ్రుచు మురి పెమునను । నల్లతరుసంఘమేమనమరుగునట్టి । కానయనిపల్కుటయును రాఘవుడు నవ్వె ॥

సీ॥ అంతనచ్చటదశస్యందనుండాకోస లాధీశవరసుతనాసురిత్రి । లనుగూడి తోడిబడఘనమగుశోకంబు తోడనునగరుదోడ్తోనవెడలి । వెడలెడునశ్రులజడినియా రాముని రథముగాన్పింపంగ రామికెంత । విలపింపుచునుమహా వేగంబుచనుచుండె నా సమయంబున నకటమండ । లంబు రూశనుమత్తగజంబులకును । మదము లింకెనుమరి యుత్తంబులైన । తురగములకెల్లకన్నీరు దొరగెదిక్కు । లందుగప్పెనుకావిరి యువసి వణక్ష ॥

గీ॥ మఱియుగమి కూడిబెట్టుగాపురజనంబు ♦ లడలజొచ్చిరియట్టియాహారవంబు నింగిముట్టెనుయంతేమమంగళంబు ♦ దోచియుండెనునగరంబు జూచుతఱిని ॥

క॥ అట్టిదిగ్నితనమదికి ది ♦ మట్టనిశోకంబుభయముప్పిరిగొన న ♦ ప్పట్టున మూర్ఛాగతుడై ♦ నెట్టన తెలివందినృపతి నెవ్వగతోడన్ ॥

వ॥ పురంబు వెడలి యొలుంగెత్తి సుమంత్రునింబేర్కొని యిదే మిమ్ముగూడ

వచ్చె దనరథంబునిలుపుమనుచు వెనువెంటనరుగ నప్పుడు ॥

చ॥ జనకునిరాక గాంచి రఘుచంద్రుడునిక్కమమానవుండవై హో ♦ జనకుడు వంతగుందుచును క్లేశమునొందెడునమ్మహీపతిం ♦ గనుగొనలేక తెంపుమడి గైకొని గొబ్బునబోవనిమ్ము తే ♦ రనుచునమాత్యుతోడ నపుడానతియిచ్చిన నాతడమ్మెయిన్ ॥

వ॥ యుగ్యంబులగు పగ్గంబులవదలిన నతిత్వరితగతింజనుచుండె వసిష్ఠుండా మనుజేంద్రుండాయవచ్చి నరేంద్రు యుప్రథంబున పిలపించుచు వెనువెంటంజనుట యుచితంబుగాదని నివారించెనంత దశరథభూనాయకుండు ॥

గీ॥ హాకుమారవర్య హాసుగుణాంబుధీ ♦ హాకులప్రదీపహామహాత్మ ♦ హా నృపాలతిలక హాసత్యసంకల్ప ♦ హామహానుభావ హాసుకీర్తి ॥

క॥ నినుగూడంజనుదెంచెద ♦ ననుకంపన్నిలుము కేక యాత్మజమాటల్ ♦ విని నట్టి దుష్టచిత్తుం ♦ డనితలపకుమానసమున నార్యస్తుత్యా ॥

సీ॥ అనికల్కి పుత్రమోహావేశమున ధరాతలముపై బడికడు దైన్యమునను ♦ పొరలుచుఘూర్ణిఘూర్ణితగాత్రుండయ్యు నొక్కింతవడికిగూర్చుండికైక ♦ గనుగొనికుల నాశకారిణిదుర్మతి కలుషభాజినినీకు కతననిప్పు ♦ డింతకార్యముబుట్టె నిట్టిదుశ్చారిత్రి వగునిన్నుజూడననహమింక ♦ మాటలేటికినీదుకుమారుడైన ♦ భరతుపట్టంబుగట్టి సంభ్రమముతోడ ♦ నుండురఘురాముబాసియు నుండనోప ♦ పూనివినుమెల్లభంగుల మేనువిడతు ॥

వ॥ అనికదలి సనుదెంచి నగరుసొత్తెంచి సెజ్జపై మేనువైచి నిర్వేణుండైయుండె నంత నక్కడరామచంద్రుండు పౌరజనసమేతుండై తమసాతటినీతీరంబు చారంజని యు రదంబుడిగ్గి యపరాహ్ణ సంధ్యాదిక్రియలు నిర్వర్తించి సుమంత్రుండు పల్లవంబుల శయ్య నమర్చిన దానిపై విశ్రమించె పౌరజనంబు లతనిందిరిగి రా వృక్షతలంబుల శయనించి యతనిసద్గుణంబులుగణుతింపుచు పరవశులై నిద్రించిరంత వారలుతనవెంటవచ్చు టకు చింతించి యర్ధరాత్రంబగుడు కౌసల్యానందనుండు సుమంత్రునిమేలుకొలిపి మన యరదంబు సాకేతపురంబునదిక్కుబోవనిచ్చి కొండొకదూరంబున కొండొకమార్గంబు నం బరపి తమనదాటింపుమనిచెప్పె సీతయుందానను తమ్మునితోడంగూడి రథారోహ ణంబుజేశిన నట్లకావించు దాతరంగిణిగడచి వేగుటయు కాలోచితక్రియలుదీర్చి వేద వతియు సరస్వతియునుత్తరించి యంశుమంతుండ పరగిరికి నరుగునవసరంబున ॥

గీ॥ అమరనదినీతటంబున శరిగిమొక్క । భూరుహాముక్రిందవిశ్రమిం నాభూరితేజు । డంతనక్కడపౌరజనాలిమేలు । కాంచిరఘువరుగానక శళవళించి ॥

సీ॥ దైవంబుదూరుచుదశరథుదిట్టుచు కైకయిట్టులజేశెగాయటంచు । కన్నీరు

పరవలుగావగనొందుచు కడువెచ్చనూర్చుచు జడనుపడుచు । పడపడవణకుచు ఎడి
మూర్ఛనొందిదారయ్యెడదెలసి హాహాయటంచు। లేచుచుదిక్కులుసూచుచుశిరములు
నూచుచు నొండొరులూరగొనుచు । నరదమేగినపద్ధతినరిగియరిగి । సర్వపాపఘ్నయగు
తమసాతరంగి । శకటముజేరియచ్చటినిలచియవల । జాడగానక నెంతేవిచారమొంది ॥

వ॥ రామచంద్రువియోగంబు సహింపనేరక యత్యంతదుఃఖాక్రాంతులై ధరాతలంబుపై బడి పొరలుచు నతనిలీలలుగ్గడింపుచు నేత్రంబులుమూడిచి యమ్మహాత్ముని సుందరాకారంబుదలంచి యోగులవిధంబునజొక్కుచు నారాజపరమేశ్వరుండు సీతాలక్ష్మణసహితుండై ముందరం బొడజూపినట్లయిన కన్నులుదెరచి తదీయ్యరూపంబు గానకచింతింపుచు మరలి యయోధ్యానగరంబున కేతెంచిరంత నక్కడ గుహుండను కిరాతవల్లభుండు కౌసల్యానందనుని రాకవిని సంభ్రమాశ్చర్యంబులు మనంబున బెనంగొన మహితవస్త్రాంబరాభరణంబులు పాయసంబులుగాని తెచ్చి యారాజేంద్రునింగాంచి నమస్కరించి యతనితపోవేషంబున కత్యద్భుతంబునొంది యిట్లనియె ॥

ఉ॥ రామజగన్నివాస మునిరాజుతెరంగమరంగబూని నీ । వీమెయినేగుదెంచు
టకు నెద్దిప్రయోజనమేర్పరింపు సు । త్రామనుతప్రతాప గుణధామ భవన్మహిమాబ్ధి
యెట్టిదో । నామముగెల్వనేరనివి కారజనంబులెరుంగశక్తులే ॥

ఉ॥ వంచనమింతలేక మునివర్గముమానసముంజెయించి ని । ష్కించనవృత్తిచే
మెలగి కేవలనిష్ఠ తపంబుసేయుచున్ । సంచితకర్మనాశమగు జాడలుగైకొనినీదు
మాయ మో । హించివసింతురన్నమము నెన్నగ నేటికికర్మబద్ధులన్ ॥

శా॥ పక్షీంద్రధ్వజనీమహాత్మ్యము నుతింపన్ శక్యమేయేరికిన్ । రక్షోవీరుల
సంహారించిసురలన్ రక్షింపగారాజవై । యీక్షోణింజనియించినాడవు రమాక్షిశాంశ
నింపొంద ఘా । లాక్షుస్తుత్యము ముక్షుమానసపయో జాదిత్య లోకేశ్వరా ॥

వ॥ అనిపల్కి రఘుచంద్రునివలన తద్వృత్తాంతంబంతయు నెరింగికొని ॥

గీ॥ కైకజేశినవనికిభూకాంతుడైన । దశరథునిపాపబుద్ధికి ధరణిజాధి । పునకు
నైనట్టి దురవస్థకునుహృదబ్జ । మునను వగనొందరాము డాతనికిననియె ॥

వ॥ అయ్యా యిట్లేలచింతించెద విధిదైవయోగంబున వచ్చినకార్యంబుద్రోచిపుచ్చ శక్యంబగునే వినుమింకొక్కటేర్పరించెద నీశ్వరుండు స్వాతంత్ర్యయుండుగాని జీవుండుగానోవ డదియట్లనిన నతండుకర్మాదీనంబైన శరీరంబు ధరియించుటం జేశి జగదీశ్వరానుగ్రహంబున పూర్వకృతకర్మంబు లనుభవింపుచుండునది గావున సుఖదుఃఖజయాపజయంబులు కర్మానుగుణ్యంబుగా తనుదానవచ్చుచుండు సందియంబులేదని పల్కినయాశబరపతి శోకంబుబోసెనంత నారాజేంద్రుండు సాయంసంధ్యాదివిధులు

దీర్చి నిద్రించెయనంతరంబ చతుర్దశాబ్దంబుల హర్నిశంబు లాహారనిద్రలుదక్కి యారోపితబాణాసనుండై సీతాభర్తంగొలిచియుండుటకు లక్ష్మణుడత్యంద్భుత ప్రతిజ్ఞా పరుండయ్యెననిన విని హైమవతీయిట్లనియె ॥

క॥ ఓహోహో చిత్రమునిద్రియు । నాహారములొల్లకేల నాతడుదావై । దేహీ శుగొల్చెనని సం । దేహంబెరిగింపువాడు తెల్లమిగగన్ ॥

వ॥ అనిన శంకరుండాశ కరితో నిట్లనియె ॥

సీ॥ దశకంధరునకునుతనయుడై యింద్రజిత్తనువాడుజనియించి యజునిగూర్చి । తపమాచరింపనాతండుహర్షితుడై యిచ్చెదవరమునీకెద్దియుష్ట । మదివేడుమనవుండు మదిలోన నుప్పొంగి వనరుహగర్భునుద్వాంఛితంబు । లొనగూర్పవలతేని వినుముజగం బుల గలయట్టిజీవసంఘకము చేత । నంతమొందకుండ నట్టులవరమియ్యి । టనుడతండు నట్టులగుచుమనుజ । చేతదక్కననువుక్షేమముష్ఠిలోపల । నంనులకువిచారమంబెవాసు ॥

వ॥ పరమేష్ఠిం గనుగొని దేహయట్లగానిమ్ము మానవుండేనియు దుర్గమారణ్యాం బుల సంచరింపుచు చతుర్దశాబ్దంబు లాహారనిద్రలువర్జించిన మహాపురుషునిచేత దక్కతక్కినమనుజులచేత చావకుండునట్లుగా ప్రసాదింపవేయనిన యగుగాకయని హిరణ్యగర్భుండంతర్ధానంబునొందె నద్దురాత్మకుని సంహరించునిమిత్తం బత్తెరంగతనికి నలవడియుండెనని చెప్పి యిట్లనియె నట్లురామానుజుండు ప్రతిజ్ఞాపరుండై గుహుని తోడంగూడి ॥

గీ॥ జనకజాధీశ్వరుని యథశ్శయనమునకు । నతనినిశ్చలబుద్ధికి నధికముగను । తనమనంబునశోకాద్భుతములుబెనగొ । నంగనారేయిబుచ్చెనో నలిననేత్ర ॥

ఉ॥ అంతప్రభాతమౌటయు నిజానుజుడొయ్యనదెల్పజానకీ । కాంతుడు మేలు కాంచి యుదకంబులగ్రుంకి ప్రభాతకృత్యముల్ । సొంతముగానొనర్చి జలజాప్తునకుం గడుభక్తిమ్రొక్కి య । త్యంతముదంబుతోడ దపమబ్దచతుర్దశకంబు సల్పగన్ ॥

వ॥ నియమంబుచేసినవాడగుల మంత్రివరుని యాననంబీక్షించి యింకమాకు నరదంబెక్కగాదు నీవితేరుగొని యయోధ్యకు మరలిపొమ్మను డతండు వెచ్చనూర్చి కౌసల్యానందనుడో నిట్లనియె ॥

మ॥ చనునే భూరిగుణాఢ్య ఘోరమగు నీశైలాటవీవీథులన్ । బ్బనునీతమ్ముని సీసతీమణిని యంతేనిర్దయండించి యే । చనగాబాడియె నన్నునీవగిధి దుశ్చారిత్రుగా జూడగా । యనఘామీపద పద్మములొలచి యాహ్లాదంబుతో మెచ్చెదన్ ॥

వ॥ అనిపల్కిన రామచంద్రుండు తనయందపారభక్తి తాత్పర్యంబులకుమెచ్చి వానిననేకభంగులదెలిపిన నతండెట్టకేలకునియ్యకొని దేవానిన్నుంబాయజాలనిమోహం

బున నింతబలుకవలసె గావున నిరంతరంబు భవదియ్యచరణ సరసీరుహంబులు నా హృదయంబున కుదురుకొనునట్లుగా జాయవేయుసిన నట్లయగుంగాక యనిన నతండు రామలక్ష్మణులకు ప్రణమిల్లి యరదంబెక్కి చనియె నట్లుసీతానాయకుండు ॥

గీ॥ గుహుడుతనకుదారకుడు గా గదానును । సతియులక్ష్మణుండుసత్వరమున ।
నోడయెక్కివిలసితోత్తుంగరంగత । రంగమైయట్టి గంగదాటి ॥

వ॥ భరద్వాజాశ్రమంబున కరంగందలంచి యాకిరాతవరునుండ నియమించి యచ్చోటువాసి నాటిదినంబున యోజనత్రియంబరగి సుదర్శనసరోవర తీరంబున ।

గీ॥ యొక్కవటమూలమునవిల్చి యుండితగ మృ । గాళిఖండంబులనుదిని వాటి
రేయి । గడపిమరునాడు ప్రొద్దునగదలి యర్క । దస్తగిరికేగుచున్నట్టి యవసరమున॥

వ॥ గంగాయమునా సంగమంబుచేరంజని ప్రయాగమాధవుదర్శించి తత్సమీప వనంబునందు ననేకశిష్యగణయుతుం ద్రికాలవేది భానువిభ్రాజితు భరద్వాజుంగాంచి యతనియడుగులకు మ్రొక్కి యమ్మునీంద్రుచేత నుచితకృతుల సత్కృతులై యారాత్రి యచ్చటనిలచి మరునాడు గమనోన్ముఖులై చిత్రకూటపథంబా సంయమీంద్రునివలన నెఱింగికొని వీడ్కొని కాళిందినదియుత్తరించి సిద్ధవటంబుగనుంగొనుచు చనజనముందట॥

సీ॥ కిన్నరీజనమదాక్రీడారతివిలోల ఘటితగుహాకూటకనక కమ్రి । చాయకవా
టంబు సదృత్నశోభిత ఘుశృంగజూటంబుత్మ్యజబహుల । తావనకూటంబు తాపస
వాటంబు మహనియ్యవర హోమ మంత్రసుస్వ । రంబు గంధర్వగానంబు శ్రీవిలసిత
తంత్రీరవంబు మోదంబొసంగ । కీరకలకంఠకమనియ్య కేకికాని । నాదసహితంబు కైరవ
నలినచక్రి । వాకబకమీనషట్పదానీకయుతజ । లాశయంబలచిత్రకూటాచలంబు ॥

గీ॥ కాంచిజేరచనుచు కమనియ్యమగునచ । లాగ్రమెక్కిసీతకచటగల్గు ।
చోద్యములనువరుస జూపుచుతాపస । శ్రేష్ఠులున్నయడకు జేరవచ్చి ॥

వ॥ అమ్మునులకుమ్రొక్కి వారలచేత సత్కారంబులువడసి యచ్చోటనిలువంగోరి యొక్క మహీరుహంబుచెంత పర్ణశాలగట్టుకొని మునివృత్తి నుండెననిచెప్పి శివుండు మరియు నిట్లనియె ॥

క॥ జనపాలసుత లు గొలువం । గను కాంచనమంటపమున కడువిభవముచే ।
దనరెడురఘుపతివిధికృత । మునమునియై యడవియుటజమున వసియించె ॥

వ॥ అనిచెండియు నిట్లనియె నట్లురామచంద్రుండు జనకజా లక్ష్మణయుతుండై చిత్రకూటాచలంబున సుఖంబుండె యొక్కనాడు వైదేహి దేవోపహారంబులారగించు తరియొక్క దైత్యుండు వాయసరూపంబై వచ్చి యాతన్వియురస్థలంబున నఖంబులు నాటియరచుచు పలలంబులొడియు దానినేకమారులు దోలితోలి యక్కా మ

డయ్యెట వీక్షించి రఘువరుండుదానిపైనలిగి నిషీకాగ్రింబు గొనివైవ నదిబ్రహ్మాస్త్రంబై బలీముఖంబు వెన్నాడిన మూడులోకంబులందిరిగి తన్నుంగాంచువారింగానక మరలి సీతాభర్తపాలికిం జారనేతెంచి శరణొందిన నతండుకరుణాపరుండై దానితో నిట్లనియె ॥

సీ॥ వినుమువాయసవర్య వృథగాదునావిషు వటుగాననీ యవయవములందు । నొకయంబకంబు సాయకమునకొప్పించి ప్రాణంబుతోడుతబ్రతికిచనుము । నావుడట్టుల నిచ్చి నరవరయికనొక్క యంబకంబునవిహారంబుసేయ । జాలనునొకకంటి వీలుగాదీలాటి కొరతనేవిధమున తిరుగుచుండ । నొలియొకదిక్కు గానరాకుండుననుచు । నడలగానిగటాక్షించి పుడమిరేడు । నీకుపూర్వంబుకంటెనునెగడుదృష్టి । చింతనొందకు మనిపల్క నంతనదియు ॥

వ॥ సమ్మోదంబున రఘునందనునకు వందనంబాచరించి చనియె నచ్చటిమునులు రఘునందను శౌర్యశాంతరసంబుల కచ్చెరువంది బహుభంగుల నతనిప్రశంసించిరి రామభద్రుండు మునులసంగతిని చిత్రకూటాచలంబున సుఖంబుండెనంత నక్కడ సుమంత్రుండు రథంబుగొనివచ్చి యయోధ్యాపురంబుసొచ్చి రాజమార్గంబునం జనిన గరివాకిట యరదంబుడిగ్గి యంతఃపురంబుసొత్తెంచి పంక్తిరథునింజేరి నమస్కరించి దేవా రామభద్రుండు గంగాతటంబు జేరి యచ్చట నన్నువీడ్కొని యమ్మహావాహిని యుత్తరించి యరణ్యంబున కేగెననిన విని యతండు పలువిధంబులం బలవించి సుమంత్రుని నిజనివాసంబునకు బోవనియోగించి కౌసల్యాదేవిని రావించి యయ్యతివతో రామచంద్రుండు గంగదాటిచనుటయు సుమంత్రుండు రథంబుగొనివచ్చుటయు నెరింగించి తానుమున్ను తమసానదీతీరంబునకు వేటబోవుటయు నచ్చోట సామజంబనుతలంపున గురుభక్తుండైన యజ్ఞదత్తుం దెగనేయుటయు నమ్మహాత్ముని తలిదండ్రులు తనకుశాపంబిడి పంచత్వంబునొందుటయు సవిస్తరంబుగా జెప్పి నదినేడునిక్కంబుగా సంఘటించెనింక బుత్రవియోగంబున ప్రాణంబునిలుపనోప నూర్ధ్వలోకంబున కరిగెదననిపల్కి యామగువ నంతఃపురంబునకుంబుచ్చి శుచియైవార్చి ధరిత్రిపైబవ్వళించి రామభద్రుని సుస్వరూపంబు తనహృదయకంజంబున నిలుపుకొని ॥

గీ॥ రామరామరామ రవికులాంబుధి సోమ । రామరామచంద్రరఘుకులేంద్ర రామసుజనమిత్ర రాజీవదళనేత్ర । రామగుణసముద్ర । రామభద్ర ॥

వ॥ అనియాదేవోత్తముని దివ్యనామోచ్చారణంబుసేయుచు కాయంబుదొరంగి యవ్యయపదంబునకుం జనియెనంత ప్రభాతంబగుటయు ॥

సీ॥ పరిచారకులుతొల్లి పగిదినిమేల్కొంచి పనులెల్లదీర్చిభూపాలవరుడు । లేవ

కుక్కని తమభావంబులో జిత్రమొందంగదగు కాంతలురరయమున । యంతఃపురంబున కరిగియానరపతి వికృతవేషముగాంచి వెరపుగదుర । కరముననాతని గాత్రమొయ్యన ముట్టిచూచి యారాజుసచ్చుటయు నిక్క । మెరిగి శిరములురంబులు కరయుగముల। మోదికొని పెద్దరమున ఖేదమంద । మిక్కుటంబగు నిద్రచే మేనుమరచి। పవ్వళించిన యా రాజపత్నులెల్ల ॥

వ॥ అదరిపడిలేచి దశరథభూనాథుంజూచి నష్టచేష్టితుడై యొక్కింతవడికిం దెలివంది యప్పుడమిరేని యడుగులపైబడి నొక్కుమ్మడి కరంబుల ధారాతలంబుతడ వాడుచు నిట్లనివిలపించిరి॥

ఉ॥ హాజలజాప్త వంశవరహాసుగుణార్ణవ హామహాత్మ హా । హాజగతీశ హా సుమనసాలయధీర కృపాంతరంగ నీ । యోజను మమ్ముడించి చనయుక్తముగా మిమదింపలంపకర్ణ । భూజనపాలయొక్కడవు బోవుటనీకిది ధర్మమేకదా॥

గీ॥ సత్యశాసనుడని జనుల్ సన్నుతింప । నాత్మజుల విపిన భూమికి ననిచినట్టి చారుకీర్తిని సహధర్మచారిణులన । సత్యవృత్తిని దిగనాడజనునె నీకు॥

ఉ॥ చూడవదేలగారవపు చూపుల పల్కుల తేనెలొల్క మా । టాడవదేల చేతులకు చాగ్రములంటవదేలవర్ణి ము। ద్దాడవదేల కౌగిలిని యాడవదేల స సంభ్రమంబుతో । క్రీడలుసేయవేల రతికేళిని దేలవదేల చెప్పుమా॥

వ॥ అనియివ్విధంబున పనివిపనినేలంబడి పొరలుచు నాక్రందనంబు గావింపుచు నొక్కట కైకేయిపై మోదుకొని నీకోర్కె ఫలితంబయ్యె రామభద్రుని కాననంబున కనిచితివి పెన్మిటింజంపితివింక సుఖయింపుమనిపల్కి విలపించుచుండి రాత్మసమయంబున వసిష్ఠవామదేవాది పురోహితులేతెంచి బహుభంగుల రాజకాంతల నూరార్చి రాష్ట్రంబరాజకంబగునని యూహించి పంక్తిరథుని గాత్రంబు తైలపక్వంబుజేయించి యునిచి జయంతాది మంత్రుల నలువుర నుపలక్షించి మీరలు మణిభూషణాంబరంబులుకొని గిరివ్రజపురంబునకుంజని శీఘ్రంబ భరతుందోడుకొనిరండనిన వారలట్లు సప్తమదివసంబులకు కేకయ రాజనగరంబున కరిగి॥

గీ॥ భరతు గనుగొని మ్రొక్కియు పాయనంబు । లిచ్చి మీరలయోధ్యకు నీక్షణంబ । గదల రావలె కార్యంబు గలదటంచు । పిలువనంపె నరుంధతీ ప్రియుడునిన్నా ॥

క॥ అని చెప్పిన నప్పలుకులు । విని తనలో భీతిజెంది వెసభరతుడు దా । ననుజుని దోడ్కొని కేకయ । మనుజేశుని యాజ్ఞబూని మదివగ గదురన॥

వ॥ కదలి యయోధ్యానగరంబునకు సప్తమదివసంబున యేతెంచి యంతి

పురంబు సొత్తెంచి కైకేయింగాంచి నమస్కరించి గేకయ భూనాయకుండు బుత్తెంచిన భూషణంబులొసంగి వారల క్షేమంబులెరింగించి రాజమందిరం బమంగళంబగుటకు భయంబునొంది కైకేయి కిట్లనియె తల్లి నగరేల శూన్యంబై యున్నది శంఖభేరీమృదంగ వాద్యస్వనంబులేల వీతేరకయున్నవి యిందులకై నామనంబు గలంగుచున్నది నానా నరనాథ సేవితుండగు దశరథ భూనాథునకు సద్గుణమతల్లులగు తల్లులకును రఘుకుల జలధి చంద్రుండగు రామచంద్రునకును భాగ్యోపేతయగు సీతకును శుభలక్షణుండగు లక్ష్మణునకును నెల్లవెంట భద్రంబేకదా యిట్లునికికిగతంబెయ్యది యనవుండు కైకేయి నిజనందనున కిట్లనియె॥

గీ॥ వరయుగంబిచ్చియుండె భూవరుడు మున్ను । దనకునవియేను వేడితి తనయనీకు । నొకట పట్టంబుగట్టంగ నొకట రాము । జనపతిని విపినసీమకును బనచునటులా॥

వ॥ అంతా॥ మత్తకోకిల॥ నేను వేడినరీతి భూమిభుడిచ్చెనిచ్చిన జానకీ। ప్రాణనాథుడు తత్క్షణంబున రాజ్యలక్ష్మికి దూరమై । మానివృత్తిని కానకేగెను మానినీమణి సీతయున్। తాను తమ్ముడు సీతతోడుత తండ్రి పంపటులాయగన్॥

క॥ తనయులు కానకునరిగిన । జననాథుడు తద్వియోగ సంతాపముచే । తనువుదొరంగెను సప్తమ । దినమున ధృతిదూలి ప్రజలు దీనత నొందన్॥

క॥ గతమగుదానికి వగవక । క్షితికైకొని యేలుతడయ జెల్లునునే నీ। హితమూది వరములనక్షితి । పతియను మతిగొన్నదాన ప్రౌఢతపేర్మిన్॥

క॥ పుత్రుడు ధీమంతుండై । ధాత్రీతల మేలుచుండ తద్విభవంబున్। మైత్రిని గడగను తల్లికి । నేత్రములకు ఫలముజువ్వె నిక్కంబెందున్॥

వ॥ అనిన నుల్లంబుఝల్లన నేలపై వ్రాలి కొండొకవడికిందేరి కైకేయి నుద్దేశించి పెద్దయెలుంగున నిట్లనియె॥

ఉ॥ మాకులభర్తయైన రఘుముండను నోడక ఘోరకానలో। నాకులు కాయలు న్మెసగనంపి నిజేశుని జంపియంతటన్। బోక ధరిత్రియేలుమన్న బుద్ధులుజెప్పెద వింక నిమ్మెయిన్। నీకెనయైనసాధ్వి లవనింగలరే కులనాశకారిణీ॥

ఉ॥ నెట్టనరామచంద్రిరజ నీచరదుష్టమృగప్రియుక్తమై । నట్టియరణ్యభూములకు నంపుటకించుకరోయనట్టి పెన్। కట్టడిదానవైన నినుగట్టుగసేయకనింతిరూపమై పుట్టగజేశెపద్మజుని బుద్ధికినేమనవచ్చు నక్కటా॥

ఉ॥ నిన్ననలేదుగా మొదలనే పతిహంతవు నీకుమాటలన్ । మన్ననజేశెదా వెణుగు మానిసిబోలిసుతాగ్రగణ్యు రా । మున్నిజవంశవర్ధను బ్రపూర్ణగుణార్ణవు

శుద్ధసత్వ సం । పన్నుమహాటవిఁ మెలగ బంపినరాజవివేక మేమనన్ ॥

చ॥ వనమునకేగు వేళ రఘువల్లభుమానసమెంతనొచ్చెనో । జనకతనూజ యేమ
నెనో । చారుగుణాఢ్యుడులక్ష్మణుండు దా । మనమునజింతసేయుచును మాటికియేమని
దూరనోకదే । పనిబడిమాటమాత్రమున బాపితివౌదువె కేకయాత్మజా ॥

వ॥ అనిపల్కి కౌసల్యపాలికిం జని ।

సీ॥ సరగుననాయింతి చరణయుగంబుపై బడితండ్రివీడ్కొని బహువిధముల
నడలుచునుండనయ్యంగనభరతుని కనుగొనితండ్రిశోకంబుమాను । జననాథువేడి మీ
జనని నీకొనగూర్చె రాజ్యంబురామునరణ్యభూమి । నుండబంచెనుతద్వియోగదుఃఖము
చేత నవనీశ్వరుండుగతాసుడయ్యె । తడయనేలనింకధరణి గైకొనుమేలు । మనుముద
మునననుడు మాటలపుడు । చవుజోకనష్టచేష్టితుడై తేరి । వెచ్చనూర్చియాసవిత్రికనిమె

సీ॥ అంబనావలన పాపంబొకించుకలేదు కలుషభాజనియైనకైకవలన । నిట్టికీడు
జనించెనింతియెకానియే రామభూపాలునిరాజ్యలక్ష్మి । నాసగింపనువిను మమ్మహా
ఘునునకు నెగ్గుదలంపనెయ్యెడలనట్టి । తలపుమనంబునతలచియుండెదనేని బ్రహ్మఘ్ను
డును సురాపానుడును సు । వర్ణచోరుండు గురుతల్పవాసిమొదలు । గామహాపాత
కులుబోవు గతికిబోవు । వాడదీనికిసూర్యజైవాతృకులును । ప్రకటితంబైన భూతపంచ
కముసాక్షి ॥

క॥ అనునవసరమున నిజమిా । తనివచనముమిథ్యగాదు తలపననుచు భూ
తనిచయముబల్కెనట్టిది । వినికౌసల్యాదిసుతులు వెసమరియంతన్ ।

క॥ నందనులబట్టికొనియా । క్రందనమొనరింపనదియు గనుగొనిమునిసం క్రం
దనుడై నివసిష్టుం । డందరవారించెనంత నాభరతాదుల్ ॥

వ॥ దశరథునిగాత్రంబు గనుంగొని పెద్దతడవాక్రోశించి యారాత్రిగడపి మరు
నాడు వసిష్టునుమతంబున ॥

గీ॥ దశరథునకును శాస్త్రయుక్తంబుగాగ । నగ్నిసంస్కారమొనరించి యచటు
వాసి । యరిగిస్నానంబుగావించి యహాఃభంగి । తోదిలోదకమిడియు తోడ్తోనకదలి॥

వ॥ నగరంబునకుజనుదెంచి ద్వాదశాహతంత్రంబు నిర్వర్తించియున్నమరునాడు
వసిష్టుండు ॥

చ॥ సకలమునీంద్రమంత్రిజన సమ్మతినిట్లనిపల్కెదాని కై । కకొడుకుతోడ
నీధరణి గైకొనియేలుము రాజ్యమిట్ల రా । జకమగునేనియాకతన జేకురుకీడనునట్టి
పల్కె జౌ । లకువినవింపుగామికి తలంపునగుందుచు నాతడిట్లనున్ ॥

క॥ మనివర ప్రాకృతువిధమున । జనునేనమ్మిట్లుబల్కె సకలమెరిగియూ । డిన

నేమిసేతు గైకకు । తనయుండనిమనములోన దలచెదవేమో ॥

చ॥ ఇడుము లనొందుచుండ రఘుకులేశుడుసీతయు లక్ష్మణుండు కా । రడవులలో జరింపగ మహాత్మక యేనిటలజ్జలేక నీ । పుడమికిరాజనై సకలభోగములన్ విలసిల్లి కైక కున్ । కొడుకునటంచుచిత్తమున గొంకక నేకిోయనుంటు జెప్పుమా ॥

వ॥ అని మరియు నెవ్వామనంబున నెబ్బంగినుండునో యని యూహించి సకల జనంబుల సందియంబువాయ నిట్లనియె॥

సీ॥ కైకేయిజేశిన కఠినోక్తిలోపల గలశియుండితినేనికానివాపి । యారాము చంద్రరాజ్యంబ పేక్షింపను దశరథేశ్వరునిపాదంబులాన । యడవికిరఘురాము నంప గా మదినూహ సేయనేనెన్నడుశివునితోడు । కలలోననైన రాఘవునిపైనొక కీడు దలపనే నాచక్రిధరునిసాక్షి । యరయ వెనకటికైన ముందటికినైన । నన్ను నేమెచ్చుకొనరాదు నాగుణంబు । పంచభూతంబులును లోకపాలకులతో । జనకీజానియెరిగితె చాలుచాలు ॥

చ॥ పనివడిపూర్వజన్మమున పాయక నేను దురాత్ముకుండనై । ఘనులకుజేశినట్టి యపకారముతక్కిన యట్టిపాతకం । బానరగనించు కేని పొలివోవకయుండగ లెక్కజేశి యీ । యనువునకైకకుం గొడుకనై జనియింపగ జేశితేవిధీ ॥

వ॥ అనిమరియును॥

చ॥ మతినొకయించుకేని యనుమానముసేయక కైకయిట్టి దు । ష్కృతమొన రించి మిమ్ముడవికిన్ వడిదోలినదింతేకాని భూ । సతియును ధర్మదేవతయు సాక్షిగనీయడ నిట్లుసేయగా । పతితుడ గాను నావలన పాపమొకించుక లేదు రాఘవా ॥

వ॥ అని పెద్దయెలుంగెత్తి శోకించి యా తపోధనుని వదనకమలంబవలోకించి వెండియునిట్లనియె ॥

క॥ భూమీశాగ్రణియగు రఘు । రాముని ప్రార్థించి తెచ్చి రాజ్యశ్రీకిం । బ్రేమనభిషిక్తుజేశెద । నా మనుజ శ్రేష్టుడిటకు నరుదేకున్నన్ ॥

వ॥ యేనుతపోవేషంబు గైకొని యారాజర్షింగొల్చి యతనివెంట నరిగెనని ప్రతినయొనర్చి యక్షణంబ గైకేయినందనుండు ॥

సీ॥ తల్లులుముగురు బాంధవులమాత్యులు బురోహితులుపౌరులతోడ నరుగు దేర । శతృఘ్నసహితుడై చతురంగబలములు కొలచిరా శంకకాహళమృదంగ । భేరీధ్వనులుభూమిబిక్కటిల్లి చెలంగ పురముబెల్వడిచని సరసిజాప్త । దస్తాద్రికేగెడు నవసరంబునజాహ్నవీతటంబున జేరి విడియునట్టి । వార్తవిని గుహుండు మిక్కిలివంత నొంది । యతడు గైకేయిసుతుడని యాత్మలోన । దలచి భరతున్న హృదయంబు తెలియ

లేక । రామచంద్రునియెడ నపరాధియనుచూ ॥

వ॥ మనంబున నిశ్చయించి తన బలంబులరావించి వారల కత్తెరంగెరించి మార్గంబులు గట్టబనిచి యుద్ధసన్నద్ధుండై బ్రహ్మాండ కుహరంబుపగలనార్చుచు చనుదెంచి భరతునుద్దేశించి యిట్లనియె ॥

క॥ జనకునిశంపున కానకు । జనుదెంచినయట్టిరామ చంద్రునిపైనీ । యను పునసేనల గూర్చుక । పనివడియే తేరతగదు భరతనృపాలా ॥

క॥ సద్గుణగరిష్ఠుడైన జ । గద్గురునకు నెగ్గుదలచి కడపట నెటులన్ । సద్గతికరిగెదు వినుము భ । వద్గమనముకీడు దెచ్చు వాలాయముగన్ ॥

వ॥ అదియునుంగాక ॥

సీ॥ ధరయేలగారాదు వరమణిభూషణాంబరములుగోరదు కరితురంగ । ముల నెక్కబోడు భూతలనాథపంక్తిచే మ్రొక్కులుగొనడువారక్కజముగ । నిచ్చకప్పంబుల కిచ్చ సేయడు పాలుపంపుదెమ్మనడు సంప్రాప్తమైన । ధరణీతలంబు మీతల్లి వేడిన నిచ్చి వగలచేజనులెల్ల పొగలుచుండ । క్రిమముతోడుత జటావల్కలములదాల్చి । తానుతమ్ముడుసీతయు తక్షణంబ । పురము వెలువడి కానకుబోయినట్టి । రామచంద్రునిపై నెత్తి రాగతగునె ॥

క॥ ప్రాణంబులగుహుడుండగ । ప్రాణంబులబోవనీడు పద్యంబిది నీ । సేనల నిన్నునుభాస్కర । సూనునిపీటికినిబుచ్చు శుంభల్లీలన్ ॥

క॥ అనిపల్కినపరుషోక్తులు । వినిభరతుండాత్మలోన విస్మయమునుసి । గ్గును గదురవిన్ననై యా । వనమించుకవాంచి శబరనాథునకనియెన్ ॥

సీ॥ అనఘనీవాడినయంతయు నిక్కంబు కల్మశాలయయగు కైకవలన । నిట్టికీడు జనించె సీతడాదుల్మీల కొడుకు రామునియెడకుచ్చితంబు । దలచియిత్తెరగున దండెత్తి రాబోలునని యూహసేయుట లరుదుగాదు । వినుమునాతెరగెల్ల వివరించిచెప్పెద పూర్వజన్మంబున బూనిజేసి । నట్టియఘమున దుర్మతియైన కైక । కడుపునను బుట్టవలసెనుగాని యీభ । వంబుననుద్రోహిగాను నిక్కంబుదైవ । మెర్గి శేజాలు పెక్కులింకేలపలుకా ॥

క॥ అనితనవచ్చినకార్యము । వినుపించినశబరవిభుడు వినిముదితుండై । తననిటలము గైకై నందనుపదములు జోకమ్రొక్కి నయములరారన్ ॥

సీ॥ నయ్యెననతనికి జనకజా విభుడయోధ్యానగరముబాశి యరుగుదెంచి । విడిసినవహింగులీ వృక్షమయ్యనఘుండు పవ్వళించినయట్టిపల్లవముల । శయ్యయునాతండు జటలుధరించిన చోటుగుహుండుదాజూపజూచి । దుఃఖించిశత్రుఘ్నుతోగూడి యచ్చట

వలనొప్పగా జటావల్కలములు । దాల్చియమరతరంగిణిదాటి యాని । పాధిపతిచేత మార్గంబుజాడలెరిగి । కొనియతనివీడుకొనిచని మునివరేణ్యు । డగుభరద్వాజుజేరగా నరిగియందు ॥

వ॥ యాతపోధనుని యడుగులకెరిగిన లేవనెత్తి యతండిట్లనియె నయ్యాధరణీ రాజ్యంబు నీకొసంగి మునివేషంబు గైకొని ఘోరారణ్యంబున కేతెంచి శుద్ధశాంత తత్వంబువహించియున్న రఘుచంద్రునిపై కుహనాతపోవేషంబుబూని యపారసేనా సమన్వితుండవై యెత్తివచ్చుట యుచితంబగునే నీవుసజ్జనుండవగుదువైనను పుణ్యహీన యగు కైకకుబుట్టుటం జేశి యిట్లు దుర్బుద్ధి ప్రాప్తంబయ్యె గావలయుననివలికిన యా మునితిలకుని పలుకులకులికి భరతుండు తానువచ్చిన విధంబంతయునుజెప్పిన మునీం ద్రుండు బ్రహృష్టాంతచిత్తుండై యతిథిసత్కారంబులాచరించిన నారాత్రి యచ్చట నిలచి మరునాడు గమనోన్ముఖుండై యాతపోధనుల నుండనియమించి యరుగుచు తనమనంబున నిట్లనివితర్కించె ॥

మ॥ ననుగైకాత్మజుడంచు రాఘవుడు చెంతంజేరగానీక దు । ర్మనుజశ్రేష్టుల లోన నెంచునొదయా మన్నించిచీడేమి నే । యనునిర్దోషుడ కల్మషుండనుచు ధా యుక్తిన్విచారించి ర । మ్మనిభాషించునొ నేమియున్ననక చింతాక్రాంతుడై యుండునో॥

క॥ దశరథునివార్తనాచే । విశదముగానెరిగిశోక వివశుండై దు । ర్యశుడుపిత్రు హంత పీడను । చుశిరఃకంపంబు శేయుచును మెలగునొకో ॥

చ॥ జననియుక్తిజెప్పి వెనత్మూస్తలిగైకొని నన్నునిమ్నోయి । వనమునసుండ బంచి నృపవర్యునినంతమునొందజేశి భూ । జనములుబ్రువ్వదిట్ట వినజాలకరాముని దెత్తు నంచు నీ । యనువునరాగనొపు కుటిలాత్ముకుడంచు మదింగణించునో ॥

మ॥ అతడక్లేలమనంబులో దలచు నర్వాత్ముండునైనట్టి దు । ర్మతిగానొట యరుంగడేబ్రకృతి నంబద్ధుండగై కేయి కం । చితపుణ్యంబున నుద్భవంబయిన సౌశీలుం డునుంగాక యీ । గతినాబుద్ధిగలంగుచున్నయది రాగద్వేషసంయుక్తమై ॥

క॥ నావలనవ్రణములేదని । భూవరుడిక్లేలదలచు బొసగనియుక్తుల్ । గావే యూహింపగ య । ద్భావముతద్భవతియనెడు పల్కులువినమే ॥

వ॥ ఇదియట్లుండనిమ్ము ॥

ఉ॥ భాసురకీర్తిరామ నరపాలకుడొడ్లకునర్థితోడ దా । జేశినమేలునొడ్లు దనుజేశినకీడుదలంపడెట్టి యా । యాసముప్రాప్తమైన సదయాళుడతండు మహాప రాధు శా । కాసురుబోచు చోట కడునల్పపుకల్మషులెల్ల లెక్కయే ॥

క॥ కావునగైకెయియగునె । నావలనను యెగ్గుబుట్టునా గానిత దా । భావ

మున దలపమరచు ద । యావననిధిరామచంద్రు డనుచుఁ జనుచోఁ ॥

సీ॥ అంతనచ్చటను రామావనీపాలుండు చిత్రకూటాద్రిపైసీతగూడి । విహరింపుచునుమృగవితతి భయంబుచేపరచుటలక్షించి వెరగుజెంది । క్రిమ్మరనద్దిక్కు గనుగొని యచ్చటధరణీప రాగమంబరము నిండు । టదియేమిచిత్రమోయనియనుజన్ముతో నెరిగింపనాఘను డురురయమున । నొక్కయుత్తుంగభూరుహం బెక్కి నేల । యీనినటువలెజనుదెంచు సేనజూచి । మరియుకేతనములు దివాకరకుల ప్ర । ధానబిరుదులు బాడగాంచి తత్తరమున ॥

గీ॥ భరతుడిట్లుకైక పంపునతనమీద । దాడిబెట్టనిదియతద్యమనుచు । చెట్టు డిగ్గనురికి సీతాధవునిపాద । పద్మములకువ్రాలి బలికెనపుడు ॥

వ॥ దేవా తల్లిపంపున భరతుండు చతురంగబలసమేతుండై మనంబట్టవచ్చుచున్నవాడని పితృవాక్యంబు శెల్లింతునని యొసలుడిన రాజ్యంబువిడచి యడవులనుండ వచ్చిన నీశాంతంబింతకుడెచ్చె ననవుండు రామచంద్రుండు మందస్మితముఖారవిందుండై లక్ష్మణుంగాంచి నీకిటె ల బుద్ధిశూన్యుండవైపలికెదు నకళంకచరితుండగు భరతుండు నాకునీకంటె పరమభక్తుండు వాడుమనలనయోధ్యకు గొనిపోవదలంపున నేతెంచిన వాడతనిమనోవృత్తి నీవెరుంగవనవుండు నతండులజ్జానవతాననుండై యుండెనంత నక్కడభరతుండు ॥

ఉ॥ దవ్వులసేననిల్పియు హితజ్ఞుడుతానును పాదచారియై । యవ్వసుధేశుడున్న యెడ కప్పుడుబోవుచు నాత్మలోపలన్ । నెవ్వగజెందెరామ ధరణీపతికిం దురవస్థ వెచ్చగా । నివ్విధికైకయంచు మునులెల్లను నివ్వెరగంది చూడగాన్ ॥

వ॥ అట్లుగుందుచు పర్ణశాలద్వారంబున యందు ॥

సీ॥ నీలమేఘంబును బోలుగాత్రమువాని సొబగైనవల్కలాంశుకమువాని । దట్టంబుగా భసితంబలందినవాని సరసిజమిత్రభాసురమువాని । నిడుదపైకనిపట్టు జడలు దాల్చినవాని చింతావిహీనతజెలగువాని । దక్షిణకరమున నక్షమాలికబూని తిన్నగా హరినామ మెన్నువాని । యొసగపద్మాసనస్థుడై యున్నవాని । హృదయమున సంతతంబును సదయుడగుచు । శిష్టరక్షణమొనరింప జలగివాని । వేషమున తేజరిల్లు సద్వృత్తివాని ॥

చ॥ కనుగొనియశ్రుబిందువులు కాల్వలై వెసబారుచుండ పా । యనిదురవస్థనొందుచు ముఖాంబుజమల్లనవాంచి కష్టవ । ర్తనిగయికేయినింతటికి దాగురిజేశెవిధాత క్రూరుడై । వనమునుండజేశె రఘువంశపయోంబుధిచంద్రు నిమ్మెయిన్ ॥

సీ॥ అతులితభర్మహర్మ్యమున నుండెడుమేటి నాగిజపర్ణశాలలనుండజేశె । గణు

తింపనిఖిల భూషణభూషితాఢ్యుని స్ఫటికహారాంచితాభరణు జేసె । కమనియ్యకస్తూరి కాగంధపరిలిప్త భోగినిమ్మోయి భూతిబూయ జేసె । మృదుహంసతూలికా మెత్తనిపాన్పు పై శయనించువాని భూశయను జేసె । నృపసమూహంబు సేవింపనెగడు ప్రభువు । నలతిశబరార్భకులతోడ మెలగ జేసె । నేమియనవచ్చునకట నిమ్మహాను । భావ్రసవు దైవమిటువంటి పాటు జేసె ॥

క॥ రాజాధిరాజరఘుకుల । రాజితమణిరాజ మీయరణ్యములోనన్ । రాజసము వదలితా ముని । రాజుపగిదినున్న వాడు రాజ్యచ్యుతుడై ॥

మ॥ యొడయండాఢ్యుడు ముజ్జగంబులకు నుద్యక్తుండుదీనావ లిం । గడు వాత్సిణ్యముతోడ బ్రోచుటకు లోకస్తుత్యుడీస్వామికా । యడవింబుట్టిన కందమూలములు నాహారంబవింగాక పెన్ । బడలున్ భూతియు వల్కలాంశుకములా సర్వేశ్వరాచేశితే ॥

చ॥ నయగుణశాలిరామ నరనాయకమౌళి నృపాలకోటిచే । జయజయశబ్దముల్గొనుచు స్వర్ణవినిర్మిత సౌధసీమ ను । ఛ్రియమునసుండియింద్రుని తెరంగునభోగ చయంబులొందగా । ప్రియమునజూచుభాగ్యము లభించనిహీనుడనే గణింపగన్ ॥

ఉ॥ ఈతనివృత్తిగాంచిన సహింపగనోపనిమైత్రిలేని దు । ర్నీతుడనితియాత్మజను నింద్యచరిత్రుడ కైకయీతనూ । జాతుడగాగనోర్చితిని సత్యమెయిట్టిదిగాక ధాతన । న్నేతస్సృజించెనాయిటుల రామునిదుర్దశ చూచినిల్తునే ॥

చ॥ అతిమృదులాంగసద్గుణ గణాశ్రియపావనశీలలోక వం । దితసుచరిత్రిభాగ్యగని దేవరాంగనతుల్యసీత దా । పతిహితమూదిదాచ్యవన పత్నివిధంబున ఘోరకాన నక్లే । శతతికినోర్చియున్కిగన శక్యమెయేరికి పాపిదైవమా ॥

క॥ మారటరఘుచంద్రుండీ । సారపుభోగములయందు సద్గుణముల ఘో । రారణ్యపీడకును ని । ట్లోరిచిసౌమిత్రి వనరుచున్నాడుగదే ॥

వ॥ అని పలువిధంబులవగచుచు ననుంగుతమ్ముండు దానును నతనిపాదంబుల కెరగిన వారల లేవనెత్తి యుపగూహనంబుజేశి మన్నించె నంత జనకరాజనందనకు మ్రొక్కి యద్దేవియొసంగు దీవనలుగైకొని కరకంజంబులుమోడ్చి రామచంద్రునిం గొలిచియుండిరప్పుడు కౌసల్యాత్మజుండు భరతుంగనుంగొని రాజశేఖరుండును సత్యనిర్వాహకుండునగు దశరథభూనాథునకు సేమంబె యనవుడు ॥

ఉ॥ కన్నులభాష్పముల్దొరుగగా భరతుండువిషణ్ణచిత్తుడై । గ్రన్ననమోము వంచి పలుకంజని నాలుకరాక వెక్కుచున్ । ఖిన్నకచిత్రరూపుగతి మేదినిపైనిలచున్నగాంచి తా । ఖిన్నతనొందిరాఘవుడు కేవలమర్త్యుడపోలె నిట్లనున్ ॥

గీ॥ తండ్రియిదియేమిచెప్పవు తండ్రిసేమ । మెరుగవేడిన నతనికేందేనికీడు ।

బుట్టెనో తాల్మిమదిలోన బూనలేక । చట్టపల్కులుబల్కితే చిటిలపడగ ॥

క॥ తనయులకానకుబంచితి । వనికౌసల్యాదిసతుల వహాపుపల్కుల్ । దనుబలికిన వినజాలక । చనియెనొకో యచటికైన జనములువగవన్ ॥

గీ॥ మమ్ముబంపిరథముమరలంగ గొనితెచ్చి । మంత్రివర్యుడాసుమంత్రుడన్న। రేంద్రుతోడ నలుకనేదేనిదూరెనో । పురముబాశియొకడ బోవునటులా ॥

క॥ నామనముగలుగుచున్నది । నీముఖలక్షణముజూచి నృపవరగణ సు । త్రాముడు సాకేతను డా । సేమంబుననున్నవాడె సెప్పుము తెలియన్ ॥

వ॥ అని బెగడుపడి తండ్రిక్షేమం బెరుంగ వేడిన యన్నముఖంబు చూడక ఖిన్నచిత్తుండును భాష్పాకులలోచనుండగుచు గద్గదికస్వరంబున నిట్లనియె ॥

సీ॥ అనఘమీర లరణ్యమునకునేతెంచిన యంతచే మతినిధైర్యంబువదలి । దుఃఖింపుచును మేను నీరగెనుస ప్తమ దివసంబునందు ధాత్రీతలేశు । డనవినిరఘువరు డప్పుడుమూర్ఛిల్లి త్రస్థలిపైవ్రాలె జనకతనయ । యును సుమిత్రాత్మజుండును మరణంబునొందిన గతినుండియొయ్యనను దెలసి । వనివిశోకింపుచుండిరి బహువిధముల । నందురాముండు ప్రాకృతుడైనయట్టి । నరునిపోలికె దశరథేశ్వరునిదలచి । యడల నూరార్చె భరతుడత్యాదరమున ॥

వ॥ అంత రఘువరుండు సీతాలక్ష్మణసహితుండై భాగీరథికింజని యచ్చట స్నాతుండై దశరథునకు తిలోదకవిధానంబు లొనరించి పిండంబువెట్టి విహితకర్మం బాచరించి మరలి పర్ణశాలకుజనుదెంచి వెండియు తండ్రిగుణంబు లుగ్గడించి యడలుచుండె నంత వసిష్టుండు కౌసల్య మొదలుగాగల తల్లులదోడితెచ్చిన జనకనందన సుమిత్రానందనయుతుండై వారలపదంబులపైబడి బహువిధంబుల నాక్రోశింప నరుంధతీవిభుం డూరార్చెనంత ॥

సీ॥ వలనుగారామభూవరుడు నాచిత్రకూటాశ్రియులైనట్టి యఖిలమునుల । నవ్వసిష్టుండాగి నహాసనంబుల గూర్చున్నతరికైకకొడుకుభక్తి । పూర్వకంబుగరామ భూనాయకుని పాదపద్మంబులకుమ్రొక్కి బహువిధముల । ప్రస్తుతిగావించి పరగ నాతనితోడ నిట్లనివలికెధాత్రీశుడనుప । కైకవచనంబు సత్యంబుగాదలంచి । యడవులకు నేగుదెంచుటలహామగునె । ధరణిపాలించుటలుమాని కరుణవిడచి । యిటుల వత్తురె నాగుణంబెరుగనటులా ॥

వ॥ అయినను మేలయ్యె మరలిచనుదెంచి యయోధ్యపాలించు మేను నీయడుగులు గొలచియుండెద కాదేని యుగ్రారణ్యంబున దీక్షంపుగైకొని సంచరించెదనను డతనికి రామభద్రుండిట్లనియె ॥

మ॥ వరము౦గేకయ పుత్రివేడగ మహీవర్యుండుబంపంగయే । నరుఁడే నెవ్వర మంతయుఁ విధికృతంబౌచొప్పుదప్పింప నీ । శ్వరుడున్నేరఁడటన్న మానవులకుఁ సాధ్యంబెకర్మంబదే । తెరగోయట్టి శుభాశుభంబులగు సందేహంబులేదారయఁ ॥

క॥ కర్మముదైవాధీనము । కర్మాధీనుండుదేహి గావునతత్త । త్కర్మఫలంబను భవ్యము । నర్మిలిజేయింపుచుండు నశాంతంబుఁ ॥

చ॥ ఎరుగనియజ్ఞులెల్ల వసుదేశుడు కామకుఁడౌటయింతికిఁ । వరమునొసంగెనంచు రఘువల్లభు కానకుబంపెనంచు ము । ష్కరములుబల్కయేజుని చందము గైకొనవిందుగాని యీశ్వరకృతమంచునొక్కడను వారలతోడుత బల్కనర్మిలిఁ ॥

క॥ నీవునువారలవిధమున । భూవరుకై కేయిదూర బూనెదవయ్యా । దైవకృతమిట్టిదని నీ । భావంబునదలపవలదె పాజ్ఞతమెరయఁ ॥

సీ॥ అత్తెరంగెల్లయునటులుండె నమ్మహీపతియాజ్ఞనడపుట వ్రతమునాకు । గానపదునాలుగేండ్లేను కానలలోన వర్తించికమ్మరవచ్చునంత । నీవయోధ్యకుజని నిష్కంటకంబుగా ధరణిపాలింపుము ధర్మనిరతి । మెలగుముప్రజలకు నెలముగావింపుము ధరణీసురోత్తముల్ దైవతములు । గాదలంపుమువిడువక త్న్మావరులను । కప్పములు గొనుచేశిన తప్పుకొలది । నహాజనములదండింపు మరులనిజమె । నమ్మినటులుండి యెల్లెడనమ్మకుండు ॥

క॥ నాకొరకై వగనొందుచు । గైకేయింగడవనాడ గాబోకుము సు । శ్లోకుల యుత్తమధర్మము । నీకెరిగించెదనువినుము నిశ్చలమతివై ॥

క॥ దైవంబనగానొండొక । టీవసుధంగలదెపెక్క లేటికియిది నీ । భావమున నిలుపువదలక । దైవముజనయిత్రిసుమ్ము ధర్మవిధిజ్ఞా ॥

గీ॥ చనుముతడయక సాకేతమునకుమరలి । యిప్పుడేజెప్పినవియెల్ల హృదయమునను । పదిలముగనుంచి ధారుణిపాలనంబు । జేయుమిదినాకుహితముగ చేతనిజము ॥

చ॥ అనవదుకన్నులన్వెడలు నశ్రుకణంబులు చేతనొత్తుచుఁ । తనువువడంక రాముని పదంబులపైబడి పల్కెకైక యీ । తనయుడుదేవమీరిటుల తాపసవేషము బూనివందుచుఁ । వనమునసుండయేను నృపవర్యుడనై ధరనేలబోదునే ॥

చ॥ యొడయడవై మెలంగుమని యుక్తులుజెప్పెదవిట్టిపల్కకే । నోడబడనేర్తునే రఘుకులోత్తమ మీరలులేనియట్టె యీ । పుడమియునాకునేమిటికి భోగములేటికి పేరిమతోడ నీ । యడుగులుగొల్చివచ్చెద దయామయ యట్లుయనుగ్రహింపవే ॥

వ॥ అనిన రామచంద్రుండిట్లనియె ॥

క॥ నుతపుణ్యశీలుఁటులల । యతివేషముబూనివచ్చి నట్టులయగు స । మ్మతి

తో నెరిగించెదవిను । హితమొనరింపంగదలచె దేనియునీవుఁ ॥

వ॥ చలంబుడిగి మద్వచనాతిక్రమం బొనరింపక నయోధ్యానగరంబున కరిగి నేమరలివచ్చునంతకు రాజ్యంబుపాలించుమనిన విని దశకంఠునివలని భయంబుదొరంగం గంటిమని కిన్నరగంధర్వాదులు సంతసించిరి సంతసించక భరతుండన్నదెసం గనుంగొని యిట్లనియె ॥

చ॥ అనఘచరిత్రగేకయ నృపాత్మజకుఁ వసుధేశవర్యుఁ డి । చ్చినవరముం బ్రతిష్ఠి తము సేయమదిందలపోశెదేని స । య్యనమనవారిదో డుకొని యేగుమయోధ్యకు నెవ్వ రేమి నీ । యనుజుఁడగానెకానలకు నంపునునన్నొగి బోయివచ్చెదఁ ॥

వ॥ అనిన రఘువరుండు కౌతూహలస్వాంతుండై యతని హృదయంబింత యొప్పియుండుట్లయని యతనికరంబు తనకరంబవలంబించి యేకాంతంబునకుఁగొని తెచ్చి సరసిజాసన ముఖాద్యమరసమూహ ప్రార్థనపరుండై మనుజవేషంబున తానవతరించుట రావణాదిరాత్రించరుల దెగటార్చి జగంబులకు మోదంబుగావింపను దశరథుపనుపు నిమిత్తంబుగా రాజ్యంబుడిగనాడి వనంబునకుఁజనుదెంచుటయు నేర్పడంజెప్పి విశ్వసింప వేని యోగదృష్టింజూడుమని యతనికి భూతభవిష్యద్వర్తమానంబు లెరుకపడంజేశె నతండది గనుంగొని సమ్మతించె నాసమయంబున వసిష్ఠుండు రామచంద్రునితో నిట్లనియె ॥

గీ॥ భరతుడత్యంతభక్తిమై బహువిధముల । నిన్ను బ్రార్థింపుచున్నాడు నెమ్మి భక్తి । వత్సలుండవుగావున వలనుమీర । యీవు నొడగెడు పాదుకలితనికిమ్మ ॥

వ॥ వానిపరిముఖంబున రాజ్యపరిపాలనంబు సేయువాడుగాక యనిన నాతండు గురువచనం బతిక్రమించక నట్లయొసంగి యాజ్ఞయిచ్చిన శత్రుఘ్నుండును తానును రామచంద్రునకు ప్రదక్షిణంబువచ్చి నమస్కరించి తత్పాదుకలు శిరంబునమోచికొని తెచ్చి భద్రదంతావళంబుపై నిడికొని ఛత్రచామరంబులు మెరయ మున్ను తమతోడ వచ్చినవారలంగూడి చిత్రకూటాశ్రమంబు వెడలి ॥

గీ॥ వలనుమీరంగనలభరద్వాజు నాశ్ర । మంబునకు జేరి యామునియమండనునకు నంతదెలియంగ జెప్పినా డచటనిలచి । యలమిమరునాడు గుహుడున్న యెడకువచ్చి ॥

సీ॥ యచ్చటనిలచి రామావనీపాలుని యానతిక్రమమెల్ల నానిషాధ । పతితోడ నెరిగించి పరమసంప్రీతిమై మన్నించియతని నామంత్రణంబు । విహితభంగినొనర్చి వేవేగమున నయోధ్యాపట్టణముజేరియంతఃపురికి జననులబనిచి రాజద్వారమొగిగాచి మెలగునట్టులమూల బలము నునిచి । యవనిజాధిప రహితమైనట్టినగర । మడవికంటెను దుష్కరంబని తలంచి । యఖిలజనములననుమతి నచటననుజు । నుండనియమించి

తానొక్కరుండ కదలి ॥

వ॥ నందిగ్రామంబు ప్రవేశించి పాదుకాముఖంబున రాజ్యంబు పాలింపుచుండె నంత నక్కడ ॥

గీ॥ క్షోణిజానాయకుడు చిత్రకూటశైల ౹ మునుల కత్యంతభక్తిమై మ్రొక్కి వారి ౹ యాజ్ఞగైకొనిచనె మోదమావహిల్ల ౹ పుణ్యవనమైన దండకారణ్యమునకు ॥

వ॥ అని హిమవన్నగాత్మజ కెరింగించెనని సూతుండు శౌనకాదులకుం జెప్పిన విని తరువాతి వృత్తాంతం బానతిమ్మనుటయు ॥

మ॥ చతురంబోధి పరీతభూభరిత భాస్వద్భూరి చారిత్ర సం ౹ తతవేదార్థ రహస్యధిక్ప్రకట వేదవ్యాసమాసింద్ర ప్రో ౹ క్షితదాసాఘ నిజాస్వయాభరణ విస్తీర్ణ ప్రభాపూరి తాం ౹ చితపుణ్యోదయదేశికోత్తము మణీ శ్రీవైష్ణవగ్రామణీ ॥

క॥ భాషాధినాధ సన్నిభ ౹ పాషండకులాద్రిభిదుర పాణి రమే శా ౹ న్వేషణ హృత్పంకజమృదు ౹ భాషణసదయాంతరంగ భాగ్యతురంగా ॥

మంత్రిసమకతాళవృత్తము ॥ వరగుణప్రసిద్ధసర్వ వైష్ణవౌఘనుస్తకా ౹ భరణ కల్మషాంబుద ప్రభంజనాహిరణ్య భూ ౹ ధరసమానధైర్యచారు ధర్మధర్మనందనా ౹ హరికృపాకటాక్ష వీక్షణార్జితార్య రక్షణా ॥

గద్య ॥ ఇది శ్రీభద్రాద్రిరామచంద్ర వరప్రసాద లబ్ధకవితా విచిత్ర ఆపస్తంబ సూత్రగిరుమ నామాత్య పుత్ర గౌతమగోత్ర ప్రసిద్ధ సిద్ధనమంత్రి ప్రణీతంబైన శ్రీసదాశివ రామాయణంబను మహాకావ్యంబునందు దశరథుండు రామచంద్రుని పట్టంబుగట్ట నుద్యోగించుటయు నింద్రుండు రామచంద్రునొద్దకు నారదుం బనుచుటయును మహేంద్ర మాయాప్రవేశంబును మందరకైకల మరుద్యోగంబును రాజ్యాభిషేక విఘ్నంబును దశరథు చింతనంబును సీతాలక్ష్మణ సమేతుండై రామచంద్రుండు వనంబునకరుగుటయును దశరథు మరణంబును భరతాగమనంబును భరతుండు రామచంద్రునొద్దకు చిత్రకూటాచలంబునకు బోవుటయు రామభద్రుని పాదుకలు కొని తెచ్చి భరతుండు తత్పరిముఖంబున నందిగ్రామంబున నిలచి రాజ్యపాలనంబు సేయుటయు నను కథలంగల అయోధ్యాకాండ సర్వంబును యేకాశ్వాసము సంపూర్ణము

శ్రీరామ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# అరణ్యకాండప్రారంభము.

శ్రీరమణీధవపద సర । సీరుహమధుపానమధుప శేఖరఘన గం । భీరక్షీరోదధి
వి । ద్యారూఢ కిడాంబి వెంకటాచార్యవరా ॥

వ॥ విన నవధరింపుము సూతుండు శౌనకాదులకిట్లనియె నట్లు రామచంద్రుండు
దండకారణ్య గమనోన్ముఖుండై ॥

మ॥ శరచాపాంచిత హస్తుడై కొలచి భాస్వత్స్ఫూర్తి శోభిల్లు సో । దరుడుం
జానకి వెంటరాగ మదవేదండాహి పంచాస్య సూ । కరభల్లూకలులాయ యుక్తమగు
నక్కాంతారముం జొచ్చి స । స్వరబాణాసనశింజనీ రవము చేతన్ వానిబోదోలుచున్ ॥

చ॥ సుపథముగానొనర్చుచు యశోధనుడవ్వల నేగి ముందటన్ । దపసులకొంద
రంగని యథావిధి వందనమాచరించి వా । రపరిమితానుమోదమున నాశిషముల్ దగనిచ్చి
నిల్పనా । తపసకులప్రదీపకుడు తద్దివసంబట నిల్చి వేగినన్ ॥

క॥ అమ్మునులనీడుకొల్గొని । తమ్ముడు సీతయును దాను ధైర్యరస సహా ।
యమ్మునగైకొని యధీశ్వర । యమ్మునచని చనియు బంధురారణ్యమునన్ ॥

ఉ॥ కాంచిరిభూరి భూధరసమ కర్కశ కాయు విదీర్ఘ దంష్ట్ర । క్రాంచిత నేత్ర
శక్రముఖ రాఖిలనిర్జరవీరబృంద ధీ । ప్రపంచలితాట్టహాసు బహుసాధనహస్తు ప్రశస్త
నామన । క్తంచరు పీడితార్య బుధతాపసనాథు విరాధునుగ్రునన్ ॥

వ॥ కనుంగొని వానిరూపంబునకు విస్మయులగుచు నవ్వలజనుచుండ మార్గం
బున కడ్డంబువచ్చి యానిశీధినీచరుండు ॥

చ॥ జనకతనూజబట్టి తనచంకను బెట్టుకరాముజేరి ఘర్జనమొనరింప నానృపుడు
చండకృశానునిబోలి యమ్మహాదనుజుని మేన నస్త్ర సముదాయము జొన్పిననొచ్చి
యాత్మలో । ననుగనలొందివాడవని నందన నచ్చటడించి రోజుచున్ ॥

గీ॥ సింహనాదంబుగావించి చేతిశూల । మారఘూత్తముపై నేయ నపుడుదాని ।
భల్లములద్రుంచె సౌమిత్రి పటుశరముల । నసురవరుమేన నాటించె యాగ్రహమున ॥

వ॥ ఇట్లుగృచ్చిన నొచ్చియు జలింపని ధైర్యంబున నావిభారీచరుండు ఖడ్గంబు
గొని వ్రేయుడు వాడు పంచత్వంబునొంది యసుర కాయంబువిడచి గంధర్వశరీరంబు
గైకొని ॥

క॥ మనుకులునిబహువిధంబుల । వినుతింపుచు నిట్లనియె వినుతుంబురుడన్ ।
ధనదునిశాపవశంబున । దనుజత్వమునొందిమీరు దండించుటయున్ ॥

క॥ హేయాశ్రియమగురాక్షస । కాయంబెడబాశిపుపుడ గంధర్వుడనై ।
శ్రేయములగంటిమునివర । తోయజవనమిత్ర నీలతోయదగాత్ర ॥

క॥ జననుతయిచటికి నిరుయో । జనముల శరభంగడనెడుసన్ముని వసియిం ।

చినయాశ్రమంబు గల ద । య్యనఘునిగనబొండు భద్రమగుమీకచటన్ ॥

వ॥ అనిపల్కి తుంబురుండు నిజలోకంబునకరిగె నంత నా రఘూద్వహుండు శరభంగదర్శన సముల్లాసియై యరుగుచు నుండట ॥

సీ॥ గురుతరోజ్వలబల చిరజవాశ్వసహస్ర మమరబూనిన నిజయానమొప్ప నతులితసౌందర్య యౌవ్వనంబునబొల్చు రమణులువింజామరములువీవ । జరయును రుజయును బొరయకవిలసిల్లు క్రతుభుజసంఘంబు గదసికొల్వ । యోషధిశునకు పెన్నుద్దియై యసగిన ధవళాతపత్ర సత్కాంతులొలయ । విమలమణిమయకాంచన వివిధ భూష । ణాంబరంబులదీదితుల్ సకలదిశల । యంపుగనువట్టగా మహానందమునను । జనెడ నల వేయికన్నుల ఘనునిగాంచి ॥

చ॥ యరగనివానిపోలె నిత డెవ్వడొకో పటువైభవంబుచే । నరిగెడుపాకశాసనుని యట్లులనీఘనుడందు భోగముల్ । ధరగలమానవేంద్ర సముదాయమునందుల జూడమిమ్మహా । పురుషుని తొంటిపుట్టువున పుణ్యములెట్టివి జేశినాడకో ॥

క॥ ఈమతుతైశ్వర్యంబె । కామం బెత్తినను గల్గనేరదుబో । వేయుంగన్నుల ధారకును । నీయనఘాత్మునకుదక్క నితరులకెంతన్ ॥

వ॥ అని నిజానుజన్మునితోడం బలుకునవసరంబున నముచి దమనుండు తాటకాంతకునింగాంచి యితండు జటావల్కలంబులు ధరియించి యడవుల నిముముల గుడుచుచు పాదచారియై దిమ్మరుచున్న వాడు గావున కనుంగొన బోలదనుచు మార్గంబు దప్పించి చనుచుండ తదగ్రభాగంబున ॥

సీ॥ కాంచనవరమణి ఖచితమంటపమహో దంచితరత్నసిహ్మాసనమున । నుర్వీతనూభవాయుతుడు దివ్యంబరా భరణభూషితుడు సుగంధపూజ్య । కుసుమదామధరుండు బిసరుహాసనముఖ్య దేవతాసందోహసేవితుండు । భూషణానిపద సంపూరిత శ్రవణుండు భరతలక్ష్మణ రిపుభంజనాది । సహితుడై యొప్పు రవికులస్వామిగాంచి । యచ్చెరువునొంది తొంటి దిక్కరయుడచట । తపసిసాబగున నధికమువంబుతోడ । విపినమునసేగు నారామవిభునిజూచి ॥

చ॥ హరిహయుడాత్మలోపల మహాద్భుతమంది యిదేమిచిత్రమో । మొసగగ రాదుడెందమున యేభ్రమగొంటినో లేక దేవతా । వసుడనొగానో నాకిట దివాకర వంశజు మాయగప్పెనో । పరమమునీంద్రుడైన శరభంగుడెయిమ్మెయి మోసపుచ్చెనో ॥

క॥ అనియిట్లు పెక్కుభంగుల । తనలోజింతించివృత్ర దమనుడుపిదపన్ । మన మలర రామచంద్రుని । గనియెన్ శిరోజతెరఘుగా శైలసుతా ॥

వ॥ అది యెట్లొధంబనిన నెరింగించెద ॥

సీ॥ అంబగాలికిఁడినిల్వ నభ్యాసమొనరించు వాతలుగలబోడ్డు తమ్మివాని । తను బోలునిందుఁబ్రి తానంబుభక్తిమై పూజమిల్లనఘిఁ జేకొనెడువాని । తారకబ్రహ్మ మీతండునిక్కంబని । వేదముల్ ఘోషింప వినెడువాని । రావణాసురుఁద్రుంచి రక్షింపు మమ్మను నాడికేయుల మొరలరయువాని । దాసజనములఁబోషించు తలఁపువాని । సంతతానంద పూర్ణుఁడై సకలజగము । లమర పాలించువాని యత్యంతవిభవ । మునజలంగెడువాని సన్మూర్తిఁ వాని ॥

వ॥ కని భయసంభ్రమంబులు మనంబున ముప్పిరిగొన రథంబుడిగ్గి రఘునందనుని పదాంబుజంబుల కొరగి లేచి నిటల తటఘటిత కరకమలుండై యిట్లనియె ॥

ఉ॥ శంకరధాతృముఖ్య సురసన్నుతసజ్జన యోగిబృంద వ్యా । త్సాంకజచంచరీక భవబంధవిదూర రమేశకోటి మీ । నాంకనిభాంగభాస్కర హిమాంశువిలోచన పన్నగేంద్రప । ర్యంక ఖగేంద్రవాహన జవాద్రిఁనముష్ట నిశాటమర్దనా ॥

ఉ॥ ఏలితిమూఁడులోకముల నిందుఁడనైనను బోటిధన్యులుం । బోలగలేరు నిక్కమని బుద్ధిదలంపుచు గర్వమొంది భూ । పాలురలోననిన్నొక నృపాలునిగా గదలంచి తేమనం । బోలును నావివేకము ప్రఫుల్లసరోరుహనేత్ర రాఘవా ॥

గీ॥ పాలకడలియు వైకుంఠ పట్టణంబు । శిరులఁబొలిచిన సాకేతపురము నృగ ని । శాట పన్నగసయుక్త పాండ్రఘోర । విపినమునుఁజూడ నీకొక్క విధమె యభవా ॥

వ॥ అని యభినుతించు బలాంతకుని నిజమాయా మోహితుంజేసి యయ్యతుల తేజోవిరాజిత రూపం బుపసంహరించి యప్పటియట్ల మునివేషంబుతో సీతా లక్ష్మణ సహితుండై పొడచూపిన నతండు తొంటిచందంబున భ్రమగొని రాజనందను గాదలంచి యిట్లనియె ॥

క॥ జనవర యీకాననమున । జనశ్యముగాదు పాదచారులకటు గా । వున మీరలడవినుండెడు । దినములుకడ చనినదనుక తేరనొప్పంగన్ ॥

వ॥ నాయరదంబెక్కి విహరింపుం డనవుండు దాశరథి యిట్లనియె ॥

ఉ॥ నిర్జరనాథమాదెసను నీకృపగల్గుట జేశిపల్కుటల్ । కర్జమెయైన మద్గురుని కట్టడకైకొని భోగపుంజముల్ । వర్జము జేశి యిట్లు వనవాసులమై మునివృత్తినుస్కి సౌ । ఖ్యార్జితమైన నీరథము యానముసేయగ బోలదారయన్ ॥

క॥ నీవెరుగనట్టిధర్మము । నీవసుధంగలదె త్రిభువనేశ్వర తలపన్ । నావిధము దెలియుకొరకై । యీవిధిబల్కితిరి సరయుచే ముదమయ్యెన్ ॥

వ॥ అని యతని నామంత్రణంబుజేశి యరుగుచో నించుకదూరంబున ॥

క॥ హరివంశాగ్రణిగాంచెను । పరతత్త్వార్థఁఁపరిసంగు భసితనిషంగున్ । వర

మౌని నిచయసంగుఁ । హరిపాదసరోజభృంగు నా శరభంగుఁ ॥

ఉ॥ కాంచినమస్కరించి నన గౌరవమొప్పగ నహాభంగి కీ । వించితపోధ
నుండు ప్రియవిష్ణునిరాముని పూజజేశి మో । హించినభక్తితో ఫలము లిచ్చిన గైకొని
జానకీశు డ । కాంచనగర్భసన్నిభుని గన్గొనియిట్లనవల్కె నర్మిలిన్ ॥

కం॥ మునినాథ మీమహత్త్వము కొనియాడగతరమె దివ్యకుసుమపరిమళం
బునబోనివాసనల ని । చ్చెను నీమతపోవని విశేషముల్లన్ ॥

ఉ॥ నావుడు మౌనిబల్కె నరనాయక నన్ దినమంచ వేడి యా । దేవవిభుండు
దానరుగుదెంచెను నిచ్చటికి మ్మహాత్ముడి । ఛా విధిచాల్పు దివ్యసుమసౌరభసిద్ధి వహించు
డుదుచే । నీవనిగల్గు పుష్పతతు లిచ్చె సుగంధము బంధురంబుగాన్ ॥

వ॥ అనిన నద్భుతచిత్తుండవో ల రామచంద్రుండు మునీంద్రా సురేంద్రుండు
బిల్చినం బోక నిల్చుటకు విశేషం బెద్ది మమ్ము గోటులు త్రిదివం బెవ్విధంబున జూడ
నబ్బునోయని మనంబున నవరతంబును గోరుచుందుము ॥

కం॥ అనవిని శరభంగుడు రా । మునియానన సీమగాంచి మునిసన్నుత యో ।
వనజదళనేత్ర సీయర । గనియర్థము గలదె ముజ్జగంబుల యందున్ ॥

వ॥ నావలనవిన నిచ్ఛయింతేని యవధరింపుము స్వర్గసౌఖ్యంబుల సిరంబులు
తత్సుకృతానుభవంబులుదీరిన క్రిమ్మర పుట్టువులకుం దెచ్చునట్లగుటయే నందువోవుట
కియ్యకొనక భవదియ్యాగమనంబున కెదురు చూచుచున్న వాడం గావున ॥

చ॥ జగములు బ్రస్తుతింపగ ప్రశస్తికినెక్కిన నీదులోక మ । చ్చుగ కృపసేయు
నాకు మధుసూదనయంచు నుతించు శాస్త్ర పారగుని మునీంద్రుని గన్గొని తరణ్యధివంశజు
డవ్విధంబె నీ । కగునని వత్సలత్వమున నానతియిచ్చిన బొంగి నిష్ఠతోన్ ॥

మ॥ రఘువంశాగ్రణి పాదయుగ్మమును హృద్రాజీవమధ్యంబు నం । దు ఘటిం
పంగను జేశిమింట సురసందోహంబు గీర్తింప న । య్యఘదూరుండును యోగమార్గ
మున కాయంబయ్యెడం బాశి మా । నిఘనుల్ బొందెడు విష్ణులోకమునకుం డేంచేసె
తుర్యస్థికిన్ ॥

వ॥ ఇవ్విధంబున నతనికిచ్యుతిలేని పదంబొసంగి ముందర లక్ష్మణుండు త్రోవ
సూప నశ్రమంబున వధూసమేతుండై మధురఫలంబు లారగింపుచు నెనెడ విశ్రి
మింపుచు తెనెలానుచు మృగంబుల బెగడొందంజేయుచు నరుగుచో ముందట ॥

చ॥ ఉటజములన్వసించు పరమోజ్వలమౌనుల గాంచి వాంకిం । దటమున మ్రొక్కి
నిల్చి ప్రియమంబున నాఘనులిచ్చుదీవనల్ । పటుతరభక్తి గైకొనిన భానుకులేశునితోడ
నందరో । క్కటనెలు గెత్తిపల్కి రనుకంపజనింపగ దైన్యచిత్తులై ॥

మ॥ శరమష్టాఘవిదార తాపసులమై సద్వృత్తినిట్లుండగా । కఠినోగ్రాసురులేగు
దెంచి యదయుంగారింపుచుం వేదముల్ । పఠియింపంగనువిన్న జన్నము లొనర్పం
గన్న క్రోధాత్ములై । జఠరంబుల్ వెసవ్రచ్చిచంపుదురు హింసాచాతురీధుర్యులై ॥

వ॥ కావున యాసురస్తోమముల గీటడంచి మమ్ము రక్షింపుము మాకు శరణంబగుము
రామభద్రయని ప్రార్థించిన మునులనాదరించి యంతుల కొండంబడి ప్రతినెగావించిన॥

మ॥ పృథివీనందన రామచంద్రుగని ధాత్రీనాథ నిష్కారణా । బ్రిధనంబేల
యొనర్పబూనెదవు దుర్భావంబుతో వారు నీ । పథమాత్రందలపోసిరే మునులకై
బాహాప్రతాపోగ్ర స । ద్రథవీరాగ్రణి నీకుబోలునె మహారణ్యంబులో నావుడుం॥

మ॥ రమణీమద్విశిఖాగ్ని కీలలను గర్వస్థయిర్యదైతేయ వ । ర్గమహాకానన
మేర్చిమానుల క్రొంగింగావింతుమోదంబు త । థ్యము నా వాక్యము తప్పగాదు విను
సప్తాంభోనిధుల్ వట్టినం । గమలాప్తుండు ప్రకాశదప్పిన గిరీంద్రంబుల్దరం గ్రుంగినం ॥

వ॥ అది యట్లుంటేని ॥

చ॥ ననుశరణంబునొందిన జనంబులకేను ప్రియుండజువ్వ న । య్యనఘులు
మత్ప్రియుల్ గుణగణాఢ్యులు దంచితపుణ్యులెల్ల శ్రో । ధనములకహర్గాలాఘనుల పా
యక నేను వసించిప్రాణమై । నను నరలేకయిత్తుచు ముదంబున వేరుదలంపనెట్టిచో ॥

క॥ విడుతుసాకేతమేనియు । విడుతునునిన్నేని యఖిల విభవంబేనిం । విడుతును
లక్ష్మణునేనియు । విడతునె శరణాగతులను వికచాబ్జముఖీ ॥

క॥ వ్రతములలో సత్యోత్తమ । వ్రతమదినాకరయ భక్తవత్సలుడ దయా ।
న్వితడ వారెచటనుండిన । సతతంబేనచటనుండు సత్యముసాధ్వీ ॥

ఉ॥ నావినిభూమిపుత్రి నరనాథుని ధీరతకుంబ్రతిజ్ఞకుం । భావములోన నబ్బ
పడి పల్కకయున్నకయుండె నంత రా । మావనిపాలు డద్దివస మచ్చటనెమ్మదినుండి
వేగినం । బావనమౌనివర్గములు పజ్జనురాజనుచుండి ముందటం ॥

ఉ॥ శ్రీశపదాబ్జసన్మధుప శేఖరు కల్మషదూరుభాను సం । కాశుమహామునీంద్ర
కులకంధిసుధాంశు గుణప్రపూర్ణ వా । ణీశసమప్రభావు విజితేంద్రియుతత్వ నిరూఢ
చిత్తు యో । గీశనుతుంబ్రశాంతు విబుధేంద్రవిచక్షణు నాసుతీక్ష్ణుం ॥

వ॥ కనుంగొని యభివందనంబాచరించి యాసంయమీంద్రుచేత సత్కారంబులు
వడసి బ్రహృష్టాంతరంగుండై తదనుమతంబునం గొన్ని దినంబులు నశ్రమంబున
నచ్చట వసియించె ॥

ఉ॥ భూరిగుణోన్నతుండు రఘుపుంగవుడింతియు తానుతమ్ముడుం । సారమతిం
సుతీక్ష్ణముని చంద్రిసదండ వసించియుండ నా । చేరువమౌనిసంఘకము చేరగవచ్చి

నృపావతంసుచే । గౌరతగాంచి యంజలులు గైకొనిపల్కిరి యందరక్తిలిన్ ॥

శా॥ రక్షోరాజవిపక్ష భక్తజన సంరక్షామరద్యాక్ష లో । క క్షేమప్రదపక్షివాహన మహాకారుణ్యవారాశి స । ర్వాణీశ్వోశ్వర మస్తకాభరణ శ్రీవక్షా నృహర్యక్షఫా । లాక్షస్తోత్రికటాక్ష వీక్షణము ముత్త్వాసీక భూరిక్షమా ॥

క॥ ఇచ్చటికిమీరలెన్నడు । విచ్చేయుదురో యటంచు వేమరు మదిలో । హెచ్చినకోరికచేతను । నిచ్చలు నెదురెదురుచూడ నేడుఫలించెన్ ॥

సీ॥ అనఘాత్మపద్మభవాభవసేవిత చనుదెంచు మత్తపోవనములెల్ల । కనుగొనననవిని కాకుత్స్థతిలకుండు మదిలోనసంతోష మగ్నుడగుచు । మునులార యింతకంటెను నాకుమరియొండు పనియున్న దేయని పడతితాను । సౌమిత్రిగూడి నాసంయమీంద్రుల వెంట నేగివారథిథులై నిచ్చనట్టి । యర్చనలుబ్రేమగైకొని యనుదినంబు । నహాభంగినివిందులు నారగింపు । చును విహారంబుసలుపుచు దనుజవరుల । వెదకిచంపుచునుండె నావిపినమునను ॥

వ॥ ఇవ్విధంబున రఘువరుం డవ్వనంబున విహరింపుచుండి యొక్కచో నంచితధ్వానపూరంబగు కాసారంబు గనుంగొని మునులకిట్లనియె ॥

చ॥ అనఘచరిత్రులార యెటులబ్బెనొకో శ్రవణానుమోదమై । తనరెడునట్టి యీవిలసితధ్వని దీనినెరుంగజెప్పుడా । యనవుడు వారలిట్లనిరి యర్కకులాధిప మాండకర్ణియన్ । మునిపతియిచ్చటందపము మున్నొనరింపుచు నుండ నంతయున్ ॥

చ॥ బలరిపుపంపుబూని సురభామినులేవురు వచ్చియుండటన్ । సలలితభంగి గృమ్మరగ సంయమివర్యుడు వారిగాంచి సం । చలితమదస్కుడై మరుడు సందిడిబెట్టిన నోర్వలేక నప్పాలతుకతో మెలంగుటకు బుద్ధిదలంచి తపోబలంబునన్ ॥

ఉ॥ ఖోరుననీజకాశయము పొందుగ గల్పనజేశిదీనిలో । భూరిమణిప్రయుక్తమయి పొల్పుదనర్పు సువర్ణసౌధమున్ । నేరుపుతో నొనర్చికొని నిర్జరభామలగూడియున్నవా । డారవమచ్చరాంగనల యంచితగానము మానవేశ్వరా ॥

వ॥ అని యెరింగించిన రఘునందనుండు మనంబున నతని నభినందింపుచు నత్తాపసోత్తములం గూడి క్రమంబున ॥

చ॥ యడనెడ నాశ్రమంబుల మునీంద్రులగాంచి నమస్కరించి వా । రిడిన యుపాయనంబులొగి నిష్టముగాగొని భక్తియుక్తిచే । గడువినయంబుసేయుచు సగౌరవమొప్పగ నంతవీడుకోల్పడసియరుగుచున్ మృదుఫలంబులు వేడుకనారగింపుచున్

సీ॥ కైరవకల్హార కమనియ్యసారస బకనక్రఝష కర్కటరథాంగ । కలహంస చక్రవాకప్రకరంబును విమలగంభీరాంబు విపులసైక । తస్థలంబులు ఫుల్లతామర

గావించి వశియింపుచును ప్రియముగను ॥

సీ॥ మునులసేవించి యయ్యనఘుల వలనను ఘనతరంబగుపుణ్య కథలువినుచు। నొక్కొక్కయెడలను గ్రిక్కిరిసినయట్టి మునురు వెమ్ము జెట్టిదముగాగ। బుట్టినకార్చిచ్చు నట్టనవరుణ బాణములేసియుడిపి యశ్రమమొనర్చి। కొనియున్న తాపస కోటికి మోదంబు గావింపుచునుగుంపు గలుగుతరుల। నీడలనువిశ్రమింపుచు నిర్మలోద। కములు ద్రావుచు నొల్లనశ్రమమువాయ। తాళవృంతంబువల పలికేలబూని। విసరికొనుచునుఘోర విపినమునను ॥

వ॥ బహుభంగుల వినోదంబులు సలుపుచు నెడనెడన మానుషకృత్యంబు లాచరింపుచు మాయామానుష విగ్రహంబగు రఘునందనుండనాయాసంబుగా నియమవ్రతసంవత్సరంబుల యందు దశాబ్దంబులుగడపె మొక్కవాడు మరల సుతీక్ష్ణ మునీంద్రుం జేరి సవినయపూర్వకముగా నిట్లనియె ॥

సీ॥ ఎవ్వడాపోశనం బిరువుగాగైకొనె గణుతింపరానియాకంధిజలము। లెవ్వడు వింధ్యాద్రి హెచ్చుగానియ్యెక సమయంబుజేశె యచ్చట నెనిలిపె। నెవ్వడునహుషుని నిందప్రపదభ్రష్టు గావించిసర్పంబు గానొనర్చె। నెవ్వడువాతాపి నిసుమంతకడిగాగ మెక్కిగరగినదేహ్న నక్కజముగ। నట్టికుంభజుపాలికి నరుగుకోర్కె। యాత్మలోపల జనియించె ననఘచరిత। నౌనరనాథునుజెచ్చట నుండునాకు। నెరుగగా బల్కుమన నతడిట్టులనియె ॥

చ॥ రఘుకులవర్యనయ్యనఘు బ్రస్తుతిజేశిన యంతమాత్ర నే। యఘములు బాయుగాంచిన మహాఫలమెన్న నశక్యమట్టి పు। ణ్యఘృణి సుధీజనస్తుతు సనాతనధర్మధురీణుధీరు మా। నిఘనుని యాశ్రమంబునకు నిన్నసుపన్నమునుమున్న గోరితిన్ ॥

వ॥ కావున నందుబొమ్మని యగస్త్య నియునికి యరుంగంబల్కి వీడ్కొలిపె నప్పుడు జనకజా లక్ష్మణసహితుండై చని యపరిమిత ప్రమోదంబున ॥

ఉ॥ భానుకులుండుగాంచె నఘపర్వతవాస వునీతమచ్చరున్। ధీనిధిసద్గుణాకరుని నీరధితోయకరాంబుజాతు వి। జ్ఞానఘనుందయామయు ప్రశాంతుపయోరుహ సంభవా భువి। ద్యానగదర్పణాకైరవ సహస్రగభస్త్య నగస్త్య నర్మిలిన్ ॥

వ॥ కనుంగొని యతనిపాదంబులకు బ్రణమిల్లిన లేవనెత్తి యమ్మునిసింహుండు యథోచితగతులం బూజించి మధురఫలంబు లొసంగ సంతుష్ట హృదయుండేశి నాటిరేయుగడిపె మరునాడు కాలోచితకృత్యంబులు జరిపి యమోఘంబులు బాణంబులు నక్షయతూణీరంబును మేరుతుల్యంబైన వైష్ణవ శరాసనంబును ఖడ్గంబును నొసంగినగైకొని యచ్చోటం గొన్నిదినంబులు నిలచి యతనివలన వర్ణాశ్రమ ధర్మంబులు

రాజనీతియు దక్షుఁడగుల్గు విశేషంబులు నెఱింగికొని యమ్మునిపతిచేత ననుజ్ఞాతుండై॥

క॥ ఖరదూషణాదిరాక్షస । వరులఁదెగటార్చిమాని వర్గంబునకుఁ । బరితో
షము సేయఁగ వ్యా । త్సరసిజమునదలచి రామచంద్రుండంతన్ ॥

చ॥ జనకుని కూర్మిపుత్రియను జన్మదుదానరుదేర సత్వరం । బున నొకకొంత
దవ్వరిగి మోదమెలర్పగ గాంచెముందటన్ । ఘనబలవైనతేయ పరికంపితశత్రుని
కాయజ్ఞాన సా । ధన సముపాయ భూరివసుధాధరకాయు జటాయువుందగన్ ॥

క॥ కనియతనియావమునకును । మనమునసచ్ఛరువుప్పొందు మనుజేశుని గొ ।
బ్బున జేరవచ్చి ఖగపతి । వినయంబున మ్రొక్కి నిలిచి వెసనిట్లనియెన్ ॥

ఉ॥ భూజనపాలయేనరుణ పుత్రుఁడ పేరు జటాయువందుఁ వి । భ్రాజితకీర్తి
పంక్తిరథ బద్ధసఖుండనన్న దా । నీజగతిస్థలంబుపయి నేమఁటియొంటి నిడించిపోవ నా ।
యోజనఁ బెట్టగావగల నొందుమ ద్విమ్మరుచుండి నియ్యెడన్ ॥

వ॥ మిమ్ముంగంటి నాజన్మసాఫల్యంబయ్యె నయ్యా యేనుదేవరబంటను దుర్గ
మారణ్యంబుల నొంటిం దిరుగుచున్నవారలు మీయడుగులు గొలిచియుండెదననుం
డుస్మితవదనుండై రామచంద్రుండు ॥

క॥ అమలచరిత్రమ గృధ్రో । త్తమపనిగలయపుడనిన్ను దలచెదనుని సం ।
భ్రమమలర నతనిపిడ్కొని । ప్రమదయు లక్ష్మణునుతనను పజ్జరాగన్ ॥

వ॥ పంచవటీస్థలంబునకుం జని యచ్చట వశియింపందలంచి తమ్మునిమోము
గనుంగొనిన నతండతని యభిమతంబెఱింగి నొక్కపర్ణశాల యమర్చి సమర్పించిన
ననుజుని చాతుర్యంబునకు మెచ్చుచు నందువశియించె దానిచెంతననొక్క యుటజంబు
గల్పించుకొని సుమిత్రాత్మజుం డతనిం గొలిచియుండె ॥

చ॥ అనుపమకీర్తిరామ వసుధాధిపుడచ్చట నిల్చి ధారుణీ । తనయయు దాను
నెంతయు ముదంబునదేలుచు లక్ష్మణుండు దె । చ్చినఫలముల్ బ్రియంబునను
జేకొనుచున్ మునిరాజువోలె న । వ్వనివశియించెనున్న వనవాసదినంబులు బుచ్చు
చొర్కెఁచేన్ ॥

అంత ॥ క॥ దశకంఠానుజఘన క । కశయగు శూర్పణఖ యచటికాన
దిరుగుచున్ । దళ శతలోచననిభు న । ద్దశరథవరసూనుగాంచి తద్దయునపుడున్ ॥

వ॥ పంచాశుగాస్త్ర పీడ్యమానసయై యొకనేర్పున నతనిపొందికై గావించెదనని
తలంచి తదియ్య సుందర బునకు రెప్పవెట్టక తప్పకచూచుచు కామరూపిణియై
డాయంజని యిట్లనియె ॥

క॥ జనవినుతమీకు నెయ్యెడ । జననము నేరెద్దియుటకు జనుదేరంగా । వని

యేమి నితఁడు నీమా । నిని నీవెను వెంటవచ్చె నెపమొద్దికగన్॥

చ॥ యెఱుఁగఁగఁజేయుమన్న నతఁడింతయు నీసర పోవనీక నా । సురపతితోడ దత్క్రమము చొప్పడఁజెప్పిన నాలకించి యు । స్ఫురణుచు వెచ్చనూర్చి కనుఁదోఁగల గొబ్బున నీరునించి యో । సురచిరగాత్రి నిన్నదయ జూచి చతుర్ముఖుఁ డిట్లు వ్రాసెనే॥

క॥ కారమాలిన దైవంబీ । తెరఁగున విధియించి యిటుల తృప్తిఁగొనక పుణ్యరహిత మైన దీనిని నీ । తరుణిఁగాఁ జేసె నీకు ధర్మచ్యుతుఁడై ॥

సీ॥ ఆతని నైజమేమనవచ్చునట్లుండె నేనరనాయక నీవు మిగుల । కట్టడి యత్యంత కౌటిల్యచలచిత్త పరపీడనుద్యోగ దురితనిలయ । దుర్జనాశ్రియ మహా దుఃఖౌఘభాజన యిది యున్న చోట నొక్కించుకేని । ధర్మమును నీతిపుణ్యంబు దయయు నిచ్చ । గుణము సత్యంబు లేదిట్టి కొమ్మతోడి । సంగడము మాను నీ రాజ్యంబు నీకు । నెప్పటట్టుల చేకూడు నిదినిజంబూ ॥

క॥ యీ మానిని సుందరియని । నీమదిలో నాసగొనకు నృపవరసాబ గే । లా ముఖమున బడికంకనె । కామినిభాగ్యంబుగలది గావలెనెందున్ ॥

వ॥ అని మఱియును ॥

క॥ సౌందర్యము భాగ్యంబును । నెందే నావంటి మగువకే యభినవ । ట్లెందరికి గలుగనేర్చునె । యిందీవరనేత్రి యింక నేనియు నీవున్ ॥

వ॥ దీనిం బరిత్యజించి నన్ను గ్రహింపుము భవదీయ పరిపంథివర్గంబు బరిమార్చి నిన్న యోధ్య నేలించెద తథ్యంబేను రావణుచెలియల శూర్పనఖ యనుదాన నని వెండియు ॥

చ॥ బలిమి జగత్త్రయీశులను బాధలఁ బెట్టుచు వాటగొంచు దో । ర్బలఘన విక్రమస్థితిని రంజిలుచున్న దశాస్యు సోదరిన్ । సలలితభంగి నేలు నెరజాణని తండను పట్టికేతఁయుం । గలిగిన నీకు జేకురునె కాదె నిరంతర సౌఖ్యసంపదల్ ॥

వ॥ కావున ॥

క॥ అరవిందాక్షులచిత్తము । పురుషుల భాగ్యంబు చొప్ప భూస్థలిపైనె । వ్వరికైన నేని తెలియం । దరమే యనుపల్కులిపుడు తథ్యంబనియెన్ ॥

క॥ చను దెమ్ము నిన్ను దోకొని । యనుల క్ష్మణు జనకపుత్రి నొగిదును మియు నుం । డును సీతరామచంద్రుని । గనుఁగొని చిరునవ్వు నవ్వ గని యది యంతన్ ॥

శా॥ ఘోరాకారత బేర్చి యార్పులొగి దిక్కుల్ నిండగా దేవతా । వారంబుల్ దివినుండి బెగ్గిలగ దుర్వారోగ్ర రోషాస్యయై । క్రూరత్వంబున సీతమ్రింగఁజను రక్షోభామ నీక్షించి హుం । కారపార్శ్వనిదానినిల్పి రఘుభూకాంతుండు దాగ్రిక్కనన్ ॥

క॥ అనుజన్ము బిలచిమాచితె । జనకజపైవచ్చెదీని సత్వరమున ము । క్కనుగొసి ప్రచ్చుమనుడ । య్యనఘుడు రాఘవుని యాజ్ఞ నటుజేయుటయుర్ ॥

వ॥ ఆనక్తంచరిమేన నపారంబుగా రుధిరంబంట హాహాకారంబుసేయుచు జనస్థానంబున ననేకదానవ పరివృతుండైయున్న ఖరాసురుజారబోయి నేలంబడి పొరలియేడ్చుచు రామచంద్రునివలన దనకుప్రాప్తించిన భంగంబంతయు నెరింగించిన ॥

ఉ॥ కన్నులనిప్పులొల్కలయ కాలకృశానుడపోలె మండుచుర్ । గన్నన నా ఖరుండు సురకంటకవర్గము గాంచికంటిరే । యన్నరుడాచరించిన మహాద్భుతసాహస మిట్టిదెన్నడు ॥ న్గన్నదిలెదెకొన్నయదిగాదు ధరాస్థలిమీద నెయ్యెడర్ ॥

చ॥ అనిరఘువంశవర్యుని పరాక్రమమొప్ప జయింతుననుచు దా । ఘనతర రోషసంజనిత కాలభుజంగము భంగిరోజుచుర్ । దనుజుల నెల్లరాబనిచి తానురయంబున లేచి సర్వ సా । ధనములనొప్పుతేరు త్వాతంబుగ నెక్కె సురాళిబెగ్గలర్ ॥

వ॥ చతురంగబలసమేతుండై భుజవిక్రమా టోపులు పరశు పట్టసము సలతో మరభిండివాలాది నానాద్యాయుధ హస్తులగు సేనగాని పరువయజ్ఞ శత్రువిహంగ మకరవీరనేత్ర కాలకర్మ మహాకపాల రుధిరాశనరక్తనేత్ర రక్తమాలిత్రిశిర ప్రమాది వికృతి వజ్రఘోష వజ్రదంష్ట్ర మహిషభైరవ మదగజహయముఖ స్థూలనేత్ర దుర్జయంబు కాశ్రియ పృథుశ్రీవదూషణాది దనుజయోధులు పదునాల్గువేలు నడువ నెడ నెడ బొడముదుర్నిమిత్తంబులకు దలంకక ధరణిగ్రక్కదల పంచవటికిక్క జనుచుండె నట రామచంద్రుం డనుజునిం గనుంగొని ॥

చ॥ జననుతశీలముక్కిడిని శాటినెపంబున గ్రూరరక్కసుల్ । మనలనెదుర్ప వచ్చిరదె మైకొనిపోరగ యేనెసాలు దుం । జనకజముగ్ధ వాండ్రగని శంకిలగాగలదట్లుగాన తో । డ్కొనిచని యదిప్రైనునిచి కోమలిగాచుకయుండు మీవగిర్ ॥

క॥ నావుండమ్మంయిజని యత । డావనితామణినిగిరి గుహాంతరమున దా । వావిరినునిచిధనుర్ధరు । డైవిక్రమమొప్పనిలచె ననదృశశక్తిన్ ॥

ఉ॥ అంతరఘూత్తముం డతులితాంచిత భాసురరత్నకంకటం । బెంతయు వేడ్కతోదొడిని యిద్ధుగతూణి యుగంబుగట్టి య । త్యంతదయంబునం బటుశరాసనమెక్కిడి జ్యారవంబు ది । గ్దంతులకర్ణపూరమగు కైవడిజేశె మహాగ్రమూర్తియై ॥

వ॥ అయ్యవసరంబున ॥

చ॥ యుద్ధబలశౌర్యదానవుల నొక్కడతా నెదిరించి నాటితో । దురమొనరింప మైకొనియె తోయజబాంధవ వంశవర్ధనుం । డరుదదిసూతమంచు నిఖిలామరబృందము

గనుపట్టనయ్యెడన్ ॥
తెల్లవచ్చియం | బరమునునిల్చియుండిరి విమానరుచుల్
వ॥ అంత ॥ క॥ వరమాతంగస్యందన తురగోద్ధత భటచయంబు దుర్దమ
లీలన్ | నరవరునిమీదగవిసెన్ | ఖరదైత్యుడు వెనకనిలచి కడకంబరసన్ ॥

ఇవ్విధంబున ॥

క॥ బలములుతనపైగవసిన | బలయుతుడారాఘవుండు పాయక శౌర్యో |
జ్జ్వలుడై దానవవీరుల | బలువిడి విశిఖములనేసె పటుతరశక్తిన్ ॥
ఉ॥ ఈసునదైత్యులంత వసుధేశునిపై పటుశక్తితోమర | ప్రాసముశేసియార్చిన
నృపాలశిఖామణి వానిచూర్ణముల్ | జేసిసమగ్రధైర్యమున చెచ్చరబాణపరంపరల్
మహో | ల్లాసము తోడజొన్ని కడులాఘవమేర్పడ వారిమేనులన్ ॥
గీ॥ దైత్యవీరులపుడు దలకకనందరు | నొక్కపెట్టకడసి యుగ్రశరము | లా
నృపాలవరుని యంగంబుజొన్పిన | నలుకవడిమివారి యవయవములా ॥
వ॥ నిశితనిష్ఠుర శరంబులునించినొంచియు తూలించియుండన్ని విసరక వెండియు
నారఘూద్వహుండు కాలాగ్ని సదృశక్రోధుండును సంవర్త వేళాసముద్దీపిత చండ
మార్తాండుండునుంబోలె తేజరిల్లుచు భీషణాకారుండై పేర్చి నిజధనుర్విముక్తామోఘ
బాణప్రవర్షంబు ఖరసేనపైగురియించిన పాదజంఘజానూరుమధ్య బాహుకంఠ దేశం
బులు దెగి నేలంగూలు కాల్బలంబులును నాశ్వికులతోడ నేత్రోర్వి రూపరుతురంగం
బులును కేతనచక్ర నానాసాధన రథికసారథులతోడం బెక్కుచిద్రుపలై పుడమింబడు
రథంబులును తుండంబులుదెగి యుఫలకంబులుచ్చియు వాలంబుల వెడలిన ఘీంకారం
బులు సేయుచు మావటీలతో నవాళిలు మత్తేభంబులునై చతురంగ బలంబులుం
బొలియుచుండ నానృపవీరుని తేజోధైర్యస్థైర్య విక్రమంబులు గనుంగొని సహింపక
కంఠీరవంబుపై జను మత్త దంతావళంబుల చందంబున రుధిరాశన రక్తనేత్ర రక్త
మాలి వజ్రఘోష వజ్రద-ష్ట్రాలాదిగాగల్గు నెనమన్గురు దనుజయోధు లొక్క
పెట్ట రఘువీరునిపై గవసియదల్చి పరశుపట్ట సప్రాస తోమర కఠోరకుఠారక్షురికాది
నానాసాధనంబులువైచి భూనభోంతరాళంబు నిండనార్చిన నమ్మహాబలుండు వాని
నన్నియు నిజశిలీముఖంబుల చూర్ణంబుగావించి యందర ఖండనిశాతకాండంబుల జర్ఝరి
తాంగులం జేసిన బెండువడియు నంతంబోవక యొక్కుమ్మడి నవ్వుండు క్రొవ్వి యవక్ర
పరాక్రమంబున నుద్దండభుజాబలులైన రక్కసుల గలంపుచున్న వాడందరు నొక్క
పెట్టె పోదువుండేయుండు త్ర్యంచుండేపురూపరం జేయుండను నెలుంగులిచ్చి యొండొ
రులం బురికొల్పుకొని పెనుమంటపై గవయు మిడుతగమి చందంబున గవసిన
నతండు క్రోధారుణలోచనుండై వారలపై కందర్పాస్త్రంబేశిన నమ్మహాస్త్రంబశని

సదృశతీక్షణంబున నొకటికి పది పదికి నూరు నూటికి వేయునై యద్దానవ వీరులపై గవసి యప్పుడు ॥

చ॥ పదములుద్రుంచి జంఘలొగి భగ్నముగా నొనరించి యూరువుల్ । జద్రువలు జేశి వక్షములు చించిభుజాగ్రము లేవుమాపి బె । ట్టిదమగుకంఠశీమలు వడిందునుమాడియుసంతబోక పే । ర్చిదనుజసంఘకంబు మదసింధురవాజి రథాలినొక్కటన్ ॥

వ॥ తుత్రుంచితెంచి రూపుమాపుచు రెక్కలుగల భుజంగమంబుచాడ్పున నెక్కడంజూచినం దానయై మంటలుమీయుచు క్షణమాత్రంబున ఖరదూషణ త్రిశిరులను మూలదైత్య యోధవ్రాతంబునుం దక్కదక్కుంగలుగు దానవసైన్యంబు చతురంగ బలసమేతంబుగా బాలియించి శాంతింబొంది మరలివచ్చి రామభద్రుని నిషంగంబు సొచ్చెనంత ॥

క॥ సేనలుమడశినదూషణు । డానరనాయకునిమీద నతిరోషముతో । తానేగుదెంచిరయమున । నానాస్త్రములేశియార్చి నంగట్టలుకన్ ॥

చ॥ ప్రణుతపరాక్రముండు రఘురాముడు వానిరథంబు సూతకే । తనతురగ ప్రయుక్తముగ దారుణబాణములేసి త్రుంచుడుం । గినిశినిశాటుడుద్ధతిని కేలనుశూలము దాల్చునంత న । మ్మనుకులవల్లభుండ సురమస్తకముర్ధర గూల్చెవ్రేల్మిడిన్ ॥

వ॥ ఇవ్విధంబున ॥

క॥ భీషణుసంతతమునిజన । శోషణుపటుశౌర్యదనుజ సూదనసుకథా । దూషణుఘనదుర్భాషణు । దూషనుగూల్చుటయుగాంచి దోర్దర్పగడకన్ ॥

వ॥ ఖర త్రిశిరులు మూలదైత్యులంగూడి చుట్టుముట్టి యొక్కపెట్ట బాణపరంపరలు నిగుడించిన వానినన్నియు నిజసాయకంబుల బోకార్చి యప్పుడు ॥

ఉ॥ భూరికపాలముల్వగుల భూధరసన్నిభమైనకాయముల్ । దూరమహాయుధప్రతతి తోజలువందెడు బాహుశాఖలుం । ధారుణిదెళ్లభీషణ రథంబులురాల మహాగ్రశౌర్య విస్ఫారతనేశనాన్నృపుడు సాయకపంక్తుల దైత్యవీరులన్ ॥

ఉ॥ సామజయానదాశరథి చాపవిముక్త మహాస్త్రలాఘవం । బేమనవచ్చునమ్ముదొడి గేయుటబాణములందుకొంట యు । ద్దామగతిన్ శరాసనము దార్పుటవే తెగవాపు టాసుర । స్తోమముబిట్టుదాకుటయు జూడగనేర్పడకుండె నయ్యెడన్ ॥

ఉ॥ ఆట్టిశరప్రనైపుణీయు నద్భుతవిక్రమ కేళిజూచియు । ప్పట్టునకోర్ధమెంత మదిప్రబ్బగసర్పముపోలె రోజుచున్ । నెట్టనవాఖరుండు రజనీచరహంత నెదిర్చిబాణముల్ । బిట్టుగగాత్రముంజొనిపి భీషణభంగని పొంగియార్చెనన్ ॥

మ॥ ఘనరోషస్థితిబేర్చిరాముడు మహాకంఠీరవేంద్రాకృతిన్ । దనుజాధీశుని మీన

ఘోరశర సంతానంబుగీలించి కే । తనముం ద్రుంచుడు నంతలో త్రిశిరు డుద్దామప్రతా
పంబునన్ । జనపాలాగ్రణిదాకెవార్చుచు భుజాసంరంభమేపారగన్ ॥

వ॥ అప్పుడు ॥

ఉ॥ నాకవిరోధియమ్మనుజ నాథునిపైకతినోగ్రసాయకా । నీకముగప్పుడా నృపతి
నేత్రములెఱ్ఱిన దెల్పకోపధుడున్ । దూకొనసూతుద్రుంచి యొకతూపునవాజుల గీట
డంచినం । బోకచలంబుపెంపునను భోరునదైత్యుడు ఖడ్గహస్తుడై ॥

క॥ కడియంబారినరఘుపతి । త్రిదశావలినంతసింప దృఢశక్తిని దు । ర్దమము
డగు త్రిశిరుశిరంబులు । పదిరత్రియమేసియవని పైబడగూల్చెన్ ॥

వ॥ అప్పుడు ॥

చ॥ వెసత్రిశిరుండుగూలుటకు వేమరుబేర్చినశోకవహ్నిచే । మసలుచునంతలో
ఖరుడు మానుగధైర్యముచిక్కబట్టి రా । ఘనబలవంతుపైగవసి సాయకపంక్తుల మేన
గప్పి వా । కసమునసిల్చిసంగరము గాంచునమర్త్యులు చాలబెగ్గిలన్ ॥

ఉ॥ వానికిశంకదక్కి రఘువల్లభుడద్భుత శౌర్యమొప్ప స । జ్యానినదంబుజేసి
వెసఖండశరంబులు జొన్పనొచ్చి య । ద్దానవుడంతరామ వసుధావరునమ్ములవెల్లి
జేల్చితో । డ్తోనొకబెట్టిదంబయిన తూపునజాపము రెండు జేయుడున్ ॥

క॥ జలజాప్తకులుడుదైత్యుని । బలమునకుంగరము మెచ్చి భావములోనం । దల
కక కుంభజుడిచ్చిన । లలితశరాసనముబూని లాఘవమొప్పన్ ॥

చ రయమునభూరిభీషణ శరంబులనాఖరునొంచి సారథిం । హయముల
జంపివిల్లునిమి యద్భుతవిక్రమభంగిశోభ్ వా । నియవయవంబులుచ్చిచన నిష్ఠుర బా
ణములేయజాల నొ । చ్చియుబాలివోనిబీరమున జొచ్చెరవాడు కృపాణపాణియై ॥

క॥ హరిహయునిమీదనురువడి । పరతెంచుమహీధరంబు పగిదినిదోషా । చర
వంతమీనజనుడా । ఖరునింగనిరాఘవుండు కడునుద్ధతుడై ॥

చ॥ బలువిడిభీషణాస్త్రమున బాహుయుగంబునుద్రుంచిబంధు రో । జ్జ్వలతర
సాయకప్రతతి వక్షమునందునగీలుకొల్పి సా । ధులనలయించిచంపితివి దుర్దమవృత్తి
ననేకులన్మహా । ఖలుడవుగాననిన్నిపుడ కాలునివీటికిబుత్తు దుర్మతీ ॥

క॥ అనికనుగవకెంపొప్పగ । ఘనతరదివ్యాస్త్రమేసి కాకుస్థుడు భో । రున
ధనువునసంధించెను । గొనకొనిబ్రహ్మాండమెల్ల ఘూర్ణిల్లంగన్ ॥

వ॥ అంత ॥ చ॥ చటులోగ్రశుగ మిమ్మయిందొడివి చంచజ్జ్యాసమేతంబుగా ।
పటుబాహాబల శక్తిమైదవిరి శుంభత్ప్రక్రియన్నేసి ని । ష్కుటిలానేక మునీంద్రభీకరు
మహాక్రోధోగ్రదర్వీకరు । గటుపాపౌఘునకేకరున్ ఖరు నదాగాఢాంధ కారాకరున్॥

క॥ యేసిన సద్దివ్యాస్త్రం । బాసురవక్షంబుగాడి యవనింగూల్చెన్ । వాసవ వజ్రక్షతగత । భాసురభూధరముభంగి పటుశిఘ్రమునన్ ॥

వ॥ అప్పుడు ॥

క॥ పరమముదంబున నమరులు । గురియించిరికుసుమవృష్టి గొనకొనిమ్రోసెన్। సురదుందుభులువియచ్చర । తరుణులనాట్యంబులొప్పె తద్దయువరుసన్ ॥

వ॥ సకలమునీంద్రులు నానందకందళిత హృదయారవిందులైరి జగంబులు సంతసించెనంత ఖరదూషణ త్రిశిరులు రాక్షసరూపంబులంబాసి దివ్యశరీరంబులు దాల్చి యుతులవిమానారూఢులై రామచంద్రునకు నమస్కరించి నిఖిల మరసందోహం బభినందింప నవ్యయధామంబునకు జనిరని చెప్పినవిని దాక్షాయణి పురాసురదనునుం గనుంగొని మహాత్మా దుష్టవర్తనులగు దైత్యులు సుస్వరూపంబులు ధరియించి నిర్వాణపదంబునొందుటకు హేతువెద్ది మహాయోగీంద్రులు జారనసాధ్యంబగునట్టి లోకంబు వారలకెవ్విధంబున సంఘటించె తెలుపవేయనిన నయ్యిందుమౌళి యిట్లనియె ॥

మ॥ వనితానీపలుకట్టిదేనిజము దేవద్వేషులుంగ్రూర వ । ర్తనులైనను వారి పూర్వభవ సత్కర్మానుగుణ్యంబు పెం । పునసమ్మనులు బాసిదివ్యతనులై మోక్ష స్థితింజెందగా । గనిరా ధన్యులతొంటిపుట్టువెరుగం గాజేత నీకంతయున్ ॥

సీ॥ అతులతపోనిధియాజ్ఞవల్క్యుండన దనరినయట్టిసన్మునివరేణ్య । తనయులు శాంతులు దాంతులుధన్యులు పరమపావనులు బంధురదయాళు । లంచితపుణ్యులు కాంచనగర్భ సన్నిభులునక్రోధుల నిద్యచరితు । లలఘువిజ్ఞానులునవ్యయాపేక్ష ననునాత్మలోనిల్పి ఘనతపంబు । పెక్కువేలేండ్లుజరిపినప్రీతి జెంది । యేనుప్రత్యక్షమై వేడుదెద్దిమీకు । నిష్టమగునద్దినక్షిమై యిత్తుననిన । పూనివారుతపోగర్వమున జలంగి ॥

వ॥ వందనాదినందన కృత్యంబులుజరపక యీయ్యా వరమియ్యందలంతేని కల్మషాలయంబగునట్టి సంసారవృక్షఖండన కేళీకృత్యంబును ముక్తికాంతాపరిణయ మంగళోత్సవంబును ఘటింపంజేయుమనుండు వారలపలుకులకలుక వొడిమి మీరలు చేసనోపాయంబున పరిణయమార్గంబునను ముక్తివేడితిరి గావున మీయందు సాత్త్వికగుణంబు లీనమ్మైయున్నది యందుకతన రాక్షసయోనింబుట్టి జగదపకారులై వర్తించు కొన్నినాళ్లకు విష్ణుదేవుని దివ్యాస్త్రంబుల హతులరై పరమపదంబు పొందెదరని పల్కితి రోహితుండనైతి నది కారణంబుగా వారలు ఖరదూషణ త్రిశిరులైపుట్టి సమరంబు నంగూలి దివ్యధామంబు నొందిరని చెప్పి యిట్లనియె ॥

క॥ వినుమట్లధర్మమహార్తం । బున నిఖిలనిశాటవగుల బొలియించి మహా । ఘనతంబొలుపొందెను రా । ముని జేరగవచ్చియచటి మునిసంఘంబుల్ ॥

వ॥ బహువిధంగుల బ్రస్తుతించి యాశీర్వదించి చనిన సౌమిత్రి జనకపుత్రిందోడు కొనివచ్చి రామచంద్రునిం గొలిచియుండెనంత హతులైన సేనలను ఖరదూషణత్రిశిర దానవులంగాంచి శూర్పనఖ యత్యంత దుఃఖాక్రాంతయై సత్వరంబున లంకాపురంబున కరిగి శక్రజిదాదికుమారు లనేకదైత్యవీరులుంగొల్వ మహారాజ్వలమణీ ఖచితోత్తుంగ కాంచన సింహాసనంబునం గొలువున్న త్రిలోక కంటకుండగు దశకంఠుజూరంజని యాక్రందనంబుసేయుచు నిట్లనియె ॥

శా॥ కైలాసాచలమెత్తి శంకరునిచే గైకొన్న పెంపునిలిం । పాళింగెల్చినయట్టి నీదుఘన బాహాశక్తియిప్పట్టులం । దూలంబోవకవృద్ధినొంద నొకమర్త్యుండట్టిదాక్రాంత మై । నా లెక్కింపకనీదుసోదరి ననుందర్పంబుచే నుగ్రుడై ॥

ఉ॥ నన్నిటుభంగపెట్టెనని నవ్వనిపావకుభంగిపొంగుచున్ । కన్నులవిస్ఫులింగ ములు గ్రమ్మమహోరగమట్ల రోజుచుం । దన్నుభజించురాక్షస వితానములెల్లను జెగ్గిలంగ దా । గ్రన్ననచెల్లెలింగని సగర్వమెలర్పగ బల్కె నల్కతోన్ ॥

మ॥ వినగావింతలుబుట్టెమానవుడు దోర్వీర్యంబుచేకొల్వి చే । కెనెనన్నీగతి నెవ్వడాఖలుడు లక్షింపంగపేరెద్ది యం । వ్వనిపుత్రుండాకా నామమెయ్యది బలై శ్వర్యంబు లేపాటి భో । రుననాకేర్పడబల్కు వాని దెగటార్తున్ సంగరోర్వీస్థలిన్ ॥

క॥ తలకకదాబులి మీసం । బుల నుయ్యాలలూగకొల్వి భూతేశుని మం । టలకన్ను చేతమూశను । బాలియుటకుంబెంపుసేయ బోలుతలంపన్ ॥

క॥ సురగరుడోరగ రజనీ । చరవరదిక్పాలవరులు సభయులరై ద । క్కెరు లెవ్వరు తమకునధీ । శ్వరుడితడని కొల్తురకిఁ సతతమునన్నున్ ॥

చ॥ అనవినిచుప్పనాతి మొగమవ్వలగానిడి వెచ్చనూర్చుచున్ । కనుగవభాష్ప ముల్గొరుగ గద్గదికస్వరమేర్పడంగ న । ద్దనుజవరేణ్యుతో బలికె దైత్యకులోత్తమ యున్నరీతి నా । తనితెరగెల్లనీకు విశదంబుగజెప్పెద నాలకింపుమా ॥

సీ॥ దశరథక్షితినాథు తనయుడాతనిపేరు రాముండు ప్రియసి రత్నమును ని । జానుజుండునుదోన యారు ధేరజనకుని పనుపునమునివృత్తి వనికివచ్చి । యలుకమైదనుజ సంహారంబుసేయుచు వలనొప్ప పంచవటము జేరి । యలరుచునచ్చట నెలవుగావించుక మెలగయేనాచంత మెలగుచుండి । యతనుపట్టంపుమదదంతి యనగబరగు । నతనియింతినిబొడగని యాలతాంగి । సుందరంబునకాత్మలో చోద్యమంది । దాని గొనితెత్తునీకని పూనిచనినా ॥

వ॥ రాముండు క్రోధారుణ లోచనుండై లక్ష్మణునిబిలచి దీని విరూపితం జేసి తోలిచిపుచ్చుమని పలికిన ।

గీ॥ విలయకాలవహ్ని చలుపఁగానిసౌమిత్రి । యొంగవికలజేసెనంత నేను । చెప్ప
వినిఖరుండు సేనాసమేతుఁడై । కడకనేఁగి రాము దొడరుటయును ॥

ఉ॥ ఆనరనాథుఁడించుకయు నాత్మఁదలంకక యుగ్రమూర్తియై । కానవమేర్చు పావకుని కైవడిఘోరశరాసనంబుచే । దానవసైన్యమంతయును దగ్ధముజేసిఖరాదియోధులం । బూనివధించిపంచవటి భూతసుఖంబున నున్నవాడనన్ ॥

వ॥ రావణుండు ప్రియుఁడితాంతరంగుండై యంతరంగంబున సనత్కుమార వచనంబులం దలంపుచుండెనని శర్వునకు బార్వతి యిట్లనియె ॥

గీ॥ యనఘచుప్పనాతి యట్లుజెప్పినవిని । యదరిపడకవాడు ముదముజెంది । మనములో సనత్కుమారునివచనంబు । దలచెననగనేమి తెలియఁజెప్పుడా ॥

వ॥ అనిన యన్నలినాక్షికి నలినాక్షుండిట్లనియె పంక్తికంధరుండు ముల్లోకంబులు బాధలవెట్టి దానవసామ్రాజ్య విభవంబునందు దనివినొంది యొక్కనాడు సనత్కుమారుంగాంచి యతనికి బ్రణతుండై అయ్యా సకలభోగంబులం దృప్తిజెందితి నింక కైవల్యంబు జేరందలంచెద నదియెవ్విధంబునం జేకూరు నెఱింగింపుమనుం డతం డిట్లనియె నాదైత్య ప్రార్థనాపరుండై భగవంతుండైన విష్ణుండు భవదియ్య పదార్థంబు మనుకులంబున రామచంద్రుండనం జనియించి జనకనియోగంబున నిజభార్యాసహితుండై వనంబునకేతెంచి కొంతకాలదినంబులకు చుప్పనాతినెపంబున నీమనోరథంబీడేరు సందియంబులేదని యాబ్రహ్మతపస్వి యంతర్ధానంబునొందె నంత పంక్తికంఠుండంత రఘుచంద్రాగమనంబున కెదురుసూచుచుండి యారాజపరమేశ్వరుండు పంచవటంబునకు వచ్చుట నిజసోదరిచెప్పిన విని సనత్కుమారుని వచనంబులు దలంచి తనకు కాలంబుచేకుఱియెనని కృతనిశ్చయుండై యదినిమిత్తంబుగా సంతసించె నవ్విధం బెఱుంగక చుప్పనాతియగు శూర్పణఖ రావణుమనంబు సీతపై దవిలి వర్తింపుటగాదలంచి యానిశాచరాధిపుతో నిట్లనియె ॥

ఉ॥ దానవనాథ రామ వసుధావరుగేహిని సుందరంబు నీ । కేనెఱిగింపసాధ్యమె గణింపఁగ నకేని యశక్యమైన నా । మానససీమలోపలను మానుగ గోచరమైన యంత యుక్తిఁ । బూనివినంగ జేసెదను బుద్ధిపరాకున నొందనీకుమీ ॥

సీ॥ పూర్వభవార్జిత పుణ్యఫలంబున మిందుగా ధాత సృజించెదాని । తచ్ఛుభగుణ సుకృతస్థితివలనను తనయయ్యెబడసెను ధరణిదాని । తద్దశతుల్యమై తనరుధన్యతగల్గి శ్రీయమునజాంకుంకుఁ బెంచెదాని । తత్సహస్రసమాన ధర్మధురీణత యువతిగానేలె రాఘవుఁడుదాని । తద్వితీయ్యానన్యశ దానశీలతగల్గ । కన్నులలర యేనుగంటిదాని । మూడులోకములను మును జూచియుంటిగను । వలనుమీఱ దానివంటిదాని ॥

ఉ॥ చూచితిదేవభామినుల సుంధరచారు విశాలరేఖలం । జూచితినాగకన్నియల చొప్పనుకాంతివిశేషముల్ మరిం । చూచితి మర్త్యభామినుల సోయగమైనను వారియందులం । జూచుటలేదురాఘువుని సుందరికింగల రూపసంపదల్ ॥

ఉ॥ దానవనాథ యూసతిపదంబులబోల్తురు దమ్మినెట్టివో । మానుగజూతమంచు గరిమందరుణారుణ పల్లవాళి యిం । పున్నలవృక్షశాఖలను బొల్చికనుంగొని సాటిరాకలో । నూనినచింతచేమదిసి యుండెనుచూడగనాడు నాటికిన్ ॥

ఉ॥ భామినిదివ్యపాదనఖ భాసురసంపదగాంచి యాయుడు । ప్రేముడువాని బోలమనుచున్ వడినంబరవీధి జేరి హ్యా । తీమవిచార సుందుచు నిశీథినియుండకనోప్పె రాత్రులా । దీమునవిల్చి వేగినను దీనదశంబొడకట్ట వారయున్ ॥

ఉ॥ అండజయానజంఘికల నారసిమావలనోర్వలేక నీ । మండితచారుగర్భకమలంబులుహెచ్చు పెరింగిరోటచే । గుండెలువ్రచ్చుకోదొణగె కోయనికానశపంక్తులెల్లడన్ । మెండుగమ్రోయుజూపె ధరణీస్థలిపై రజనీచరేశ్వరా ॥

గీ॥ యింతియూరువులకు సుదామీడువత్తు । మనుచుబెంపొందిమరితమకంబు తేజ । మమరకున్న నురంభ వృక్షములుసిగ్గు । వడికలంగుచుతమతలల్ వాంచియుండె॥

క॥ రమణీమణిజఘనముతో । తమయున్నతిజూపి సైకతంబులు దత్తు । ల్యముగాక విసివియంతట । గ్రీమమునదిగుమొగములయ్యు గాశింజెందెన్ ॥

గీ॥ పొలుపునూగారుతోదీటు జలగుతమను । కంఠదేశంబులని బుట్టగముల వెడలి । యురగములునిక్కిదాన్నితో యొరపులేమి । లోనదలపోసియంతుల లోనసొచ్చె॥

ఉ॥ సుందరిమధ్యదేశమొగి జూచిమృగేంద్రుడు పెంపుదక్కిదా । గొందులనుండెనాకసము గూఢతనోలి వహించితన్నదా । నిందమొనర్చుకొంచు తవనిన్ కలకంఠిందలంచి సా । నందపదంబటంచును ఘనంబుగఘోష యొనర్చెనిత్యమున్ ॥

క॥ తానుబ్రతియగుదుమని యా । కామినిగంభీనాభి గనియాక్రమముం । గామిఘనావర్తంబులు । లోమరిగియగాధజలము లోవసియించెన్ ॥

క॥ అలివేణివళులయందము । పొలుపుగెలువ గానగకోరి పొంగితరంగా । వలివానిమోహారమునకు । తలగిపరచెజూవెయఖల తటినులయందున్ ॥

మ॥ జలజాతాక్షికుచోన్నతస్థితికి ప్రస్తావంబునంబొందుచున్ । కొలనుల్లేరెను చక్రవాకచయమూ క్షోణీధ్రబృందంబులా । కులతంజానముద్రసంఘుక మహాఘోరాటవుల్ దూరి ని । శ్చలయోగీంద్రుల మూడ్కినుండె నచలస్థయిర్యాఖ్యపెంపేపరన్ ॥

ఉ॥ యుబ్బునపద్మగంధి భుజయుగ్మముపెంపు జయించుకాంక్షలో । గబ్బితి

లించి | ధాత్రిపైనుండగాశేక దానికతన | నమరవల్లభులోకంబు నాశ్రయించె ॥

క॥ వనితకచభరపుచీకటి | గనినందన్నాశ్రయింప గలదనుచు నహం | బున నడగియుండియెల్లెన | ఘనముగ రాత్రులను నంధకారముదోచున్ ॥

వ॥ మరియును ॥

సీ॥ యలనాగవాడిచూపుల సొంపుగనియుల్కి దొనదూరెనయ్య నంగునిశరములు | తన్వంగియధరామృతము కల్మిబాడగని డాగెనాకసమున సుధారసంబు | హరిణాక్షిగమన విహారంబులీక్షించి తలకి రాయంచలు జలధిజేరె | కలికిదేహముకాంతి గాంచినెవ్వరగంది మెరుపులుమేఘంబు మరుగుజొచ్చె | నెలతదహాసచారు చంద్రికలు జూచి | వెరచివెన్నెలయమవస వెన్నుదూరె | శుభగమతిమేని భూరిసౌరభమునకును | కుందిచందనములుదీవు లందుమెలగె ॥

గీ॥ కాంతకొనరిన రూపరేఖావిలాస | విభ్రమమునకువెరగంది విశమశరుని | కొమ్మశంబరునింటదా గూఢవృత్తి | నుండె మోహిని బొడకట్టకుండెభరనూ ॥

వ॥ అని సీతసుందరం బుగ్గడించి ॥

క॥ ఆకొమ్మనీకు గోరికిన | శ్రీకరమునుసౌఖ్యకరము క్షిప్రంబున నే | చేకురు నిజముంగావున | లోకువయగువిధముబుద్ధి లోదలపుమెగిన్ ॥

వ॥ అని మరియును ॥

శా॥ మాయోపాయముదక్క రాఘవుని రామారత్నముం జేకొనన్ | నీయోజందలపంగ బోకుమతనిన్నిర్జింప శక్యంబుగా | దాయబ్జాక్షుపురారిముఖ్యులకు లంకాధీశయట్టున్నదై | తేయువాృతము జీరికింగొనక మదింపంగ యేగాంచిన్ ॥

క॥ అనుపమమాతనిదోర్బల | ఘనతరశౌర్యంబు జెప్పగానచ్చరుదై | కను పట్టు నేరకతనిం | జెనకిబ్రతుకదరమె కదనసీమలయందున్ ॥

క॥ అనిచెప్పినదనుజేంద్రుడు | కనకరథంబెక్కియపుడ కదలెను మారీ | చుని యాశ్రమమునకవ్విధి | చనిచనియవ్వనముసొచ్చి సరభసమొప్పన్ ॥

క॥ సుందునిసుతుపిండగ్గరి | నందరిదశముఖునిగని ఘనంబుగమది నా | నందించి యుచితభంగిని | వందనమొనరించియతడు వలనుగననియెన్ ॥

ఉ॥ ఏకతమింపురాక గతమెయ్యదియయ్యది యాచరింతు శౌ ! ర్యాకరధుర్యయట్టివిధ మంతయునానెరిగింపుమన్నదై | న్యాకృత్తిదోపరాక్షస కులాధిపుడించుక వెచ్చనూర్చుచున్ | గైకవరంబు కారణము గా రఘురాముడు సంధ్రిపంపునన్ ॥

క॥ సీతాలక్ష్మణయుతుడై | యాతతగతివనికివచ్చి యలపంచవటిం | జేతోముదమునసుండుట | ఖ్యాతిగదానవుల నెతకి ఖండించుటయున్ ॥

క॥ శూర్పణఖముక్కు జెవ్కుట । దర్పమునఖరాధియోధ దైత్యులజము నిం । జేర్పుటలెంతయునతనికి । నేర్పడగా జెప్పివినయ మెసగగబలికెన్ ॥

వ॥ నీవుమత్పూర్వా మాత్యుండవు పరమప్రీతుండవు గావున నీప్రాపున రామచంద్రునిభార్య నపహరించి యత్నవ్యక్తై పూనివచ్చిన దురంబున నతనింబోరిగొని శూర్పణఖ బన్నం బీగుదుమని కృతనిశ్చయుండనై భవత్సహాయంబు వడయుటకై యేతెంచివాడ నికార్యంబు ఘటియింపం జేయుము నీకర్ధరాజ్యం బిచ్చెదననుడు నతనిమరుద్యోగంబునకు వెరగుపడి మనంబున భయంబుగదుర తాటకాత్మజుండా నిశాటవల్లభున కిట్లనియె ॥

క॥ మాయలుమంత్రంబులు రఘు । నాయకుచేకొన్న జెల్లునాయయ్యో నీ। వియ్యాసలబడియూరక । కాయంబాప్పించెదతని కాండవితతికిన్ ॥

క॥ బలవద్విరోధమనిమది । దలపకనిబ్బంగపూన్కి దగునేఘన దో । ర్బలుడు రఘువరుడుమెలగెడు । పొలముంబోజన్నెమరుపు పుట్టిన మనకున్ ॥

వ॥ అది యెట్లంటేని ।

శా॥ రక్షోనాయక భూరిబాహుగల శా । ర్యస్ఫారుడైనట్టి రా । మక్షోణీశునితో నెదుర్పడి జయింపన్ లేరు పద్మాక్షు ఫా । లాక్షుల్ నీతరమాజయంబుగొన ప్రాణాశల్ విసర్జించు నా । పేక్షంజెందితివాకృతాంతుడు నినున్ ప్రేరేపగానిమ్మహిన్ ॥

సీ॥ ఎవ్వనిగాజూచె దీవసురేశ్వర రామునినతడు నారాయణుండు । నిర్జరసంఘంబు నీచేతబాధల బడిమొరయిడినకృపండలంచి । వారిగాచుటకునీవారిని నినుదృంచు కొరకునై యీగతి ధరణిబుట్టె । సిద్ధమాతడుమున్ను జేసినయట్టియు మానుషకృత్యముల్ శానగలవు । నానిజెప్పంగనేల దుర్వారశౌర్య । ధుర్యులగుమనఖరాదుల దురములోన । నొక్కరుడక్రీడవోలెను నుక్కడంచె । బెదరులేకున్కి నీవిన్నయదియె కాదె ।

చ॥ అసదృశసత్ప్రతాపుడ సహాయుడుశత్రునిబర్హణుండు రా । ఘుసకులభూరికానన కృశానుడుసంగర శూరుడాత డి । రసముదలంచిమెల్లన శరంబరివోసిన ముజ్జగంబులుం । బసచెడితల్లడిల్లు నలపంకజపత్ర జలంబుపోలికన్ ॥

మ॥ అరుమందెల్పెడి యోనృపాలకర । ముక్తామోఘదివ్యా శుగ । స్ఫురణోనీర్ణబలంబునత్వరిత పెంపుంజెప్పగాశక్యమే । వరనాగాయుతశక్తునన్ను పటువర్గంబెల్ల మాలించి సా । గరమధ్యంబునవైచిపోయె సురవర్గంబంత మోదింపగన్ ॥

గీ॥ అదియతనిపిన్ననాటి బాహాబలంబు । కలిమియునునస్త్రసంపద కలిమిజూవె। యిపుడుసడినన్నవాడింక నేమిచెప్ప । వచ్చునమ్మేటిభుజశక్తి వాసవారి ॥

క॥ అరిచివిలుకాడితండె । నెరుగుదునప్పీరుతోడ నేఁటికివృథా । విరసంబానర్ప నీకిది । కొరగాదికనీవు లంకకుంజనుమరలన్ ॥

గీ॥ అనిలవిని నెయ్యిబోసిన యగ్నివోలె । మండిపడిక్రోధమూర్తుఁడై మెండుకొనగ । కన్నులనుబిట్టు విస్ఫులింగములుగురియ । దనుజనాథుండు సుందుని తనయుననియె ॥

చ॥ మదమునుగ్రొవ్వినీవు నొకమానవుపెద్దగజేసినాకు జె । ప్పెదవిటువాని విక్రమము పెక్కువిధంబులయేనునిన్ను మ । న్నదొరసిత్రుంపకుండిన నెపంబుననింకిట బల్కెదేనినిన్ । మొదలవధించి యానృపతనూజులనిద్దర నుర్విగూల్చెదన్ ॥

వ॥ అని సంరంభించి బొమముడిగదుర యాడుగరచుచు దన్నుజంపనిశ్చయించియున్న నిర్జరారాతి తెంపెరింగి మారీచుండు తనమనంబున ॥

గీ॥ ఇతనిచేజచ్చి దుర్గతికేఁగుకంటె । జనకజాధీశు ఘనతరసాయకమున । గూలి యెన్నటికినిపుట్టుగులకురాని । యవ్యయంబుననుండెద ననితలంచి ॥

వ॥ పంక్తికంధరు నుపశమితక్రోధుంజేసి యతండు వచ్చినపనికియ్యకొని వెంట నరుంగును రావణునుద్దేసించి వినుమేను కమనియ్య హేమ మయాకారంబైన యేణ రూపంబుదాల్చి జనకనందనముందరం బొడసూపు రద్దేవి మదియ్యసౌందర్య క్రీడా కృతంబున కచ్చెరువంది దీనిందెమ్మనిపంచిన రఘువరుండరుదేర యే నతనిభ్రమియించి దూరంబుగకుం గొనిపోదు నతండురాకతడశైనని సౌమిత్రి యన్నజాడలవచ్చు నీ వయ్యెడవేచి భూమిజందోకొని శీఘ్రగమనంబున లంకకుంజనుమని యుక్తిభోదించి యమ్మారీచుండప్పుడు ॥

క॥ తారలరుచులను కంపా । వారముకాంతులును హేమ వసుధాధర వి । స్ఫారప్రభలునుగూరిచి । నీరజభవుడీమృగంబు నిర్మించెననన్ ॥

క॥ కనదురురత్నంబుల సొబ । గునబొల్చుచుమత్కరమున కుమ దాప్తునిలో । దనరెడుమృగములకంటెను । ఘనతరరుచిగల్గునట్టి కాంచనమృగమై ॥

ఉ॥ నవ్వుమొగంబునంగదుర నాథునియాననశీమగాంచుచున్ । మవ్వపుకొర్ఛు లీన కుసుమంబులునచ్చట గోయుసీతకున్ । దవ్వులగానవచ్చి ప్రమదామణికాంతను తన్నుజూడగా । చవ్వనదాటులీడుచు విశంకటవృత్తిని టాయవచ్చుచున్ ॥

క॥ తారుచు బారుచు నెడనెడ । బోరునదిరుగుచునుపువ్వు పొదలీగుచు సొం । పారగగంతులువైచుచు । బీరువుగతిమెరశెమాచి బెరయుచుమరియున్ ॥

వ॥ బహువిధంబుల క్రీడగావింపుచు జనకరాజనందన మనంబునకు పరమాహ్లాదంబొనరింపుచు లేచుచు మృగంబులకూడి సంచరింపుచు మాటిమాటి కత్తన్వి

జారవచ్చుచు మరలిపోవుచు నచ్చెరువ ననేకభంగుల విహరింపుచున్నంత ॥

చ॥ కనకమృగంబుగాంచి నవకంజదళాయత నేత్రిమైన యా । జనకతనూజ చిత్తమున సంభ్రమమెంతయు నగ్గలంబుగా । మనకులభర్తజేరి పలుమారున యోక్తుల దానిరూపమా । ఘనునకు దెల్పియవ్విభుని కౌగిలిగ్రకొని బాలనమ్రియై ॥

క॥ వనభూములందు నెన్నడు । కనివినియెరుగనిట్టి కాంచనమృగమో । వన జాతనేత్రి యేనే । ర్పునదైనందీనిదెమ్ము పొల్పొందంగ ॥

వ॥ అనినంత ।

క॥ కపటాకారమృగంబై । చపలుడు మారీచుడటకు చనుదెంచుటదై । త్నృపతి మొరగిజానకి । నపహరింపదలంచుటయు జనాధిపుడెరిగె ।

వ॥ యెరింగియు సీతాకాంతు పాలించుట కుద్యుక్తుండై యోగమాయనాకర్షించి యొండు నిమిత్తంబుగలదేను మరలివచ్చునంతకు నీవ్రజనకనందన రూపంబు దాల్చి యిప్పర్ణశాలయందు వసియించుమని యాజ్ఞాపించి సౌమిత్రి నుద్దేసించి ।

క॥ కుటిలాత్ములుదానవులే । నిటమరలివచ్చునంత యేమరకవి శం । కటవృత్తి సీతగాచుక । యుటజప్రాంతముననుండు మురుతరశౌర్యా ॥

వ॥ అని నియోగించి యవనిజాసహితుండై మృగంబు పజ్జనరుగువో నప్పుడు ॥

గీ॥ భానుకులజుండు దివ్యప్రభాసమాయ । బరగజేయుడుపద్మజపాకశాస । నాది దివిజులు తమబుద్ధియందుధరణి । దుహితగాగదలంచినా దుర్గగాంచి ॥

క॥ అనవినిపార్వతియిట్లనె । మనుకులుడక్లేల యోగమాయనచ్చటం । జనక తనూజాకృతిమై । యునిచిచనం దెలియజెప్పుమో ప్రాణేశా ॥

సీ॥ అనవుడిట్లనిపల్కె నద్రిజవినుతొల్లి పరవాసుదేవుండు పరమపదము । నందు శ్రీభూమినీళాంగనలనుగూడి యానందకేళిమైనలరుచుండి । యొకకాలమునను మహా దోృగంబుమదిబూని పన్నగరాజతల్పంబుపైని । యోగనిద్రారతినొందెసర్వాధిప సహితుడైయుంతనా జలధికన్య । విభునితోడుతక్రీడగావించునట్టి । కాంక్షవొడమిననతని మేల్కొలుపదలచి । వివిధమణియుతకంకణ రవములొలయ । నొయ్యనొయ్యన పాదంబులొత్తుతరిని ॥

గీ॥ పడతితలలోనముడచినపారిజాత । కుసుమసౌరభమున కెంత కొమరుమిగిలి భ్రమరపంక్తులుమ్రోయు డప్పద్మనాభు । ఖ్యాతివర్ణించిపాడిన రీతిదోచె ॥

వ॥ అప్పుడు ॥

క॥ సిరికరకంకణరవమధు । కరసందోహప్రమోద గానంబునకై । య్యురగా నిదుమేల్కొని । సొదితలలునొయ్యనూచి సొక్కుచునుండె ।

వ॥ ఇవ్విధంబున ॥

చ॥ సిరిమదికిన్ జగద్గురు విభు శ్రీపదాబ్జములొత్తుచున్కిఁ దా । నెరగక దైవయోగ మున నిమ్మయిమేల్కనిసంభ్రమించు న । య్యురగపతింగనుంగొని మహోద్ధతిఁ బ్రీకిటు జాయబోలునే । యరయఁగ నెందుకూర్రులకు నాస్పదమే విజమిట్టి కృత్యముల్ ॥

వ॥ అని యిందిరాదేవి క్రోధారుణలోచనయై యప్పవనాశనాధీశుం గనుంగొని నీవుదుర్మదాంధుండవై మత్కరకంకణ నినదంబునకుంజొక్కి శిరఃకంపంబు గావించితివి గావున శీఘ్రంబున మనుజయోనింబుట్టి చతుర్దశవత్సరంబు లాహార నిద్రలులేక సంచరింపుమని శాపంబిచ్చి యాచెంతనిలచియున్న యోగనిద్రంజూచి ॥

క॥ యురగపతి మేలుకొలిపిన । దురితాలయవగుట జేసి దుర్బలసతివై । జర యుండు దుష్టరాత్రిం । చరనిలయమునందునీవు । జ్ఞాన్స్థలిమీదన్ ॥

వ॥ అని యిరువురకు శాపంబిచ్చియున్నంత ఫణీంద్రుండు భయాకులచిత్తుండై హరిప్రియకిట్లనియె ॥

క॥ జననీమీరిటుబలుకుట । జనునేగాన ప్రియుండ సత్యంబటు గా । వునమత్పద ఘుంకారము । వినియుబ్బుచుమేలుకొంటి నెఱుగుతనమునన్ ॥

వ॥ ఇంతియెకాని నావలన నొండుదోషంబులేదు నీ యోగమాయయున నప రాధి యిట్టిమమ్మున నూరకశపింపనేల యపరాధులమేనియు సహించి శాపంబు క్రమ్మరింపుమనుం డయ్యిందిరాదేవి దైవవశంబున జలంబుడింపకయున్న కాకోదరా ధీశుండు కటకటంబడి మమ్మకల్మషుల నిట్లు కడవంబల్కినయందున నీవును మానవ రూపంబునబుట్టి యకారణాపవాదంబు నొందంగలదానవు సందియంబులేదని పల్కె యనంతరంబ శ్రీమన్నారాయణుండు మేల్కాంచి యత్తెరంగంతయు తగువారలవలన నెరింగి యిదియంతయు కాగల ప్రయోజనంబు యేనును దుష్టరాత్రిం చరసమ్హార ణార్థంబు రవికులంబున నవతరించెద మీరలు నట్ల ధరిత్రిపైబుట్టి నాతోడం బాయక వర్తించెదరని వారలరోషంబు వారించె నది కారణంబుగా శేషుండు లక్ష్మణుండై పుట్టి యిందిరారమణియు జనకనందనయై జన్మించె యోగమాయయు శాపకాలప్రాప్త యగుటయు సీతారూపంబున రామచంద్రానుమతంబున పర్ణశాలయందు నిలచెనని యెరింగించి తరవాతివృత్తాంతంబు శంకరుండిట్లనియె ॥

చ॥ వినుమట రామచంద్రు డరవిందనిభానన యైనసీత నె । మ్మనమునగల్గు కోర్కెఁగరి మందగదీర్పదలంచి నిక్కమే । మనుజునిబోలిక్రీడలకు మైకొనియాసతి వెంటనంటిరా । జనెకుహనామృగంబరుగు జాడలతాలిమి వీడిశీఘ్రమే ॥

వ॥ ఇవ్విధంబు నమ్మాయామానుష విగ్రహంబు నరుంగుచుండంగని యా

కపటాకారమృగం బంతరంగంబున నెంతయుశంకించి రఘువరుండు తనవల లదవుట నిశ్చయించి యతనిం జిక్కులం బెట్టి దూరంబుగొనిపోయి యలయించం దలంచి ।

ఉ॥ పొంచినపొంచుడగ్గరగ బోయినదాజరగత్తియవ్వలో । కించుకసేపునిల్చు నృపుడేగినడాసినయట్లజేసి న । విమ్ముంచునుమించువేడుకల మిత్రకులాగ్రణిజేరవచ్చినన్ । వంచనబూనిసాధు మునివర్గముచంతల జేరునొయ్యనన్ ।

గీ॥ ఇనకులస్వామికెదురుగా నేగుదెంచి । మరలిపరతెంచివవడించు తరులనీడ। రఘువరుండచ్చటికివచ్చు రాకగాంచి । లేచిమెల్లనచనిచని చూచునతని ॥

వ॥ మఱియును ।

క॥ తరువ్రులమఱుపులపొన్నల । పొరుగులయిరుగులను నదుల పొంతలనెంతే । గురుకులబెట్టుచు దిరుగుచు । గిరులచరుల విరులపొదల క్రీడయొనర్చున్ ॥

వ॥ ఇవ్విధంబున విహరించు నమ్మాయామృగంబు వెంటనంటి కోండొకవడికి యలసట వొడమినంగినిసివింట బాణంబు సంధించివేసిన ॥

క॥ అదిచని దనుజునిమాయను । మొదలనెవడిమ్రింగి ప్రాణములుగొన వెస నా । త్రిదశారిసేలగూలుచు। నదవదమయ్యపుడు లక్ష్మణాయనిపలికెన్ ॥

వ॥ అంత నక్కడ నయ్యార్తరవంబు ధరణినందనవిని మూర్ఛిల్లి రామచంద్రు నకు కీడువాటిల్లుటగా నిశ్చయించి సౌమిత్రిం జేరుకొని ॥

చ॥ వితతయశోభిరామ డరవిందహితాన్వయ వార్ధిసోము డా । శ్రితజన కల్పకద్రుమము సింధురవైరిపరాక్రముండు వం । దితసురవల్లభుండు నవనీరజనేత్రుడు లక్ష్మణాసురా । హితులొనరించు కృత్రిమము చే ~~నెటులం~~ మ్రెనొ ఘోరకానలన్ ॥

గీ॥ అన్ననీవేగివేగ మీయన్నజాడ । లరసిరావయ్యయింకెవ్వ రరయువారు । లేరిచటతండ్రి మీతండ్రిమారుసుమ్ము । రామచంద్రుండుకలుషవి రాముడరయ ॥

సీ॥ అనుటయులక్ష్మణు డాత్మలోదలపోసి ధరణిజనీమాటతథ్యమరయ । నసురు లత్యధికమాయాదక్షులగుదురా నైననావాక్యంబు పూనివినుము । రాముడుసంగర భీముడువినుత సుత్రాముడాతడుకేల ధనువుదాల్చి । నెదిరిజయింపుట కేరికిశక్యంబు గాదుదీనికినేలకళవళింప । బాహుబలశౌర్యధైర్య విస్ఫారదైత్య । భూరిగర్వాంధకార పంకేరుహాప్తు । డెరుగవేదురములోన నొక్కరుడనిల్చి । ఖరశరంబులఖరుసేన బారి గొనగ ॥ వ॥ కావున ॥

చ॥ దనుజులమాయగాని యిది తథ్యముగాదు రఘూద్వహుండు న । య్యన మృగవేషరక్కసుని నంతకువీటికిబుచ్చివచ్చు నీ । మనమునశంకదక్కి వినుమా జన కాత్మజనిన్నుడించియే । జనుటలునీతిగాదనిన చంద్రనిభానన పల్కెనల్కతోన్ ।

మ॥ అరిసంఘంబులచేత జిక్కువడినన్ హా లక్ష్మణా యంచు నా । తురతన్ రాముడు బిల్వగా జనక నాతో నమ్మగా బల్కుచున్ । గోరగాముల్ మదినూహఁ జేసెద వచో క్రూరాత్మముష్ణట్టిలీ । తెరగామేటి యెరింగియుండిన నినుం దేజూచునే కానకన్ ॥

శా॥ యుగ్రారణ్యము కేగుమంచు బహుమాయోపాయచాతుర్య నా । మ్యాగ్రిం గేకయపుత్రి రామవిభు నంపన్ వచ్చి యీ చిత్రకూ । టగ్రావంబున దండకాటవిని యుండన్ నీవుదోడున్కి సా । ధుగ్రామణ్యము నేడుగానబడె నీ హృత్సిద్ధమార్గంబునన్ ॥

చ॥ అరమరలేక నమ్మి కరుణాంబుధియైన రఘూద్వహుండు స । చ్చరితుడ వంచు నిన్నిచట శంకయొకించుక లేకయుంచి దా । హరిణముజాడనేగ దగునా యితడారయ వెఱ్ఱిగాక యా । భరతుని యట్లనీవనుచు భావమునం దలపంగ వద్దకో ॥

ఉ॥ అమ్మ యిరాఘవుండు దివిజారిసమూహము బారిజిక్కెచి । త్తమ్మున నెమ్మి నమ్మి నిను దమ్ముడవంచును వేగదోడుగా । రమ్మని జీరగా విని పరాకుగ జేసెద వక్కక్కటా । తమ్ముడవోయి శత్రుడవు తథ్యముగా బరికించి చూచినన్ ॥

చ॥ అరయగ రామచంద్రునకు నాప్తునిరీతిని వెంటవచ్చి ని । ష్టురతకునోర్చి పాపమని చూడక నన్ను వరింపబూనితే । నిరయము చారగోరుటలు నీమది బుట్టెనో భూమిగాన్న యా । భరతుడు చెప్పెనో తెలియబల్కుముడాపక నేడు దుర్మతీ ॥

సీ॥ అని క్రోధచిత్తయై యరవిందదళనేత్రి బల్కినపల్కులు ములుకులగుచు చెవులందు సోకిన శ్రీరామచంద్రుని పలుమరు మదిలోన దలచి కొంత । వడికి హాయనుచు దైవంబును దూరుచు కనుగవలను భాష్పకణములొలుక । నడలుచు సౌమిత్రి యపుడన్న జాడల నరుగంగదానిశ్చయాత్మ~~డతుల్యా । మిగులకనుకతోడ~~ మగువను వీక్షించి । తగునుతగదవాక తగవు విడచి । పలువిధములనన్ను బలికినఫలమెల్ల । ననుభవింపుమనుచు నంతమరియూ ॥

సీ॥ కలనైనగాని వెక్కసమైనయిటువంటి పలుకులు వెడలవీ పడతివలన । హేతువెద్దియో దైవమేక్రియ గావింప దలచియున్నాడకో తెలియరాదు । సద్గుణసంఘాత త్మజాతయగు సీత గాదో కాయీ కొమ్మ గాకయేని । లక్ష్మణుడను గానో లక్షించి చూచిన కాదేని యూరక కార్యమింత । యేల పుట్టును యీపె నన్నేల దాను । కఠిన వాక్యంబులాడునీ క్రమము మెరసి । యెటుల సేయుదునిటులని యెటులనొంటి । విడచి పోవుదు నిట్టి కారడవిలోనా ॥

వ॥ అని మరియును ॥

ఉ॥ అల్పపుకాంతవోలెను దురాగ్రహవృత్తిని నీచవాక్యముల్ । కల్పన జేసి పల్కె నదిగావున నిచ్చట నిల్పియుండగా । గొల్పదు నామనంబు రఘుకుంజరుజాడల

బోవస్వామి సం । కల్పము మీదనే తెరగు గాగలదో యటు గాకతక్కనే ॥

క॥ సతినొంటిడించి యిటు వ । చ్చితి వేటికటంచు నృపతి చిత్తములో న । మ్మతి సేయక కోపించిన । క్షితిసుతను బల్కునెల్ల చెప్పదు వరుసన్ ॥

వ॥ అని కృతనిశ్చయుండై కేతన ఛత్ర శంఖ చక్ర ధ్వజ వజ్రాంకుశాది శుభ రేఖాలంకృతంబైన రామచంద్రుని చరణసరసీరుహంబుల చొప్పరయుచు జనకనందన తన్నాడిన దుర్భాషలకు మనంబున దుఃఖింపుచు సుమిత్రానందనుండరిగె నంత దైవ యోగంబున ॥

సీ॥ జరచేతఁ గజారి సర్వాంగములతోఁబ్రిఘు లల్లాడుచుండు కాయంబు దనర । నధిక ధావళ్యమై నట్టిబొమ్మలవెంట్రుకలు పైనివ్రాలినకన్నులమర । సత్వలేమినిపథ శ్రమము చేనుద్భవమైనయుచ్ఛ్వాస నిశ్వాసమొప్ప । యట్టివిరోధికి నీరూపువలదను గరిమెనువడకెడు శిరము మెరయ । మానితంబగు దండక మండలములు । బూని కాషాయవస్త్రముల్ మేనదాల్చి । మాయిరే హరినారాయణాయటంచు । వచ్చె యతివేషమున దశవదనుడటకు ॥

క॥ సీతే నుడలిగె నేనియు । యేతీరున తన్ను జ్రితుకనియ్యుడిప్పుడే । నీతిదనకని దశాస్యుం । డాతరసన్యాసియయ్యె యావనిజయెదురన్ ॥

వ॥ ఇవ్విధంబున కుహనా తపోవేషధారియై పర్ణశాలకు జనుదెంచిన నయ్యతి వయు నిక్కంబ యతిగాదలచి నమస్కరించి మునీంద్రా యచ్చటినుండి విజయం చేసితిరి భవదియ్యాగమనంబున నింక శుభంబులు చేకురు గావున మావారలు వచ్చు వఱకును కొండొకవడి యిచ్చటనిశ్రమించి యాతిథ్యంబు గైకొనుట యొప్పుననవుండు రామలక్ష్మణులు లేకునికి నిశ్చయించి ప్రముదితచిత్తుండై నిర్భయంబున ॥

ఉ॥ ఆవిబుధారియంత వసుధాత్మజగన్గొని యంబుజాక్షి యే । రావణనామధేయుడను రాక్షసవర్యుడ లంకయేలుచుం । దీవిధి తాపసత్వము వహించి నినుం గొని పోవునందుకై । భావములోపలం దలచి బాల్పడి యిచ్చటి కేగుదెంచితిన్ ॥

వ॥ అని పలికి యా యతివేషంబు విడచి యతిభయంకరాకారంబగు కాయంబు దాల్చి పొడసూపిన నమ్మహాదైత్యుని రూపంబు పొడగని బెబ్బులింగాంచిన కురంగ శాబకి తెరంగున నయ్యిందువదన మూర్ఛమునింగిన కరంబుల యుత్తన్వి బడియున్న ధరాతలంబుతోడం బెకలించి దించి రథంబు పైనిడుకొని శీఘ్రగమనంబున లంకానగర మార్గంబునం జనుచుండె నంత నమ్మాయాజానకి కొంతవడికిందేరి యిట్లని విలపించె ॥

సీ॥ హరిహయముఖ్య నిర్జరులార దిక్పాల వరులార యాచరవాపరయ్య । హరులార నిఖిల భాస్కరులార వసుయక్ష వరులార యాచరవాపరయ్య । గరుడవిద్యాధర

గంధర్వచారణ వరులారయీచర వాపరయ్య । మరుదస్త్రిసాధ్య కిన్నరులార యురగ ప్రవరులార యీ చరవాపరయ్య । తరణికులజలధి హిమకరుడనంగ । బరగుశ్రీరాము చంద్రుని భార్యనకట । వరుడుమృగయాపనోదార్థ మరుగజూచి । మొరగికొని పోవుచున్నాడు సురవిరోధి ॥

వ॥ అని యరచుచు తనకడ్డపడువారిం గానక ॥

సీ॥ లుంగలవంగ నారంగవృక్షములార క్షితిపతికీ మాట జెప్పరమ్మ । చూత భల్లాతకామ్రాత వృక్షములార నృపతికీ తెరగేర్పరింపరమ్మ । వంశాంబకింశుక శింశుపా తరులార చెలువునకీవార్తదెలుపరమ్మ । తాలతమాల తక్కోలద్రుమములార విభునితో నిదివిన్నవింపరమ్మ । జంబుజంబీరనింబ కదంబవకుళ । కదళి – సాళ మరువక క్రముక నాగ । పూగజాతికురంటక భూర్జబదరి పాదపములారప్రియునితో బలుకరమ్మ ॥

మ॥ మృగముందెచ్చెదనంచు రాఘవుడు పిర్మిన్ బోవగాజూచి యీ ర్ష్యగిం దైత్యుడు గొంచుబొయ్యెడిని గర్వస్ఫూర్తిచేనన్న భ దగుడైనట్టి మ ఘ నకు సర్వంబేర్పడజేయుడీ । మృగసంఘంబులు వాపయింగలుగు గూర్మిః దెల తెల్లంబుగన్ ॥

శా॥ రామాయన్నను బాయువాపమను శాస్త్రంబెంతయుందెల్సి త । న్నామో చ్చారణ జేయుచున్నిరత మానామాఖ్యబెంపొంది హ్వా । తీనుంబా గెను పల్కల యిటకుం జేరంగనేతెంచు నా । రామాధీశునితోడ మత్క్రమము మీరల్ గొబ్బ నం జెప్పరే ॥

ఉ॥ ఆరడికోర్చిరావణు డహంకృతిచే మదిగొవ్వి శత్రు సం । హార్పరకుడైన రాముని మహాత్మ్యమెరుంగక నన్నుగొంచు నీ । తీరునలంక కేగెడు నతిత్వరచే గుటిల ప్రియుక్తుడై । శారికలార యీ తెరగు శ్యామవరుతోడ నెరుంగబల్కుడీ ॥

గీ॥ తార్క్ష్యసలలిత వరశకుంతలములార । నీలకంఠకపోతాది నిఖలవిహాగ । సంఘకములార రఘుకులచంద్రుతోడ । వెరుగజేయుడు నావిధంబెల్ల మీరు ॥

క॥ ఓమాల్యవంత భూధ్రమ । యీమనుజాసనుడు నన్ను నిమ్మోయిగొని గు । ద్ధామగతి నేగువార్తలు । భూమీశునితోడదెల్పు బాలుపమరంగన్ ॥

ఉ॥ పావనశీలయో పరమ పావనగౌతమి నీకుమ్రొక్కెదన్ । నావిధమేర్ప రించు రఘునాథునితోడ దయానమేతవై । భూవరువేగరమ్మనుమ పుణ్యజనాధిపు డైన యట్టి యీ । రావణుద్రుంచినన్ను కృపరంజిలశీఘ్రమె తెచ్చునట్టులన్ ॥

వ॥ అని బహువిధంబుల బలవింపుచుం జను నమ్మగువ జనకనందనగా నెరింగి దశరథుని బద్ధసఖుండు జటాయు వనువాడు మార్గంబున కడ్డంబుబర తెంచి ప్రచండ

కోపియై యాఖండల విద్వేషిం గనుంగొని దురాత్మా రఘువరుండు లేనియెడ సీమగువను మొఱంగి గొనిపోవుట పౌరుషంబు తెఱంగేయని పల్కి యదల్చి వియచ్చరులచ్చెరువంద నప్పుడు ॥

సీ॥ బంధురశౌర్యమే పారదైత్యునిదాకి మీఁదికి నెగసి బిమ్మిటిగొనంగ । శిరములు పన్ని భాసురనూత్నమణియుత హాటకదివ్యకిరీట పంక్తి । ధరఁ డొల్లగాఁ జేసి తన వాఁడిగోరులు నాటించియతఁడు దైన్యంబునొంద । చంచుపుటంబున సంరంభుఁడై వాని తనువెల్లఁ జించి రథంబు జదియ । మోదిచీకాకుగావించి మోములడఁచి । యద్భుతంబుగ జేయుఁగాలాడనీక । భయముబుట్టించి ధట్టించి పటురయమున । తలలు క్రిమ్మరఁ బెట్టుగా దన్నుటయును ॥

చ॥ పెటపెట పండ్లుగీటి సురభీకరుఁ డప్పుడు గృధ్రనాథుపై । జటిలతరోగ్రవహ్నియుత సాయక మొక్కటి వేయ దానిచే । నిటలము దాఁకవాఁడు ధరణీస్థలి మూర్ఛిలి లేచి యమ్మహా । కుటిలుశిరంబులం జిదియఁ గొట్టిన సృక్కి దశాస్యుఁ డయ్యెడన్ ॥

క॥ యిరువది నారాచంబుల । వారిసూత తనూజు నేయ నదిద్రుంచి వెసన్ । దర మితన వజ్రనఖములు । సురశత్రుని వీపు జించి సుక్కఁగ జేసెన్ ॥

చ॥ అడరినకోపవహ్ని మనుజాశనుఁడా ఖగరాజు రొమ్ముదా । నడిదము వైచి నొంచి పృథుశయ్యాంతకుఁడై వడి నార్చి శక్తిచే । కసువడి నేయ పక్షములు గాడి ధరాస్థలి గూలెనప్పుడా । పుడమియనుంగుపట్టి పగబొందఁగ చిత్తములోన గుందుచున్ ॥

వ॥ ఇవ్విధంబున ఖగపతిం గూల్చి దశకంధరుం డెప్పటియట్ల జనకనందనం గొనిపోవ నరుగుచు జటాయువు చావునకుం దూరవగచుచు నింక తన్ను విడిపించువారలెవ్వరని తలపోయుచు ముందర నొక్క గిరిశృంగంబున నేవుర కపులం గాంచి రామునకు దనపోక చెప్పెడవలయునని దివ్య మణిభూషణంబులు దిగిచి పై చేలంబు కొంగు జించి దానముడిచి యుంగట్టి యావనచరుల యెడం బడవైచి విలపించుచుం జనియె నట్లు త్రిలోక కంటకుండగు దశకంఠుండు లంకాపురంబున కరిగి యశోకారామంబున నాతన్విని నిలిపి యచ్చట దశసహస్ర సంఖ్యల దైత్యాంగనల నయ్యంగనారత్నంబును గాచికొని యుండునటుల నియమించి సుఖంబుండెనంత నక్కడ రఘువరుండు మాయామృగంబు దెగనేసి మరలివచ్చునెడ దనజాడల నరుగుదెంచిన సుమిత్రాపుత్రుం గనుంగొని యతనిరాక చందం బెఱుంగనివానిపోలె యిట్లనియె ॥

మ॥ అనఘా దుష్టమృగప్రయుక్తమునకుం ఘోరారణ్యదేశంబులో । జనకక్ష్మాధర పుత్రి డించి విగళద్ధర్మత నిన్నివ్వ రా । జనునే యచ్చట పూర్ణచంద్రముఖియే చందంబునం గుందెనో । దనుజానీకము నెట్టిదుర్దశల నొందం జేసిరో మాయలన్ ॥

ఉ॥ వచ్చుటయేమినొంటి వనవాసములోపల సీతడించినీ । విచ్చటికేనువచ్చు నెడ నిమ్ముగ జెప్పినమాటలెల్ల తోఁ ! పుచ్చుటయేమిమిక్కిలియు భూగుణాఢ్యుడ వంచు కానకే । దెచ్చుటయేమియియ్యెడ మతిభ్రమనొందుట కేమిచెప్పవే॥

చ॥ అనుటయులక్ష్మణుండు హృదయంబున ఝల్లన విన్నబాటుతో । కనుగవ భాష్పముల్దొరుగ గాచరణంబుల నేలవ్రాయుచుఁ । మనమున మాటిమాటికిని మానిని వాక్యము లుగ్గడింపుచుఁ । వనజజశాత్రుడైన రఘువల్లభుతోడుత బల్కెనొయ్యనఁ॥

గీ॥ అనఘచరితమీకు నాక్రమంబెల్లను । యున్నరీతినేను విన్నవింతు । నవఘ రింపు మృగము నటుగొనితెమ్మని । వనితబనుపమీరు వచ్చుటయును ॥

వ॥ యొక్కింత తడవునకు మీపల్కు చందంబుగా నొక్క యార్తరవంబు వినబడిన ॥

ఉ॥ అందుకునుల్కిసీత పరమార్థముగాగ దలంచినన్ను మీ । చెంద మొరింగి రమ్మనుడు సాధ్వినినుం దిగనాడినాకు బో । వందగదెన్నియేని రఘువల్లభుడిప్పుడ వచ్చునాత్మలో । కుందకుమంచు పల్కుటయు క్రోధముతోననుగాంచి రోజుచుఁ ॥

వ॥ కర్ణకఠోర వాక్యంబులు బలికిన తలకి యేను మీజాడల నిర్విఘ్నంబున జనుదేరవలసె ననుండు రామచంద్రుడు కోండొకవడి జింతించి నెండియుని ట్లనియె॥

ఉ॥ కారుణుబల్కెనంచు నవకారము చిత్తమునందలంచి కాం । తారము లోపలం ధరణినందనొంక తెడించి నీకునీ । తీనునరాక జెల్లునె మతింబరికింపగ వద్దె పూర్వ బ్రం । దారకులెందుమాయలను దక్షులరౌట వివేకసాధనా ॥

క॥ నీవేమిసేయువాడవు । దైవంబే వేళనేమి దలచిన నటులౌ । గావునదీనకి వగవం । గావలవదటంచు శీఘ్రగతిగాజనుచుఁ ॥

వ॥ యెడనెడం బొడమను దుశ్శకునంబులకు నులుకుచు పర్ణశాలం దరియం బోయి యందు ధరణినందనం గానక శోకార్ణవమగ్నుండై యుచ్చైరువం బరికింపుచు పేరుకొని పిలచుచు యత్తన్విలేకున్కి నిశ్చయించి పలువిధంబులం బలవింపుచు మూర్ఛాగతుండై కోండొకవడికిందేరి యచ్చోటువాసి సీతాన్వేషణంబు సేయుచు ప్రాకృత మనుజుండపోలె నమ్మాయా నటుండప్పుడు ॥

ఉ॥ హాయను దైవమాయను ధరాత్మజనీక్రియ నన్నుబాపితే । లాయను జానకీకడు చలంబొనరించుట నీకుధర్మమే । వాయనుపూర్వ దుష్కృతము వల్లని తోఁయగ నేరికశ్య మ । య్యాయను మోసమాయను నిశాటునిమాయను లక్ష్మణా యనుఁ ॥ క॥ సీతా మైథిలిజానకి । భూతన యాజనకరాజ పుత్రీనీ వే । లా తొలగి చనితివేయను । నాతో భావింపుమనుచు నాతింబిలచుఁ ॥

వ॥ మఱియును ।

సీ॥ గిరిగహ్వరములు వేసరకకనుంగొను । క్రమమున ఋష్యాశ్రమముల వెతకు । దేవాలయంబులు తెరగొప్పవీక్షించు పక్కణంబులు గొల్లపల్లెలరయు భూమీరుహంబులు పొదరింట్లుబరికించు కమలాకరంబులు కలయజూచు । కొందలేక యేఱులు నదులుపరిశీలించు కొమలకమిరి పల్లములుచూయు । పుట్టలనుమందపట్టులు పుప్రప్సటించు । చైత్యనిలయంబులును భూత తతి నివాస । ములును లోయలు యాగ శాలలును చొప్ప । దప్పకుండనరీక్షించు ధరణిసుతను ।

వ॥ ఇట్లు బరికించి యంమనుంగానక సీతం బేర్కొని ।

క॥ సీతాసీతాతపముల । చేతండయ్యంగనీక సేవానిరతిన్ । చైతన్యమూముద మందగ । జేతువ్వుయింకెవ్వరిపుడు శేత్రురు నాకున్ ॥

చ॥ మదగజయాన నీమృదుల మంజులభావల నాదరింపుచున్ । కదసియుదుంగు దేరగను కంతుడువైరము కొంచి బాణముల్ । గుదిగొనినేయు వాడిపుడు కోమలినీవిటు బల్కకున్నన్ । బ్రతుకగనిచ్చునే మొదలె పాంథవిరోధి యతండెఱుంగవే ।

వ॥ అని వెండియు ॥

సీ॥ పర్ణవినిర్మిత భాసురయుటజంబు మణియుతభర్మ హర్మ్యంబుగాగ । భీకర శార్దూల బృందకురంగముల్ సమదవారణ తురంగములుగాగ । విపులశాఖాంచిత వృక్షసమూహంబు నెమ్మినుద్యాన వనమ్ముగాగ । శబరకిరాత నిశాచరవర్గంబు:పరికింపగామహీ ప్రజలుగాగ । అటవిసాకేతముగ సుమిత్రాత్మజుండు । మంత్రిగా నిన్ను గూడి సామ్రాజ్యభోగ । మనుభవించితి నీవిపుడచటువాసి । చనుట కాంతారమై తోచె జనకతనయా ।

ఉ॥ ఏమన్నిపోదమోఘ్నకికత చెవ్వరి మోములు నెట్లుజూతు రా । మామణియాత్మ మందిరము మానుగనేగతి సొత్తుసీత రా । దేమకొాయన్నతల్లులకు నేమనిచెప్పను నవ్వసిష్ఠుతో । న్నేమనిమాటలాడుదు నదేమనిబొందుదు నుందునేక్రియన్ ॥

వ॥ అని పెక్కుభంగుల దలపోయుచు సుమిత్రానందను నుద్దేశించి ॥

శా॥ ఏలానీవును నీసహోదరులు నాకేలా ధరిత్రీతలం । బేలా తల్లులు బాంధవుల్సచివ లింకేలాహితుల్ పట్టణం । బేలారాజ్యము భోగపుంజముల వేలా జానకింబాయుటే । చాలుంజాలును లక్ష్మణాచనుము నీచందంబు నీకేటికిన్ ।

చ॥ అనఘచరిత్రమానక మహాటవికింజనుదెంచి భృత్యవ । ర్తనము వహించి మమ్మరసి దైవకృతంబున మోసపోతివే । మనగలదింకనీవు జనుమయ్యపురంబున కేను సీతవో । యినగతి బోవువాడను సహింపగనోపను తద్వియోగమున్ ।

చ॥ తమమది నాకుగావగచు తల్లులకున్నిజ సోదరాళి కీ। క్రమమెఱిగింప బోకు రఘురాముడదేమఖా రాడటన్న యు। క్తముగను మాటలాడు నిరతంబును నబ్బురతావనీశు చి। త్తమునకు వచ్చునట్ల యుచితస్థితిసేవ యొనర్పు తాల్మితోన్॥

క॥ అనవుడు దుఃఖార్ణవమున। మునిగి సుమిత్రాత్మజుండు మోమెత్తక హా। యని విలపించుచుతా జే। సిననేరమిగా యటంచు సిగ్గరియుండెన్॥

వ॥ ఇవ్విధంబున మాయామానుష విగ్రహంబగు రఘునాయకుండు నిక్కంబ మనుజుండపోలె విడంబనంబు జరపుచు ధరణీనందన నందంద నిరీక్షింపు రిచ్చపడుచు వెచ్చనూర్చుచు తదియ్యాసుందరం బుగ్గడించుచు నిమీలితనేత్రుండై యడనెడ నిలువంబడుచు తరుపక్షి మృగసంఘంబుల బేరుకొని సీతజాడలడుగుచు దైవంబుదూరుచు చనజన నగ్రభాగంబున నుగ్రగ్రావంబునుంబోలె పడియున్న ఖగపతింజూచి రోషంబు మొగంబునం గీలుకొల్పి డగ్గరి॥

చ॥ జనకజమ్రింగి కాపులుగు చందముగైకొని యున్నయట్టి యీ। దనుజుని జూడుమీ ఖలుడు దారుణకర్మమొనర్చె నంచు దా। ననుజునితోడబల్కి విలునమ్ములు గైకొను డంతలోన రా। మునిగని గృధ్రవల్లభుడు ముక్కరిగుందుచు నొయ్యనిట్లనున్॥

చ॥ అనఘచరిత్రరాఘవ దయార్ణవయన్యుడ గానుచూ భవ। జ్జనకునకున్ సఖుండను నిజంబునపేరు జటాయువండ్రు మీ। వనితను రావణుండు చెరపట్టుకపోవగ యోనుగాంచి యాదనుజునిబిట్టదల్పి బలదర్పము పెంపున నొంచి చెచ్చరన్॥

క॥ అమరపతిపంక్తిచే నీ। క్రమమున గూలితినిరాజ కంఠీరవ నిక్కముసీత గొంచుదైత్యుడు। ప్రమదంబున నేగబాహు బలముమెరయగాన్॥

వ॥ అని పెద్ద యెలుంగెత్తి విలపించిన జటాయువు నూరార్చి రఘువరుండతనికి విజ్ఞానంబు ప్రసాదించిన నప్పుడు నరపాలతనయుండను తలంపువిడచి పరతత్వంబుగా నెరింగకొని రామచంద్రుని యంఘ్రిపద్మంబులు హృదయంబున కుదురుకొల్పి యహంకార మమత్వంబులు దిగనాడి పరమానంద స్వాంతుండై యిట్లనియె॥

సీ॥ సనకాదియోగీంద్ర సంసేవ్యపదయుగ గరుడవాహనదోష ఘనసమీర। రాజీవ హితకులార్ణవ పూర్ణచంద్రమా నుహానియ్యకోటి మన్మథశుభాంగ। గంగాధరస్తుత్య కారుణ్యసాగర రఘువీరపన్నగ రాజశయన। నారదవాణి వీణాగాన మోదిత తాటకాంతక వైరి దమనదేవ। యమరకు ధరధీర యవనీతనూభవ। నేత్రకైరవాబ్జ నీలజలద। గాత్రసాధుమిత్ర కాకుత్సవంశ ప। విత్రవృత్రదమన విభవ యభవ॥

వ॥ దేవా దేవర నిత్యలీలావిభూతి మహిమలెరిగి వర్ణింప చతుర్ముఖ షణ్ముఖ సహస్ర

ముఖులకైన నలవిగాదే నెంతవాడ ననంత తేజోవిరాజితంబును సహస్రశీర్షనయన చరణంబులుంగల రూపంబువహించి యాదిమధ్యాంతములు లేక విశ్వతోముఖుండవై మీ మేనిరోమకూపంబుల ననేకకమలజాండంబులు ధరియించి ప్రభాసాదిమాయా దేశకంబును శ్రీ తుష్టిపుష్టికీర్తి మాయాద్యఖిలశక్తులు నణిమాదిమహిమంబులు మాయాప్రముఖులు మహదాదిచతుర్వింశతి తత్త్వంబులు సేవింప స్వాతంత్ర్యయుండవై నాశరహితుండవై నిత్యానందపూర్ణుండవై నిగమాంత వేద్యుండవైయుండి యిట్టి సర్వోత్కృష్టరూపంబు మహాయోగీంద్రులకైన నెరకపడంజాలక తద్దివ్యరూపంబు వలన వాసుదేవసంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధరూపంబుల పురుషచతుష్కంబు బుట్టించి జగంబులుత్పాదించి స్థితిలయంబొనరింపుచు క్రమ్మరసృజింపుచు పెక్కు విధంబుల క్రీడగావింపుచుండువు యిట్టి జగన్నాటకుండవగుట నిజప్రాకృతాకార విదంబుల నెరింగియు రాజసహంకార గ్రస్తులై భ్రమనొంది కంజాసనాది దివ్యులు తారక బ్రహ్మ మూర్తివైన మిమ్ముల మర్త్యుగా భావింతురు గావున దేవత్వంబేనియు ప్రధానంబుగాదు యుష్మన్నిర్హేతుక కటాక్షంబు లభించవలయునట్టి విశేషంబు సంఘటించిన జాలు హీనకుల సంభవుండేనియు శుద్ధ మూఢుండేనియు నతండే ధన్యుండు జ్ఞాన సంపన్నుండు తథ్యంబిందులకు నీదర్శనంబు మదియ్య జననంబే కాదె యొండు చెప్ప నేలయని యద్దేవుని బహుభంగుల బ్రశంసించి పునః పునః ప్రణామంబులాచరించిన నజ్జటాయువుంగని సుమిత్రానందనుం డయ్యా యిట్టి దివ్యజ్ఞాన సంపన్నుండవు గృధ్రంబవై జన్మించుటకు గతంబెద్ది తెలుపవేయను డప్పులుగురేని యతనికిట్లనియె ॥

సీ॥ పూర్వకాలంబు సుబోధనామాఖ్యత బరగినయట్టి తపస్వివరుడ । నొక
కాలమున నుపద్మోదరప్రీతిగా నబ్జగర్భుడు జన్నమాచరింప । కనుగొనుకాంక్ష
వెక్కసమైన నటకేను మునముత్తోకొందర మునులగూడి । చనియున్నతరియాగ
సంపూర్ణమగుడు నయ్యజ్ఞశేషము చతురాననుండు । కశ్యపబ్రహ్మచేతికి కరుణ
నొనగి । యఖిలమునులకు నిమ్మన్న నమ్మహాత్ము । డట్లకావింపకాల్మిపో నాడి
యొడిచి । బలిమిమైగొన్న నన్ను కోపమునవతడూ ॥

వ॥ దురాత్మా కాంతంబు పోనాడి యిట్టి దూర్తకృత్యం బాచరించితివి గాన గృధ్రంబవై జనియింపుమని శాపంబిచ్చిన యేను భయంబుజెంది యతనింగనుంగొని ప్రసన్నవదనుం జేసిన నాయడ ననుకింపాయత్త చిత్తుండై యిట్లనియె మదియ్యవచనంబనృతంబు గానేరదు కొన్ని దినంబులకు పరంధామ నివాసుండగు వాసుదేవుండు రావణాది రాత్రించర వధార్థంబుగా పంక్తిరథునకు రామచంద్రుండన నుదయించి తండ్రిపంపున వనంబునకరుదెంచు నప్పురుషోత్తముని నిమిత్తంబుగా ప్రాణంబులొసంగి

యుత్తమ లోకంబున కరిగెదవని యానతిచ్చె నేనతని వచనక్రమంబున నిట్టిరూపంబు గైకొంటినని లక్ష్మణున కెఱింగించి రామచంద్రుని చరణ కమలంబుల పై దృష్టినిలిపి కాయంబువొరంగి దివ్యరూపంబుతో యపవర్గంబున కరిగె నంత రఘువరుం డతని మరణంబునకు దూరవగచి నిజ జనకున కెట్టులట్టుల యాపక్షీంద్రునకు విద్యుక్తంబుగా బ్రహ్మ మేధకంబున పరలోక క్రియలాచరించి యతని గుణకథ లభివర్ణించుచు నచ్చోటువాసి ॥

ఉ॥ మోహాల శానిబద్ధ ముని ముఖ్యుడపోలె రఘూద్వహుండు ను । త్సాహముతో నిజానుజుడు డగ్గరిరా గహనంబులోపలన్ । గేహినిరోయుచున్ దనదు కిల్బిష మెన్నుచుబోవ నుండటన్ । బాహువులుసాచి యిద్దరిని బట్టెకబంధుడు దుర్మదాఢ్యుడై ॥

క॥ పట్టినరాముని తమ్ముం । డిట్టును గదలలేక హృదయములోనన్ । దొట్టినఖేదంబున నపు । డిట్టులనియె నన్నతోడ హితమలరంగన్ ॥

చ॥ అనఘచరిత్రయీమరి నిశాటునిబారిని జిక్కినార మిం । దునుచనరాదు యీభుజుని ద్రుంచుటకుం దరిగాదుగాన నే । న్నన ననువీనికిచ్చి చనబోలును నీవిటు జేసెదేనయున్ । వనజహితాన్వయంబు కడవర్ధిలుచేకురు నెల్లకార్యముల్ ॥

క॥ అనుతరిదైత్యుండిద్దర । ననుమోదముతోడబిగిచి యాహారముగా । గొన బూనవాని కరయుగ । మనుపు మెరసితుంచి రవ్వడాన్నృపతనయుల్ ॥

వ॥ అంత ॥ ఉ॥ బంధురశాపకల్మషము బాసికబంధుడు విష్ణుపాద సం। బంధియపోలెగ్రొధమును మత్సరముందిగనాడి శాంతుడై । బంధముబాడ్చి హస్తములు భావములోపల మోడ్చిమ్రొక్కి దో । పాంధతమోని వర్తికిను దంచితకీర్తికి భద్రమూర్తికిన్ ॥

ఉ॥ మ్రొక్కిధరాత్మజాధిపుని మూర్తిమనంబుననిల్పి దన్ను దా । జొక్కుచు రామచంద్రునిను జూడగగంటిని మద్భవంబు పెం । పెక్కిపితామహప్రభృతు లెన్నడు గాంచగ నేరనట్టి మీ । చక్కనిమేనుగంటి నతిసౌఖ్యములందగ గంటినవ్యయా ॥

మ॥ మనువంశాధిప మౌనిసంఘములు సమ్యగ్జ్ఞాన సంపన్నులై । కనియుంగానక మాయచేభ్రమసి ముక్తప్రాజ్ఞులై యాత్మలో । మనుజుండంచు దలంచు చుండగను దుర్మార్గంబుచే మానుషా । కనవృత్తిన్ విహరించు మీకు ఘమునోజం గాంచగాశక్యమే ।

క॥ నలినాలయా మనోహర । నలినోదరభక్తరక్ష నలినదళాక్షా । నలినభవ స్తుత పదయుగ । నలినాప్తాన్వయపవిత్ర నతమునిమిత్రా ॥

క॥ అనియభినుతిగావించిన । వినితనమానసములోన వెరగందుచు రా । ముని తమ్ముడతనితోని । ట్లనపల్కెను నరభసము ప్రియంబలరారన్ ॥

వ॥ అయ్యా మున్ను నీవలన నాసురభావంబు వోచె నీస్వాంతనవచనంబులవలన నిష్టంబు మనంబలరె నిట్టి యుత్తమునకు నీకెత్తెరంగున దుష్కరకాయంబు ప్రాప్తించె నెఱింగింపవేయనిన నతండు ॥

సీ॥ అనఘాత్మ చెప్పెద నత్తెరంగెల్లను వినుమేను శ్రీయన విలసినట్టి । గంధర్వతనయుండ ఘనుడనుధనువను వాడపద్మజుచేత వరమువడసి । బలవిక్రమము పెక్కి పన్నగామరమర్త్య లోకముల్ద్రిరుగుచు భీకరముగ । నెనురెవ్వరును లేక నినుమాడ్కి వెలుగుచు వరగర్వమునసాధువరుల భూమి । సురలబాధలబెట్టుచు మెరుకమౌళి । యొక్కచోస్థూలశిరుడను నొప్పు తాప । సార్యుబాడగని గేలిచాయంగబూని । ఇట్టి కాయంబుధరియించి యోగనతడు ॥

వ॥ నన్నుంగాంచి ప్రకోపితచిత్తుండై దురాత్మా నిజరూపంబుడాచి ఇట్టివికృతవేషంబు గైకొంటివి గావున నింతనుండి యిట్లు ప్రవర్తింపుమన యేను భయంపడి సంయమీంద్రుని పాదంబులకు ప్రణమిల్లి వేడికొనిన నతండు నాయెడ దయాళుండై తారకబ్రహ్మంబగు రామచంద్రుండు లోకోపకారార్థంబుగా మనుకులంబున జన్మించి జనకుని యోగంబున వనంబునకుం జనుదెంచు నప్పురుషశార్దూలునిచేత భవదీయబాహుయుగళంబు ద్రుంపంబడి శాపవిముక్తుండవయ్యెదు వగవకుండుమని యానతిచ్చె యేనతని శాపవిధంబున నీవికృతవేషంబు ధరియించి నిచ్చటికి యోజనదూరంబున మెలంగు ప్రాణిసంఘంబుల వెజరి యగపడినవాని భక్షింపుచు యోజనబాహుడన వర్తింపుచుండు భవదీయాగమనంబున కృతార్థుండనైతి యీగాత్రంబున ననికిం జేసి భూతభవిష్యద్వర్తమానంబు లెరకపడక యున్నయవి దీనిదహించు డిప్పటిమేను దాల్చి మీకు భవిష్యదర్థంబు నెరింగించెదననుండు రఘునందనాను మతంబున సుమిత్రాత్మజుం డట్లుకావించిన నతండు గంధర్వశరీరంబు ధరియించి రామచంద్రునిం గొనియాడి రావణుండు జానకింగొనిపోయిన విధంబు దెలిపి యిచ్చటికి కొంతదూరంబునను మతంగాశ్రమంబుగల దందు పుణ్యసాధ్వి శబరియాతిథ్యంబు సేయందలంచి మీరాకల కెదురుచూచుచున్న యది యచ్చటికేగి యాసుశీలసేయు సత్కారంబులు గైకొని యవ్వలపంపా సరోవరంబు చేరంజనిన దానికి నాగ్నేయంబున ఋష్యమూకాద్రిగల దయ్యచలంబుపైని సుగ్రీవుండను వానరపుంగవుండు వాలికి నోటువడి యున్న వాడతనితో సఖ్యంబుఘటియించు ధరణిజా జాడలేర్పడు కార్యసిద్ధియగు నన్దుజనుండనిపల్కి శ్రీతనయుండు విమానారూఢుండై నిజలోకంబున కరిగె నంత నవ్వేటువాసి యతిత్వరితంబున ॥

మ॥ సనకాదుల్ నుతిజేసి కానననివి రాజన్మూర్తి లక్ష్మీధవుం । డనఘుండాత్ర

శరణ్యుఁడచ్యుతుఁడు విశ్వాత్ముండు విశ్వేశుఁడా । జనపాలాగ్రణి యేగెరాకలకున్నై
సద్భక్తిమైఁగోరు పా । వనశీలన్ శబరింగనుంగొన మహావాత్సల్య సంధాయియై ॥

వ॥ ఇట్లరిగిన ॥

గీ॥ రామచంద్రవిభుని రాకలునర్థిమై । మునులుచెప్పవిని ప్రమోదమంది ।
యతనిపాదయుగ్మ మతిభక్తిసేవించు । తలపుబూనిశబరి తక్షణంబ ॥

చ॥ యెదురుగవచ్చిమ్రొక్కె జగదీశునకాశ్రిత భక్తసంఘుక । త్రిదశమహీ
రుహంబునకు దిక్పరిపాలక వైరివీర దు । ర్మదగజ పంచవక్త్రునకు ప్రస్ఫురమాని
మనస్సరోజ ష । ట్పదునకుదీనమానస కృపాపరమూర్తికి భద్రకీర్తికిన్ ॥

వ॥ మ్రొక్కి నిటలతటఘటిత కరకమలయై యిట్లనియె ॥

ఉత్సాహ ॥ దేవదేవ లోకపూజ్య దీనపోషనూతనేం । దీవరాక్షచారువక్ష
ధీవిశాలయోగిరా । డ్భావపీతదివ్యగాత్ర భానుకోటితేజ రా । మావనీశ యాశవంది
తాప్రమేయ శాశ్వతా ॥

సీ॥ పరమాత్మపరమేశ పరిపూర్ణగుణధామ సర్వజ్ఞసర్వేశ సర్వసాక్షి । సర్వ
లోకాధీశ సర్వాగమస్తుత్య సగుణనిర్గుణదాన జనహృదబ్జ । బంభరభవదూర పద్మా
మనోహర యాద్యంతరహిత వేదాంతవేద్య । యినశశినేత్ర దేవేశకిరీట సంస్ఫుటిత
వరమణి చారుముఖ వి । రాజనీరాజపదయుగ రాజతిలక । పరమపావన సజ్జన పారి
జాత । దేవసేవితవందిత దితిజహరణ । రమ్యగుణసాంద్ర దశరథ రామచంద్ర ॥

వ॥ దేవా భవదీయ్య స్వస్వరూపం బిట్టిదని నేర్పరింప నేరివశంబు కేవల
బ్రహ్మజ్ఞాననిష్ఠులకు పరబ్రహ్మంబవై ముముక్షులకు మోక్షప్రదుండవై మూఢుల
కభేద్యంబవై త్రైగుణ్యవర్తులకు త్రిమూర్త్యాత్మకంబవై వర్తింపుచు భూతలంబుల కధీశ్వ
రుండవయ్యు వానియందనుగుణ్య చిత్తుండవు గాక విద్యావిద్యలంబొరయక వేదాం
తంబులనైన నెరుంగరాక జీవాత్మ స్వరూపకుండవై పమాద్యధిక రహితుండవై
యచ్యుతుండవై యనంత కల్యాణగుణ పరిపూర్ణుండవై సంతత శుభప్రదుండవై
జగన్నాటక సూత్రధారివై బ్రహ్మాండాద్యఖిల ప్రాణిసమూహంబుల యందంతర్బహి
ర్మధ్య గతుండవై వానిసుఖంబు గనుంగొనుచు సాక్షివై యుందువు పరమపదంబున
శ్రీభూనీళలం గూడి క్రీడింతువు క్షీరవారాశి మధ్యంబునం దిందిరాదేవి తోడంగూడి
శేషపర్యంకంబునం దానందవిహారంబు సలుపుచుందువు మెండియు జగంబులులయంబు
గావించి ప్రళయకాల జలమధ్యంబున వటపత్రశయనుండవై శిశోరాకృతి వహించి
విశ్రమింతువు పదంపడి లోకంబులు సృజించుతలంపు వొడమిన నాభికమల మధ్యం
బున చతురాననుగల్పించి యతనిచేత జగంబులు సృజింపంజేసి పరిపాలింతువు యొకా

నొక కాలంబున లోకంబుల కపకారంబు గావించు దుష్టరాత్రించర వర్గంబు బరిమార్చుటకు జలచర నరమృగ రూపంబుల నవతరించి వారిం గీటడంగించి భువనంబులు రక్షింతువు ఇట్టి బహురూపవ్యాపివైన నిన్ను శోధింప సమర్థు లెవ్వరు కావున మీ ప్రపంచంబు మీకే కాని యొరులకు దెలియనలవిగాదు వేదశాస్త్రంబులు పలు తెరంగుల పలుకుం గాని మిమ్ముల నింతంతవాడని నిశ్చయింపనోపవు కర్మజ్ఞాన భక్తి వైరాగ్యంబులవలన మిమ్మెఱుంగ వచ్చునని ప్రాజ్ఞులైనవారలు తదాసక్తచిత్తులై వర్తించి ప్రయాసంబు నొందుచుందురు గాని భవదీయ నిరహేతుక కటాక్షంబు దక్క నితరోపాయంబులవలన మీ దివ్యమంగళ విగ్రహంబు గన నశక్యంబు సర్వ స్వాతంత్ర్యయుండవగు నీవె వేళల నెట్టులొనర్చిన నట్టులగు నింకులకు వెరగుపడనేల పరబ్రహ్మ పరంధామ పరమపురుష పరమాత్మయని యద్దేవుని నభినుతించి నిజగురుని వచనంబు తెఱంగున నాలోకశక్తికి నాతిథ్యం బొనరింపందలంచి నిజమనోవృత్తి విన్నవించిన భక్తవత్సలుండు గాన నాపరమేశ్వరుండు తమ్మునితో దానును తదీయాశ్రమంబునకుం జనియెనంత ప్రముదితాంతరాత్మయై యా శబరీలలామంబు ॥

కం॥ ఫలములుగోయుచుమధురము । గలయవిగా గొఱికిచూచి కడుయోగ్యము
లై । వెలయునవి బుట్టలోనిడి । సలలితగతితెచ్చి రామచంద్రునకిచ్చెన్ ॥

గీ॥ అటులొసంగిన సంతోషితాత్ముడగుచు । పరమపురుషుండు తారకబ్రహ్మ
మూర్తి । శబరిచవిగొన్న ఫలములు సరభసమున । ననుభవించెను బ్రహ్మాదులరుసుజంద ॥

సీ॥ తనయునిగా నోచి కనియెనొగని యా కౌసల్యపైనంత కరుణలేదు । కానల
కును సహాగావెంటవచ్చిన తమ్మునిపైనంత తాల్మిలేదు । అనిశంబు తనచరణాబ్జయుగ్ల్
భజియించు మౌనులపైనంత మమతలేదు । బాల్యమునగూడి పాడియాడినయట్టి
సఖులపై నాతీరు చనువులేదు । తనయుడగు ధాతపైనంత మనసులేదు । సగముగొఱికిన
పండులొసంగినట్టి । శబరిపై కూర్మియచ్చటనులేదు । యేమిచెప్పంగవచ్చు సీతేశు
మహిమ ॥

వ॥ ఇవ్విధంబున నిచ్చలు నాశబరిదెచ్చియిచ్చు ఫలంబులు దానిజన్మ సఫలంబగునట్టుగా నుపయోగింపుచు తనయందలి భక్తి తాత్పర్యంబులకు బ్రహృష్టాంతరంగుండై రామచంద్రుం డామగువం గనుంగొని నీయభిమతంబెయ్యది వినుపింపు దాసి యొకగూర్చుననుండు నయ్యంగనారత్నంబు రఘుపుంగవునకు మ్రొక్కి యిట్లనియె ॥

మ॥ జనవాలాగ్నిని మూఢచిత్తనగు నా సత్ప్రేమ రక్షింప నీ । యనుకంపా
దలతేని యోగులకు గమ్యంబైన లోకంబు నా । కునివాసంబుగ సేయుమాటికి నీక్షోణీ
స్థలింబుట్టి చా । వనుజన్మింపగ నొల్లనో యాభవ దేవా దేవ తారాధితా ॥

ఉ॥ నావినిసంతసించి నరనాయకుడట్లుగ నంచుబల్కు ద । స్పావనశీల కాష్ఠములు పైబడదాచితి పేర్చి దానిపై । నావిడి బవ్వళించి రఘువల్లభ శ్రీచరణారవిందముల్ భావములో దలంపుచు సుపర్వులు నివ్వెరగంది చూడగన్ ॥

వ॥ కాయంబు దొరంగ దివ్యశరీరంబు ధరియించి పరమపదంబునకుం జనియె ననిన శర్వాణి చంద్రమౌళికిట్లనియె॥

క॥ యెగింలిపండులు రాముని । కంగన యిట్లొసగి చరితమెందక నెట్టులో । గంగాధర ప్రమదంబున । నంగజ గురులోకమునకు నరిగెం జెప్పుమా॥

వ॥ అనిన ముక్కంటి యా కంబుకంఠికిట్లనియె వనితా పుణ్యసాధ్వియగు శబరిపక్వఫలంబులు గోరికి తెచ్చి రఘుపుంగవునకిచ్చుట దోషంబనరా దవ్విశ్వాత్మున కుపయోగ్యంబు గావలెనని భక్తిపూర్వకంబుగా జవిగొని యిచ్చె దానం జేసి కృతార్థ నయ్యె వినుము తపోదాన స్నానసంధ్యాద్యనుష్ఠానంబు గావించు వారలకంటె భక్తినిష్ఠుల కా సర్వేశ్వరుండు సులభుండై యుండు నని పల్కి యిట్లనియె।

చ॥ అలికులవేణి రామవిభుడచ్చటు వాసి దినేశపుత్రు ని । శ్చలకృపబ్రోవ గోరి యనుజన్ముడు దోనయరుంగు దేర న । య్యలఘుతపః ప్రకాశము రయంబున నేగుచు గాంచె గౌతమిన్ । కలుషవినాశనిన్ సుజన కామిని వాహిని లోకపావనిన్ ॥

వ॥ కని యాశ్రమంబున సీతజాడల యుడు నావ్యపవతీ రత్నంబు పరమపదనివాసుండగు వాసుదేవుం జూడంగలైననుచు నుప్పొంగిన ప్రకుపిత చిత్తుండై రామచంద్రుం డమ్మహావాహిని గనుంగొని క్రూరమతివై మద్విమతులం గూడి యహితంబొనరించి ధరణీసుహితవృత్తాంతం బెఱుంగించవైతివి గావున కుటిలచిత్తవైన నీయందు నింతనుండి యవగాహం బొనరించినవారలు ధర్మేతరులగుదురని పలికిన ॥

క॥ వడవడవణకుచు గౌతమి । పడతుకయై వచ్చి యతని పదంబులపై । బడి బడి కరయుగము మొగిచి । యిటులననుచు బలికె కేవలభక్తిన్ ॥

చ॥ పరమపదాదినాథ పరిపాలితకంజభవాండసమ్మనీ । శ్వర వరయోగి హృత్కమలవాస రమేశ జగన్నివాస శం । కరపురుహూతవంద్య భవకండన దుష్టనిశాటబృందసం । హార ఖగరాజవాహన జనార్దన భక్తఫలప్రదాయకా॥

క॥ కరిరాజవరద శాత్రవ । వరభుజబలగోత్ర బిధుర వనధిశయానబంధుర కరుణాకర శ్రీకర । సరసిజదళనేత్ర నీలజలధరగాత్ర॥

ఉ॥ నేరమి లేదు నావలన నీవిటువచ్చుట గాంచి పొంగి గం । భీరత నుంటి లోకమున బిడ్డలు తండ్రిల రాకకుబ్బరే । గౌరవయోగ్యనైన ననుకల్మష గాగణుతించి యేలని । ష్కారణమిట్లు బల్క కృపగావుము మ్రొక్కెద భక్తవత్సలా॥

గీ॥ తప్పుగలిగియున్న తనయులదెసనేమి యలుగతగదుతండ్రి కట్లుగాన ఖలధర్మ చయము నీయరుంగనియది । గలదె యరయగా జగన్నివాసా॥

క॥ అనునవసరమున నచ్చటి । మునివర్గంబేగుదెంచి ముదమున రాముం । గని వేదోక్తములగు దీ । వనలొసగుచు బహువిధముల వర్ణించితగన్॥

వ॥ ఆరాజ పరమేశ్వరు నుద్దేశించి దేవా సకలవర్ణాశ్రమధర్మంబులు మీరు గల్పించి పాలించుటం జేశి జరుగుచున్నయవి యందుమునులమైన మాకుస్నాన సంధ్యాద్యనుష్ఠానంబు లహరహకృత్యంబులు గావున నీగౌతమీ తటవాసులమై త్రికాలంబిందులగ్రుంకి విహితకర్మంబులాచరింపుచుందుము మీచేత నిందింపబడియు పవిత్రయయ్యె మాపయి కరుణగలదేని యీనది యప్పటియట్ల పవిత్రగాజేయవలయుననుడు వారల వినుతులునాతరంగిణీ తిలక జేయు వందనంబులు గైకొనికరుణాసాంద్రుండగుచు యప్పుడు భక్తజనాధిక్యం బేర్పరింపం దలంచి మున్ను శబరి ఋతుమతియై చతుర్థదివసంబున స్నానంబాచరించుటకు గౌతమియందు యుక్తంబుగామి నొక్కజలాశయంబున మునింగివచ్చి పిదప గోదావరియందు గ్రుంకుచుందునట్టి పల్వలోదకంబులు తనకోదండంబునం బెకలందిగిచి యమ్మహాప్రవాహినియందు గలపి గౌతమి నెప్పటియట్ల పరిశుద్ధగాజేసె నాటనుండి శబరీగౌతమీ సంగమంబను బరగి రామచంద్రుని మహాత్మ్యంబు దెలుపుచున్నయది విను మట్లుగావించి యచ్చటి మునులచేతనను జ్ఞాతుండై కొంతదవ్వరిగి ముందల॥

సీ॥ కమనీయశ్యోభిత కమలమరందంబు మదముతోగ్రోలు షట్పదచయంబు। బిసవివరంబుల మెసగిచూనసముల నలరుచుండెడు కలహంసపంక్తి। గంభీర విమలాంబు ఘనతరసంచార వరనక్రఝష చక్రవాకసమితి । తటభవఫలపుష్ప ఘటితశాఖాసాంద్ర సకలదాత్రీరుహ సముదయంబు । గరుడగంధర్వ యక్షకిన్నరవిహార । సరస సల్లాపన-గీత చారుసైక । తస్థలంబులు ఘుమఘుమధ్వానసాంద్ర మిళిత పంపాసరోవరంబెలమిగాంచి॥

గీ॥ యందుతీర్థమాడి యరవింద బాంధవ । వంశవర్ధనుండు వలనుమీర । సతలమైతనర్చు నవనీరుహము చెంత । నుండె తమ్ములక్ష్మణుండు గొలువ॥

వ॥ అనిరుంద్రుండు తుహినాద్రినందన కెరింగించెనని సూతుండు శౌనకాదుల కు వినుపించినవిని తరువాతి వృత్తాంతంబెటులయ్యెనని పలుకుటయు॥

మ॥ హరిదశ్వప్రతిమాన తేజ ఘనమాయావాద పాషండ భూ । ధర సంఘాత బిడౌజచక్రధర పాదధ్యాన చిత్తాబ్జ ని । త్యారమాశోభిత చారుమండిత విశుద్ధజ్ఞాన పారీణ బం । ధుర కారుణ్య గుణాప్రపూర్ణ బుధస్తోత్రాఖ్య పుణ్యోదయా॥

క॥ విప్రాన్వయ మణిచారు గు । ణ ప్రతిపక్షౌఘరామ నరనాయక వి । ద్యా ప్రాప్తిచేత సనిఖి లా । ర్య ప్రణుతసుశీల సంతతాశ్రితపాలా ॥

భుజంగప్ర ॥ త్రియీవేదపారంగ త్రాధన్యమూర్తీ । జయస్తోకవిభ్రాంత సద్ధర్మవర్తీ । దయాంభోది యప్రాకృతస్తోమవర్య । నయోపాయధుర్యా జనస్తుత్యచర్యా ॥

గద్య ॥ ఇది శ్రీభద్రాచల రామభద్ర వరప్రసాద లబ్ధకవితా విచిత్ర గిరుమ నామాత్య పుత్ర గౌతమగోత్ర ఆపస్తంబ సూత్ర ప్రసిద్ధ సిద్ధనమంత్రి ప్రణీతంబైన శ్రీసదాశివ రామాయణంబను మహాకావ్యంబునందు సీతానాయకుండు జనకజా లక్ష్మణసహితుండై దండకారణ్యంబున కరుగుటయు విరాధవధయును యిందాగమ నంబును యిందునకు విశ్వరూపంబు చూపుటయు శరభంగ దర్శనంబును శరభంగ మోక్షప్రాప్తియు సుతీక్ష్ణ సంభాషణంబును అగస్త్య దర్శనంబును శస్త్రాస్త్ర లాభం బును శూర్పణఖ నాశికాచ్ఛేదనంబును ఖరదూషణాది రాక్షస సంహారంబును వారల పూర్వభవప్రకారంబును రావణమారీచుల దురుద్యోగంబును మారీచుండు మాయామృగంబై వచ్చుటయును పర్ణశాలయందు యోగమాయ జానకీరూపంబున వసియించుటయును ఇందిరాఫణీంద్ర యోగమాయ లన్యోన్యశాపంబు లొందుట యును మారీచవధయును దశవదనుండు యతివేషంబున కుహనాజానకిం గొనిపోవుట యును యోగమాయా విలాపంబును జటాయువు పుణ్యలోకగము డగుటయును కబంధ నాపమోక్షంబును శబరీస్తోత్రంబును శబరి యుత్తమపదంబు నొందుటయు గౌతమీ శాపంబును శబరీగౌతమ సంగమంబును పంపాసరోవర ప్రవేశంబును నను కథలంగల అరణ్యకాండ సర్వంబును ప్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీసీతారామాయనమః శారదాయైనమః

# కిష్కింధాకాండము ప్రారంభము.

శ్రీజగ్గార్యగృహాంగణ । రాజితనిర్జరమహీజ రంగేశపదాం । భోజమధువ్రత ఘన వి । ద్యాజలధి కిడాంబి వేంకటాచార్యవరా ॥

వ॥ విన నవధరింపుము సూతుండు శౌనకాదుల కిట్లనియె నట్లు సీతానాయకుండు పంపాసరోవరతీరంబున విశ్రమించియున్న యవసరంబున ॥

గీ॥ భానుసూనుండు రామనృపాలవరుని । నతనితమ్ముని గని హృదయమున నధిక । భయముజెంది రయంబున బరచి యత్తె। రంగు సంతుల్లికెల్ల నెరుంగజేసి ॥

వ॥ వారలుం దానను యనిలనందనుండున్న యడకుంజని యతనిం గాంచి యిట్లనియె ॥

గీ॥ పవనతనయవినుము పంపాసరోవర । మునను కృతకవేష మునియుగంబు । మెలగుచున్నగంటి తెలిపెదవారల । రూపమత్తులబాణ చాపధగుల ॥

క॥ వనరుహబాంధవ భాసితు । లనుపమబలయుతులు మేచకాంబోధర కాం । చననిభగాత్రులు వారల । గనిశర మదినగ్గలంబుగా భయమొందవ్రు ॥

క॥ యరుకజనింపను తాపస । వరులో నరపాలసుతులో వాళిబనుపగా । నరుదెంచిన మాయావులో । యరయంగావలయు వేగముని యిట్లనిన ॥

క॥ పగవారినమ్మబోలదు । తగసామోపాయములను దలతురు చరపం । బగయనల మెట్టిదట్టిద । తెగటార్పకపోముజూవె తెల్లంబెందు ॥

ఉ॥ కావున నూరకుండుటలు కజ్జము గాదట కేగి వారి నం । భావనగాంచి యాఘనులు పార్థివసూనులొ మౌనివర్యులో । దేవతలో తలంపగ నతిస్థిరబుద్ధి నెరింగ మీర వి । చ్చేవసియించుటేటికని చొప్పడనారసి రమ్ముమారుతీ ॥

క॥ అనవుండన్న గాకని పా । వనియూ రాఘవులకడకు వడిజని కరుణా। వననిధి యగు శ్రీరఘు రా । మునియుజ్వలమూర్తిగాంచి ముదితహృదయుడై ॥

వ॥ యతండు దుష్టజన సంహారణార్థం బవతరించిన నారాయణుండని తలంచి యయోధ్యా సుమిత్రానందను జేరి వినమిత్రోత్త మాంగుండై అయ్యా దేదీప్యమాన పవిత్రాంశులరగు మీరలెవ్వ రీయనఘుండు నీకేమిగావలె మీకుం జేరెయ్యది యింక వచ్చుటకు గతంబెద్ది సవిస్తరంబుగా దెలుపవే యని వేడియు ॥

గీ॥ నావిధము జెప్పెదను వాయునందనుడను । పేరు హనుమంతుడని యండ్రు

సారసాప్త । తనయుసచివుండయాతడు బనుపనిటకు । నేగుదెంచితిమీవిధం బెరుగ బూని ॥

సీ॥ అనవినిలక్ష్మణుండనియె వాతనితోడ కపివర్య వినుము మత్క్రమమునీకు । నెరిగింతు దశరథేశ్వరుల మితండు రాముండు సుగుణాభి రామమూర్తి ॥ సర్వభూత హితుండు సర్వశరణ్యుండు సత్యసంధుడు ధైర్యశాలిఘనుడు । విజితేంద్రియుడుబాహు విక్రమధుర్యుండు శుభలక్షణుడు శత్రుసూదనుండు । తాతసత్యంబుపాలింప దలచిసీత । యేనువెనువెంటరా వనికేగుదెంచి । మునిజనంబులరక్షించి దనుజవరుల । ద్రుంచి మరికొన్నినాళ్లకు పంచవటికి ॥

వ॥ చనుదెంచి వసియింపుచుండ దశకంధరుండనువాడు వంచించి సీతంగొని పోయిన నాసతినరయుచు నేతేర మార్గంబున కబంధుండు సుగ్రీవుని వృత్తాంతం బెరింగించి యతనిగరుణించి తదియ్యవార రాజ్యంబులోనగూర్చుం డవ్వానరపుంగవుని కతంబున మీకు వైదేహీయునికి యేర్పడు కార్యసిద్ధియగునని పలికిన ॥

క॥ మనుకులపాకశాసన । తనయునిబరిమార్చి మిత్రతనయునిచేతం । బని గొనగదలచి యిటకుం । జనుదెంచినవాడు శైలచరకులతిలకా ॥

వ॥ యేనిమ్మహా ధనుర్ధరుని యనుజన్ముండ లక్ష్మణాభిధానుండనని యెరింగించిన నభస్వదాత్మజుండు గరంబుసంతసిల్లి రఘువరునియడుగులకు ప్రణమిల్లి దేవా యక్లేనియుం దడయనేల యినజుండున్నయెడకుం బోవుదమని ప్రార్థించిన నియ్యకొని యతనింగూడి సుమిత్రానందన సహితుండై సత్వరంబున ॥

క॥ మలయాద్రిచేరజని మన । ములరంగాయచటనిలచి యజ్ఞాప్తసుతుం । బిలచి తెమ్మనుడుమారుతి । యలరుచుసుగ్రీవుపాలి కరిగియాతనితోన్ ॥

క॥ తానేగుటరఘువతి స । న్మానించుట లింద్రసుతుని మర్దింపంగా । బూనుట పొందొనరించుట । కై నరనాయకుడు వచ్చుటంయుతజెప్పెన్ ।

వ॥ చెప్పి వెండియు ॥

మానిని ॥ భూరిభుజుండగు భూవరుగాంచగ బోవుట నుత్తమకార్యము గో । త్రారిసుతుండెగటార్చిసతంబుగ నద్రిచరాధి పతిత్వముదా । కూరిమినీకొనగూర్చును శ్రీరఘు కుంజరుబోలిన రాజులిలన్ । లేరుకృపాలుడు లెమ్ముమనంబున శోకముశంక రయొనర్పకనన్ ।

వ॥ రోమాంచ కంచుకితగాత్రుండై మిత్రసూనుండు పవమానపుత్రుం గౌగలించుకొని నీమూలంబున మేలొదవె ధన్యుండనైతినని సన్మానించి సచివసహితుండై మారుతాత్మజ పురస్సరంబుగా నప్పుడకదలి ॥

ఉ॥ ఆరవినందనుఁడు హృదయాంబుజరంజని గాంచె దైత్య సం । హారు వికార
దూరుఁ గలశాబ్ధిగభీరు మునీంద్రచిత్త సం । చారు నఘాపహారు ఘనసంగరశూరు ననేక
మన్మథా । కారు నుదారు భూరితర కాండశరాసనధారు నయ్యెడన్ ॥

వ॥ కని సాష్టాంగ నమస్కారంబు గావించు నతండు మన్నించి లేవనెత్తిన
కృతాంజలియై యిట్లనియె ॥

గీ॥ దేవతాధీశవినుత మదియ్యమైన । రాజ్యమును రుమను నగ్రజరాజతనయు ।
డపహరించినఁ బోరాడి యోపనోర్వ । గాదరఁ గాఁమి ఋష్యమూకమున నిల్తు ॥

వ॥ ఇడుములఁ బడుచున్న నాఁడ నేఁడు మదియ్యభాగ్యవశంబున మీయడుఁగులు
పొడగంటి నీయాపద దొలంగించుటకు దైవంబు నిన్నుఁ బంపె ననవుఁడు దయాసము
ద్రుండగు రామభద్రుండు ॥

క॥ హరిదశ్వతనయు నమ్ముము । గరుడధ్వజ రుద్రసద్మ గర్భులొకటియై ।
యరుదెంచి తోడుసూచిన । పురుహూతతనూజు ద్రుంచి ప్రోచెదననున్ ॥

వ॥ అని పల్కి యయ్యరుణాగ్రభసిసూనుని మస్తకంబున నభయహస్తంబొ
సంగిన నతని మంత్రులు సంతసించిరి రవిజుండును వానర రాజ్యహరవిగ్రహకొన్న పాలు
పున నలరెనంత ॥

సీ॥ ఇనజుండు రాముని గనుఁగొని దేవేశ యసురకునగపడి యవనిజను ।
యరుగు నాఁ ఋశ్యమూకాచలంబున యేనుబలిముఖులనుగూడి మెలఁగుచుండ । మాటికి
నిన్నులక్ష్మణుని దైన్యముపేర్మి దలఁపుచుశోక సంతప్తయగుచు । సొలుపొందుతనమేని
భూషణంబులు దివిచి యవియుఁ దైచేలతోనఁ గట్టి వైచిపోయిన గని యేను వానినొనర ।
నొక్కగిరిగుహాలోపల నునిచినాఁడ । నిలుకుగొనివత్తునని ధరణీశునాజ్ఞ । బూని
పంకజబాంధవ పుత్రుఁ డపుడు ॥

వ॥ వానిం దెచ్చి రఘుపతి ముందరం బెట్టిన నతండు క్రీడఁ బోలె నొక్కింత వేష
బంబు గావించి యట్టకేలకు సహోదరుండు దేర్పనారడిల్లి యానరదేవోత్తముండు ॥

చ॥ వనరుహపత్రమిత్రసుత వానరవంశపవిత్రగోత్రభి । త్తనయుఁడదేల నీదు
ప్రియదారను జేకొని వెళ్లఁద్రోచె నే । యనువున నీకు వానికిని నాలముగల్గెను మూల
మెద్ది సయ్యన నెఱిగింపు నాకనిన నాతఁడు రామునితోడ నిట్లనున్ ॥

సీ॥ ధరణీశ వినవయ్య తమతండ్రి హాతుఁడైన తదనంతరమున ముచిదమన
పుత్రు । డగచరాధిపతిత్వ మొగిబూని భుజబలంబెంతయు దనరార యేలుచుండు ।
డతని మజ్జనకుని యట్లగా భావించి పరిచర్యసేయుచు భ్రాతృవత్స । లతనుంటినట
దైవకృతమున మాయావియను నొక్కరక్కసు డతులశౌర్య । దర్పమున పూర్వవై

రంబుదాల్చి రాత్రి । జనులునిద్దురజెందిన సమయమునను । శిరులబాలుపొందు కిష్కింధ జేరవచ్చి । నగరివాకిట నిలచి ఘనంబుపగిది॥

క॥ ఘుర్జింపుచు తరుచరులను । భర్జింపుచు క్రొవ్వుమిగిలి భండనమున క । పృజన్మాత్మజురి పుబల । నిర్జితు నింబిలువ నతడు నిష్ఠురభంగిన్॥

చ॥ కడువడిబోవ యేనతని గాచిపిరుందన యేగు డా ని శా । టుడుమము నిద్ద రంగని పటుత్వబలంబులు పీటిబోవ త । ల్లడమున భూరిభూధర బిలంబున సొచ్చెను వానిజాడ నే। తడయక యేముబోయి గుహాడగ్గరనంత సురేంద్రసూతిదా॥

వ॥ తదియ్యముఖంబున నన్నునిలపి యేను మగిడివచ్చునంతకు గాచియుండుమని పలికి తానగ్గిరి గహ్వరంబుసొచ్చె యొక్కసంవత్సరంబు గడచునంతకు రాక తడసిన యేనుజింతయొనర్పు చున్నంత॥

గీ॥ నిర్జరారిసింహ గర్జనవృత్రి వై । త్కారి సుతుని దైన యార్త । రవము వింటిబిలము వాతవెడలెను నెత్తుర । త్తెరగునకును యేను వెరపుజెంది॥

వ॥ గీర్వాణ విద్వేషునిచేత వాలిసి హతుండకాదలంచి శాత్రివుండుపైనెత్తి రాగలండను తలంపున గుహా ముఖాంతంబున నొక్క శైలంబునిచి యచ్చోటువాశి వాలికి తిలోదకంబులిడి కిష్కింధానగరంబు ప్రవేశించి యత్తెరంగు భాంధవా మాత్యుల కెఱింగించియున్నచో వానరరాజ్యంబునకు ప్రభుండు లేకున్కినఖిల ప్లవంగ ప్రార్థితుండనై తరుచరాధి పతిత్వంబు నైకొని ధర్మాచారంబున పాలింపుచుంటి నంత కొన్నిదినంబులరిగన॥

గీ॥ బిలములోపల ప్రత్యర్థి బిలుకుమార్చి । యబ్బలారాతి నందనుం డరుగు దెంచి । తరుచరాధీశ పదవిని దనరునన్ను । గాంచి కన్నుల విస్ఫులింగములు దొరుగ॥

వ॥ నిఖిలామాత్య వర్గంబురావించి వారలతో నాకథంబెఱింగించి నాపైన యావ రాధంబువెట్టిన యేనప్పుడద్దేవేంద్ర పుత్రునకు నమస్కరించి యున్నతెరంగువిన్నవించిన నపరాధినని బహుభంగుల ప్రార్థించిన నతండు చలంబుడింపక మదియ్యవనితయగు రుమను రాజ్యంబునుండిగిచికొని వెడలనడచిన॥

గీ॥ నాటనుండియేను నగముల వనముల । దీవులందు నదులతిరిగి తిరిగి । వాలి శోకవెపంబువలనను ఋష్యమూకాద్రియొక్క రామియారసియుందు॥

వ॥ వర్తింపుచుండుననుడు రఘునందనుండు భానునందనునితో మహాబల విక్రమ సంపన్నుడగు వాలికి నయ్యచలంబెక్క రామికి గతంబెయ్యది యనుం డతండిట్లనియె మున్నుమహేంద్రనందనుండు దుందుభుండను రక్కసు నుక్కడించి వాని

కళేబరంబు పాదాంగుష్ఠంబున నెగరవైచిన ఋష్యమూకాద్రిపైబడి తదియ్య శోణితం బిన్దుహిధరంబుపై తపంబు గావించు మతంగమునీంద్రుపై జిలికిన నతండు క్రోధారుణిత లోచనుండై యుత్తరంగాచరించి క్రూరుండీశైలంబు మీదికి నేతెంచిన యప్పుడ శిరంబు సకల శతంబై పంచత్వంబు నొందుంగాకయని శాపంబిచ్చి యుత్తమ తపస్వివరుండు గాత మీతీరంబున జనియె దానంజేసి వాలికి ఋష్యమూకారోహణంబున సాధ్యం బయ్యె నదియెరింగి నేనియ్యచలం బాశ్రయించియున్నవాడ నృపకంఠీరవ యవధరింపు మని వెండియు ।

చ॥ అనఘచరిత్ర ఘోర రజితాద్రివిధంబున నొప్పు దుందుభిం। దనసనరాదు నట్టి యమరాహితు గాత్రము దాని నెత్తగా। వన చరవర్యుడైన యలవాలికి నొండెను నాకు నొండె త। క్కని తరులోప రాషని జగన్నుత మీరలు పూనిసేయుడున్॥

గీ॥ వాలిద్రుంచెదరని నమ్మవచ్చునని న। నవనిపాలుండు వామపాదాంగుళమున మింటికెగరంగ జిమ్మిన మెచ్చురాక। భానుసూనుండు వెండియు బల్కెనపుడు॥

సీ॥ జనపాలకోత్తమ జంభారితనయుండు దునిమెదునాడు దైత్యునికళేబ। రము నిండుకయుండు రక్తమే దోమాంసములునేడు శుష్కమైచులు కదోచు। హెచ్చుగాదిన దిమీర లిమ్మొయినెత్తిన పాకశాసని బాహుబలము మెరయ। సప్తతాలంబులు సరవి గానొక్కెడగూర్చి పనణంబులు గోయుచుండు। గాన నొకయేటుచేవాని ఖండితంబు జేశెదేని కపీంద్రుని సిద్ధముగను। యుక్కడంచెదవని నమ్మియుండవచ్చు। ననిన కౌంసల్య పట్టిదానాత్మణంబ॥

చ॥ శరమరిబోశి తేయుడును ఛండగతింజని వానిగూల్చి భూ। ధరములు గాడి శీఘ్రమున ధారుణిదూరి సుపర్వసంఘముల్। వెరగుపడంగ మళ్లిరఘువీరుని షంగముజొచ్చె పూర్వపుం। దెరగున రాము విక్రమము దిక్కుల వారనుతింపు చుండగాన్॥

క॥ శౌర్యబలుడయ్యు రఘుపతి। యార్యమనందనుడు జెప్పి నట్టెల్ల దా। తుర్య గతినాచరించెను। కార్యార్థికి నదియువిహిత కర్మమె కాదే॥

ఉ॥ అప్పుడు రామచంద్రుని మహాద్భుత శౌర్యముగాంచియంతయున్। దెప్పర మంది భానుజుడు నేత్రయుగంబును మూశి యొయ్యనం। దెప్పిరి నేమియున్న నతదేహము కంపమునొంద విన్నబా। టొప్పగ హస్తముల్మొగిచి యుండెను చిత్రపురూపు కైవడిన్॥

వ॥ కావున ।

చ॥ పనిగొనబూని ధన్యుడొక పట్టున తన్ననిచేరవచ్చినన్। వినయమొనర్చి

దానికి నివేదించుచు కృపబుట్టజేశి చే । ర్చునదన కార్యముందెలిపి ప్రాణికెసేయగ భోలుగాని యా । వానరుప నోపిదోషవని యొద్దిపరీక్ష గొనంగవచ్చునె ॥

వ॥ అదియట్లుండె తదనంతరంబ వృత్తాంతంబు వినుము ॥

క॥ మనుకులుడు భాస్కరాత్మజు । ననుకంపంజూచి తరుచ గాఢిపయికె నీ । మనమున యెంతుదలంపక । చనికదనము సేయబిలుము శక్రాత్మజుని ॥

క॥ పిలచినయంతనె నీపై । బలురోషముతోడవచ్చి పైకొనిపోరన్ । బాలి యించెద నవ్వాలిని । బలభేదినగంబు గూల్చు పగిదివేల్మిడిన్ ॥

ఉ॥ నావిని యాతడంతకు మనంబున నుబ్బుచు బోవనప్పుడా । త్రీవరశేఖరుండు రఘునందన తమ్మునితోటగూడి । సుగ్రీవుపిరుంద నేగి యొకవృక్షము చెంతను బొంచియుండెదా । నావిబుధేంద్రనందనుని యాగమనంబు మదింపలంపుచున్ ॥

వ॥ అంత సుగ్రీవుండు కిష్కింధచేరంజని మహాద్భుత ఘర్జిత ధ్వానంబు గావింప శక్రాత్మజుండు దారుణరోషంబున నిజనగర ద్వారంబువెడలి దిశలు బగులనార్చుచు జలజబాంధవ నందనుం బలువిడిందాకె నప్పుడాండుకులం బరవిశ్వంభరలు నిండబొబ్బలిడుచు నుప్పొంగి చరణఘట్టనల ధరాతలంబు చలింపకుల భూదరధ్వయంబు చాదంబున మత్త సింధురయుగంబు విధంబున సముద్రయుగళంబు చాడ్పున కంఠీరవ ద్వంద్వంబు వడుపునదరలక బిరుతియ్యక యుబ్బుడింపక తెరలక పెనుంగుచు కరచుచు రక్తపూరంబులు వెడల గాత్రంబులు పరియగలుగ వ్రేయుచు వజ్రవజ్రంబునంబోని ముష్టితలంబులం బొడచుచు హుంకరింపుచు నఖంబుల వ్రచ్చుచు తన్నుచు దారుచు పోరుచుండి రయ్యవసరంబున భానునందనుండు దనకు బలపరాక్రమంబు లల్పంబగుట జేసి శక్రసూతిచేతి నిష్ఠుర తరముష్టిఘాతంబుల కోర్వంజాలక ॥

సీ॥ సమరంబులో పరాజయమంది నిజభుజా బలమంతయును దూలభయద కంపి । తాంగుడై వెనకదిక్కరయుచు ఋష్యమూ కాద్రిపైనేగు డయ్యవసరమున । రామచంద్రుడుజని రవిసుతుడగ్గరి యసమానబలశాలి యైనవాలి । చేతికిలోబడి సేమంబుతో రాక గలిగనేనీకు భాగ్యంబుకలిమి । ననుడుభానుతనయు డార్తరవంబున । మిగుల శోకమంది మేదినీశు । చరణయుగ్మమునకు సాష్టాంగమొనరించి । తనపరిధాను లెల్ల దరసిపొగల ॥

వ॥ అనిన పార్వతి యిట్లనియె దేవా భానుసూనుండు జగదేకవీరుండగు రామచంద్రుని నమ్మి సమరంబున పరాజితుండగుటకు హేతువెద్ది యెరింపుమనిన నతం డిట్లనియె నతివా సుగ్రీవుం డాశరథ్యుంజేరి యభయ హస్తంబు వేడిన నతండెల్లభంగుల

వాలిం దెగటార్చి వానరరాజ్యంబు నీకు ఘటింపజేతునని నిఖిలైశ్వర్యకరంబును నిజదాస జననిబిడ దుఃఖాంధకార విచ్ఛేదన దినకరోదయంబని కరంబునగు దనకరంబు శిరంబుపై నునిచిన నమ్మం జాలక దుందుభికాయం బెత్తించి పరీక్షగొనియె నదియు విశ్వసింపక సప్తతాళచ్ఛేదంబున నతని బాహుబలం బెరింగికొనియె నందును మనంబు తిరంబు సేయక సంశయింపుచుండె నట్టిది కారణంబుగా దురవస్థం జెందె కావున నిర్మలాంతః కరణులై యాదయానిధి నమ్మినవార లభిమత సుఖంబులం గాంతురు సందియంబు లేదు విను మట్లుతన సేమం బెరుంగ వేడిన రఘునందనుతో నిట్లనియె॥

ఉ॥ యేమనివిన్నవింతు జగదీశ్వర దేహము చూడు నేడు సు। త్రామసుతుండు బాహుబల దర్పమెలర్పగ నన్ను ఘోర నం। గ్రామములోన నొంచి కృపగాచి వధింపమి నాకు గ్రిమ్మర౯। మీముఖ పద్మముం గనెడు మేలు ఘటించుట కారణంబుగా౯॥

ఉ॥ చాలెను రాజ్యకాంక్ష మృగశాబకలోచనయైన తారతో। కేళిని దేలితిన్ని ఖిల కీశసమూహము గొల్వగంటి సు। శ్రీలొనగూడె నేరికి న జేయుడనైతిని మీయను జ్ఞచే। వాలికెదుర్పగా నెదురువచ్చె మనోరథ సిద్ధులన్నియు౯॥

ఉ॥ ఎక్కడ కేనిబోయెద మహీశ్వర వాలి జయించు కార్య మిం। కెక్కడ గల్గు నాకు వెరవెద్ది ధరాస్థలి నీయంబుజాల పెం। పెక్కినయట్టి నీవు గన యంతయు ఘూపి యొనర్చిపుచ్చె ది। క్కెక్కడిదిమ్మహా ఖలుని యేపడగించుట కేర్పరించుమా॥

వ॥ అని తలపోయుచు వగచుచున్నవాని లేవనెత్తి యారాజేంద్రుండు॥

ఉ॥ చేరగదీసి కౌగిటను జేర్చి కలంగెద వేలయెల్లియా। క్రూరుని ద్రుంచి నీకు నొడగూర్చెద వానర రాజ్యమిమ్ముగా। నూరడుమంచు నవ్య మధురోక్తుల దేర్చి శరీర వేదనల్। దూరము జెందనట్ల కృపతో దుతమూపు బుణింకి వెండియు౯॥

గీ॥ భానుతనయ నిన్ను పగతుడు నొప్పింప। గాంచియూరకున్కి గాదలంచి। పలికితీవు నన్ను కలగినమదితోడ। తెలియజేతునట్టి తెరగు వినుము॥

చ॥ పదములు జాను జంఘలును బాహులురంబులు తుందిలంబులౌ। నుదరము లాస్యముల్దలప నొక్కవిధంబున నుండు నీకు నా। త్రిదశవరాత్మ సూనునకు దీనను సంశయమంది సేయకే మదిదలపోసి మానితిని మచ్చరరాజ మమోఘమౌటయు౯॥

వ॥ అనిపలికి లక్ష్మణు నుద్దేశించి యెల్లి సమరంబునందున మన కెరుకపడునట్లుగా నొక్క గజపుష్పమాల యతని యురతం దవిలించుమనుం డమ్మెయిం గావించిన దినమణి సూనుండప్పుడ తరుచరరాజ్యంబు లభించినవానిం బోలి సంతసించె నంత నా రేయినిద్రించి మరునా డరుణోదయంబున లేచి కాలోచితకృత్యంబులు దీర్చి లక్ష్మణ

హనుమత్సుగ్రీవ సహితుండై కిష్కింధానగర మార్గంబున కొందూరంబుజని యచ్చట నొక్క తరుమూలంబున తాను నిలచియుండుటకు సంకేతంబు చెప్పి బలారాతినందనుని తోడి సమరంబునకు పురికొల్పితెమ్మని పంచినవాడట్ల చని నటరద్వార సమీపంబున భూనభోంతరాళంబునిండ ఘర్జనం బొనరించిన ॥

గీ॥ అట్టి కోలాహలంబున కాత్మనలరి । గోత్రభిత్సూనుడెంతయు క్రోధమంది నేదిహేతువొ కాని నయ్యినసుతుండు । వచ్చెదానేడు సమరంబు వాంఛచేతా ॥

క॥ ఏనిన్నటియనిలోపల । పూనివధింపకయవిడచి పుచ్చుట ఏడిం । తేనియు మదిలోదలపక । ప్రాణములీవచ్చె ప్రేతపతి జేరేపన్ ॥

వ॥ కావున ॥

శా॥ ఉగ్రన్మెచ్చగ జేసిభూరిబల శౌర్యోదగ్రుడై నట్టి పం । క్తిగ్రీవున్నిజ వాలరోమపటు శక్తింజుట్టి యంబోధు లం । దుగ్రాకారతముంచి పోవిడుచు బాహు స్ఫూర్తిచేసిష్టు యా । సుగ్రీవుంబరిమార్తునంచు జనునా సుత్రామసూనుంఘనుల్ ॥

వ॥ కనుంగొని తారయిట్లనియె నీవు బలోన్మాదంబు పెంపున దినమణి సూను తో సమరంబునకు బోవుట కర్జంబుగాదు నిన్న మనయంగదునకు నొక్క వానరుండు చెప్పిన రహస్యంబు విన్నవించెద నవధరింపుము ॥

క॥ జనకునిపంపున రాముడు । జనకజలక్ష్మణులగూడి సాధునియతిచే । వన ముననుండగ పంక్తి వ । దనుడుమాయవన్నిసీత దాగొనిపోవన్ ॥

క॥ మనుకులుడాసతి వెదకుచు । ననుజన్మనికూడియటకు నరుదెంచిన నా । తనిజేరబోయిభాస్కర । తనయుండెరిగించినాడు తనబన్నంబుల్ ॥

గీ॥ అట్లుచెప్పినకృపజేసి యవనివిభుడు । వాలిమదమడగించి యవశ్యముగను । కీశపతిజేతునిన్ను శంకింపకనుచు । నభయహస్తమొసంగినా డార్యమునకు ॥

వ॥ దానికినలరి సుగ్రీవుండు రఘుపతితో నశ్లేని సర్వవనాటుల బనిచి మీకు వైదేహిజాడదెల్పించి సహాయకత్వంబాచరించి యత్తన్విం గన్నుం గూల్చెదనని శపథంబులాడినవాడు యేనిత్తెరంగు సిద్ధంబుగావిన్నదాన నిందులకు దృష్టంబుగాదె భానునందనుండు నిన్న నీకునోటువడి యప్పటియు నేడు తనదాన కయ్యంబునకు వెచ్చపెరంగి వచ్చినవాడు కావున నీవు చలంబుడిగి యాతనింగలసి పంచికుడుచుట నీతియని వెండియు ॥

క॥ బలహీనుగమనంబున । దలపకుసుగ్రీవుడనడ ధన్యుడు కడు దో । ర్బలుడు నీకంటెనా రఘు । కులవరు కృపకలుగుకతన కుధరారిసుతా ॥

సీ॥ అనవుండు తారతో నతడనె రాఘవుం డట్టికార్యార్థిగుర్తి డగుటమున్న । యెరుగుదమ్మోటికి యేనేలసుగ్రీవు డేలనా కేల యీనేలయనుచు । సత్యంబుధర్మంబు నిత్యంబుగాబూని తాపసవేషంబు దాల్చి యడవి । కేతెంచిరవిజున కిచ్చునెబాసలు వినబోలదీమాట విన్నకతన । తెలిపితివిలెస్స యికనొక్క తెరగుగనిన । పరమ పురుషుండు తారకబ్రహ్మమూర్తి । పుణ్యపురుషుండు సర్వేశ్వరుండ్యాడత । డిట్టిఘనునకు కపిసహాయంబు వలెనే ॥

వ॥ అదియునుంగాక ॥

గీ॥ అఖిలధర్మమూర్తి యనవద్యచరితుండు । సీతగూర్తుననిన చిత్తగించి । భానుసుతునికొరకు పూనివచ్చెమనే పరమపుణ్యనియతి బాసినన్ను ॥

క॥ యెక్కుడిమాట సముద్రము । లొక్కటనింకినను వహ్ని యుడుకడగిన నా । దిక్కరులు మొగ్గకిల్లిన । నిక్కము రఘువరుడు సారకు నిందకు నోడుఁ ॥

వ॥ కావున నిసజుని నజులోకింబున కనిచివచ్చెద చింతింపకుండుము ॥

మహాస్రగ్ధర ॥ అని సంరంభించి క్రోధం బధికతరముగానప్డు ఘోరాహిపోలెఁ । ఘననిశ్వాసంబుతోడఁ గదలిదశదిశల్ గంపమొందంగగాంచెఁ । కనదత్యుగ్రాగ్ని తేజుఁ కరనతలభుజాగర్వ దుర్వారభాజుఁ । దినసాథాత్మయ్యజాతుఁ దివిజపురధరాధీశ రాట్సూనుడంతన్ ॥

క॥ గనుగొని బెట్టుగనార్చుచు । వనరుహ హితసూతియురము వాసవువజ్రం । బునబోని ముష్టిచే బొడ । చినమూర్ఛమునింగి తేరి చెచ్చెరనపుడు ॥

చ॥ దినమణిసూతి యుద్ధతిని దిక్కులుభీతివహింప సిహ్మాగ । ర్జనమొనరించి కేలనొక శైలముగ్రైకొని కాలుప్రోలికన్ । చనుము దురాత్మకాయనుచు శక్రతనూభవు మీదవైవన । వ్వనచరభర్త దాని గరువంబునబట్టి ప్రచండమూర్తియై ॥

మ॥ హరిదశ్వాత్మజు వేయనాతడు భుజంబడ్డంబుగానొడ్డుడ । గ్గిరియుంతింతలు నుగ్గునూచమగు డగ్గీర్వాణ నాథాత్మజుం । డరుదుఁ రోషము నగ్గలంబుగను శౌర్యస్ఫార దుర్వారుడై । యరవిందాప్త తనూజుపైగవిశి శాహాటోప మేపారగన్ ॥

వ॥ ముష్టిహాతిని నొప్పించిన నతండు ప్రళయకాలాగ్నింబోలె మండుచు నాఖండలతనూభవుని యురంబు చరణతాడనంబు గావించిన నబ్బలారాతి నందనుండు వానిశిరంబరచేత జరచె నట్లయ్యిరువురు మత్తదంతావళంబుల విధంబున దరయుచు కంఠీరవంబుల భాతిఘర్జింపుచు సముద్రంబుల తెరంగున ఘూర్ణిల్లుచు కాలభుజంగంబుల మాడ్కి రోజుచు ప్రళయాగ్నులంబోలె పెచ్చుపెరుంగుచు ప్రచండ పరాక్ర

మంబున నన్యోన్యజయకాంక్షులు మనంబున జెనంగొన భీకరవిక్రమక బోరుచుండి రయ్యవసరంబున వాలి మదియ్యు వరప్రభావంబు కతన బలంబెక్కుడయ్యె సుగ్రీవుండు క్షీణబలుండై చేయునది లేక తనమనంబున ॥

చ ఇనకులవార్ధిచంద్ర దివిజేంద్రపి రామహా వంద్యసర్వ శ్రో । ఘనఘనసీల గాత్ర పరిపాలితకంజ భవాండబృంద పా । వనసుచరిత్ర భక్తజన వత్సలదీన శరణ్య మాని హ్మ । ద్వనజదినేశ దైత్య బలదర్పమహీధర దేవవల్లభా ॥

ఉ॥ దాహముహెచ్చె మేను పరితాపముజెప్పగ రాదువీడు పెం । గ్రాహము వోలెనన్ను సమరంబున బట్టలయించి చంపె యు । త్సాహముబొంది యీఖలుని దండధరాలయ వాసుజేయు సం । దేహముమానియస్త్ర జగతీవర భక్తఫలప్రదాయకా ॥

చ॥ భుజబలశాలివాలి మునుపోరగజయింపగ లేకనూత్న పం । కజదళనేత్ర రాజ్యమును గైకొనుమంచు నొసంగి యూకపి । వ్రజమును బాసిరోసి నగరాజము జేరిన నన్నునీవదాం । బుజములుగొల్వజేసి టులబొమ్మనిపల్కిన నమ్మివచ్చితిన్ ॥

చ॥ సమరములోన జిక్కిననిశాత్రవు బారిని రామచంద్ర యీ । క్రమమున నన్నునీవు కృపగావగయుండుట పాటిగాదు యు । త్తమను భయార్తుగరుణ వాపక బ్రోచుట సర్వధర్మముల్ । విమలచరిత్ర నీవెరుగవే విడనాడక నన్నుగావవె ॥

వ॥ అనునవసరంబున ॥

శా॥ అంభోజాప్తకులప్రదీప్తకుడు దివ్యాస్త్రంబు చాపంబునన్ । శుంభల్లీలన మర్చి బాహుబల విస్ఫూర్తిందగందీశి యా । జంభారాతి ముఖామరుల్ బెదర దీక్షావర్తియై యేశె సం । రంభద్దీప్తి హిమాంశుమాలి వరగోత్రస్థాలి వాలింబడన్ ॥

ఉ॥ యేసినయమ్మహాస్త్రమది యేమని చెప్పగవచ్చు మండుచున్ । వానవనూతి పెన్నురము వ్రచ్చిధరాస్థలి గాడెనింక నో । భూపతియిట్లరావణుని భూరిపరాక్రమ మొప్పదృంచిదా । నీనుతదెచ్చు రాఘవుడు నిక్కముజాయని తెల్పుచాడ్పునన్ ॥

వ॥ అని చెప్పిన భర్గునకు దుర్గయిట్లనియె మహాత్మా అనంత బలపరాక్రమ సంపన్నుండగు రఘువరుం డయ్యింద్రనందను నెదిరించి ద్రుంచక పొంచివేయుటకు గతంబెద్ది యని నతండిట్లనిసెప్పె వాలినన్ను మున్నారాధించి తపంబొనరించిన యేనుప్రీతుండనై నీయభీష్టంబెద్ది వేడుమనుండ తండు తనతో నెదురించిపోరు విమతుని బలపరాక్రమంబు నందర్ధంబు తనలో గలయునట్టిది వాడుపరాజితుండగునట్టిది యొసంగుమనిన నట్లకృప జేసితినది కారణంబుగా రఘూవరుం డబ్బలారాతినందను దెగటార్చు సామార్థ్యంబు గలిగియుమది య్యవాక్యంబు పతిష్ఠతంబుసేయుందలంచి పొంచివేశె వినుమట్లు రామ

చంద్రా మోఘప్రదర నిశితాస్త్రహస్తుండై ధరాస్థలంబున సురరాజనందనుం డొరంగిన॥

శా॥ విల్లుందమ్మునిచేతికిచ్చి సమరోర్వీండాయ నేతెంచి యు | త్సల్లాసంబున భానునందనుని మోమొప్పారగా గాంచుచో | యుల్లంబెంతయుపల్లవింప నతడా యుర్వీశ్వరుం జూచి సం | ఫుల్లోర్మీకృప నీప్సితంబులని యర్థిన్ మొక్కి గీర్తింపుచున్ ॥

గీ॥ అతని లేవనెత్తి యత్యంతకరుణచే | గాత్రమెల్లనివిరి శత్రువరుని | శౌరిజిక్కి పిదప ప్రాణంబుతోడుత | బ్రతికితౌనెయనుచు బలికె నృపతి ॥

క॥ అదిగని శోకమువగపును | మదిలో హెచ్చినను ధైర్య మున్నుండగుచున్ | త్రిదశపతిసుతుడు రాముని | వదనాబ్జముగాంచిపలికె వారనియలుకన్ ॥

క॥ తగునె తగవులకావ్రు | తగుతగదని మానసమున దరవక యోనా | పగతునితో బోరాడగ | తెగనేయుట ఘూలయంబు తెరవుంగాదే ॥

గీ॥ నీవునిస్పృహుడవు నిఖిలశరణ్యుండ | వనఘమతివి సత్యమనుచునమ్మి | యుంటిగాని యిట్టి బంటువుధర్మిష్టి వగుట దెలియనైతి నాత్మలోనా ॥

వ॥ అని మఱియును ॥

క॥ పురమునుగొని వెడలనడచిన | భరతుంగానెడను వేచి పలుమాయల మీ | ధరణిజ నెత్తుకపోయిన | సురరిపుడను గానుతలచి చూచిననీకున్ ॥

క॥ యెందుకు గీటణగించితి | చందంబునకరుణవిడచి జనపరయొప్పా | నింద కొడిగట్టి కొంటివి | యిందున ఫలమేమిగల్గె యెఱుగంజెప్పుమా ॥

వ॥ అది యట్లుండె నిజకార్య నిర్వాహణార్థంబని తలంచితేని ॥

చ॥ పరునివధించి భానుజని పట్టముగట్టి యతండుతోడ రా | నరులనుగీటణంచి వసుధాత్మజ నైకొని వచ్చునంత దు | ష్కృతమది యేలయిట్టివని గ్రన్నన నాపని నన్నుబంచినన్ | గరమవలీలబట్టి దశకందరు దెత్తును తెత్తు జానకిన్॥

చ॥ మొదలదినేండ్రి సూతిగ్రృప ముట్టగబల్కిన యట్టిపల్కనీ | మదిదలతేని నిద్దరకు మాదగురాజ్యము బంచియిచ్చియా | యదనున గూడియుండుమను డట్టిదినా కొనగూడదంటినా | సదియొకేటనిజూచి తెగనాగ్రహయొనర్చితె సత్యవర్తనా ॥

క॥ అనవుండు రాముడోహరి | తనయా యీనీతిమున్న తలపకగాలం | బున దవిలిమీనువగచిన | యనువున జింతింపనేమి యగునని కనినన్ ॥

గీ॥ సూర్యసుతుని బోరుచోవేచినంపుట | పాపమంటివజ్రిపాణితనయ | గోవు నెగుచు పులిని గూల్చి మోదవును బ్రోచు | టదియు సుచరితంబా యఘమొతలప ॥

వ॥ అని వెండియు ॥

క॥ అనుజునిదారను రాజ్యము । గొనిమెలఁగుచు నుండునట్టి క్రూరుని నినుచే । దునుమఁటతగదే యనవుడు । వనచరపతి మిన్నకుండె వగమడిగదురన్ ॥

వ॥ అంత నక్కడ కిష్కింధా నగరంబునం దంతఃపురనివాసులగు తారాది కాంతా జనంబులు చండ్రోరు విక్రమశాలియగు వాలినేలంగూలుట విని యుల్లంబులు ఝల్లనమూర్ఛిల్లి యట్టకేలకు తెలివంది కరంబుల నురంబులు శిరంబులు మోదికొనుచు నాక్రందనంబు గావింపుచు నంగదసహితులై యుప్లవంగలవానరప్రముఖులు తోడరాన మందగమనంబున ॥

చ॥ పదములు దొట్రుపాటుబడ పయ్యెదకొంగులు తూగియాడగా । వదనములెంతవాడొదవ వాతెరలెండగ రత్నహారముల్ । గుదిగొనుచుండ భారమగు కొప్పులు వీడగ భూషణావళుల్ । చదధరిత్రిపైనరల చెచ్చెరనేగిరి వాలిపాలికిన్ ॥

వ॥ చని యనేకవిధంబుల శోకించి రందు తారయాశు నాశీర కుమారునిపైబడి కేలనేల దడవాడుచు యిట్లనియె ॥

సీ॥ కుధరంబుబట్టి వారధియొక్కడవె తెచ్చి నట్టినీసత్వమెందరిగెనేడు । దుందుభి కాయంబు ద్రుంచినైచిననీదు శౌర్యంపుకలిమేడ సమసెనేడు । పంక్తికంధరుతోక బంధించియుద్ధదుల ముంచుదర్పంబేడ మొగిసెనేడు । సప్తతాళములు హెచ్చరిక గూడగబట్టు భుజములపెంపేడ బొలిసెనేడు । హా మనోనాథ హా వీర హా మహాత్మ । హా బలారాతినందన హా కపీశ । రాము బాణముచే యుద్ధరంగమునను । గూలితే వజ్రి చేబడు కొండపగిది ॥

ఉ॥ అక్కునజేర్పవేల యిపుడంగదునంగద లెల్లబాపి పె । న్మక్కువసేయవేల సురనాథతనూభవ కాంతుడీర నా । దిక్కటుజూడవేల కడుతియ్యనిమాటలు బల్కవేల పెం । పెక్కినప్రేమతోడ చనువియ్యవదేల యరుంగబల్కుమా ॥

ఉ॥ అంగదు గారవించి ప్రియమారగనక్కున జేర్చువారు లే । రంగద యిట్లు భూవిభుని క్రూరశరంబుల గూలనీవు వ్రా । శెంగదపద్మయోని నరసీరుహమిత్ర తనూజుడింత జే । శంగదరాముతోనతడు సఖ్యముజేసెనటంచు జెప్పిరే ॥

చ॥ వలదనిచాటిచెప్పితి దివాకరనందనుతోడ పోరికిం । జలమున నేగుచుండ రఘుచంద్రుడు భానుజు గారవించుటల్ । తెలిపితిని తడిచ్చిన ప్రతిజ్ఞలు జెప్పితి నెంత జెప్పినం । తలపున నాదువాక్యములు తథ్యము సేయుగ వైతి వక్కటా ॥

క॥ యెట్టిదొ నవ్విభుసాయక । మెట్టి గొనావింటినత్వ మెచ్చగ చేసూ । ఇట్టిదొ నీయంతటిజగ । ఝట్టింబడవైచె నేమి చెప్పగవచ్చున్ ॥

క॥ వినుమీవులేనిలోకం । బనఘా నాకేలయింక నంగదుఁడేలా । వనచరవల్లభ నేనీ । వెనువెంటనెవత్తునిలువ విహితమె నాకున్ ॥

క॥ పతియేదైవము సతులకు । పతియే కారణముతలప పతియేహితుఁడున్ । పతియేకుగడయుగావున । పతిలేనితనూజువేల బాంధవులేలా ॥

వ॥ అని పలువెరంగుల విలపించుచున్న తారపలుకు లిందునందనుం డెట్టకేల కాలకించి మెల్లన కనువిచ్చిచూచి భాష్పపూరిత లోచనుండును నాకంపితగాత్రుండును దీనవదనుండగుచు గద్గదికస్వరంబున నిట్లనియె ॥

క॥ నీమాటవినక నీకిప్రియ । భూమీశునిసాయకమున బాలియగవలసెన్ । రాముడుసత్యవ్రతుడని । నామదిలో నమ్మినట్టి నమ్మికెదీరెన్ ॥

ఉ॥ అవ్విభుదూరనేల హరిదశ్వతనూభవు డేమిసేయు నా । క్రొవ్వునవింతగా వలసె కూరిమినంగదు బ్రోచువార లిం । కెవ్వరుదీన్నికైమదిని నెంతయుమిక్కుటమై తనచెన్ జూ । నవ్వగయచ్చుశోకమున నిర్జరనాథ తనూజుడొయ్యనన్ ॥

క॥ తారకరము తనకరంబున । గౌరవమొప్పంగబట్టి కమలానన యీ । ధారుణికి వగవనీవుం । గూరనునింగమునకాత్మ గుందినకీలన్ ॥

వ॥ కావున మదియ్యహితంబు నెరపందలంచితేని ॥

క॥ హరిసుతుమదికింపొదవగ । పరిచర్యలొనర్చుభక్తి భావంబున నా । కొరకై నీమదిగుందకు । తరుణీయంగదునిబ్రోవు దయదళుకొత్తన్ ॥

వ॥ అనిపల్కి తనసమీపంబున ధూళి పరివృత కాయుండును సంతత భాష్ప ధారాళమగ్నుండగు నంగదు చేరందిగిచి కౌగలించి కరంబున నతని మేనునివురుచు యతనివానసంబు వీక్షించి ॥

క॥ అంగదవిధియిటువలె జే । సెంగద కపిరాజ్యమీవు సేయగనే జూ । డంగదయాదుదశ వ । చ్చెంగదయని వగచిరవిజు చేరంబిలచెన్ ॥

వ॥ పిలచి యిట్లనియె ॥

క॥ గరళముకొంప్పిన గొనియది । పరివేదనసేయనవధి పడుగతినీతో । విర సంబు గట్టికొని యీ । తెరగున బాలియంగవలసె దినకరతనయా ॥

వ॥ అని కన్నీరునించి యింక నానేరంబుదలంపక నంగదుగారవించి యువరాజుగా నొనర్చుమని మరియును ॥

చ॥ వినుమహాపత్రిమిత్రసుత పిన్ననిసూడగ్రరామపీని నీ । దనదృశబాహువిక్రమము నందుదలంపగ మత్సమాను డీ । రసమున దానవాధిపుడు రాజవరుండును

బోరువేళ ర । క్కసుల నితండుద్ధ్వంచగను కన్గొనిమెచ్చెను చూటలేటికిఁ ॥

వ॥ అని యంగదుకరంబు భానునందనుని కరంబుననునిచి తారంజూపి యీసతీ లలామంబు పరమపుణ్యశీల నీతివివేకంబు లెఱుంగు గావున నిత్తెన్విజెప్పిన బుద్ధి చిత్తంబున జొన్పుమది యట్లుండె నీవు శరణాగతరక్షకుండగు రామచంద్రుని చరణకమలంబులు శరణంబునొంది కృతార్థుండవైతి విమ్మహాత్ముని చిత్తవృత్తి నెఱంగున భయభక్తి తాత్పర్యంబులు కలిగి మెలంగుము ॥

క॥ రాజీవహితజరాముని । రాజనకజరాకదలవు మదివదలకు నీ । యోజను పాములచెలిమియు । రాజులకృప పెద్ద నమ్మరాదుంజుమీ ॥

క॥ నరపతులువైరులెత్తిన । తరిమన్ననజేతురదియు దప్పిపెరుగుచో । జెరుచుటకు మనములోపల । ఒరికింతురు కప్పయెలుగు పాములపగిదిఁ ॥

వ॥ అనిపలికి కొంతవడి యూరకుండి మరణభ్రాంతి లక్షణంబులు దోచిన నెఱింగి రామచంద్రు నుద్దేశించి ॥

గీ॥ లేశమేనియుకోరికె లేదునాకు । నొనరనంగదుపై మోహమొకటిదక్క । రఘుకులోత్తమ తరుచర రాజ్యమునకు । కరుణతోవీని యువరాజుగా నొనర్పు ॥

వ॥ అది యట్లుండె లోకారాధ్యుండవైన నిన్ను పరమ నిర్వేదనచేతం గడవం బలికిన నాయజ్ఞానంబు సహించి నచ్యుతంబైన లోకంబు ఘటింపం జేయుమనిన రఘువరుండు కరుణాసాంద్రుండై యంగదు నువరాజుంజేసెద నమ్ము నీవు మదియ్య బాణానలదహన పాపెదనుండవు గావున నీకు నక్షయ పుణ్యలోకంబులు సిద్ధించు సిద్ధంబని యతనియురంబు గాడినశరంబు ఱెరికిన దివ్యజ్ఞాన సంపన్నుండై రామచంద్రపాదారవింద ధ్యానంబు సేయుచు కాయంబు దొరంగి పరమవైష్ణవ పదంబున కరిగెనని చెప్పిన విని దాక్షాయణి నిటలలోచనుం జూచి ॥

క॥ పరసతిగోరిన దుర్మతుడు । నరకంబున బడుననంగ నగరిపుసుతుడా । తరణిజు భార్యను జేకొని । హరిపురమున కెట్టులేగె నానతియీవె ॥

సీ॥ అనవుడానతికి పురాంతకుండిట్లను వనజాక్షితొంటి భవంబునందు । వాలి సచ్ఛూద్రుడై వలనొప్పగాశాంతు డనుమునిపుంగవు నాశ్రయించి । యతనికి పరిచర్యలాచరింపుచునుండ దానికిమెచ్చి యాతాపసార్యు । డెద్దికోరికెవేడు మిచ్చెదననవాడు ఘనతరసంతోష కలితుడగుచు । ననఘ మీకృపకపాత్రుండ నగుదునేని । నెమ్మి మీరేగు పుణ్యలోకమ్మునాకు । గలుగజేయుడటన్న నయ్యనఘతేజు । డట్లగావింతు ననుచు దానాక్షణంబ ॥

క॥ అనిలజహరుండై తన । మనమున ననునిల్పి నిష్ఠమైనితరంబుం । గనుగొనక
తపము సేయగ । ననుకంపప్రసన్నమైతి నతనికి నేనుఁ ॥

గీ॥ అట్లుప్రత్యక్షమై వేడుమనఘుని య । భీష్టమొనగూర్తు ననవాత డిచ్ఛబొంగి
నాకు నీరూపుసన్నిధియున్ నాశరహిత । మైనలోకంబు టన్ననే నతనితోడ ॥

వ॥ మునీంద్రా! ప్రినికి పునర్జన్మంబునం గాని యిట్టిది గలుగనేరదు వీనిమీది మమతం జేసి నీకు నింకొక్క దేహంబెత్తవలసి యున్నదని వరానతిచ్చితి రోహితుండనైతి అంతం గొన్నిదినంబుల కంతంబునొంది శాంతుండు మతంగ మునీంద్రుండై జన్మించె శూద్రుండు వాలిప్రేక్షక్ట్టి జన్మాంతర విశేషంబువలన నన్నారాధించి తపంబుగావించిన యే నతనికి ప్రత్యక్షుండై వరంబు వేడుమనిన నతండిట్లనియె నయ్యా వరమియ్యందలంతేని గరుడధ్వజుచేతం దక్క తక్కొరులచేత చావులేకుండునట్లు కడపట తదీయలోకంబు ఘటింపునట్టు వొనగూర్పవే యనినయే నతనింగరుణించి యట్ల యొసంగితినది కారణంబుగా దుష్కృత నిర్మూలుండై వైకుంఠధామంబు నొందెనని చెప్పి మరియును ॥ గీ॥ వాలిమృతుడైన వానపై వాలివాని । నతులుసుతుడును భాస్కరసుతుడుమిగుల । నడలుచుండంగగాంచి యప్పుడమిఁ లేని । యినతనూభవు బేర్కొని యిట్టులనియె ॥

గీ॥ వగలనొందనేమి వాసవిధన్యుడు । పుణ్యలోకమునకు బోయెదేహ । కష్టి
రంబుదీని కడలకారణమేమి । జన్మమెత్తుటెల్ల చావగాదె ?

వ॥ కావున నింతంబనిలేదతండు కారణజన్ముండు మహాశూరుండని యూరార్చి వాలికి దహనాదిక్రియ లాచరించునట్లుగా వారల నియోగించి తానునుజ సమేతుండై ఋష్యమూకాద్రిపై విశ్రమింపుచుండె నంత సుగ్రీవాదులు దివిజరాజనందను గొనిచని యొక్క పర్వతసమీపంబున దహించి పరలోక క్రియలాచరించి మంగళస్నాతులైరంత రవితనూజుం డంగదాంజనేయ సహితుండై మాల్యాంబరా భరణంబులుదాల్చి నిఖిల వానరబృందంబులు పరివేష్టింప రామచంద్రునిపాలికిం జనుదెంచి యున్నరదేవోత్తముని గొలిచియుండె తదవసరంబున మతిమంతుండగు హనుమంతుం డిట్లనియె ॥

చ॥ మనుకులసార్వభౌమ బుధమాన్యచరిత్ర యుజేగుడైన యా । వనచర
నాథువ్యంచి బలవంతపువంత దొరంగజేసి యీ । దినమణిసూతిబ్రోచితివి దిక్కులకీర్తి
జలంగునట్లుగా । వనరుహబాంధవాన్వయ వివర్ధన దుష్టనిశాట మర్దనా ॥

మ॥ వెరవప్పం బరలోక సత్క్రియలు తావిధ్యుక్తమార్గంబునఁ । పురుహూ
తాత్మజు కాచరించి పిదపఁ పూతాంగుడైవచ్చె చ । చ్చరనేడీరవి సూనురాజ్య

విభవ శ్రీయుక్తుగావింప ద । త్పురికిన్ మీరరుదేరగావలయు నంబోజాక్ష తార్క్ష్య ధ్వజా ॥

వ॥ అని తన్నుప్రార్థించిన హనుమద్వచనంబులకు సంతోషితాంతః కరణుండై రఘువరుండు హరిదశ్వాత్మజు చేరంబిలచి మాకు గురుని యనుదినంబులు గడ తేరినం గాని పురంబు సొరుటకు సహాంబుగాదు కావున ॥

మ॥ పరమప్రీతినరింగి సహాగత్తులం బట్టాభిషిక్తుండవై । హరిపౌత్రుం గరమర్థి తోడ యువరాజ్య శ్రీయుతుంజేసి సు । స్థిరతన్ భోగములందుచుండు ప్రజలన్ సేమం బుతో బ్రోవు వా । నరనాథోత్తమ పుణ్యచింత మదిలోనంబొన్న మెప్పట్టునన్ ॥

క॥ ఈవానకాలమేగిన । బోవలెశాత్రవులపైని భువిగలకపులన్ । వేవేగ దోడుకొని యిట । రావలెను మరాకుమనుచు రవిసుతుడంతన్ ॥

వ॥ రామచంద్రుని యనుమతిగొని కిష్కింధకరిగి యంతఃపురంబు సొత్తెంది యవనీ సురవరుల రావించి విధ్యుక్తంబునా ॥

గీ॥ సకలవానరసందోహ సమ్మతమున । నపుడు పట్టాభిషిక్తుడై యవనిసురల కగ్గలంబగునట్టి ద్రవ్యంబులొసగి । లలితవైభవవిస్ఫూర్తి పొలుపుదనరె ॥

వ॥ ఆసమయంబున ॥

మ॥ ధవళచ్ఛత్రము బట్టెవాయుజుడు నాత్మాంబాంగి తారుండు న । ద్వివిధుం డుజ్వల హేమరత్నమయమా వింజామరల్ వీవ ను । త్సవులై వా నరసంఘముల్గొలువ మార్తాండాత్మజుండొప్పె దా । దివిజవ్రాతము గొల్వగా వెలయు నద్దేవేశుచందంబునన్

వ॥ ఇట్లు పట్టాభిషిక్తుండై యంగదు యువరాజుగావించి సకల జనానంద కరం బుగా రాజ్యంబు పాలింపుచు సుఖంబుండెనని పలికి భవానికి శివుండిట్లనియె ॥

క॥ వరుసంబు గురిశెనంతట । హరుసంబున రవిసుతుండు నతిసౌఖ్యముతో । పురుషార్థ మలరనుండెను । కరుసజనముబ్బ జలము ఘనమయ్యెనిలన్ ॥

వ॥ ఇట్టి ప్రావృట్కాలంబున రాముండు ఋష్యమూక పర్వతంబున నిజాను జన్మునింగూడి సీతావియోగ తాపంబున పలు తెరంగుల చింతింపుచుండె నంత నొక్క నాడు ॥

ఉ॥ పావనియంత భానుజుని పాలికి నేగిశరత్తువచ్చె రా । మావనినాథుతోబలికి నట్టివిధంబున నీవుజానకీ । దేవినిజూడకేశ వితతిందగనంపక కామకుండవై । యీవిధి మాకరున్కి తగునేరఘునందన బుద్ధిమాన్యతన్ ॥

చ॥ మెరుగుసువాతడల్గిన సురేంద్రుడుజాలడు నిన్నుగావ నా । వరబలశాలి

నైతనకు వాలిని మొక్క శరంబుచేత నీ । థరబడ నేయుగాంచితిమి తచ్ఛరరాజము మొక్కవోక భీ । కరగతితో నిషంగమున గ్రాలెడు కాలకృశాను పోలికన్ ॥

క॥ కావున నాతనికాంతను । వేవేగమె వెళకబంపు వృక్షచరుల సు । గ్రీవ వెడ జాగుసేయక । నీవరుసము విహితభంగి నృపవరుగొలువన్ ॥

వ॥ అని కార్యంబు దెలిపిచెప్పిన నగరువెడలి యేతెంచి యనేక వానరపతుల రావించి యఖిలదిశల రఘు లక్ష్మీ వల్లభ నరసి యాతన్ని యున్నచోటెరింగి సప్తమ దివసంబులకు మరలి రంతెట్లు ఉపదేశ సెప్పంగు మసలినవాని తీవ్రదండంబున దండింతునని శపథంబుజేసివచ్చి తాను అంతర మందిరంబునకరిగి తారాది కాంతాజనంబులతోడ రతిసుఖంబుల దేలుచు పొద్దులుబుచ్చుచుండె నంత వరుషంబణగి శరత్కాలంబు సొచ్చె నక్కడ సీతానాయకుండు సుమిత్రానందను నుద్దేశించి ॥

క॥ జననుత ప్రావృట్కాలము । జనినన్ రవిసూతికీశ సంఘము గాని వ । త్తును శిద్ధంబనియిటు వం । చనజేసెంగంటెరాక చంచలమతియై ॥

చ॥ వరసురకన్యకా మణుల వాంఛమయిందగు లూదికీడలన్ । పరగెడుపాక శాస నునిభాతిని యద్దినరాజ సూతి దా । సురుచిర రూపసంపదల జూడగనొప్పు సతీజనంబులన్ । కరమనురక్తిగూడి కుతుకంబునదర్పక కేళిదేలుచున్ ॥

క॥ మనల మదిలో నదలపక । మునుదాబడియున్న బన్నములుదలపక న । వ్వని తలనుగూడి మరచిన । యినసూనుని వెఱ్ఱిబుద్ధి కేమనవచ్చున్ ॥

ఉ॥ ఆతనిపాలికేగి తెగనాడకనీతులు బల్కియాకపి । వాగ్రతముతోడ దోడు కొని రమ్మనిపల్కిన లక్ష్మణుండు ధా । త్రీతలనాథయట్ల యొనరించెదనైనను భాను జుండు దు । ర్నీతుడుజెప్పినం దెలియ సేర్చునెతమ్ముడుగాడె వాలికిన్ ॥

ఉ॥ వచ్చిన తోడితెచ్చెదను వానరరాజ్య రమావిభూతిచే । పెచ్చుపెరంగి చిక్కలను జెట్టి మదంబునరాక తక్కినం । జెచ్చరఘోరసాయకముచే బలసూదన సూతిజేరగా । బుచ్చిన సంభ్రమస్థితిని భోరునదేవర జేరవచ్చెదన్ ॥

వ॥ అని సంరంభించి వికటకట కోపోత్కట విస్ఫులింగాయుత విరూపాక్ష ప్రేక్షణుండై బాణ బాణాసనంబులు ధరియించి గమనోన్ముఖుండైన సౌమిత్రింగాంచి కరుణాసముద్రుండగు రామభద్రుండిట్లనియె ॥

చ॥ అనఘచరిత్ర కార్యగతి యారసిచూడక నాగ్రహించగా । జను నెయతండు రాక వెడజాగులుబెట్టిన యేనియోర్చి స్వాం । తనవచనంబులాడి యుచితస్థితివచ్చుట కియ్యకొల్పి నె । ర్పున నిటదోడితెచ్చుట యపోలునుపోలదు రోషమియ్యెడన్ ॥

గీ॥ పురముబాసివిపిన భూమికిఁ జేరెంచి । సీతఁ గోలుపోయి చింతమునిగి । యతని ప్రాపు గోరి యరుదెంచియిమ్మోయి । తెంపుసేయఁదగునె తెరలిమనసు॥

సీ॥ తనపూర్వభవ దుష్కృతంబున నమ్మోయి గొంతిని రాజ్యంబు గోలుపోయి। హరిహాయసూతిచే పరిభవంబునుబొంది గిరివనదుర్గముల్ తిరిగితిరిగి । వనరుమ నే జెంచి మనలనుశరణంది వెరవప్పుదైవంబు కరుణవలన । తరుణియురాజ్యంబు ధనధాన్య సంపదల్ మాకుడంగగ్రైకొని మహితవృత్తి ! సంగనలతోడ కేళీవిహారములను । దవిలియందుఁడ నిచ్చటి తలపుమరచె । నింతియేకానిమనకేమి నెగ్గుసేయ । డతని శాసింతుననిపూన నర్హమగునె ।

క॥ తనకార్యార్థంబునకై । పనివడి మనతోడదూగ బల్కినమాత్రం । జనుదెమ్మో రాకతక్కిన । దనుమెదనని తెంపుసేయ దోషముగాదే ॥

క॥ యెరిగి యరుదెంచెనేనియు । నెరమేలతఁజెరుగకున్న నెరమేలు నిశా । చరనాథుగూల్చి ధాత్రీ । వర పుత్రినిదెచ్చుటెంత వలనుగమనకున్ ॥

వ॥ అని మరియును ॥

ఉ॥ మూడవకంటివానిపెను మూర్తివహించినవాడవీవు నీ । జూడభయంబుదోచు రిపుసూదన నాయటువంటి వానికిన్ । బాడిదలంపుమీకడవ బారకుశ్శాత్రము వద్దునీకు నా । తోడసుమీ కృపందలచి తోయజబాంధవ సూతి బ్రోవుమీ ॥

క॥ నమ్మికలిచ్చినవాడ న । తమ్ముగ రక్షింతుననుచు తరుణిజనకు న । త్యమ్మది గావున నట్టి ది । వమ్మొనరింతు వనుపూన్కి వలవదుసుమ్మీ ॥

క॥ చట్టదలంపకుమీ యీ । పట్టునదిన రాజకూర్మి పట్టికినతడుం । గట్టిగ మన ముంజెట్టిన । చెట్టుసుమీ యలిగిపెరక జెల్లునె మనకున్ ॥

క॥ ఆతడేమిసేయునుశ్రీయః । పతిసత్కృప గలిగినపుడు పగతుండైనన్ । హితుడగునదిలేకుండిన । హితుడైనం బగతుడగున హీనబలాఢ్యా ॥

క॥ కోపంబువలను వచ్చిన । చోపెంపొనరింప జనదు సుజనులకెందున్ । రూపింప నెట్టులన్నను ॥ కోపము పాపంబుపొత్తు గుణరత్ననిధీ ॥

వ॥ అనిపలికి పీడుకొలిపిన నుడుగని రోషంబున ॥

సీ॥ కన్నులకెంజాయ గని సహస్రమయూఖు డస్తాచలంబున కానగింప । సాంద్రమహాటవి సంచారమృగ సముదాయంబు బిలములదాగుచుండ । గమనోరు పాదనిర్ఘాత వృక్షాచల ఘనశృంగరజము దిగ్దళలబర్వ । ఘండరోషోద్భవచ్ఛ్వాస మారుత హతి దిగ్గజంబులొకింత మొగ్గిలింప । నుడుగణంబులు రాలంగ నుర్విపణక । కాలభుజ

గంబు గతివిల్లుకేలగాఁల । నంబుజాప్తతనూజ పురంబునేర । వచ్చెసౌమిత్రిలయ
నమవర్తిబోలి ॥

వ॥ ఇట్లు చనుదెంచిన మహా రౌద్రమూర్తిం గని గవని కావలివారలు సత్వ
రంబున నరగి యినజునకెరంగించిన నతండు తారతోడంగూడి యున్కిం జేసి యప్పలు
కులు చౌలంజొనుపడయ్యె నవ్వనచరులంగదు పనుపున నారాజసూత్రిని నగరుసొరకుండ
నాగుదమని భూరిభూదరంబులు మహీరుహంబులు కరంబులదాల్చి కోటచుట్టును
గవకులను బొల్చినిల్చిననరల నరకుగొనక ధట్టించి పారందోలి రవిజుని దుర్నయంబు
మనంబునం దలంపుచు నచ్చి నగరువాకిటనిలచిన ॥

గీ॥ ద్వారపాలురచేవిని తద్విధమ్ము । కాత్మలోపలనుల్కి కంజాప్తసుతుడు ।
కంపితాంగుండు గద్గదకంఠుడగుచు । యనిలసూనునిరావించి యతనితోడ॥

ఉ॥ రామునకించుకేని యపరాధముజేసిన వాడగాను తా । నేమిటికగ్గెనాపైన
దేటికిలక్ష్మణుబుచ్చె నీతడా । భీమపరాక్రమస్థితిని జేర్చిమహోగ్రత మట్లనీడ కి ।
ట్లీమయి వచ్చినిల్చుటకు హేతువదేది తలంచిచూడగన్ ॥

క॥ అహితుండెవ్వడొకో న । న్నహితుంగా జేసి నిట్టులాశ్చర్యంబా । మహిత
చరిత్రునకే నొక । సహజన్మని యట్లునుంటి చర్చింపంగన్ ॥

సీ॥ అనితలపోయు నయ్యర్కజువచనముల్ వినియపుడు పవననందనుడు బల్కె ।
నగచరాధీశ రామావనీశునితోడ వానలువెలశిన వలనుమీర । జానకినరయంగ
వావరవీరుల ననిచినేమిముగొల్వ నతిరయమున । నరుదెంతుననివచ్చి యామాటలన్నియు
మరచి యింతులతోడ సురతకేళి । దవిలియున్నట్టినీయున్కి దనమనమున । నెరిగిలక్ష్మణు
నిటబుచ్చె యీవుమదిని । నొండుదలపక నీతని యుచితభంగి । నెదురుకొనివన్న
బొడగన యేగుటొప్పు ॥

వ॥ అని చెప్పిన సమీరనందను హితోక్తులకలరి భానుజుండు నిజ కాంతాజనం
బులు నమాత్యులుందోడ రాజుని సౌమిత్రి నెదుర్కొని నమస్కరించి మందిరంబునకు
తోడితెచ్చి యుచితాసనంబున గూర్చుండ మనిన నప్పుడు రామచంద్రు యాజ్ఞా
క్రమంబు దలంచియు వీడు తర్జన భర్జన నార్హుండుగాని ప్రసాద యోగ్యుండు
గాడని తలంచి మనంబున కోపంబుదీపింప సుగ్రీవున కిట్లనియె ॥

క॥ నరపతిబంపిన దూతను । నరనాథుని పంపుగాక నాకిచ్చుట సు । స్థిరబుద్ధిని
నెల్వనగునె । తరుచరనీయట్టులను కృతఘ్నుడ నగుచున్ ॥

చ॥ అనవుడు భానుసూతి హృదయంబున బొక్కుచు విన్ననైరయం । బున

నరపాలసూతి పదముల్ తన ఫాలముసోకమ్రొక్కి నై। త్రిసెరయబల్కెనో యనఘ తీక్ష్ణముచేనిటు దారలాడనే। మనగలవాడనై నవిను మాదర మొప్పగ నాగువాక్యముల్

క॥ రాముసకుంబ్రియ భృత్యుఁడ। రామానుజ యాతడునన్ను రక్షించుటలు। న్నేమరుతునె యెదిగావున। భూమిసుత వెదకము న్నె బుచ్చితికపుల॥

వ॥ వారు వచ్చునంతకు నిలచి వృక్షచర నికరంబులంగూడి యతనియాడుగులు గొలువ వచ్చెదనని యున్నవాడ నిట్లు నన్ను నిష్కారణంబు దుర్జయుంగా జూచుట ధర్మంబె॥

చ॥ అనుటయులక్ష్మణుండు ప్రియాగ్నిఃధంబున మండిభాను నందనుదెసగాంచి నీవలను దప్పులులేవని పల్కెదిప్డు చేశిన యవమానకృత్తి మము చెప్పగశక్యమె నీవ సత్య శా। సనుడవపుణ్యమూర్తివి యసఖ్యుఁడ వల్పుడ వెన్నిచూడగాన్॥

క॥ రాముడునాశ్రిత జనర। క్షామణి గావుననను నిన్ను జంపకయున్నా। డా మహ నియ్యుండలిగిన। నీమాయలు నేటివరకు నిలచునె యినజా॥

ఉ॥ వచ్చెదవేని రమ్ము రఘువల్లభు గొల్వగ నీక్షణంబ యీ। తచ్చన మాని రానుమది దల్పకయుండెద వేనియింతయుం। బొచ్చెము లేకదెల్పు నిను బోవనకాలుని వీడు జేరగా। బుచ్చి భవద్విధంబునకు భూవరుతోవ్రతి వాక్యమిచ్చెదన్॥

వ॥ అనుపల్కు సౌమిత్రి పల్కుల కులికివిన్ననై మిన్నకుండె యన్నగచరేంద్రుంజూచి భయభ్రాంతయై యకలంకతారాధిపః భవదన యగు తారబోడున లక్ష్మణున పాదంబులపైబడి లేచి ముకిళిత కరకమలయై యప్పుడూ॥

చ॥ అనుపమశీల లక్ష్మణ మహాత్ముడవీవు సమస్తకార్యముల్। గననివిలేవు భానుజుడు క్ష్మాసుతజూడగ వానరావలిం। బనిచినవాడు సేనల నపారముగా గొన రామచంద్రునిం। గనుగొన బోదునంచు కుతుకంబున నెల్లవ నటబృందమున్॥

వ॥ పిలువంబంచిన వాడన వెండియు

క॥ మీపెట్టినచెట్టితడు గృ। పాపూర్ణత్వమునబ్రోచి ఫలముఁగొనుమీ। వీవగిది తెంపుసేయక। కోపంబువసహ్మరించు గుణరత్ననిధీ॥

వ॥ అని వినుతించిన తారవినులకు ప్రసన్నుండై రామచంద్రుని యాజ్ఞాక్రమంబు దలంచి కోపంబు విడచెనప్పుడు సుగ్రీవుండు విగతభయుండై తెలివందిచిత్తంబలర సౌమిత్రితో నిట్లనియె॥

క॥ వచ్చెద సేనలదోకొని। చెచ్చెర రఘువీరుగొల్వ సీతను వెతకం। బుచ్చెద నెచ్చటనుండిన। తెచ్చెదవత్తి కడకుసతిని దృఢతరశక్తిన్॥

వ॥ అని సుమిత్రానందను కిష్కింధా నగరంబున కొండొకదినంబులు నిల్చు నట్లుగా ప్రార్థించి తదనుమతిగొని మనోవేగులైన శతసహస్రకోటి సంఖ్యలగల్గు వనచరుల రావించి మీరలివ్వుడచని నీలాద్ర్యాదయ నహ్యా వింధ్యశైలాన హేమకూట పారియాత్రాచల మేరుమంద రాదినిఖిల పర్వతంబులును నానారణ్యాభూములను పూర్వ పశ్చిమోత్తర దక్షిణసముద్ర తీరంబులను సరిద్వన ప్రాంతంబులను వసియించు మర్కటవీరుల నిచటికిదోకొనిరండని పనుప తదియ్యాని యోగంబున నవ్వానరులవ్వుడు నింగికెగసి సత్వరంబున నరిగి యెల్లడల వర్తించు గీశశ్రేష్ఠులతో సుగ్రీవుని యానతిని చెప్పిన వారలు వన్యఫలంబులు కందమూలఫలంబులు పాయనంబులుగా గొని యాకీ శపతి శాసన భయంబున నప్పుడ కదలి ॥

సీ॥ నస్తాద్రివాసులు తప్తహేమప్రభ కలవారుభీకరా కారులతల। శౌర్యబలా ఢ్యులు సాహసధుర్యులు పటుశీఘ్రగమనులు ప్రళయకాల। భైరవమూర్తులు పంచాస్య కేసర భాసురవర్ణాలు ప్లవగవరులు। నేలయీనినగతి నింగియుదిక్కులు క్షితితలం బెల్ల దిక్కరియగాను। వచ్చికిష్కింధ చుట్టును వలనుమీర। నిలచియుండిరి యంత నా నీరజాప్త। నందనుడువారిగాంచి యానందమంది। త్ప్రాతలేశుని। ఋణమీగ గంటి ననుచు ॥

వ॥ అంత ॥

చ॥ ఇనతనయుండురామ వసుధేశశిఖామణి సానుజన్మునిం। గనుగొనిపల్కెనో యనఘ త్వాస్థలిపైగల పీరవానరుల్। గొనకొని యేగుదెంచిరిదె గొబ్బునవీరల గొంచు భూవిభుం। గనుగొనబోవుటొప్పు నృపకౌశికుడాత్మను నుత్సహింపగ ॥

వ॥ అనిపలికి పరమోత్సవంబున ప్రస్థానభేరి వేయించిన ॥

మ॥ కలగంబారి పయోధిసప్తకము దిగ్దంతుల్ వెనుగ్రుంకె భూ। తలముక్కు మ్మడి దిద్దిరందిరిగె గోత్రవాత్రముల్ దూలె నం। కులరావంబు నభంబుముట్టెమది నంకోచించి వేరొండు దో। వలువీక్షించిరి పూర్వమార్గము లొగిన్ వంచించి యుకాబ్జలుక్ ॥

వ॥ అంత నాభానుజుండు తారాదికాంతల నంతఃపురంబునకు బోవనియోగించి రామానుజుండు తానును సంగదుండు కనక మణిమయంబులగు శిబికలెక్కి ఛత్రచామ రంబులు మెరయవంది మాగధవినుతులు చలంగవానర సేనాసమన్వితుండై రెండవ యింద్రుండు నుంబోలె ప్రమోదంబున రామచంద్రుని కడకు నరిగిరంత ॥

క॥ చనియ నతిదూరమున రా। మునితమ్ముండపుడు రాజ ముఖ్యునిగని గ్రి।

క్కనశిబిరా లుడిగికరములు । వినయంబునమోడ్చి భక్తివివశు లగుచున్ ॥

వ॥ చేరంజని యతని చరణంబులకు సాష్టాంగంబు గావించిన రఘువరుండు వారల లేవనెత్తి గాఢాలింగనం బొనరించె మఱియును పేరుగల వానర సంఘంబులు మొక్కిన మొక్కులు గైకొని మన్నించి రవినందన ప్రభృతుల గూర్చుండ నియోగించి యొక్కింత సేపునకు సుగ్రీవుని యాననం బాలోకించి యిట్లనియె

క॥ నినుబిలువ లక్ష్మణుని బని । చినవచ్చితిగాని మున్ను జేసిన మేరల్ । మన మునను దలచి శీఘ్రం । బుననీవై యరుగుదేవె పొలగనిటకున్ ॥

వ॥ అనిన యాకపినాయకుండు జక్కసాగం బడిలేచి చేతులుమోడ్చి అయ్యా చిరకాలం బిడుములంబడి భవదియ్య కృపాతిశయంబున దార రాజ్యంబును మరలం గాంచి తద్వ్యసనంబున రవిలిమరచి యిట్టింటి నాయపరాధంబు సహించుమనుడు రామభద్రుం డుస్మితవదనుండై యతని సన్మానించి కపీంద్రా సద్గుణ సంఘాతయగు సీత వెతక వృక్షచరుల బంచుమనిన యప్పుడు సుగ్రీవుండు ప్రహృష్టచిత్తుండై మహాత్మా దేవగంధర్వ పుత్రులు కామరూపులు కామగమనులు నపార బలపరాక్రమ సంపన్నుల సహాయు లద్రితరు నఖదంష్ట్రాయుధుల సంఖ్య మర్కటయూథపులు దేవర పాదంబులు గొలువ రెండవ సముద్రంబునుంబోలె విడసియున్న వార లిదెలంక పైబనుపు మునిశ్వం కం బని పుత్రమిత్రా మాత్య వర్గంబుతో సురకంటకుం బరిమార్చి ధరణినందన గొని వచ్చెదరనిన రఘువరుండు పరమానురాగంబు నొందె నంత ॥

సీ॥ చరణఘట్టనలచే ధరణిజలింపంగ కరములవృక్షముల్ గిరులు మెరయ । సింహనాదమురోద సీకుహరమునిండ లలిసర్పసదృశ వాలములుగదల । నీలజీమూత సన్నిభ కాయముల కాంతి సలిలిజహితుని మండలముగప్ప । నఖదంష్ట్రరోచులు నిఖల దిక్కులయందు నిబిడమైవెన్నెల నిగ్గులొరయ । దరసినడచుచుమందర దాటులిడుచు। మరలిపోవుచు నందంద గురుకులిడుచు । నేలయీనిన తెరగున నొలి వృక్ష । చరులు రఘుపతిగాంచిరి సరభసమున ॥

వ॥ మరియును ॥

సీ॥ అరువదికోట్లవ నాటపేరులతోడ శతబలిశతకోటి సంఖ్యగొలువ । గాసుషే ణుండును గంధమాదను డారు కోట్లతోనొకవేయి కోట్లతోడ । కుముదుండు నేబది కోట్లతోపనసుండు నొక్కొక్క కోటితో నుక్కుమిగిలి । శరభుడంగదుడు కేసరియును వాత్సుండు గవయుండుపదికోట్ల కపులతోడ । నలుడు పన్నెండుకోట్లతో నాలుగేసి । కోట్లతోద్వివిధమైందులు కోటితోడ । శరభుడంగద నీలులు శత సహస్ర । కోటితో

దారుడీరేడు కోట్లతోడ ॥

గీ॥ వేయుకోటుల కపులతో వాయుసుతుడు । పరగంభుడు కోటి వానరుల తోడ । పద్మకోటి వనాటులు బలసి కొలువ । నింద్రజానుండు బొడకట్టె రెలమి మరియు ॥

వ॥ దుందుభియు జాంబవంతుండును వేగదర్శియు వినతుండు నాదిగాగల నామ రూపులైన తరుచర శ్రేష్ఠులనేక కోట్లతో సుగ్రీవ పురస్సరంబుగా రామచంద్రుం గొలిచి యుండిరప్పుడు భానునందనుం డానందకందళిత హృదయారవిందుండై కౌసల్యానందను వదనకమలం బవలోకించి యిట్లనియె ॥

మ॥ జగతీనాయక నేఁడు దెంచిరి ధరా చక్రంబునం గల్గు కీ । శగణంబుల్ బనిపంపు మీ నొనరఁ ద్వ్యానందనం జూచి వ । చ్చు గతిన్ వేగమ నావుడా రఘుకుల క్షోణీశుఁ డుప్పొంగి యు । ష్ణగభస్తి ప్రియసూనుతో బలికె నుత్సాహంబు దీపింపగాన్ ॥

క॥ తపనసుత యిందులకు గురి । యుపమింపగ నీవ కాక యొరులుం గలరే । యిపుడట పోగలరాగల । కపిసంఘము సంపుతడయి గానేమిటికిన్ ॥

వ॥ అనిన సంతోషించి యర్కనందనుం డప్పుడెల్ల వానరులు విన నెలుంగెత్తి యిట్లనియె ॥

చ॥ శపథము జేసెదన్ వినుడు సర్వ వనాటులు రాముదేవి న । చ్చుపడగ నెయ్యెడం గలుగ జూచిటు మానములేన వచ్చునే । కపికుల వర్యుడాతనికి గ్రిన్నన మద్విభవంబునందు న । ర్ధపదవి యిచ్చువాఁడ వసుధారమణుండు వినంగఁ బల్కెదన్ ॥

వ॥ అని బలపరాక్రమ సంపన్నులగు యనేక కపివర్యులతోడం గూడ వినతుని తూర్పుదెసకును నసిలజాంగద గవాక్షమయింద గంధమాదన ద్వివిధ నీలజాంబవంతాది వీరుల దక్షిణ దిగ్భాగంబునకును సుషేణప్రముఖ వానరయూథపుల పడమటి దిక్కునకును శతవలి లోనుగాగల కపిముఖ్యులనేక కోట్లను త్తరంబునకు నరుగుఁడని నియోగించి వారలకు నుదయత్రిశృంగ హస్తాద్రి నీలాచల పర్యంతంబును మార్గంబునంగల దేశంబులు పట్టణంబులు నద నదీతటంబులును వనోపవనంబులును నగ నగోపకంఠంబులును కమలాకరంబులును గుహలును నిర్ఝర ప్రదేశంబులును మహారణ్యంబులును సాగర ద్వీపంబులును విమల పులినస్థలంబులును ఋష్యాశ్రమంబులును దేవగంధర్వ యక్ష రక్షోరగ పితృదేవతా నిలయంబులును యడనెడంగల్గు విశేషంబులు వేరువేర నరింగించి అన్నిటను సీతనుంగలయ వెతకి యొక్క నెలకు మరలి యేతేర వలయునట్లు రాక మసలినవాని తీవ్ర దండంబున దండింతునని పల్కి తత్క్రమంబు రామచంద్రున

కేరింగించిన నతఁడు ప్రముదిత చిత్తుండై యాను దక్షిణ దిగ్భాగంబునకుం జను నగచర వీరులలోన నాంజనేయుని చేరంబిలచి నెల్లవారలు వినుచుండ నిట్లనియె ॥

ఉ॥ తాపసవృత్తి దిర్మ్యరుచు ధారుణిజన్ వెస గోలుపోయి సం । తాపము నొంది మాటికిని దైవమునొక్కట దూరుచుండ నీ । యాపదలెల్లబాపియు మదన్వయ మిమ్ముగ నుద్ధరింపగా । శ్రీపతినిన్ను దాస్యజన జేసెనువిక్రము జూపెపావనీ ॥

క॥ అలఘుపరాక్రమ యొరులకు । నలవియెమమ్ములను పంకజాక్షతనూజుం । జలిమియొనరించి కూర్పగ । నిలలోపలనీకెచెల్లు నిటుగావింపన్ ।

వ॥ అని వెండియు ॥

ఉ॥ నీవతికార్యదక్షు డవనింద్యపరాక్రముధుర్య జానకీ । దేవిని గానగాగలవు తెల్లమియాసతితోడ బల్కుమీ । నావచనంబుగా జనక నందననిన్నిటు దెచ్చినట్టియా। రావణుగీటడంచి యమరప్రకరంబు నుతించునట్లుగన్ ॥

క॥ నినుదోకొని సాకేతకు । జనియెడ సందియములేదు సత్యంబిది నీ । మనము నన్నమ్మియూరడు । మనిపల్కుమటంచు జెప్పి యందరుజూడన్ ॥

వ॥ హనుమంతుని డగ్గరంజేరి వానరేంద్రయా చంద్రవదన నినుగని మనంబున విశ్వసింపక యానవాలు వేడినయప్పు డీముద్రిక యాభద్రేభయాన కొనంగుమని తన యంగుళియ్యకం బా కపిపుంగవుని చేతికిచ్చి నీకెల్ల వెంట శుభంబగు పోయిరమ్మని కౌగలించుకొని వీడుకొల్పిన ॥

క॥ కరమునముద్రిక గైకొని । పరమాహ్లాదంబుతోడ పవనాత్మజుడా । ధరణీ నాథునిశ్రీపద । వనజంబులుసోకమ్రొక్కి వారనిభక్తిన్ ॥

వ॥ లక్ష్మణ సుగ్రీవుల పాదంబులకు ప్రణమిల్లి అంగదాది వానర ముఖ్యులం గూడుకొని దక్షిణంబునకుం జనియె నట్లు రామచంద్రుని మతంబున భానుజు పంపు గైకొని శతవలి ప్రముఖులు తూర్పునకును ననిలజాంగదనల జాంబవంతాది ముఖ్యులు దక్షిణంబునకును సుషేణ వినతయాధ ముఖ్యులు పశ్చిమోత్తర దిగ్భాగంబులకును సీతాన్వేషణపరులై చనిరనిచెప్పి సర్వమంగళకు గంగాధరుం డిట్లనియె ॥

క॥ వనచరులిమ్మెయి నయ్యిన । జుని పంపునరాముదేవి చొప్పరయంగా । జనుచు తమలోనప్రతినలు । నొనరింపుచు కూకలిడుచు నుద్యచ్ఛక్తిన్ ॥

చ॥ పురవన దుర్గమంబులను పుణ్యనదీతట సీమలన్ మహీ । ధరములనీరజాకరవితానములన్ పులినస్థలంబులన్ । శరనిధిపొంతభూముల ప్రశస్తపుదీవుల యాగశాలలన్ । సురుచిరదివ్యవాసముల సుందరసౌధములన్ గృహంబులన్ ॥

సీ॥ పర్ణశాలలమని పల్లెలపట్టణంబులగోష్ఠభూముల పొదలపుట్ట। లనుమహారణ్యంబులను విజనస్థలంబుల శిలయేరుల భూరుహముల। చాటునగుహలను శైలకంధరముల పూపొదరిండ్లను భూతిభవన। ములను నీరాగారములను వావులనుతటా కతటంబుల బ్రాకటముగ। సీతఁబరికించి కానక చింతఁజెంది। తడయుట నుచితమనుచు సత్వరముచేత। పశ్చిమోత్తర పూర్వదిగ్భాగములకు చనినవారరుదెంచియయ్యె నజుఁగాంచి॥

వ॥ తమరు పోయివచ్చిన తెరం గెరంగించిరి మఱియును॥

క॥ దక్షిణ దిగ్భాగము నర। ఘుక్షితిపతి సతినివెతక గోరిచనిన యా। వృక్షచరముఖ్యులెల్లను। నీక్షీణబలంబుకలిమి నరయుచు నెందున్॥

చ॥ జనకతనూజ గానక విచారమునొందుచు నందరొక్కచో। వనువునగుంపుగూడుకొని యర్యమ పుత్రుడు జేశినట్టి యా। దినములు మేరదప్పిడినితీవ్రగతిన్ మనమేగియున్నయా। తనికెరిగించు టొప్పువిశదంబుగ నాతెరగెల్ల నావుడున్॥

వ॥ వారలకు మహాబలసూనుండిట్లనియె॥

క॥ మీరరుగుడి నజుజేరం। గారయమున నేను సీతగానక నెటులా। భూరమణుజూతు లక్ష్మణు। నేరీతింగందురవిజు నెట్లీక్షింతున్॥

వ॥ నాకుజానకింజూచి కాని రఘుపతి సన్నిధికి వచ్చుటకు మనంబుగొల్పదు బహువిధంబుల మైథిలి జాడలెరింగి వచ్చెదనట్టి తెరంగబ్బదేని మేనుదొరంగెదననిన నలని వాక్యంబులకు అంగదాదుల ద్భుతశోక సంతప్త చిత్తులై యట్టకేలకు ధైర్యంబు చెప్పుకొని మనకునింత చింతింపనేల నింకనెల్లచోట్ల సీతనువెదకి యాసాధ్వీరత్నంబు మనభాగ్యవశంబున దొరికెనేని యావార్తగొని సుగ్రీవు పాలికింబోదము కాదేని యప్పటి కార్యంబు జూచుకొందమని నిశ్చయించి జానకి నన్వేషింపుచుం జనిచని ముందట వింధ్యాద్రిపొడగని యగ్గిరీంద్రంబుపై నెక్కి యందు॥

క॥ తరుకుంజ పుంజభూముల। వర కమలాకరములందు వనములగిరి కం। ధరముల శిలయేరుల న। ద్ధరణిజ గలయంగ వెతకి తరుచరులంతన్

గీ॥ సీతగానకమనముల చింతజెంది। యామహీంద్రంబు డిగివచ్చి యలసి యచట। శాంతవడి విశ్రమించి తత్ప్రాంత భూమి। యందు పొదలను పరికించి యచటువాసి॥

క॥ బహుళభంగుల జింతింపుచు। గహనము రోయుచును నెదుట ఘనవిశదంబౌ। గుహయొకటి జూచియందుల। మహిజను బరికింతమనుచు మానినకోర్కెన్॥

ఉ॥ అందరునొక్కపెట్ట వెసనాగుహసొచ్చి మహాంధకారముం । బొందినదాని లోపలను జిక్కియుమార్గము గాన రామికిం । గొందలమంది చిత్తముల గుందిమనంబుల లోగలంగగా । ముందర నొక్క తేజమున మోఘముగా గన నొప్పెనంతయున్ ॥

సీ॥ అప్పుడుచీకటి యణగియాబిలమెల్ల దేదీప్యమానమై తేజరిల్లె । నందరవింద కల్హారకుముద్వతి సంశోభమానయు చారుమీన । బకసకోకచ్ఛప ప్రకటితరోలంబ ఝంకారమిళితయు సలలితాంబు । పూరయుసదమల భూరి నానారత్న ఘటితకాంచన హర్మ్య కలితయును మ । హోజ్వలయునగచు ముందట నొక్క నీర । జాకరము గానబడిన యాశ్చర్యమంది । ప్రసదమున కపులు దానిజేరంగనరిగి । యాతటంబున నిల్చి వారచట మరియూ ॥

వ॥ పుష్పదళకి సలయ పరిపక్వ ఫలోపేతంబులైన నానా వృక్షంబులు పొడ గని పరమాహ్లాదంబు నొందుచు వెండియు దత్సమీపంబున జటా వల్కలంబులు ధరి యించి తపంబు సేయుచున్న నొక్క ముద్దియుంజూచి యత్తన్వి సీతగానోపు ననుతలం పున డాయంజనిరందు పవమాన నందనుండా పరమసాధ్వికి నమస్కరించి సాంత్వ వచ నంబుల నిట్లనియె ॥

క॥ జననీపేరెయ్యది । గొనకొని యీబిలములోన గూఢతచే ని । ట్లునికికి గత మెయ్యది నా । కునుగొబ్బున నేర్పరింపు కుశలత మెరయన్ ॥

సీ॥ అన నాతపస్వి యిట్లనె వాయుసుతునితో వినుము సావర్ణి నందననునేను। పేరుస్వయంప్రభ నీరతితాపస వృత్తిచేనేనున గుహావిశ్రమింతు । ఘనమణి ఖచితంబు గాసురాసుర దుర్గ మంబుగాదీని సమ్మోదముతోడ । కస్త్రమమున నావిశ్వ కర్మనిర్మిం పుడు నీక్షించిమయుడు దానిచ్ఛలోన । నబ్బురము జెంది దీనికై యబ్జభవుని । గూర్చి తపమాచరించిన కూర్మిమీర । నతడు ప్రత్యక్షమై యిష్టమైన వరము । వేడుమిచ్చెద ననిపల్క వినియతండు ॥

వ॥ సంతసిల్లి యరవింద సంభవు చరణంబులకు ప్రణమిల్లి తనకు నునికిపట్టు నకు నీబిలం బిమ్మనిన నట్లయొసంగి చనియె నంత తన నేర్పుమెప్పున కాంచన రత్న కీలితంబైన సౌధంబును సలలితంబైన జలాశయంబును గల్పించె నామయుండు హేమ యను భార్యతోడం గూడి యనేక వత్సరంబు లిందు క్రీడజరిపి హేమ కాలవశంబు నొందిన మయుం డిచ్చోటువాసి చనియె విను మా హేమ నాకు ప్రియసఖియ గావున దానిమీది మోహంబున బాయంజాలక నిచ్చట వర్తింపుచుంటి నది యటుండె దేవ దానవులకైన నింకుసొచ్చి మరలి బ్రతికిపోవ నశక్యంబు మీరలెవ రెచ్చనుండి వచ్చి

తిరి యున్న యూపెరింగింపుండనిన ననిలనందనుం డా స్వయంప్రభ కిట్లనియె ॥

క॥ జనయిత్రి యేమికి పులము ।జననుతుడగు రామచంద్రు సతివెతకంగా ।జను
దెంచి నారము రవి । జనిపంపున నిది నిజంబు జొప్పడ మమ్మున్ ॥

గీ॥ కమరయంబున నీగుహ వెడలజేయు । క్షుత్పిపాసలనెంతయు సుశ్రీక్కి నార।
మదియునటులుండె కాని గుహాంధకార । బంధురతచేత మార్గంబు బయలు పడదు ॥

క॥ రాముని హితమొనరించుట । రామామణి వినుము దేవ రాజికినా సు ।
త్రామునకు హితమొనర్చుట । గామది నూహించుమమ్ము కడ తేర్చవడిన్ ॥

సీ॥ అన నాతపస్వి దయాన్విత చిత్తయై యగచరదీనికై యాత్మలోన । వగ
నొంద నేలమీవారలతో గూడ ఫలములనమిలి యీజలము ద్రావు । మీవెడలించెద
నీబిలంబనవిని మారుతి సంతోషమగ్నుడగుచు । నంగదాదులు దాను నతిమధురంబు
లౌ ఫలములుభక్షించి జలముద్రావి । యాస్వయంప్రభ వెడలింప నపుడుబిలము ।
వెడలియేతెంచి యందరు వెరపువీడి । బ్రతికిమందలగంటి మిప్పటననుచు । నచటు
వాసి మహాటవియందు సొచ్చి ॥

వ॥ సీతాన్వేషణంబు గావింపుచు సముద్రతీరంబునకుంజని యందును జనక
నందనంగానక మనస్తాపంబునజిక్కి విసివియుండకు నొక్క భూమీబుహాంబు క్రింద
మోద్రిదగిలంబడి కార్యంబు దలపోసి పలువురు పలువిధంబుల బలుకుచుండి రపుడంగ
దుండునెల్ల వారలు వినుచుండనిట్లనియె ॥

క॥ జానకినిగాంచి నెలలో। రానిధరిత్రీజచరుని ప్రాణముగొందున్ జానిక్క
మనుచు రవిజుడు । దానొనరగ ప్రతినెబలికె ధరణిపు మోలన్ ॥

వ॥ కావున ॥

ఉ॥ ఏనట కేగుదెంచి నిక నెవ్వరి మోములుజూడనొల్ల నీ । ప్రాణములర్కసూ
తికిని బల్మినియొప్పన సేయనొల్ల నా। మానససీమలోన రఘునందనుచారుప దాంబు
జాతముల్ । ధ్యానముసేయుచుం గడుముదంబున నిచ్చట మేనువీడెదన్ ॥

వ॥ మీరలినజు పాలికింబొండనిపల్కి కన్నీరుదొరంగ నంగదుండు ప్రాయోప
వేశంబుజేసిన ననిలజ జాంబవంతాది వానరులందరు నతనింగనుంగొని శోకసంతప్త చిత్తు
లై దక్కుత్తికతో నిట్లనిరి ॥

గీ॥ భానునందను నట్ల మాపాలికీవు గాన నినుబాసిచనగ యుక్తంబుగాదు ।
సత్యమీమాటయని పల్కి శాఖాచరులు । నప్పుడందరు కృత నిశ్చయాత్ములగుచున్ ॥

వ॥ ప్రక్షాళిత పాదవదనులై యాచమించి దర్భశయ్య లమర్చుకొని యుత్తర

శిరస్కులై పర్వళించి యున్నంత ॥

క॥ బలుగృధ్రమొకటి చేరువ । మెలగుచు పడియున్నకపుల మెల్లనకని యి । మ్ములనుండగ యాహారము । గలిగించెను దైవమనుచు గౌతుకమతియై ।

క॥ తనలోన బలుకుచుండగ । వినియంగదు డపుడు శోకవివశుండై యా । వనచరులనెల్ల జేర్కొని । వనజానన యిట్టులనియె వారలతోడన్ ॥

ఉ॥ యక్కట కైక వేడ్కవర మేటికిపంకి రఘుండు రాముని । న్రెక్కుసమండగా బనిచె కాననభూమిని రాఘవుండు దా । జక్కనదేల నైకొనియు జానకితోడంత వచ్చె వచ్చె బో । యుక్కిడిజేసె నేల చలము న్మరయంగ దశాస్య సోదరీ ॥

సీ॥ అదిగనిఖరదూషణాది రాక్షసులేల చనుదెంచి రాముచే సమసిపోయి । రావణాస్యుండేల యవనిపువంచించి సరగచేకొనిపోయె ధరణిసుతను । నాసాధ్వి విడిపింతు నని తాకియా జటాయువదేల దనుజుచే నుర్విగూలె । మహిజవెతకుచును రామక్షితీశుడేల నాబుష్యమూకాద్రి కరుగుదెంచె । నతనితోనేల సుగ్రీవుడమరభంగి । సఖ్యమొనరించె నేటికి జనవిభుండు । హరితనూజుని ద్రుంచి యాహరితనూజు । రమణ హరిరాజ్యమున కేల రాజుజేసె ॥

క॥ వనజాప్త తనయుడేటికి । మనలనుబొమ్మనియె నిటకు మహిజన్ వెతకన్ । పనివింటిమేల మనమొక । యనువున దప్పించుకొనక నవివేకులమై ॥

వ॥ అని బహుభంగుల జింతింపుచున్న తారాతనయుని పలుకులయందు జటాయువు గూలె నను వార్త సంపాతిచెవుల సోకిన మూర్ఛజెంది కొంతవడికిందేరి శోకింపుచు నధిక ప్రియాసంబున నాకపివీరుల దగ్గరి యేనుసంపాతి యనువాడ జటాయువు తన తమ్ముడని యెరింగించి వారలతో నిట్లనియె ॥

సీ॥ కపులార మీరలెక్కడనుండి వచ్చితి రెందుబొయ్యెద రిట్టు లేమికొరకు । జనుదెంచియిచ్చట నచ్చెద మనుచును సమరబారియెూప వేశమందనరి । యున్నారలిదిగాక యురుబలశాలి జటాయువుసీతకై కాయమొలి । బొసెనటంచు మీపలుకుల వింబడి విని శోకవార్ధిచే మునిగియతని । వార్తలరయంగ వచ్చితి వలనుమీర । నింతయును యున్నరూపున నెరగజేయు । డనిన నప్పుడయంగదు డాదికీశు । లవ్విధము తెలయ జెప్పిన నతడుమదిని ॥

వ॥ జటాయువు మరణంబునకు కడువగచి యంగదాదు లూరార్పందేరె నంత నప్పులుగురేనికి రెక్కలు మొలచి జవ సత్వంబులు గలిగి పొలువొందుచున్నం గాంచి కపులద్భుతచిత్తులై యతనితో విట్లనిరి ॥

క॥ కదలంగలేక నిచ్చట నదవదనొందుచును మెలగు నల్పబలుడ వీ । విదివరకు

వంతుండు హరిహయసూతుండు మొదలుగాగల కపిముఖ్యులెల్ల | తమబాహు బల మాత్మ దలపోసి దలపోసి యోపినకొలది నుద్యుక్తులగుచు | చలన పక్షద్వయంబును నలుపది యును | యాబదియు నరువదియు డెబ్బదెనపదియును | తొంబదియు నూరు సెప్పిరి శోనవారి | కప్పుడావాలిసూను డిట్లనుచుబలికె ॥

క॥ యేనుశతయోజనములను | బోనోపుదు శంక లేదు పోలగవినుడా | వాన రులట చనిమరలం | గానరు దెంచుటకు శక్తి గలదో లేదో ॥

ఉ॥ నాపుడు జాంబవంతుడు మనంబలరన్ హరిపోతుగాంచి నీ | పేవిధి బల్కె దేల మము నేలినవాడవు పూనినన్ను నా | దేవవిరోధి వీటికి మతింబరికింపక నొంటి బుచ్చి యి | చ్చోవసియించి కాయముల జొప్పడ ప్రాణము లుంచనేర్తుమే ॥

చ॥ అటులనలంప నేటికి మహాబలశాలి సమీరసూతి యి | చ్చట గలుగంగ నియ్యన ప్రచండపరాక్రమ మొప్పనాథ్య దా | పటుగతి దాటి రామ నరపాలునదేవిని జూచివచ్చి నం | కటములబాపు వానరని కాయమునా రవివంశవర్యులన్ ॥

చ॥ అని హనుమంతు బేర్కొని మహాత్మకమీరలు వేడ్క సేయగా | జనునె యపాంపతిన్గడచి జానకిగన్గొని మళ్లి రాక నీ | కొనరెడుగాని వేరొకని కొప్పదహీంద్రుడు దాల్చు భూమి యో | పునెమరియొక్క పన్నగము బూనిధరింపగ మారుతాత్మజా ॥

గీ॥ జలములెల్లనమలె చర్చింపపాషాణ | తతియు నెల్లదేవ తలెనుహీంద్ర | చరసమూహమెల్ల నరయగాహనుమంతు | లేకపీంద్రు వీని నెరగ జెపుమా ॥

ఉ॥ కావున నెల్లభంగులను గ్రక్కున నంబుధిదాటి జానకీ | దేవిని గాంచిమళ్లి చను దెమ్ము విహంగ నొందునట్టి యా | భూవసలక్ష్మిణుందరుణి పుత్రునిమమ్ము సముద్ధరించు దే | వానలిబ్రస్తుతింపగను వాయుజ యింకిట జాగు లేటికిన్ ॥

వ॥ అని పలికిన జాంబవంతుని పలుకులకులరి యాంజనేయుం డాకపివీరుల జేర్కొని యిట్లనియె ॥

ఉ॥ మీరిటువేడ నేమిటికి మేయుజవంబు బలంబు పెంపునన్ | వారిధిదాటి జానకి నవస్యముకన్గొని యిప్డువచ్చెదన్ | భూరమణుండునన్ను పరిపూర్ణకృపస్థితి గార వించుటల్ | భూరివివేకులార మదిలోనదలంపక రిత్తపుత్తునే ॥

మ॥ యురుశక్తిం బదయుగ్మమున్నిలిపి బిట్టూకించి లంఘించుచో | ధరయంతే నియు గృంగిదాటుటకు సత్వంబియ్యదల్లాట యు | గ్గిరిరాజంబున పొందుగానిలచి లంఘింతున్నభో వీధికిన్ | గరమాశ్చర్యముతోడ నిల్చి సురసంఘుంబెల్ల నీక్షింపగన్ ॥

వ॥ అని పలికిన పవమాన నందను వాక్యంబులకలరి యాకపిబృందం బప్పుడు॥

క॥ చలరేగియతనిడగ్గరి । బలభేదికిసురలయట్ల పరిపరిగతులన్ । వలగొని భక్తిసి పుష్పం । బులపూజ యొనర్చిరంత పొల్పలరారన్ ॥

వ॥ అని శివుండు భవానికిం జెప్పినట్లు సూతుండు శౌనకాదులకు వినిపించినవిని వారలు మహాహర్షమగ్నులై తరువాతికథ యెఱింగింపుమనుటయు ॥

శా॥ చంద్రాభ్రాధిప దంతికుంద రజత క్ష్మాభృత్సుధాంభోధి నా । గేంద్రాదిత్య నదీసమానయశ లక్ష్మీశాంఘ్రి రాజీవ భృ । ఙ్గేంద్రాపాపవిదూర భూసుర కులాధీశానిత్రాంతోల్లస । త్సాంద్రానంద మనస్సరోజ శరణార్త త్రాణ పారీణకా ॥

క॥ అకళంకచ్ఛాయ సుందర । వికజాంబుజపత్రనేత్ర విలసితగాత్రా । సకలాస్థాన సుపూజిత । ప్రకటిత కరుణాలవాల ప్రియమంజశీలా ॥

ద్రుతవిలంబితము ॥ పతితపావన భానుసిభాదివ । స్మితవిలాస కృపాబ్ధిశుభప్రదా । శ్రితసమూహ వశీకృతశిష్ట సం । స్తుతపదాంబుజ సూనృత సూక్తికా ॥

గద్య ॥ ఇది శ్రీ భద్రాద్రి రామభద్ర వర ప్రసాద లబ్ధకవితా విచిత్ర గిరుమనామాత్య పుత్ర గౌతమగోత్ర ప్రసిద్ధ సిద్ధనమంత్రి ప్రణీతంబైన శ్రీసదాశివ రామాయణంబను మహాకావ్యంబు నందు రామలక్ష్మణులు పంపాసరోవర ప్రాంతంబున సుగ్రీవుండు గనుంగొనుటయు నచ్చటికి పవన నందనుం డరుదెంచి వారల వృత్తాంతం బరయుటయు సప్తతాళ ఛేదనంబును వాలిసుగ్రీవుల యుద్ధంబును వాలి మరణంబును సుగ్రీవ రాజ్యలాభంబును నిఖిల సేనాసమేతుండై యినజుండు రఘుపతిం గొలువ వచ్చుటయు అంగద ప్రముఖ వానరులు సీతాన్వేషణ పరులై యరుగుటయు గుహా ప్రవేశంబును స్వయంప్రభ సంభాషణంబును సీతం గానక కీశుల ప్రాయోప వేశంబును సంపాతి సంభాషణంబును హనుమంతుండు దధిలంఘించుటకు కృతనిశ్చయుండగుటయు ననుకథలంగల కిష్కింధాకాండ సర్వంబు నేకాశ్వాసము ॥ శ్రీరామార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# సుందరాకాండ ప్రారంభము.

శ్రీరమ్యాచాయ సదన వి । హారాంచిత విష్ణుమూర్తి యశ్శాంత మహా । దారగుణాశ్రియసకల బు । దారాధనశీల వేంకటాచార్యవరా ॥

వ॥ విన నవధరింపుము సూతుండు శౌనకాదులకిట్లనియె నట్లు రత్నాకరోల్లంఘనోద్యోగుండై యంగదాదులు తాను రయంబున మహేంద్రాద్రి యెక్కి యత్యంత కౌతూహలంబున ॥

సీ॥ కమనియ్యపల్లవ సుమనోవిరాజిత విపులశాఖాలతా వృక్షచయము । ఛండ దంతావళ శార్దూలపంచాస్య శరభాదిఘనమృగ సంఘకంబు । కీరవనప్రియ శారికా తిత్తిర శాకఘూకానేక కలకలంబు । యక్షగంధర్వ విద్యాధరామర రాత్రి చరమునీశ్వరసిద్ధ సముదయంబు । భూరిమందారశోభిత పుంజితంబు । గలిగిరంజిల్లు నన్నగాగ్రంబునందు । కీశనికరంబుతోగూడ క్రీడవోలె । నధిక శౌర్యధురంధరుం డనిలజుండు॥

చ॥ గజరిపు విక్రమంబున మృగంబులనెల్లను బారదోలి యం । డజనివహంబులంగరపు టద్వయతాడిత శబ్దభీతిచే । గజిబిజి నొంటజేయుచు నఖండమదోద్ధతి నానగంబుపై । బుజుగతిమీర బెంపొదవె రెండవశృంగమనంగ ధీరుడై ॥

వ॥ యిత్తెరంగున నన్నగోపరి భాగంబున చిత్తంబలర విహరించి కొంతతడవున కనతిదూరంబున ॥

మ॥ అతులోత్తుంగతరంగ సంఘంమ మేయధ్వానదిక్పూర ఘో । రతరగ్రాహతి మీనతిమింగిల ధునీ రాజీవసంచార మం । చితనైర్మల్య జలానుసారమతి వి । స్తీర్ణప్రభాకార మా । నితగంభీర సమృద్ధివార్ధిగని భ్రాంతిన్ వాయుసూనుండొగిన్॥

చ॥ తనమదిలోన నిట్లనియె తక్కక నీ మకరాలయంబు గాం । చినగడవంగ బెట్టిదము సిద్ధముతాక్షుర్యాని యట్టివానికై నను రఘురాముపాద నలినంబులుడెందము నందునిల్పి యా । తని కరుణాకటాక్షమున దాటెదభూరిజవంబు పెంపునన్ ॥

వ॥ అని మరియును ॥

క॥ తడయకగనేటికి నూరక । కడువడిరత్నాకరంబు గడచియసురులన్ । దొడిబడ నేలంగూలిచి । పుడమిసూతు గాంచివత్తు భుజబలమొప్పన్ ॥

మ అవనీపుత్రిని లంకలో వెతకగా నచ్చోటలేకుండె నా । దివిజాధీశునివీటజూతు నొకయుక్తింజూడగా నాడ నా । యువిదంగానక యుంటినేనియును భీమో

పాయతఁ వార్ధిలో । నవలీలంగనుగ్గొందు నిందులను లేదాశ్చర్యమొప్పారగఁ ॥

గీ॥ రావణాసురుతోడ తత్పురము జేరికి । వాలరోమంబుచే జుట్టి లీలవోలె ।
భూమిజాక్షిస్సు నెదటికి బోదుగాక । ముజ్జగంబులు సంతోషమున జెలంగ ॥

మ॥ అటుగాకున్న ప్రమోదమొప్పగను నవ్వారామచంద్రుండు నా । గిరీ
నెయ్యంబలరంగ జేర్చి యల సుగ్రీవాద్యులుం జూడగా । నిటబ్రుత్తెంచెను సీతజాడలకు నై
తద్వార్త లేదంచు న । చ్చటికేనూరక పోవుటల్ జనునె కీశవ్రాత మున్నవ్వగాన్ ॥

చ॥ అనితలపోసిరామ వసుధాధిపశేఖరు పాదపద్మముల్ । మనమ్మునవిల్పి లక్ష్మ
ణుని మాటికిసన్నుతి జేసి పంకజా । స్నన పవమానమిత్రులకు సన్నుతి వెంకి క్రిందడి
యంగదాదులం । గనుగొని కౌగలించుకొని గాఢపరాక్రమ ధైర్యధుర్యుడై ॥

సీ॥ భూరిశౌర్యమున సుధారసంబవల్లిల దేవకిం గొదువైన త్రేయుభాతి । జంభారి
పంపున శైలసంఘంబుపై రయమునజనుభి దురంబుమాడ్కి । పురములుమ్మాడ్కు
నిర్మూలంబుగావింప గాబోవుమద్విశిఖంబుకరణి । మధుకైటభాసుర మర్దనకి మ్యోగ్ర
పారసాత్తుని చేతి చక్రమనగ । భూధరంబుమీద పొందుగానంఘ్రి ద్వయంబునిల్పి
దివ్యులద్రిచరులు । ప్రస్తుతింపనభ్ర పదమ్మున నెగశను । ప్రబలజవసమ్యుత్తుండు పవనజుండు ॥

వ॥ అప్పుడు ॥

చ॥ అనిలజు డంబరంబునకు నట్టులదాటుడు నమ్మహాద్రిపై । దనరుమహీరు
హాదిమృగతండము లంగజ ముఖ్యకీశులా । ఘనునిజవంబుచేదవిలి గాలివశంబున
రాలుటీకులుం । జనుగతి కొంతదవ్వరిగి శైలము చేరుట దోచె వెండియున్ ॥

క॥ అనిచెప్పిన నలికాక్షుని । గనుగొని గిరికన్నె బలికె గహనచరులతో । హను
మంతుడొకడు వీనికి । యనఘా యీసత్వమేల నబ్బెం జెపుమా ॥

అ॥ అనిన నతండిట్లనియె ॥

క॥ నగజామారుతి దక్కన । యగచరులందరయ నొక్క డనిచూడకు ము ।
జ్జగములలోనాతని సరి । ఖగపతియొకరుండు దక్కగామరి గలడే ॥

వ॥ అదియునుంగాక ॥

చ॥ అతినానింకొక యేర్పరింతువినుమో యవ్వాజిఁ రామభూ । పతిధాత్రి
సుతజాడకై యన్వేషుపు డీఁ భద్రంబు చేకూర్చగా । మతిలో యూహయొనర్చి పూర్ణ
మగు ప్రేమం గౌగిటంజేర్చి యు । ద్భుత బాహాబలమిచ్చె యింద్రుకతనఁ బోలొప్పెందొ
నన్వీరుడుఁ ॥

వ॥ అని పలికి తరువాతి వృత్తాంతంబు వినుమని యిట్లనియె నట్లు కపివీరుండు

పుణ్యోదయ నీకడన్నిలువ సంతోషంబెయ్యా నైన భా । స్కరపుటంబోనిధి గృంకగా సమయమై కన్పట్టెడిఁ ప్రొద్దులే । దరగంగావలె లంకకుం దడయగా నహీంబె యూహింపుమా ॥

తో॥ కటకను । శతయోజనదూరము సాగర మ । ద్భుతమేయిది దాటుటపోల రఘు । క్షితినాథుని సత్కృపచేనికియే । నతియుద్ధదినేగెద నద్రివర ॥

తో॥ అని నెయ్యముదోపగ నగ్గిరిపై । తనకేలొగి నూదిముదంబున న । య్యనఘుం డపుడప్పటి యభ్రపథం । బున నేగుచునుండెను మోదముతోన్ ॥

గీ॥ అంతనచ్చటికర్థిన యాదితేయ । ముఖ్యుడరుదెంచి మైనాకమునకు నని యె । యనఘరాముని భృత్యుడౌ ననిలజునకు । హితమొనర్చితి గావున నీతనుండి ॥

వ॥ నీమనంబున నావలనిభయంబు వాసి యిచ్ఛావిహారంబున వర్తింపుము ॥

చ॥ అని అభయంబొసంగి భిదురాయుధుడేగె దివంబుచేర న । య్యనిలజుడాక్రియంజనగ నాతని బాహుబలంబెరుంగగా । మనమునను హా జేసి బహుమానపురస్కృత మొప్పనప్పుడ । య్యనిమిషులెల్ల గూడి సురసాఖ్యను గన్గొని పల్కిరొయ్యనన్ ॥

వ॥ ఉరగాంబా తరణీకుల వర్ధనుండగు రాముని పంపున ధరణిజజాడ లరయుటకై యగ్గిరిచరముఖ్యుం డొక్కరుండ పోవుచున్నవాడు నక్కడ దైత్యులు పెక్కండ్రు గలరు కావున కార్యభాగం బెట్టులుండునో నీవేగి యాతని బాహువిక్రమం బెరింగి వచ్చుట మాకు పరమ లాభంబగునని చెప్పి వీడుకొలిపిన ॥

శా॥ భీమాకారత నొక్కరాత్రిచరియై పెంపొందియభ్రస్థితిన్ । సామార్థ్యంబున నేగి గర్జిలుచు రోషం బుప్పతిల్లంగ హ్రా । త్సీమన్ శంక యొకింతలేక కరిపై సింగంబులంఘించు న । ద్దామప్రౌఢిని మారుతాత్మజుని చంతంబొల్చి మోమోడకన్ ॥

ఉ॥ అద్రిబిలంబుతోడ సెనయైతన రారెడు నోరువిచ్చి తా । రౌద్రము పెంపుమీఱఁగ మారుతిని గ్రక్కనమ్రింగెదనంచు డాయనా । భద్రగుణుండు వేరొక నెపంబుదలంచియు గ్రాలునంగుళీ । ముద్రవియత్తలంబున కమోఘ బలోన్నతి మీఱె నుద్ధతిన్ ॥

క॥ అనుడా హిమవన్నగ నం । దన యచ్చెరువంది ప్రాణనాథునకనెనో । యనఘా యుంగరమట్టుల । హనుమంతుండేల మీఱె నానతియీవె ॥

సీ॥ నావుడు పార్వతి దేవితోనవ్విధం బెరిగింపగాబూని యిట్టులనియె । నద్రినందన వినుమా సురితనుమ్రింగ నరుదేర నాపవనాత్మజుండు । దానిజయించువిధం బాత్మజింతించి యతిరపరిపేశమై యుక్కడంప । గానిశ్చయించి యాకతిన నిశాచరి

కడుపులోఁజొచ్చిన త్వన్మతలేను । నంగుళీముద్రి యొసంగిలి యానటంచు । సతులిశా టోపమెంతయు నతిశయిల్ల । మింటికురువడి నెగరంగ మీఱెనప్పు । డాదితేయులు నివ్వెరగంది జూడ ॥

వ॥ అనంతరంబ పవమాన సూనుం డారక్కసికి వెక్కసంబగు నటు గాత్రంబు పెంచిన నమ్మాయా దానవియు నతండద్భుతంబు నొంద వక్త్రింబు దెరచె నదిగని ప్లవంగపుంగవుం డొక్కింత విచారించి సూక్ష్మాకృతి గైకొని దాని యుదరంబుసొచ్చి ప్రవర్ధమానుం డగుడు నూపిరి వెడలక నక్కుహనా నిశాటిని కంఠగత ప్రాణమై యాకళేబరంబు బాసి పూర్వరూపంబు ధరియించె నాంజనేయుండును విధుంతుదవక్త్రి గహ్వరంబు వెడలి పొలుపుమిగులు భానుమంతు ని యనువున తేజరిల్లె యంత నయ్యుర గాంబ గంధవహ నందనుం గనుంగొని ॥

తరళ॥ పవననందన రామభూవరు పంపునన్ వెసనొంటిమై । దివిజకోత్పని వీటి కేగగ దివిజులెల్లదలంచి నీ జవబలం బెరుగంగదారు విచారచిత్తు లరయ్యను । త్వన మెలర్పగ నన్ను బంచిన సాహసంబున వచ్చితిన్ ॥

క॥ గిరిచర శేఖర నీబల । మెరిగితి నీసాటిగలరె యందునరయ నా సురులనగ నెంతవారని । యరిగెన్ సురసాఖ్యదన నిజాలయమునకున్ ॥

మ॥ అనినన్ పార్వతి బల్కె నప్పు టనఘాత్మా నంగుళీముద్రి మీ । ఱెనభో వీథినటంచు బల్కితిరి వాడంబోని శౌర్యంబు పెం । పున నయ్యంగర మెంచువోయెను మరుత్పుత్రుండు దాగ్రిమ్మరం । గొనుచెబ్బంగి నెసంగబల్కు మిది నాకుండేట తెల్లం బుగన్ ॥

వ॥ అనిన నాతండిట్లని చెప్పె॥

గీ॥ మానినీమణి యాపవమానసూతి । యట్ల మీటినయుంగరం బంబరమున । తామరసగర్భు లోకంబు దాటిపోయె । నంత సురసాఖ్యవీడ్కొని యగచరుండు ॥

వ॥ మనో వేగంబున డాయంబోయి నయ్యంగ ళియ్యకంబు గైకొని మరలి చనుదెంచుచు వివిధమణికీలిత కల్యాణ సౌధ సందోహంబును తాలతమాల తక్కోల మందార విటపి సముదాయంబును కీరకోకిల శారికాద్యనేక పక్షిరాట్సంకులంబును మందార మకరంద నిష్యందపాన పరవశేం దిందిరనివహ ఝుంకారంబు గల్గి పద్మ బాంధవ ప్రభా భాసంబైన యొక్క పురంబుగని యందు ॥

సీ॥ నారదాదిమునీశ వారంబు తత్వ విజ్ఞాననిర్ణయగోష్ఠి జరుపుచుండ । దివిజ నాయకముఖ్య దిక్పాలకుల్ మహా వినయపూర్వకమున వినుతిసేయ । నుభయ

పార్శ్వంబుల సభయతతోడని లింపులబలము సేవింపుచుండ । చలగుచురంభోర్వశీ మేనకాదులు నిరుపమక్రియలచే నృత్యమాడ । చారునవరత్న శోభితాస్థానమునను। నలుమొగంబులు మిక్కిలి చెలువుదనర । భద్రపీఠంబుపై సంభ్రమముతోడ । మహితగతినొప్పు పద్మసంభవునిగాంచి ॥

ఉ॥ యీసుగుణుండు పూర్వమున నెట్టితపంబొనరించి నాడకో । యీసురవైరి గూర్చి పరమార్థముగా నటుగాక యుండినన్ । వాసవ ముఖ్యదేవతలు వారక కొల్తురొ భూరివైభవో । ల్లాసము జెందునొక్కడు తిరంబుగనీపుర మేల గల్గునో ॥

చ॥ అనికడువేడ్క నాభినరుహాసను లోకముచూచి దీని నే । లనిజననంబ దేల సఫలంబగునంచు తలంచివేగమా । దినమణి గృంతునంతకును ధీర గుణాఢ్యుడు వార్థిదాటి నే । ర్పునజనె వానికోర్కి రఘుపుంగవుడాత్మ నెరింగిగ్రన్ననన్ ॥

వ॥ కృపాయత్తచిత్తుండై యతనికప్పుడభావికాల చతురానన పదవికి పట్టంబుగట్టె నింక యీబ్రహ్మకల్పంబు దీరిన యనంతరంబ పవమానపుత్రుండు సత్యలోకంబు పరిపాలింపం గలవాడనిన కాత్యాయనీదేవి కృత్తివాసున కిట్లనియె ॥

క॥ భూతేశయా ప్రభంజన । సూతిమదింగోరినంత చొప్పడగా న । ల్పాతభవ పదవియొసగెను । సీతేశునికిరుణ నేమిచప్పగవచ్చున్ ॥

క॥ నావిని శంభుడుపల్కెను । దేవీ యీజానకీశు దృఢతరభక్తిన్ । సేవించు నట్టివారికి । జూవెయతడంత భక్తసులభుండరయన్ ॥

వ॥ అనిపలికె యనంతర కథాప్రసంగంబు వినుమట్లు వాయుసూనుండు శంకలేక నకళంకశౌర్యంబున సాయంకాలంబునకు లంకానగరోత్తర ద్వారసమీపంబునకుం జని యచ్చట నిల్చి తనలోనా ॥

ఉ॥ ఈపురినాకకాదు దివిజేశ్వరముఖ్య సురాళికైన వా । ణీపతికైన నయ్యలిక నేత్రునకైన చొరంగదుర్లభం । బేపగిదిం జనంగదగు దేక్రియజానకి జాడగాంతు ధాత్రీపతి కోర్కెనెవ్విధిని దీర్తునటంచు విచారయుక్తుడై ॥

క॥ నలుదిక్కులరసి భార్గవ । కులవర్ధను హితవుసేయ గోరుచు రాకా । సులరేని వీడుచొర నె । వ్వలనంగానకను కొంత వడితనలోనన్ ॥

మ॥ అసమానోద్ధతి నేగగూడదని కార్యంబాత్మనూహించి రా । క్షసనందోహము లందొరంగి యొక సూక్ష్మప్రక్రియన్ బూని యా । వ్వసుధానందన జాడ గాంతునన దేవద్వేషి యాకాంతనే । దెనగోప్యంబున నుంచినాడొమరి ధాత్రీపుత్రి నానెట్టిదో ॥

గీ॥ ఎన్నడేనియు గన్గొని యేనెరుంగ । లంకపగటింటివేళ సొరంగరాదు । చొనగరాదని యూహించి వెరపుజెంది । యటకుమరలంగ బొయ్యెద నంటినేని ॥

ఉ॥ నాసరివారుజూడ రఘునాథునిపంపున నెగడెంచి యా । యాసముతోడ నిట్టి మకరాలయముద్ధతి దాటియిప్పుడీ । వాసవవైరిపీడుగని వారనిభీతి వహించిబేల నై । భూసుతజాడ గైనక పోయినకార్యము పిటిబోవదే ॥

ఉ॥ లెక్కగ గోచరంబగు బలీముఖశేఖరు లుండనందులో । నొక్కనివిశ్వసింపక రఘూత్తముడీపని నన్ను నంపుటల్ । గ్రిక్కున దారుణీసుతను గన్గొని రమ్మని కాక మిక్కిలిం ! గక్కసమానులంక చొరగాయని రమ్మని వల్కడుంగదా ॥

ఉ॥ తమ్ముడరమ్మటంచు వసుధాపతి యుంగరమిచ్చి నన్ను నె । య్యమ్మున సీతకిమ్మనుచు నానతిబెట్టిన యట్టి డంతయుఁ । వమ్ముగ నించుకేనియు మనంబున గొంకక రాముజేరి నీ । సొమ్మిదెకొమ్ము జానకిని జూచుటలేదని చెప్పబోదునే ॥

ఉ॥ తమ్మునవిశ్వసించి వసుధావరశేఖర వాయుసూతిచే నిమ్మని యుంగరంబు ధరణీసుతకిమ్మని పంచితీవు జి । త్తమ్మున చాలనమ్మి యదిదాపదిలంబుగ మళ్లిదెచ్చె నీ । నమ్మినబంటు వీడెయని నన్ను బలీముఖులెల్ల నవ్వరే ॥

వ॥ అనియిట్లు డోలాయమాన మానసుండై వెండియు ॥

చ॥ మనుజవరేణ్యుడట్లు బహుమాన పురస్కృత మొప్ప ధారుణీ । తనయను జూడనంపిన విధం బదియారసి చూడనన్ను దా । ఘనముగ సేయబూనుట యెుకాక పరాక్రమ హీనుడంచు న ద్దినకరజన్మముఖ్యులు మదింబలుమారును నవ్వనందుకో ॥

గీ॥ అనుచుపెక్కగతుల నచ్చటనొక ముహూ । ర్తంబు జింతచేసి తనమనంబు నందు రామవిభుని యంఘ్రిద్వయంబును । దలచితన్నుదాన తెలసిమరియా ॥

ఉ॥ నాయుడపేర్మిమజేసి రఘునాయకుడంపుట విక్రమోన్నతుం । జేయదలంచి కాకదన చిత్తములో కుటిలత్వమూదినఁ । మాయలబెట్టునే తగని మాటదలంచితి నట్టులైన నీ । తోయధి దాటగాగలనె దుర్దశనొందక వాయువేగతఁ ॥

చ॥ మనమునసింనుకేని యనుయానముసేయక సీతజాడకై । పనుచుట లేమినన్ను మురిపంబున కౌగిటజేర్చినట్టి రా । ముని హృదయంబులోపల ప్రమోదముగల్గదలంచు టేమి నా । వనచరబుద్ధికేమి యనవచ్చును యంత వెఱుంగు నక్కటా ॥

వ॥ అది గావున నాథక్తవత్సలుని కారుణ్యంబు గల్గుట భువనత్రయంబునం దొక్కటేనియు నసాధ్యంబు గలదె యని నిశ్చయాత్మకుండై తన యున్నతాకారం బుజ్జగించి యొక్క సూక్ష్మరూపంబు గైకొని తత్పురద్వార సౌధంబుపై నెక్కి లంకా

పురంబు కలయంగాంచి యందు నతులితా నర్ఘ్యా మణిమయ రోచులం జెలువందు వాసవారాతి మందిరంబుజూచి యుద్దిక్కు మొగంబై చను పవననందనుం గనుంగొని ॥

క॥ కనుగవనిప్పులురాలగ । తను తారోజచును కఠినతరవాక్యములన్ । మన మున ననుమానింపక । ననెనాగ్రహ మూదిలంక యమకులుబెదరన్ ।

ఉ॥ ఎవ్వడవేవురోరి మదినించుక యోజక దుర్మదంబుచే । క్రొవ్వుగ్రేంద్రుడున్న యడకుంజను కుంజర మట్లలంకలో । నెవ్వరిచేరికింగానక నేడ్తెరనన్ను తృణీకరించు నీ । వివ్విధినేగుచేమిగతమియ్యదిరోరి వెణుంగువానరా ॥

క॥ నినునిపుడ మ్రింగనగు వ । చ్చిన కార్యముదెలసి యట్ల జేసెదమది గొ । బ్బున తెలియబల్కు నీవిధ । మనుమానము సేయ నేల నవనీదర్చిచరా ॥

క॥ నాయడుట నిలనోపరు । తోయజగర్భాదులైన తొడరగలేరే । నీయానసే కొకించుక । నాయుష్మేషంబుగల్ల నగునిక్కముగన్ ॥

గీ॥ అనుడు చిరునవ్వుమెరయ నయ్యనిలజుండు । దానికిట్లను నంతటిదానవౌదు । వైననీపేరు పెంపునేడరయవలయు । నెరగబలుకుము తడయగా నేలయనుడు ॥

క॥ గిరిచర వినుు లంకయనం । బరగుదు దనుజేశునాజ్ఞ మైకొనియపుడీ । పురి గాతు నింకనీవే । రెరిగింపుమనుండు నాతడిట్లని పలికెన్ ॥

క॥ మీనగరిగల విశేషము । లేనెరిగిచనంగనిటకు నేతెంచితినీ । తానాథుని యనుమతినను । డానగచరపేరుతోడ । నదియిట్లనియెన్ ।

శా॥ ఓరీ వెంగలివానరాధమ భయంబొక్కింతయున్ లేక నీ । వీరీతిన్ జనుదేరగా నగునె యింకేలాగు ప్రాణంబుతో । మీరాజుం గలయంగ బొమ్ముదవు బల్మిందెచ్చినేడిట్లు దా । నారాజీవ భవుండునాకు నిను నాహారంబు చేశెంబలే ।

క॥ అనవుడు నపుడాలంకకు । హనుమంతుం డిటులనియె నవ్వునటువలెనె । వన జాసనువంపుననీ । పనిసేయగవచ్చినాడ పరువడినిటకున్ ॥

ఉ॥ నావిని యానిశాచరి ఘనంబగు రోషముతోడ వాయుజుం । దావలకేల గృద్దుటయు తద్దయుబాహు యుగంబుసాచియా । పావనిదానిబట్టిధరపై బడవైచివధింపబూని దే । వావలిబ్రస్తుతింప నపుడంగనయంచురు గాచె పేర్మితోన్ ॥

వ॥ అంత నానిశాటిని కొండొకవడికి యెలుంగెత్తి యా శామీరితో నిట్లనియె నయ్యానీకొక్క విశేషంబుచెప్పెద యెన్నడేనిజకనందన జాడలవనచరుం డరుదెంచి నిన్ను నోర్చు నాటికి లంకకు కీడువాటిల్లు రావణునకు కాలంబు గూడునని కమలగర్భుండుపలికె నతనివచనం బనృతంబుగాదు యింక నీవలసినయందుం జనుము ॥

సీ॥ అనుపమవాయు నందనుడు తద్వారంబు ననుబోక ప్రాకార మొనరదాటి। యిభమదలలిత సౌరభవాసితంబును వివిధ నానాగృహ విలసితంబు। నతులవిభ్రాజిత హర్మ్యాభిరామంబు సురభిప్రసూన సంశోభితంబు। పంచమహావాద్య బంధుర నినదంబు చాతుర్యమధుర సంగీతరవము। గలిగి యొప్పారు రాజమార్గమున నేగి। యఖిల జనముల మర్మంబు లరసికొనుచు। నెరక పడకుండ రావణాసురుని నగరి వాకిటను నిల్చుతరినంత వలనుమీరా॥

క॥ జనకజను వెతకవచ్చిన। హనుమంతుం జెట్టివాడొ నాతని సొబగుల్। పని పడి చూతమటంచును। జనుదెంచిన మాడ్కి నింట చంద్రుడుదోచెన్॥

వ॥ అంత॥

క॥ చంద్రోదయంబు పొడగని। సాంద్రా నందంబు తోడ శైలచరుండా। యింద్రారినగరిలో రఘు। చంద్రుని సతినరయబూని సరభస మొప్పన్॥

సీ॥ కరమర్థితో గిరి కటకంబులను మంట పంబుల కేళి గృహంబులందు। గుళ్ళలోపలవప్ర గోపురంబులయందు దంతిరథాశ్వ సద్మములయందు। రచ్చలవీథుల రమణీయసౌధ హర్మ్యములందు నింతుల మందిరముల। ఘనతరంబగు నధికారులయిండ్లను విప్రులశాలలయందు వివిధయక్ష। గరుడగంధర్వ కిన్నర సురవితాన। కారిరా భవనముల కుంభకర్ణముఖ్య। నిఖిల రాత్రించరానీక నిలయములను। విలసితోద్యాన వనముల వెతకి వెతకి॥

వ॥ యెందును నవనీనందనం బొడగానక యొండుదెసను కల్యాణ మయంబైన యొక్క నికేతనంబుగాంచి దాని జేరంబోయి నచ్చోట నవయవంబులు మరచి సుప్తులైన సుందరులంగని యమ్మహా బలనందనుండు తనలోనా॥

ఉ॥ ఏనెటువంటి పాతకినొ నీపరభామల గూఢమర్మముల్। పూనిటుజూడ బాల్పడితి పుణ్యవిహీనుడనైతి నంచు నెం। తేనియు చింతజేసి యవనీంధ్ర చరుండు మనంబులోపలన్। దానవుడా రఘూత్తముని ధ్యానమొనర్చి వివేకసాంద్రుడై॥

క॥ నాకరయనేమి దోసము। ప్రాకటముగ రామవిభుని పంపుననిటు లా। గీ కలకంఠుల జూచితి। గాక నెపంబూని చూడగారాను గదా॥

క॥ అనిపరికింపుచు ముందటి। ఘనతర నవరత్నఖచిత కాంచనమయమై। తనరారు నొకవిమానము। కనుగొని డాయంగ నేగి కపివరుడంతన్॥

వ॥ దానిపై నారోహణంబు జేసి యందు మదిరాపాన పర వశత్వంబున దేహస్మరణ లెరుంగక వరమణి భూషణాంబరంబులు దివిచియు వక్త్రంబులు దెరచి యు

నొండొరులం గవుగలించుకొని నిద్రించు యువతులం గనుంగొనుచు రావణుని పర్యంకప్రదేశంబు చేరంబోయి మందోదరింగాంచి తదీయ సౌందర్యంబున కద్భుతంబు జెంది సీతయని యూహించి తనమనంబున ॥

ఉ॥ జానకి లోకమాత రఘుచంద్రునిమ్రొద్దనె కాకయిట్టిదు | దానవుశయ్య పైని ప్రమదంబున నీక్రియ నిద్రవోవునే | మానుగపుష్పగంధమణి మండిత భూషణమ్ముల్ ధరించునే | పానముసేయునే విభుని బాసిసుఖంబుల కిచ్ఛగించునే ॥

ఉ॥ ఈమదిరాక్షి దానవకులేశుని యంగనగాగనోపు నే | నామది గానలేక క్షితినందనగా బరికించి మోచితిం | కేమనవచ్చు రామతి విహీనతకక్కట నూహసేయ నీకాముకినీసీతయైన దశకంఠునిముక్కున నూర్పుగల్గునే ॥

క॥ అనిపల్కి పానశాలకు | జనియచ్చట సుప్తులైన సతులం బరుసన్ | కనుగొనుచు మగుడిమారుతి | తనయుండొక్కెడను నిల్చి తనలోననియెన్ ॥

సీ॥ గిరులందుగుహలందు కేళీగృహంబుల కొలకులనదులందు గుళ్లలోన | పానశాలలయందు ప్రాసాదములయందు ప్రాకటకూప తటాకములను | రచ్చలలోన దుర్గమతలంబులయందు సెజ్జపట్టుల ద్విజశ్రేణి మంది | రంబులలోన వనంబులలోపల పుష్పగృహములయందు భూగృహంబు | లందు గొందులతక్కిన యట్టిచోట్ల | వెతకిచూచితి నారఘుపతిసుదతి | లేదులంకనునిక్కంబు మీదనింక | నెవ్వి సేయుదు విధికృత మెట్టులొక్కొ ॥

ఉ॥ తోయధిదాటి తాభయము దొట్టిన ప్రాణము లోలిబాసెనో | నాయసురేశ్వరుండగు దశాననుడాకటిచేతద్రుంచెనో | పాయని దైన్యమూని రఘుభర్తను కానని యట్టిచింతచే | కాయముబీడెనో దనుజ కాంతలె మచ్చరమూది చంపిరో ॥

చ॥ అలిగి రఘూత్తముండు వసుధాత్మజజాడల నేగుదేరగా | గలడనియూహజేసి దశకంధరుడాత్మ దలంకివార్ధిలో | పలబడవైచెనో హితుల ప్రోపునడాచెనొ లేక నెమ్మహా | ఖలునకు నింకనొండు దెసగన్గొన వేరొక లంకయున్నదో ॥

వ॥ అని యనేకవిధంబుల జింతించి మందర నొక్క యారామంబున యనాభిరామంబై కనుపట్టుచున్న యది వైదేహినరసి యద్దేవి యచ్చటలేక యుండెనేనియు మీదటికార్యంబు చూచికొందమని నిశ్చయాత్ముకుండై యశోకవనంబు డాయబోయి యందు ॥

సీ॥ అప్పటప్పటికి నాహాయను నిట్టూర్పు వేడిమి యధరంబు వాడియుండ | చెక్కిట చెయ్యూది శిరమొకించు వాంచి వారకకన్నుల నీరునించి | కావలియున్న

రాకాసులఱుఖుంకెల ఘోరతరభీతిమై యులికి యులికి । క్షణమొకయబ్దంబు గాబరికింపుచు దీనాస్యయై తనమానసమున । గొందువలేనట్టివంతను గుంది గుంది । నిరాశను తెన్ను గాని నిందించుకొనుచు । చింతసేయుచునున్నట్టి సీతగాంచె । పవనపుత్రుండు సమ్మోద భరితుడగుచు ॥

వ॥ ఇత్తెరంగున గనుంగొని యాప్లవంగపుంగవుండు తనయంతరంగంబున॥

క॥ రాముడు వనంబేడునెడ । నేమనితా గురుతుచెప్పె నిరవందంగా । నామదికి జూడనివి యీ । భామామణియందు గలవు పరికింప గన్ ॥

క॥ పదములుజంఘలు మధ్యము । రదములు వీనులును కందరము కరయుగముల్ । వదనమున ధరమునుదరము । సుదతికి విభుడన్నమాటకు చూడగనొప్పెన్ ॥

గీ॥ అంశుకంబుతోడవు లలికంబు నలకంబు । లాన్రుపావతంసు డన్నయటుల । నున్నవరియ నీపయోరుహలోచన । సీతగాగనోపు సిద్ధముగను ॥

వ॥ అనివితర్కించి తనమనంబున నిక్కంబుగా నెరింగెనని పూర్వాకారంబు బూనియమ్మహీరుహశాఖాపర్ణంబుల నొదిగియుండె తదవసరంబున నవ్వామలోచన గద్గదికస్వరంబున తనలో నిట్లనియె ॥

చ॥ పనివడి కేకయాత్మజకు పాపపుబుద్ధిజనింపజేసె గ్రీ । కానవిపినంబు జేర్చి యటనుర్వ వెనువెంటని మాయలేడివై । మనుకులభర్తపాపి దయమాలి దశానుబాలిని మ్మెయిక్ । వనమున నాకెనుండుటకు వ్రాసితినాకు పయోరుహాసనా ॥

క॥ జనకునకుబుట్టి యజనం । దనునింటం జొచ్చి వినుత దమునుండగు రా । మునకుప్రియయైన నాకిటు । దనుజులతో నుండజేశె దైవంబకటా ॥

చ॥ విమలచరిత్రుడైన రఘువీరుని బాసిన యప్పుడావను । త్తమ మదిమాని యేను వసుధాస్థలిపై నశికోర్చియిప్పుడీ । క్రమమున చింతజేశెదను కాంతలు బుద్ధి విహీనులంచు శా । స్త్రములను బల్కుచుండెడు విధంబుదలంపక రిత్తవోవునే ॥

శా॥ ఆబంగారపు వింతలేడిగనియే నారామభూపాలునే । లాబోధించితి దాని దెమ్మని నృపాలశ్రేష్ఠుడట్లేనినా । దాబల్మిన్ గలహించియేమిటికి బోవం దోలితిన్ లక్ష్మణున్ । స్త్రీబుద్ధిః ప్రళయాంతకా యనుట సందేహంబె యూహింపగన్ ॥

వ॥ అని మరియును ॥

క॥ ననుగానక రఘునాయకు । డనుజుండును తానుగూడి యాగహనము చం । తను బరికింపుచునుండెనో । దనుజులమాయలను నన్ను తలపుమరచెనో ॥

క॥ రావణుడు నన్నుదెచ్చుట । తావిని యాఖలుని తోడుతం బోరాడం । గా

వెరచియూరకుండెనో । యీవరకున్ వీడు దెచ్చు పెరుగడా మరియున్ ॥

క॥ ఏనోడక సౌమిత్రిని । మానసమెరియంగ నినిన మాటలతనిచే । తానువిని దానికటులనె । కానిమ్మని తలచెనొక్కొ కఠినహృదయుడై ॥

క॥ నను గానని దుశ్చింతను । దనుజులమాయలకునోడి ధరణీశుడ దా । నను జుని గూడి యయోధ్యకు । జనెనో వనవాసమింతె చాలునటంచున్ ॥

వ॥ అని యనేక భంగులం జింతించి తనలో ధైర్యం బవలంబించి వెండియు నిట్లనియె ॥

చ॥ అదవదనొందలేక యిటులాడితిగాక యదెట్టిమాట న । న్నుదనుజ వీరు నింటను జనుల్ పరిహాసము సేయడించి తా । గొదకొని కూర్మిసోదరుని గూడియయో ధ్యకు మళ్లిపోవగా । మదిబరికింపనింత యభిమానవిహీనుడె రాముడారయన్ ॥

సీ॥ పూని నాకొరకుగా భూతేశు విలుద్రుంచె కాకాసురునిబల గర్వమణచె । రౌద్రంబుతోడ విరాధునుక్కడగించె నని లోనఖరదూషణాదిదైత్య । వరులను దెగటార్చె మరియుదక్కినయట్టి యసురులనురువడి హతము జేసె । యిట్టివిభుండేల నిప్పుడు శిక్షించు గహనంబులోపల గలయు వెతకి । యెల్లవిధముల నాజాడ లెరిగివచ్చి । కడలి యవలీలగడచి విక్రమమెలర్ప । రావణాసురముఖ్య దుష్టరాక్షసులను । నాహవంబున దొడరి కూలార్చుగాక ॥

క॥ అనియిట్లు సీతబల్కగ । వినియచ్చటనున్న యసుర వెలదులుకోపం బున కటములదర కరముల । గొనకొని కైదువలు బుచ్చుకొని యుద్ధతులై ॥

వ॥ అందరు నొక్కుమ్మడినార్చుచు నీపాపజాతి మన రావణునకు కీడు దలంపు చున్న యది దీనిద్రుంచుండు మ్రింగుండను నెలుంగులు నింగిముట్ట ఝంకించు నవసరం బున చేరువ నిదురవోయెడు త్రిజట మేలుకని వారలతో నిట్లనియె ॥

క॥ మీకేటికీతత్తరపడ । రాకాసులకెల్లకీడు రఘురామునకుం । బ్రాకటలీల శుభంబగు । గాకని కలగంటినిపుడు కడుచిత్రముగన్ ॥

వ॥ అది యెయ్యది యనిన నెరింగించెద సావధానంబున వినుండు ॥

చ॥ శిరమునమూనెజారగ నిశీసమయంబున భుక్తహాస్తుడై । గరళముద్రావుచుం దనదు కంఠములందున రక్తమాలికల్ । కరముధరించి దక్షిణము గ్రక్కునయొక్కడ పంక్తికంధరుం । డరిగెను నగ్నవేషమున నాచును నేకలగంటి వెండియున్ ॥

చ॥ ఘనుడు విభీషణుండు వెలిగామరితక్కిన యట్టిరాక్షసుల్ । పనివడి రావణా సురుని బ్రస్తుతిసేయుచు రక్తపుష్ప చం । దనములు మేనదాల్చి పరిధాన విహీనత రావణుండు బో । యినగతి దక్షిణంబునకు నేగిరటంచునుగంటి వెండియున్ ॥

గీ॥ సామజారూఢుడై రఘుస్వామియిటకు । వేడుకలరంగ సౌమిత్రితోడగూడి। యురుగుదెంచి నిశాటుల యవనిగూల్చి । సీతదోడ్కొని మరల వెంచేయగంటి ॥

క॥ సితవస్త్రంబులు దాలిచి । ప్రీతితోడం గూడి యధిక పరితోషముతో । క్షితితనయ పుష్పకముపై । నతివిభవము మెరయ యుండు నని కలగంటిన్ ॥

గీ॥ పరిబలబహుళాశ్వ సామజ రహితమయ్యె । లంకజలనిధిబడగంటి లంకలోన। రాక్షసాంగనలధిక స్వరంబులోలయ । నుబ్బినర్త్యాచు పాడుచు నుండగంటి ॥

క॥ కావున నాకలనిక్కం । బేవిధమునకైన రాఘవేంద్రుడు పంక్తి । గ్రీవాది దుష్టదైత్యుల । వావిరిదునుమాడునిది ధృవంబరయంగన్ ॥

వ॥ అట్లగుట మనమీ జానకికి నపకృతిసేయుట కర్జంబు గాదనిన నారాకాశి మూకలు భయాకులమానసులై నాయింపువదనకు యభివందనం బాచరించి హితులై మెదగిరి నంతయు వృత్తాంతంబు హనుమంతుండు విని యక్కడా మగువ సీతయాగుట నిక్కంబుగా నెరింగి తనవచ్చినపని యచ్చెలువకు తెలియపడం జేయువాడై దాశరథిం జేర్కొని ॥

సీ॥ దశరథరాజనందనుడు విశ్వామిత్రి సవనాహితాసుర సమ్మారుండు । ముని సతిశాప విమోచనుండంధ కాంతకభూరి చాప విధ్వంసకుండు । భార్గవ రాముని బాహుబలంబెల్ల వింటనుగైకొన్న వీరవరుడు । కైక వేడిన వరము నిక్కంబు శేసి । యడవి కేగినయట్టి సత్యవ్రతుండు । చారుగుణసాంద్రు డతులిత శాంతమూర్తి । యైన రఘునాయకుండిట కనిపెనన్న ॥

వ॥ అని మరియును ॥

చ॥ యొనరగపర్ణశాల కడనుండగ నచ్చటికొక్క రాక్షసాం । గన జనుదేర దానిగని గ్రక్కునముక్కు నగంబు జేసినం । బనివడి దానిబాంధవుల పాయనిరోషము తోడ బోర వ । చ్చిన నపుడా నిశాచరుల చెచ్చెరరాముడు బోరగూల్చెడున్ ॥

క॥ హరిణంబై యొకరాక్షసు । డరుదెంచిన దానిదేర నారఘునాథుం । డరుగుటయు వేచి నిన్ని । తెరగున దశకంధరుండు దెచ్చెనిచటికిన్ ॥

సీ॥ అంతనారఘువరుం డాగ్రహావిస్ఫూర్తి కుహనా మృగంబును కూలనేసి । యనుజన్ముయుక్తుడై యతిరయంబున పర్ణశాలకువచ్చి యచ్చటను నిన్ను । గానక చింతచే గానలోనెల్లెడ వెతకుచు నొకగృధ్రవిభునికతన । నీవిధంబంతయు నెరిగి దుఃఖింపుచు గ్రక్కున ఋశ్యమూకంబు జేరి । యబ్జహితసూతితో హితమాచరించి। యతనికను రాగమొనరెడు నట్లయొక్క । కోలనవలీల వాలినిగూలనేసి । త్రిదివ

సంఘంబు తను ప్రస్తుతింపుచుండ ॥

వ॥ సుగ్రీవునకు రాజ్యంబొసంగి యతని పురస్సరంబున పెక్కండ్ర శైలచరుల నీజాడ లరయంబుచ్చిన యేను సంపాతి వచనంబు కతన బాడబాళ్రియంబు గడచి లంకాపురంబు గలయ వెతకి యిచ్చట నిన్నుం బొడగంటి ననుజయుక్తంబుగా రామచంద్రుం డపార వానర సేనా సమన్వితుండగుచు సుగ్రీవునిం గూడి సుఖంబయున్నవాడు మీకు నిచ్చట సేమంబకద ॥

క॥ నావిని ధరణీనందన । భావంబు నబ్బురంబు బ్రిమదంబెనగన్ । గావడన మెత్తి వృక్షము । పైవలనుగ నొదిగియున్న పావనిగనియెన్ ॥

క॥ కని వీడెక్కడికుహనా । వనచరుడో యిట్టులసుర వరుడైన దశా । నను డనుపవచ్చెనొకొ । యనియించుక జింతచేసి యాసతిమఱియున్ ॥

చ॥ తనమదిలోన నిట్లనియె । తథ్యముగా రఘువీరుడీతనిం । బని చినవాడొ లేక విధిమాయొయొ యూహయొనర్ప యేకలం । గన భ్రమగొంటినో యురక కన్నుల కిట్టుల గానవచ్చెనో । పనివడియింతనుండిక శుభంబులు జేకుర పేళయయ్యెనో ॥

గీ॥ అనుచు చింతసేయు నవసరంబునతరు । శాఖడిగ్గివచ్చి శైలచరుడు । నతనతమొ్రక్కి హస్తయుగ్మము మోడ్చి । పలికె రామ్య నమ్రభాషణములా ॥

క॥ తల్లీనీకుగ శ్రీరఘు । వల్లభుడాహారసుఖవివర్జితుడై దా । నెల్లప్పుడనుజ యుతుడై । యుల్లంబున జింతసేయుచున్నాడు సుమీ ॥

ఉ॥ నావిని ధారుణీసుత మనంబుననించుక విశ్వసించిదా । పావనితోడనిట్టులనె భానుకులేశుని దూతవేని యా । భూవరు రూపురేఖలును పోలకనాకు నెరుంగజెప్పినన్ భావములోన నీపలుకు పథ్యముగా పరికించి నమ్మెదన్ ॥

క॥ అనుటయు వాయుతనూజుడు । జనకజమదినున్నయట్టి సంశయమెల్లన్ । తనలోనవెరిగి యపుడా । వనితకునిట్లనుచుబలికె వలనొప్పంగన్ ॥

సీ॥ రాముండు మేఘవర్ణమువాడు వెడదయౌ నురమువాడధిక భాసురమువాడు । లలితవిస్ఫార ఫాలమువాడు కంబుకంధరము వాడమిత సుందరమువాడు । ధవళాంబుజాత నూతనపత్రరుచిర నేత్రములవా డుజ్వలాస్త్రములవాడు । శరణువేడిన వారి నరమరసేయక బ్రోచువాడదయుల నేచువాడు । భూతదయగలవాడు నెప్పుడు మునీంద్ర హృదయశీమల వసియించి పొదలువాడు । వార్ధిగంభీరుడాశ్రిత వత్సలుండు । శవ్యచారిత్రుడాజాను బాహుడరయా ॥

చ॥ మఱియునతండు సర్వజన మాన్యుడుధన్యుడు భూరివిక్రముం । డరిమదభంజ

నందు సుగుణాఢ్యు డమేయబలుండు మేరు భూ। ధరసమధీరుడిందు ధరతామరసాసన వందితుండు సం। గరవిజయాభిరాముడు జగత్ప్రియుడంగజ రూపుడెన్నగన్॥

క॥ ఉన్నగుణంబుల లక్ష్మణు। డన్నకు నెనయైన యతడె యగుసిక్కముగా। చెన్నుగ నతనిదేహము। గన్నసువర్ణంపుకాంతి గనుపట్టుసుమీ॥

క॥ నారాకకెదురు సూచుచు। వారధికడ నంగదాది వనచరులున్నా। రా రూఢి నీదుసేమం। బా రామునకెఱగసేయ నరుగగవలయున్॥

ఉ॥ దేవపిరోధినిన్ను చరదెచ్చిన పిమ్మట రామచంద్రుడా। తోవ నెలక్ష్మణుంతు తనతోజనుదేర నరుగుదెంచి సు। గ్రీవునితోడ సఖ్యమొనరించి నినున్మదిజింతసేయ దా। నా విధమెల్లగాంచి కమలాప్తతనూభవుడప్పుడాయ్యెనన్॥

వ॥ నాడునీవు గీర్వాణ పరిపంథిచేత పట్టువడి వచ్చునప్పుడు మీపైచేలంబున ముడియంగట్టి పుడమింబడవైచిన భూషణంబులేను గాంచి పదిలపరచియుంచి నవిదెప్పించి యతండు రామచంద్రుని యదుటబెట్టించిన నానృపాలస్వామి వానింజూచి కన్నుల నపార వారికణంబులు గురియ మూర్ఛాగతుండై యొక్కించుక దేరి యవి యక్కునంజేర్చి కుంచుచుండిన మార్తాండసూనుండేనును దేశ్య నెట్టకేలకు నూరడిల్లి నిన్ను వెతకుటకై పుత్తెంచినం జనుదెంచితి రామచంద్రుని దూతను యినజునిసచివుండ హనుమంతుండనువాడను॥

క॥ వనజాక్షినమ్ము కుహనా। వనచరుడను గానటంచు వలనుగ సీతాం। గన పాదపంకజంబులు। తనఫాలముసోక మొక్కె తరుచరుడంతన్॥

క॥ ఇదెమీకు నానవాలుగ నదమలచరితుండు రామచంద్రుండునాచే। ముదమొదవనంపె ముద్రిక। సుదతీకొమ్మనుచు నిచ్చె శుంభల్లీలన్॥

వ॥ యిత్తెరంగున నాకపిపుంగవుండు రఘుపుంగవుండంపిన నంగుళీయ్యకం బాకురంగలోచన చేతికిచ్చిన నచ్చెలువయు నానంద బాష్పనయనయు రోమహర్షణగాత్రయు నగుచు ముఖంబున జిరునవ్వొలయ దానిముద్దిడి యప్పుడు॥

చ॥ అరమరలేక ఫాలమున నంటుచుకన్నుల నద్దుకొంచుదా। కరమనురక్తితో బిగియ కౌంగిటజేర్చి ప్రియుండపోలె సా। దరమున ముచ్చటాడుచు ముదంబున దేలుచు లజ్జనొందుచున్। సరములగూర్చుచున్ గుచకుచంబుల పైవిడికొంచు నిట్లనున్॥

క॥ యేనిచట నిట్టులుండగ। ప్రాణేశుడు నీవునన్ను బాసియచ్చటన్। పూనియెటులుంటి రక్కట। వానాథుడు నన్నుదలచు నావలుకుగదే॥

క॥ నా మీదియాన సుమిత్రా। సౌమిత్రి యొకప్పుడైన జననుతుడగు నా।

రామునితో తననేర్పున । నామాటకు విన్నవించు నాకృపబుట్టన్ ॥

వ॥ అని మరియును ॥

గీ॥ అవధినొందెడుదాననై యుంటిగాక । ధరణివిభునకు నామీఁది కరుణలేని । ది । సౌమిత్రినాకెవ్వ రితరులెవ్వ । రరయ నవేమిగావలె నెరుఁగఁజెపుమా ॥

ఉ॥ క్రూరతపంక్తికంఠు డిటకున్ జరదెచ్చిన నాటనుండియే । నారయనిద్రలేక మలినాంబర నయ్యుపవాసమూని యాతీరున శోకవారినిధిఁదేలుచు ఘోరతపంబు నేయుమా । వారికి నీకునేఁడు దయవచ్చెను నాయుడ మేలెముద్రికా ॥

చ॥ పనివడినన్నురామ జనపాలుని పెండిలి జేసినట్టి యూ । చనువునవచ్చితో దివిజ శాత్రవునిం బెగటార్పవచ్చితో । జనకవ సుంధరాధిపుని సద్గుణముల్ దలపోసి వచ్చితో । గొనకొని చెప్పనీవు నిటకుంగృపతోడుత వచ్చుటంతయున్ ॥

చ॥ మనుకులభర్తనన్ను బహుమానతి జేయుచు నిన్ను నెప్పుడుం । తనకడ వ్రేల బెట్టిన విధంబుమనంబున మచ్చరించి నే । ర్పున నిటులాగుజేసిపుడు పోలగనాయనవంత జూచి యూ । యనఘునినన్ను గూర్చుటకు నై పనిపూనుక వచ్చితౌబలే ॥

చ॥ యెరుఁగకయున్న నాళ్లు హృదయేశుఁడునాయడ మోహముంచు నే । మురయుచునుంటిగాని వినుముద్రికనీయడ ప్రేమ యెక్కుడా । నరపతికెట్టులన్న సురశాత్రవశత్రుడు నన్నునిమ్మెయిం । జెరగొనితెచ్చినన్ సరకు సేయకనుండె మనంబులోన దే । వరవిటయున్కి జేసి రఘువల్లభుపద్ధతి వచ్చు జూడుమిా ॥

వ॥ అని యిట్లనేకభంగుల నయ్యుంగరంబుతో సరస సల్లాపంబులాడి మారుతాత్మజు నుద్దేశించి ॥

ఉ॥ భానుకులావతంసుని శుభస్థితివేగ మెరుంగజెప్పగా । పూనిపయోధిదాటి పరిపూర్ణకృపం జనుదెంచిలంకలో । దానవకోటికించుకయు తల్లడమందక వచ్చియిట్లు నాదీనతబాపువారు జగతింగలరే మరినీవుదక్కగన్ ॥

ఉ॥ భూరిబలాఢ్య మాకొరకు బూనియొకించుక శంక లేక యీ । తీరునవచ్చినట్టి భవదియ్యమహాద్భుత శౌర్యధైర్యముల్ । స్ఫారజవ ప్రభావములు సన్నుతిసేయ తరంబెయుక్తి నై । వారగనింద్రదేవగురు వారిజగర్భులకేని పావనీ ॥

క॥ మునుగాధేయుడు రఘు రా । మునకున్నను పెండ్లిజేసి ముదమున నిపుడా । మనుకులవిభునింగూర్పగ । వనచరవరనీకువంతు వచ్చెంజుమిా ॥

క॥ వనజభవుడోర్వజాలక । వనివడిరఘువరునినన్ను బాపెనెట్టులో । యనఘా మమ్ముంగూర్చిన । వనరుహసంభవునిపదవి వచ్చునీకున్ ॥

వ॥ అని యిట్లనేక భంగుల నతనిచిత్తంబలర పలికి ॥

ఉ॥ ఎన్నడువచ్చురామవిభు డెన్నడునన్ను పరిగ్రహించు నిం। కెన్నడునేను రాఘవమహీశునిగూడి సుఖంపుచుందు నా। కెన్నడు వంతమాను హృదయేశుని పాద సరోజయుగ్మము। గన్నులజూతునెన్నడిక కారుణికోత్తమ నాకుజెప్పవే ॥

సీ॥ నావుడోజనయిత్రివే వేగమేనేగి విభునితో నీవార్తవిశదముగను। వివరింపనారఘు వీరుండు నాకంటె బలియులైనట్టి యపారకీశ। సంఘకంబులగూడి సరభసంబున లంకపైనెత్తి చనుదెంచి బంధుమిత్ర। సచివతనూభవ సహితంబుగా రావణాసురుబోరిలో హతముజేసి। నిఖిలదిశలందు తనకీర్తి నిండునటుల। ముదమెలర్పంగ సాకేతమునకు నిన్ను। నర్థిగొనిపోవు నిజమునీవంత తడవు। ప్రాణియిచ్చోట నిలువ లేవేని వినుము ॥

వ॥ లంకానగరంబుతోడంగూడ వైనతేయుని యచువున నన్మహారాజు నొద్దకుం గొని పొయ్యెద నరు దెమ్మనవుండు నయ్యంగన నవధికసూక్ష్మతనుండవు యిట్టి కడింది ప్రయోజనం బెవ్విధంబున సంఘటించుననిన నతండు ॥

క॥ చిరునవ్వునవ్వి సీతకు। కరమాశ్చర్యంబుదోప గాయుడు పంక్తుల్। వర సందలపువ్వులుగా। పరువడి వింధ్యాచలంబు పగిదింబెరిగెన్ ॥

వ॥ ఇట్లు రెండవ వింధ్యయ నందనమేను వెంచిన పవమాన సూనుంజూచి ॥

గీ॥ అనిల నందన నీబలంబరయు కొరకు। నాత్మలోపల దలచింటిట్లంటిగాని। యెంతపనికైనజాలుదు వెన్నినిన్ను। బోలవనచరులున్నారె భూతలమున ॥

వ॥ అని యనేకభంగుల యమ్మహాబలనందను నగ్గించి వానరేంద్ర యఖిల లోక కంటకుండగు దశకంఠకంఠ విచ్ఛేదనార్థంబుగా నతిఘోర తపస్వియుంబోలె కృశీభూతనై యిడుములు గుడుచుచు నెదురుసూచుచున్న నన్నురఘుపతి సన్నిధికిం గొని పోయిన నస్మదియ్య వ్రతంబు నిష్ఫలంబగును ననంతశౌర్యసంపన్నుండైన రఘువీరుని విక్రమంబును వమ్ముంగాంచునట్టిది గాకుండనాయునికి యెరింగించి యాన్నృపకంఠీరవుని దోకొని వచ్చి సపుత్రబాంధవంబుగా పంక్తికంధరు సహ్మారింపంజేయుమిందులకు గురివేరొకరుండు లేడనిన యమ్మహాశక్తి దీర్ఘక్రోధంబున కద్భుతంబంది మనంబున భయంబుగదుర నంజలిజేసి యాంజనేయుండిట్లనియె ॥

క॥ జననీనాకిక దడయం। జనదార వివంశవార్థి చంద్రునికడకుం। పని వినియవ శీఘ్రంబున। జనపతికే మానవా లొసంగెదొ తెమ్మా ॥

వ॥ అనుటయు నప్పద్మలోచన తనయుత్తమాంగంబున దాల్చు ననఘ్యా

రత్నంబు త్తరియ్యంబు కొంగునముడియంగట్టిన యది విడచి యాకపిసిమ్హునిచేతికిచ్చిన దానింగొని యద్దేవికి మ్రొక్కి దీవనలుగైకొని లేచి గమనోన్ముఖుండౌటయు ॥

చ॥ అనిలజ రామభూవిభుని యంఘ్రులకిమ్ముగ నాదుమ్రొక్కుగా । గొన కొని నీవుమ్రొక్కిడుము క్రూరనిశాచర కాంతలిచ్చుటన్ । గినుకనొనర్చు బాధ లెరిగింపుము సమ్మెనదాని నిమ్మెయిం। దనుజుని యాకెనుంచుటలు ధర్మువుగాదని పల్కు వెండియున్ ॥

క॥ తనయంతటి శౌర్యోన్నతు । వని తామణినొక్కయసురి వంచించినచో । కినియక యున్నిక్కిందగునే । యన్న చెప్పుము శాంతమిటన నర్హంబనుమీ ॥

ఉ॥ తానుదయాపయోంబుధి సుధాకరుడంచు దలంచియేకదా । భానుతుజ్ఞాన మాజనక భూపతి రాముననుం బ్రియంబుగా । మానుగ నన్నొసంగె పవమానత నూభవ యిట్టి నాయెడన్ । భానుకలావతంసుడు కృపారహితుండగుటేమి చిత్రమో ॥

వ॥ అని మరియును వాయుపుత్రా సుమిత్రానంద మిత్రనందనుల తోడ నస్మదియ్య వృత్తాంతంబెరింగింపుము పోయిరమ్మని వీడ్కొలిపిన నతండు పునఃపునఃనమస్కృతులొనరించి కొంతదూరంబు సనియూరక పోవుటలు పౌరుషంబు తెరంగుగా దొక్కించుక విక్రమంబు నూపుట బాహుబలంబు కలిమికి ఫలంబని మనంబునందలంచి యశోకారామంబుననుం గవసి యుద్ధతంబున ॥

సీ॥ ప్రళయకాలమునాటి పవనునితెరగున భూరుహంబులు బెరికి పారవైచి । పవికెలబూనిన పాకవైరియు బోలె గిరులశృంగంబుల నుసుము జేశి । ఛండమదాభీల సామజమోయన కాసారములను జీకాకుజేశి । పన్నగాంతకుని శుంభల్లీల దక్కిన యండజంబులనెల్ల బెండుపరచి । భూరిపంచాస్యగండక పుండరీక । గండభేరుండ ముఖ్యమృగ వ్రజంబు । బారగాదోలి దిక్కులు పగులనార్చి । తోరణస్తంభము రువడి జేరెనంత ॥

వ॥ ఇట్లు వక్రపరాక్రమంబెసంగ రెండవకాల భైరవుండునుంబోలె క్రీడించు పావనింజూచి యవ్వనంబు కావలియున్న రాకాసులు భయాకుల మానసులై రావణుంజేరబోయి యిట్లనిరి ॥

క॥ దనుజాధీశ్వర యొక్కడి । వనచరుడో యొకడువచ్చి వసుధాత్మజతో । డను మాటలాడి మరలం జనచున్ వనమునకు గవసి సాహసవృత్తిన్ ॥

క॥ జగతీజంబులు బెరికి వి । హగములనుద్ధతి నిజంపి యార్పులు చలగన్ ।

మృగముల గసిమసగిపు డా । నగచరుడున్నాడు తోరణ స్తంభమునన్ ॥

గీ॥ అనిమిషారాతి వినుమట్టి వనములోన । జనకసుతయున్న దిక్కు వృక్షములుదక్క । నావనాటుడు వెకలించ నట్టివిటప । మరసిచూడంగ మందునకైన లేదు॥

వ॥ అనిసవిని మండిపడి యాఖండలశాత్రవుండు చండపరాక్రములగు దశసహస్ర దానవ వరులంగని నానిం బట్టి తెండని నియోగించిన ॥

సీ॥ ఘనతరశూల ముద్గరచక్రకరవాల ముఖ్యసాధనము లిమ్ముగ ధరించి । నడచిముందరతోరణ స్తంభమునసతి పీరుడై యొప్పంగ మీరిజూచి । యార్పులుజలగ పీడాయింత జేసిన వృక్షచరుండని వివిధగతుల । నాడుచు దగ్గర నరిగిరయంబున గొట్టుడు పోనీకపట్టుడనుచు । హరిణసంఘంబు గ్రొవ్వాది యురకమాలి । కరివిరోధిని జనకిన కరణినాసు । రాగిలొక్కట గుమిగూడి యాగ్రహమున । నతిబలాత్మజుపై నేగ నాతడపుడు ॥

క॥ వాలముద్రిప్పుచు తారలు । రాలన్ దిక్కరులు మొగ్గ రాక్షసులాత్మన్ । చాలా గగ్గిలరెండవ । కాలునిక్రియ దిశలుబగుల గానార్చి వెసన్ ॥

ఉ॥ వారలతోడనిట్టులనె వారిజమిత్రకులాబ్ధి చంద్రుడౌ । నారఘువీరువంపున ధరాత్మజజాడల నేగుదెంచితిన్ । భూరిబలాఢ్యుడం బవన పుత్రుడనన్ హనుమంతుడండ్రు దే । వారిసమూహబంధుర మహాటవిపాపక మూర్తినారయన్ ॥

క॥ పరువులుబారుచు మీరీ । తెరగుననిట కేలవచ్చి తిరి దుర్మతులై । దురమున నన్నోర్వంగా । హరిహయముఖ దేవకోటికైనందరమే ॥

చ॥ సురులజయించినట్టి కడుశూరులమారయ మేముమాకు వా । నరుడన నెంతవాడని మనంబుననించుక శంకలేకనిం । దరుజను దెంచి నారలు గదా మిము నొక్కని బోవనీక భీ । కరగతి ద్రుంచివైచి దశకంఠునకున్ వగబుట్ట జేసెదన్ ॥

ఉ॥ నావుడు దైత్యులాత్మల ఘనంబుగ రోషము లుప్పతిల్లనా । పావని మీద ముద్గర కృపాణము ఖాద్యఖిలాయుధావళుల్ । వావిరి నేసి యార్చిన నవారితవిక్రము మొప్పనాతడా । దేవవిరోధులంగని మదిం జలరేగి కృతాంతుకైవడిన్ ॥

గీ॥ అలిగితోరణ సిక్షిప్తమైనయట్టి । పరిఘుయవలీలగైకొని పావకుండు । విపిన మేర్చుతెరంగున వివిధగతుల । తోడ దేవవిరోధుల ద్రుంపజొచ్చె ॥

క॥ కొందరశిరములు ద్రుంచియు । కొందరయుదరముల వ్రచ్చి కుపితాత్మకుడై । కొందరిని బిలుకుమార్చి । పురందరుడునుతింప సంగరం బొనరించెన్ ॥

వ॥ ఇవ్విధంబున గగన ప్రచారుండై మారుతసూనుండా పిశితాశనులం గసి

మసంగిన యాతనిఁబారిబడక తొలంగి పావునకుందప్పిన వారలు తలలువీడఁబారి సురారి కత్తెరంగు చెప్పిన ॥

ఉ॥ ఆనగవైరిశత్రుడు ప్రహస్తసుతుండగు జంబుమాలి నెం । తేనయమారగా విలచి నీవురయంబున నేగిలంకలో । దానవవీర సంఘము ముదంబున వ్రస్తుతి నేయునట్టులా । వానరుఁబట్టి తెమ్మనుడు వాడువెసం ధనురాస్త్రపాణియై ॥

క॥ చనిబెట్టుగ చాపగుణ । ధ్వనిమ్రోయగ దిక్కులద్రువడాసియనిల నం । దనుపైన నస్త్రవర్షము ఘనముగఁగురియించి యధిక గాఢస్ఫూర్తిన్ ॥

ఉ॥ ఆనసశీమనొక్క నిశితాస్త్రమువైచి దశాంబకంబులం । బూనికరంబులం జొనుప భూరిపరాక్రమ ధుర్యుడా జగ । త్ప్రాణతనూజుడొక్క శిలబల్విడి తెచ్చి నిశాటునేయ న । ద్దానవుడాశిలన్ సునిసి తప్రదరంబుల నుగ్గునేయుడున్ ॥

చ॥ తరుచరుడందుకున్ గనలి తద్దయుబెట్టున నార్చివానిపై । పరిఘముద్రిప్పి వేసిన సుపర్వవిరోధులు భీతివారగా । నరదమునశ్వముల్ బటు శరాసనమున్ వివిధాస్త్రశస్త్రముల్ । శిరమును గాత్రముంజదిసె శీఘ్రమెదైత్యుడు గూలె మేదినిన్ ॥

వ॥ ఇత్తెరంగున వానినంత కాంతికంబున కనిచి యాంజనేయుండు తోరణస్తంబంబుచేరె నంత సంగరంబున మారుతి వేడిమికోర్వక పలాయితులైన నక్తంచరులు రావణుకడకేగి జంబుమాలిపాటు జెప్పిన ॥

మ॥ దనుజాధీశ్వరు డందుకెంతయును క్రోధస్ఫూర్తిమై మంత్రి నం । దనులం బల్విర నంపవారలతి యుద్దాడప్రతాపంబు న ద్ధనురస్త్రామిత శస్త్రధారులును సేనాయుక్తులై వాయుపు । త్రునిపైనొక్కట నేసియార్చిరి మహారోషంబు తోడంగడున్ ॥

క॥ పరువడి నమ్ములవానం । గురిసిన నక్కీశవరుడ కుంఠితబలుడై । తరిమి యవి నుగ్గుసేయుచు । సురశత్రులమీద గవిశె కుంభల్లీలన్ ॥

సీ॥ కరతలంబునను కొందరమస్తకంబులు పరియలువారగా జరిచికూల్చి । ఘనముష్టితతుల పెక్కండ్రనుద్ధరతను ఘోరంబుగాబట్టి గృద్దినంపి । కౌగిటకొందరగారించిబిగ్గర నదిమిపోనియ్యక హతముజేసి । పాదతలంబుల పల్విరవధియించి భుజముల కొందర బొలియజేసి । వాడినఖములకొందర వ్రచ్చిత్రుంచి । రథము రథమున జతిపి సారథులనడచి । యపుడుదిక్కులు బగులంగ నార్పికాల । భైరవాకారుడై యొప్పె పవనజుండు ॥

క॥ అంతంగొందరు సురరిపు । లంతేవడినేగి దాన వేశునకా వృ । త్తాంతము చెప్పినసిగ్గుచుక । చింతించి దశాననుండు చెచ్చెరనపుడున్ ॥

వ॥ యూపాక్ష విరూపాక్ష ముఖులగు దండనాయకులం గనుంగొని వీరలు కరితురంగ బలంబులంగూడి చని యావనచరునిం బట్టితెండని నియోగించిన నాసుమన సారాతులు మదేభారాతి విక్రములై దశదిక్కులం దలంక కూకలిడుచు తోరణ ప్రచారుండగు సదాగతినందనుం గూడ ముట్టి ॥

క॥ గొదకొని యస్త్రమయంబుగ । పొదివినవాలంబుదిప్పి భూద్రిచరుడులో జదలవిదళించెను వా । రిదముల బోదోలుపవను రీతి న్వానిన్ ॥

సీ॥ ఆలోనయూపాక్షు డైదంబకంబుల కపిపుంగవుని మస్తకంబునాట । నేయుడాతడు నింగికెగసినయూపాక్షు డతనితోనమెగసి యంపవాన । గురియుచుపపావని గొనకొనివారించె నంతవిరూపాక్షు డల్లితొడరి । శరములముంచిన యిరువురుదైత్యులు గగనపరిచారులై కడగి ముద్గ । రంబులుద్ధతిదిప్పి శీఘ్రమున నేయ । వాయుసూనుండు గనలి దుర్వారశక్తి । గదసిపరియలుగాతల లరికాలడాచి । నాసురారులనిద్దర నవని గూల్చె ॥

ఉ॥ వారలనట్లద్రుంచి కపివంశవరేణ్యుడు శేషసైన్యముల్ । జేరగనేగిభూరిమద సింధురమాగ్రిహ వృత్తితోడ గా । సారములోపలన్ మెలగు చందమునన్ హయ సామజంబులన్ । వీరనిశాటులందునిమి వెండియుతోరణ వాసుడాటయున్ ॥

వ॥ అంత నాసామీరిచే నూటికిం గురిగాక తప్పినసురరిపులు లంకకరిగి యత్తెరంగు పురందర కంటకునకుం దెలిపినవాడు గనలొంది ॥

క॥ అక్షీణవిక్రముండగు । నక్షకునిం జేరబిలచి యరిభంజన నీ । వీక్షణమయటకు జనియా । వృక్షచరుం బట్టితెమ్ము వేగంబనుడున్ ॥

సీ॥ అతడిద్ధసన్నద్ధుడై ప్రమోదంబున రమణీయమణి భూషణములుదాల్చి । కనకచిత్రితదివ్య ధనురాస్త్రపాణియై యఖిలభూషణ నిఖిలాస్త్రశస్త్ర । భాసురంబగు తేరు పైరయంబున నెక్కి కనదురురత్న కేతనముగ్రాల । సామజహయభట స్యందనానీకంబు నిరుగెలంకులయందు నేగుదేర । దట్టముగశంఖ భేరికా ధ్వనులుమ్రోయ । వీరభటసింహనాద దిక్పూరముగను । నడచికడుఁరోజుచును తోరణముననున్న । యతి బలాత్మజు పొడగని యలుకవాడమి ॥

వ॥ వింటి గొనయం బెక్కించి గుణంబుసారించి విజృంభమాణా వష్టంభంబున॥

చ॥ అనిలతనూజు మేను వివిధాస్త్రమయంబుగ నేసియార్చి నం । దన మదిలో దలంకకను దగ్రతనాఘను డంఘ్రిపీఠికిం । జనినను వానితోనెగసి శైలచరేంద్రుని నంప వెల్లిదే । ల్చిననత డానిశాటుని శిలీముఖసహ్మతి మెచ్చియాత్మలోన్ ॥

ఉ॥ బాలుడనంగ రాదితని బాణపరంపర కోర్వపూర్వ వి। క్రాలకుడైననోప
డది గావున నీకలుషాత్మునుర్విపై గూలగజేసి లోకముల కుం బ్రిమదంబొనరింతు
నటంచుదా। వాలముద్రిప్పి యార్చి సురవైరిరథం బరచేత వ్రేయుడున్ ॥

కం॥ తురగాస్త్రసహితముగ నం। బరతలమునుండి యపుడు బటువేగముతో।
సురరిపుని రథమునురుమై। ధరపైబడ భూరిఖడ్గ ధరుడై వాడున్ ॥

కం॥ పొలివోని బంటుతనమున। బలుపడి గగనమున కెగయ పవనసుతుండా।
ఖలునికడకాళ్లు రాకా। సులుతల్లడమందబట్టి కుంభలీలన్ ॥

చ॥ ధరణికినేగుదెంచి వివిధస్ఫుటకాంచన భూషణావళుల్। సరగునరాలనంగ
ముల సంధులువీడ తొడల్ భుజంబులున్। విరుగగ కంఠమున్నులియ నెత్తురుగ్రక్కగ
ద్రిప్పితిప్పి దు। స్తరగతి నేలత్రోవయిచి చంపెనిలింప విరోధినంతయున్ ॥

వ॥ ఇట్లు వాయుసూనుం డా నిశాచరుం బరిమార్చి వానిబలంబుల నుద్దండ
భుజాదండంబుల ఖండించి తోరణాధి రూఢుండయ్యె నంత హతశేషుల వలన రక్షో
నాయకుం డక్షుని పాటు విని దుఃఖాక్రాంతుండై కొంతవడికి యింద్రజిత్తు నుద్దేశించి॥

చ॥ అరిబలభేదివంచి తగుణాఢ్యుడవద్భుత భూరిఘోర సం। గరవిజయాభి
రాముడ వఖండపరాక్రమ శాలివాసురా। సురలకునైన నిన్నెదిరి చూడగశక్యమె
పోరనా పురం। దరుజరబట్టివేమును సుధాంధస సంఘము దోలియుద్ధతిన్ ॥

కం॥ నాతోనెన్న సమర్థుండ। వాతతభుజ బలిమికలిమి నస్త్రనిపుణ వి। ఖ్యా
తుండవ బేధ్యుండవు। నీతిపరుడవతుల శౌర్య నిధివెన్నంగన్ ॥

గీ॥ మున్నుజంబుమాలి ముఖ్యనిశాటి సం। ఘంబులక్షకాది ఘనబలాఢ్యు।
లధికసేనగూడి యరిగియా వనచరా। ధముని నోర్వలేక సమసిరనిని ॥

వ॥ కావున తక్కొగ్గులకు నక్కపికులాధము జయింప తరంబుగాదు నీవిప్పుడ
చని ॥

చ॥ సమరమునందు దివ్యశర జాలమువేడిమి జూపిభూరి వి। క్రమమలరార
దైత్య నికరంబుగనుంగొని యాత్మలోన సం। భ్రమమునన్నొంద నడిచిరు బట్టుకర త
డెంతయుంచులో। భ్రమసకుమెన్ని భంగుల శుభంబగునీకును పోయిరమ్మొగిన్ ॥

సీ॥ అనవుడుశక్రజిత్తాత్మలో నుప్పొంగి యపుడుతండ్రికి మ్రొక్కి యతనిచేత।
సేవపల్గైకొని తీవ్రదంష్ట్రాసనం బులు తార్క్ష్యవేగంబు భూరితర బ। లాశ్వసం
యుతము వియచ్చరంబగునట్టి యరదంబుపై నెక్కి యఖిలదిశలు। బదరీకృతంబుగా
బల్విడినార్చుచు నతులితాటోప సురారికోటి। లమితసేనాసమన్వితులై తనర్చి। తోడ
నడుదేర చని చని తోరణమున। బంధురోన్నత శౌర్య విభ్రాజమాను। ననిలసూను

గనిడాయు నవసరమున ॥

క॥ మృగములు వాపోజొచ్చెను । ఖగములు నరచుచునుదిరిగె కలగెదిశల మ । ర్త్యగణంబంబర తలమున । నగచరు విక్రమము జూతమని నిల్చిరొగిన్ ॥

వ॥ అప్పుడు ॥

క॥ రావణి కఠినాస్త్రంబులు । పావని పైనేయ రామభద్రుని భటుడా । దేవేంద్ర జిత్తుశరములు । దావెసదునుమాడి యభ్రతలమున కెగసెన్ ॥

చ॥ యగశిన మేఘనాథుడు నహీనపరాక్రమ మొప్పనప్పు డా । యగచరవర్యు మీద నురయంబున తేరటు దోలియుజ్వ లా । ఖగములు బిట్టుగాబరపు చుంగడు భీషణ మూర్తిదాల్చి ది । వ్యగణముభీతిచేదలక నమ్ముల వెల్లిని దేల్చియార్చుచున్ ॥

చ॥ తరలకనద్రివోలె శరధారల వేడిమి కోర్చి యుద్ధతిన్ । సురరిపు మేనువ్రచ్చి కడునుగ్రక్కగ జేయుచు బిట్టుగృద్ధుచున్ । బరువడి దాటుచున్ మరలి పైకొనిపోరుచు నోటదక్కి యం । బరచరుడై తనర్చె పవమానతనూజుడు శౌర్యధుర్యుడై ॥

వ॥ ఇవ్విధంబున నొండొరులు బద్ధమత్సరులై పోరుచున్నంత ॥

క॥ రావణి తనలోనిట్లనె । నీవనచర వీరుశౌర్య మేమనవచ్చున్ । చావచడ డావహంబున । లావితనికి నెక్కుడయ్యె లక్షింపంగన్ ॥

క॥ అదిగావున నీకీశుని । కదనంబున గెల్వతరము గాదేరికి బె । ట్టిదము గుబ్రహ్మాస్త్రంబున । వదలక నిర్జింతుననుచు వాడుద్ధతుడై ॥

గీ॥ అదికనియతి శోడ నప్పుడయ్యస్త్రంబు । వింటబూనియింట మంటలడర । నేయ వాయుపుత్రు డెంతయుమూర్ఛిల్లి । యంబరమున నుండి యవనివ్రాలె ॥

వ॥ వ్రాలి యొక్కింత తడవునకుం దెప్పిరి యాబంధంబు బ్రహ్మాస్త్ర బంధంబని యెరింగి తదేక నిష్టాగరిష్టుండై మానసంబున తన్మంత్రిధ్యాన్నం బొనరించి బంధ మోచనుండై వనజభవుని యనుమతి కొంత యనుసరించియును దోషాచరునితోడ భాషింతుడను తలంపున వెణుంగువానిం బోలె కనుంగొనుచుండ రాకాసి మొత్తంబు జనుదెంచి యాకపీంద్రుని పెనుమ్రోకుల నంటగట్టి మేఘనాథ పురస్సరులై యార్పులు నింగిముట్ట లోకవిద్రావనుండగు రావణు సమ్ముఖంబునకుం గొనిపోయిన నుగ్రాకారుండై హనుమంతుం గనుంగొని ప్రహస్తునివదనం బవలోకించి వానితో నిట్లనియె ॥

గీ॥ ఈవనాటుడిటకు నేతేరపనియేమి । వచ్చియిట్టులేల వనముజెరిచె । నరయ తన్నునంపి నట్టివాడెవ్వడు । తెలియనడుగుమీవు తెల్లమిగను ॥

చ॥ అనుడుప్రహస్తుడంత పవనాత్మజు గన్గొనిపల్కె నిట్టులో । వనచర నీవు నిచ్చ

టికి వచ్చుటకేల ప్రయోజనంబు ని । న్ననిచిన యాతడెవ్వడు సురారులసేల వధించి
తీవు గా । బ్బున విడిపించిపుచ్చెదను బొంకకనంతయు నేర్పరింపుమా ॥

సీ॥ అనినప్రహస్తుని యాననంబీక్షించి యేపున పవనజుడిట్టులనియె । పూషణా
న్వయ సుధాంబోధి సత్పూర్ణిమచంద్రుడౌ రఘురామ చంద్రుదూత । ననిలతనూ
జుండ నినజుసచివుండ హనుమంతుడనువాడ నగచరుడను । జనకతనూభవ జాడకై
త్రిదశవైరులకొందర కదనభూమి । హతముగావించి పేర్చి దశాస్యుతోడ । పరగ
భాషించుకొరకునై పట్టువడితి ।

వ॥ అనిపలికి యల్లవారలు వినుచుండ దశముఖునిం గనుంగొని ॥

చ॥ ఇనకులుడైన రాఘవ మహీశుడు పంక్తిరథుండు పంపగా । ననుజుడుసీరకే
తనప్రియాత్మజదో నరుదేరవచ్చి తా । నొనరగ పర్ణశాలకడ నుండగనచ్చట మాయ
వన్నె వం । చననిటులాగు శంకిలక జానకిదెచ్చుట నీకుబాడియే ॥

క॥ అనిమిషుల బారదోలితి । ధనదుని పుష్పకముగొంటి దర్పంబునన
మనుజుండు గెల్వవాడే । యనిమాచుట మానుమీ దురాగ్రహమేలా ॥

గీ॥ అతులితోన్నతమైన యాకారమునసొప్ప । కలిమియందు బాహుబలము
నందు । సతులయందుదలప సుతులందు హితులందు । గలరెనిన్నుబోల నిలనుఘనులూ?

మ॥ దనుజాధీశ్వరయిట్టి నీకలిమి వ్యర్థంబయ్యెడింజూడు రా । మునిబాహాబల
మీవెఱుంగవు జుమీ మున్వాలపాశంబుచే । నినుబంధించిన వాసవిందునిమె నంతే
కాదు యూహింప న । య్యనఘుండమ్మరి బోయుచోదాడర ఫాలాక్షుండుదాశక్తుడె॥

చ॥ అనవుడు బిట్టురోజుచు దశాస్యములొక్కట బెంచికన్నులన్ । కనదురు
విస్ఫులింగములు గ్రమ్మభయంకర శస్త్రధాహలం । గని కపికీటకాధముని కట్టుడు
కొట్టుడు త్రుంచుడంచు బ । ల్కినవిని యావిభీషణు డొగిం దశకంఠునితోడ నిట్లనున్

మ॥ తనపాలేలిక పంపుఋనిటకు నుద్యద్విక్రమంబొప్ప వ । చ్చినవాడై ఇటు
లాడెగాక మదిలో జింతింపగావీని వ । ల్లను తప్పేమియనాక భూరితర శాంతంబెల్ల
లోనాడి యో । దనుజాధీశ దురాగ్రహంబాదవి దూతంజంపగా బాడియే ॥

క॥ రావణ నీకోపాగ్నికి । దేవాదీశుండొ జముడొ త్రిపురాంతకుడో ।
గావించిచూడు మదిలో । నీవనచరుజంపదీన నేమగుననుడున్ ॥

గీ॥ అపుడు తమ్మునివాక్యంబు లాదరించి । రాక్షసేంద్రుండు భటుల చేరంగ
లచి:। తోడరి యీవానరాధము తోకగాల్చి । పురముగలయంగ వెనద్రిప్పి పుచ్చు
మడూ ॥

వ॥ యమభటు లంబోని నిశాటులు పెక్కండ్రువచ్చి యాపురంబున నఖిల గృహంబుల కార్పాసపట్టికలు దెచ్చి నూనియునలది యతని వాలంబున సుట్టి యనలం బిడి మునుపటి కట్టులు వదలక పట్టుకొని వాద్యంబులు జలంగ నార్పులు నింగిముట్ట వీధులం ద్రిప్పుచున్నంత ॥

క॥ అనల శిఖలించు కేనియు । తనుజోకక యుండుసటుల తరుచరవరు డా । త్మను సీతానాథుని పద । వనజంబులు దలచుచుండె వారనిభక్తిన్ ॥

క॥ రేమని చెప్పుచు శ్రీరఘు । రాముని సామార్థ్యమద్రి రాజతనయయా । భీమానలశిఖలప్పుడు । సామీరికి చంద్రికిరణ సంఘుకమయ్యెన్ ॥

వ॥ అంత ॥

క॥ తనుగట్టినకట్టులు దు । క్షునియములుగా త్రెంచివైచి కూరిరాహిగతిన్ । వన చర వీరుడురోజుచు । ననిమిష శాత్రవులగూల్చి యపురుద్ధతుడై ॥

చ॥ అమితపరాక్రమం బెశగ నార్చుచు నెక్కడ తానెయు య్య శీ । ఘ్రము దిశలన్ మిడుంగురులు గ్రమ్మగమంటలు మింటనంట రో । మముమదిలోన హెచ్చగ నిశాచరసంఘ నివాసముల్ గ్రమ । క్రమముగ గాల్పజొచ్చెలయ కాలమునాటి కృశానుపోలికన్ ॥

శా॥ ఆలంకాపురిలో విభీషణుని గేహంబొక్కటే తప్పగా । వాలాగ్నిందశకంఠ ముఖ్య దనుజ ప్రాతాలయంబుల్ దను । శ్శాలల్ భూరిమదేభశాలలును విస్ఫారాశ్వ శాలల్ మహా । జ్వాలాభీలము గాగగాల్చె వెసనా సామీరి యొక్కుమ్మడిన్ ॥

క॥ అనిలజునివిక్రమం బే । మనిచెప్పుదు ఘటికలోన నద్రిజవిభుమా । దను జుని పురివాలమ్మున । దనరెడు నపార్చి కర్పితముగా జేశెన్ ॥

వ॥ అసమయంబున ॥

క॥ పొగలెగశెనచట నదిగో । మిగులన్నండంగ దొడగె మెండుగనచ్చో । మొగులందెనదుగో మిడుగురు లగణితముగనంచు పౌరులాత్మను భీతిన్ ॥

వ॥ నలుగడలం బరచుచుండి రట్టియెడ ॥

క॥ అనలకణంబులు నంబర । మునముట్టగ ధూమశిఖల ములు వడిగ్రమ్మం । గనునర్చులెగయ నుగ్ర । ధ్వనులను మండంగజొచ్చె వసినింగికడన్ ॥

గీ॥ దానవాధీశుడప్పుడు తానుతగు సు । రాహితులతోడగూడ పురంబువెడలి చేయునది లేక మదిలోన చింత జెందు । చును తనంతన ఖిన్నుడై సూచుచుండె ॥

వ॥ అనంతరము ॥

సీ॥ ఘనరతిక్రీడల బెనగినిద్దురతమి నగ్నికీలలయట్ల నడగువారు । తమ తమ భూషణా తతిదేరగానేగి సప్తార్చిశిఖలెర్చి నచ్చువారు । నంగంబులను విస్ఫులింగంబు లంటగా దూరినల్దిక్కుల బారువారు। పానమదావేశ పరవశంబుననిండ్లు వదలంగనేరక మడియువారు । నంబరంబులువీడగా నరుగువారు । మందిరాంగణసీమల మ్రగ్గువారు। నగుచులంకాపురంబున నసురులిట్లు । గాలిరెక్కడజూచిన గుంపులుగను ॥

క॥ శాలలువెలువడి నగ్ని । జ్వాలలు గాత్రములనంట జచ్చుతురగముల్ । వాలుమదకరులు బిట్టుగ । గాలిధరంగూలునట్టి ఘనసౌధంబుల్ ॥

వ॥ మరియు రెక్కలుకమరి కలకంబులుసేయుచు బొలియు శారికాకీర పారావతాద్యండ జంబులును మండెడు ధాన్యరాసులును పొడియైన వజ్రవైడూర్య ముఖ్య నానారత్నంబులునై నకల ద్రవ్యశూన్యంబై అశోభితంబై జ్వాలావృతంబై లంకాపురంబు వెలింగె నయ్యవసరంబునం గొందరు దైత్యవీరు లాకీశవల్లభుం దాకిన ॥

ఉ॥ వారల వ్రేల్మిడిందునిమి వాయుసుతుండు ప్రమోదచిత్తుడై । వారకతన్ను నొక్కట దివౌకసులెంతయు బ్రస్తుతింపగా । భూరిపరాక్రమంబెసగ భూస్థలిద్రవ్యగ నార్చుచున్ వెస । నీరధిజేరనేగె రజనీచరులెల్లెడ నిల్చిచూడగన్ ॥

వ॥ ఇవ్విధంబున లంకాపురంబు నప్తార్చికర్పించి పోరవచ్చిన నిశాచరవీరుల బొరినమరి రత్నాకరంబుజేరి యందు వాలానలంబార్చి మరల వైదేహికడకేగి వినమితోత్త మాంగుండై కేలుమోడ్చియున్న యప్పావనింగాంచి జనకపుత్రిక యిట్లనియె ॥

క॥ అరిదిపరాక్రమ నీవును గరుడుడు పవనుండునబ్ధి గడవనసమర్థుల్ । పరికింప లంకగాల్పగ । నొరులకుదరమౌనె నీకు నొకనికిదక్కన్ ॥

వ॥ అని కపీంద్రా ఇంద్రాదులకు పట్టువడిన యప్పుడేమనికొంటివి యేచందంబున బంధంబులబాసితివి యేపగిది నగ్నివలనం గడతేరితివి యేతెరంగున వైరులం బిలుకుమార్చితివి యెరిగింపుమనుడు ॥

గీ॥ ఆత్మలోపలముదమంది పావనిసుతకు ♦ నపుడుదా పనముబెరుకుట లాదిగాగ ♦ యున్న తెరగున నంతయు విన్నవించి ♦ పోయివచ్చెదననిపల్కి భూద్రచరుడు॥

వ॥ అవనినందనచేత ననుజ్ఞాతుండై యొక్క భూధరంబెక్కి యుత్తరాభిముఖుండై వినువీధికెగసి రోదసీకుహరంబునిండ సింహనాదంబు సేయుచు బోవుచుండె నప్పటియట్ల మైనాకంబు నూరటగావింప నెదురేగుడు నయ్యద్రివరు నాదరించి కేలనంటియా మంత్రణంబుజేసి తొంటివిధంబున జనుచుండె నంత నక్కడ ॥

ఉ॥ అంగదముఖ్యవానర చయంబురయంబున మింటనట్టులు । ప్పొంగుచు

వచ్చువాయుసుతు భూరితరాద్భుత సింహనాదమున్ ♦ చంగటనాలకించి తమచెంతన నుండెడు నద్రులున్ మహా । తుంగమహీజముల్ జవముతోడుత నొక్కడ నెక్కి- చూచుడున్ ॥

వ॥ వారలకు జాంబవంతుండిట్లనియె ॥

క॥ పావనిజనకజ బొడగని ♦ తావచ్చెంబోయినదిని తలపగనత డా ♦ దేవిని జూడకయుండిన ♦ నీవిధమున సింహనాద మేటికిసేయున్ ॥

వ॥ అని తమలోభాషించు నవసరంబున ॥

సీ॥ అంగదాదివనాటు లాత్మలనుప్పొంగి కరమధిాననొండొరు కౌగలింప ♦ నతులిత్రోన్నత మహేంద్రాచల శృంగంబు గృంగితుత్తుమురయ్యి నింగికెగయ ♦ తనుకాంతి పద్మమిత్రునికాంతి భాతిని పరగిదిక్కులయందు ప్రజ్వరిల్లగ ♦ నబ్బురపాటుతో ననిమిషుల్ తనశౌర్య మంగనాయుక్తులై యభినుతింప ♦ సాంద్రతరమోదమున వానరేంద్రుడు దధి ♦ గడచివాలంబుద్రిప్పుచు పుడమిరేని ♦ యడుగులెప్పుడు గనుగొందు ననుతలంపు ♦ మెండుకోనివచ్చినిల్చె నాకొండమీద ॥

వ॥ ఇవ్విధంబున సౌభాగ్య సాంద్రంబగు సమ్మహేంద్రాచలంబుమీద నిలచి వాలితనయ జాంబవంతులకు మ్రొక్కి తక్కిన బలీముఖుల నుచితగతుల సంభావించి చారుగుణ సంఘాతయగు సీతంజూచితిననవుండఖిల వానరులాత్మల నుప్పొంగి యార్పులు నింగిచలంగ ప్రమోదాకృత్త చిత్తులైరి యంగదుండా మారుతి నాలింగనంబు జేసె యంత నందరు నొక్క విపులశిలాతలంబున గూర్చున్న యవసరంబున జాంబవంతుండు హనుమంతునకిట్లనియె ॥

చ॥ వననిధియట్లుదాటితివి వాసవశాత్రవవర్యు ప్రోలికే♦ యనువునసేగి తద్వ వని జాసతినేక్రియగంటీ సీత యే♦ మనియెను నీవుగ్రమ్మర సురారి సమూహములన్ మొరఁగి వచ్చిన విధమెట్లులింతయును జెప్పరమాకు నెరుంగబల్కవే ॥

క॥ అనుడు పవమాననూనుడు । తనలోన ప్రమోదమంది తద్దయుతానా । వననిధిగడచుట లాదిగ । పనివడివారలకు తేటపడ వినుపించెన్ ॥

వ॥ ఇవ్విధంబున నెరింగించిన యతనియద్భుతశౌర్యంబున కచ్చెరువంది బహుభంగుల నగ్గించి మనమింక తడయనేల రామచంద్రుని యొద్దకు పోవుదమని యంగద ప్రముఖబలీముఖులు వాయునందన పురస్సరంబుగా నచ్చోటువాసి వచ్చి పరమాను -రాగంబున ॥

క॥ దధిముఖపాలితమగు నా । మధువన ముద్ధతినిజొచ్చి మదకరులట్లుం । గు

ధరచర నికరములు బహు । విధముల చిత్రాజ్ఞములను వేడుకలలరన్ ॥

సీ॥ గొనకొని తేనియల్ గ్రోలుచుసోలుచు నిద్దురబోవుచు నిక్కిలేచు । చను దోకలెత్తి చూచుచు వీకనార్చుచు గునియుచు బారుచు కూకలిడుచు । క్షోణీరుహంబు లెక్కుచు నేలకురుకుచు గ్రమ్మరబ్రాకుచు గంతులిడుచు । నాడుచు బాడుచు నట్టిట్టు దిరుగుచు వెక్కిరించుచు కికకికననగుచు । నొకనిపై నొక్కడలుగుచు నొకనిమీద । నొకనిద్రోయుచు వేరొక డొకనిచేతి । ఫలములుగొవడిమెసగి చప్పటలుగొడుచు । విశ్రమించిరి యాకపిప్రకరులిట్లు ॥

చ॥ ఒకధరణీజమెక్కి నొక డొయ్యనపండులు దించునుండగా । నొకడదిజూచి యొడకర యొద్ధతివాని బడంగద్రోచి దా । పక పక నవ్వడాతని పైబడునంత నెయొక్కడందు వ । చ్చి కలహమేలయంచు తన చేతిఫలంబు లొసంగువానికిన్ ॥

క॥ కొనగొమ్మపైన నొక్కడు । పనివడి పండులుదినంగ పైకొనియొక డా । వనచరుడెక్కిన వృక్షము । గొనకొని కదలించువాడు కూతలిడంగన్ ॥

చ॥ చవిగలపండులంచు నొక శైలచరుం డొకకోతికియ్యగా । నవియొకకీశుడుం గొని రయంబునబారగ నొక్కవానర । ప్రవరుడు వానిగూడజని బల్మినిగైకొనవాని గాంచి యొ । క్క వనచరుండుబుచ్చుకొని గ్రక్కున నొక్కనికిచ్చు నవ్వుచున్ ॥

వ॥ ఇవ్విధంబున ॥

చ॥ మధురఫలంబులం దినుచు మాటికి తేనియ లొలిగ్రోలుచున్ । మధుపము లట్ల మ్రోయుచు గ్రమంబున నెక్కడజూడ తారయై । మధువనమంతయున్ ఘటిక మాత్రములోపల గాసిజేసి యా । కుధరచరుల్ మనంబునను గొంకకనాడుచు బాడుచుండగాన్ ॥

వ॥ వనపాలకు లధికరయంబున దధిముఖు డున్నయెడకుం బోయి వానితో నత్తెరంగు జెప్పిన నతండు ॥

క॥ వారలనందర ద్రుంచెద । వారకనిదె చూడుడనుచు వారుండానున్ । భూరి శిలాతరు సాధను । లై రయమున కపులగాంచి యపుడిట్లనియెన్ ॥

చ॥ నలినహితప్రియాత్మజు వనంబుగదాయని మీమనంబులో । దలపకనించు కేనియును తల్లడమందక బెట్టుగ్రొవ్వి వి । చ్చల విడిగాసిజేసితిరి ఛండపరాక్రమ మొప్పమిమ్ములన్ । పనివడిద్రుంతునంచు జని పైబడినందరి మోదనయ్యడన్ ॥

గీ॥ అనిలసూనుండు వానిపై నలుకవొడమి । యురగనాతనికంటె మున్నంగ దుండు । దధిముఖునిమీదగవసి యుద్దండవృత్తి । మోముమోకాళ్లు నేలతో బ్రామి విడసె ?

వ॥ ఇవ్విధంబున వానిచే నవమానితుండై యాదధిముఖుం డనుచరులం గూడు
కొని రామచంద్రునిం గొలచియున్న సుగ్రీవుపాలికింజని మొ్రక్కిన నభయంబొసంగి
యినజుండు మాతులామనంబునం దలంకక నిన్నిట్లు గలంచిన వాడెవ్వ డెరింగింపు
మాక్రూరాత్ముని తీవ్రదండంబున దండింతు ననుండు వాడిట్లనియె నయ్యా యంగదాంజ
నేయ ప్రముఖులగు బలీముఖులు మన మధువనంబుసొచ్చి యఖిల వృక్షంబులు గాసి
సేయం గనుంగొనియేను మీయాన బెట్టినం గినిసి యుప్పాటంజేసిరనవుం డతం డత్తైరం
గంతరంగంబున నెరింగి ముఖంబునం దెలివిదోప నందసువిన నిట్లనియె ॥

సీ॥ పావనిరామ భూపాలునిదేవిని గనబోలునతనికి గాక తక్కి । నట్టివారికి తర
మానె యీపనిబూని కావింప మూడులోకముల యందు । నూహింపనాఘనుం డుర్వి
జంగానక మరలివచ్చిననేల మధువనంబు । గాసియొనర్తు రంగదముఖ్య వానరుల్ వన
పాలకులసేల జనకజాతు । రవనినందనబాడగని యరుగుదెంచి । నట్టి కౌతూహలం
బున నవ్వనాట । శేఖరులకేమి జేసిన ఛల్లుననుడు । ముదమునొందిరి రఘుకుల ముఖ్యు
లంత ॥

వ॥ బలీముఖ పుంగవులప్పుడ హనుమత్పురస్సరంబుగా కదలి ॥

చ॥ తరువులు భూమిపై నొరగ దార్కొనితొ్రయుచు నద్రిశృంగముల్ । విరు
గగ దాటుచున్నగుచు నిక్కుచుదిక్కులు వ్రియ్యనార్చుచుం బరువడి మేఘముల్
చెదరి పారగవాలము లెత్తి త్రిప్పుచుం । తరుచరులేగుదేర వసుధావరుతో రవినూతి
యిట్లనెం ॥

క॥ నరవర చింతయొనర్పకు । ధరణీసుతగాంచిముదము దళుకొత్తంగా । గిరి
చరులు వచ్చిరదిగో । యురుగతినియుటంచు బల్కు చున్నట్టియెడం

క॥ అంగదముఖశాఖామృగ । పుంగవులరుదెంచి రామ భూవరునకు శో ।
ఖాంగుడగులక్ష్మణునకు ప । తంగతనూజునకు మొ్రక్కి తగవ రంతం ॥

వ॥ మహాబలనందను పురస్కరించుకొని యున్న యవసరంబున సకల వాన
రాను మతంబున నయ్యనిలనందనుండు రామచంద్రునితో నిట్లనియె ॥

క॥ భూమిజను చూచివచ్చితి । నేమంబున నున్నదరయ చిత్తములోనం ।
వేమరువగలం బొగలున । దేమనిచెప్పుకును పద్మహితకుల తిలకా ॥

మ॥ శరణాత్మేశ్వరయంచు రాఘవ మహీశాయంచు నోరామ భూ । వర
యంచుం కరుణాంబుధీయనుచు దేవస్తుత్య యంచుం మహా । తురతందైత్యుల బారి
జిక్కువడి మీతోలోకమై యున్నదా । ధరణీనందన రేయుసుంబగలు నాత్మంగుందు

చుఁ రాఘవా ॥

క॥ దినరాజవిరహితంబగు । వనరుహమట్టులను దివిజవల్లభునెడ బా । సిన యాపులోమజగతి । యనిశము జింతింపుచున్న దవనిజయధిపా ॥

క॥ మదిలో మీపదభక్తియు । వదలదు నొక్కప్పుడేని వగయుడుగదు దా । నిదురయురుంగదు జానకి । యదవదనెవ్వరితో ముచ్చటాడదు సుమ్మీ ॥

క॥ సురపతిబంధులు మిగులన్ । దురితాత్ములటంచు భయముదోట్టునయపుడా ధరణీసంభవ మదిలో । నరనాయక తన్నుదాన నమ్మకయుండున్ ॥

క॥ దేవా దేవరపంపున । నావననిధిదాటి రాక్షసాధిపు పురము । న్వేవేగ జొచ్చి సీతా । దేవిని వెదకంగబూని ధృఢగతితోడన్ ॥

వ॥ నిశిసమయంబున లంకానగరంబు సొత్తెంచి దశకంఠాది నిశాచరుల మందిరంబులను తక్కినచోట్ల వెతకి వెతకి యందును జనకనందనం గానక యొక్కింత చింతించి మీయుదర నందనా రామంబునుంబోలె నయనాభిరామంబై కనుపట్టు దనుజాధీశుని యుద్యాన వనంబగు నశోకవనంబుసొచ్చి యందు నఖిలదిక్కులం బరికించి యొక పాదపంబుక్రింద మోదరహితయై కూర్చున్న సీతాదేవింజూచి ముదావహుండనై సాష్టాంగ దండప్రణామంబు గావించి మీగుణకథలు కొన్ని విన్నవించి నారాక ఎరింగించిన విశ్వంభరాత్మజ విశ్వసింపకయున్న మనంబున భయంబుజెంది క్రమ్మరవినమిత శిరస్కుండనై మీరూపురేఖలు చెప్పి నన్నుంబని పంపునప్పుడు నాచేతికి మీరలొసంగిన యంగుళిముద్రిక యొయ్యన నయ్యవ్వచేతికిచ్చినం గన్నులనద్దికొని తన బాములన్నియుం జెప్పి యిట్లనియె ।

ఉ॥ తానుదయాపయోంబుధి సుధాకరుడంచు దలంచియేకదా । భూనుతుడైన మాజనక భూపతి రామునకున్ ప్రియంబుగా । మానుగనన్నొసంగె పవమాన తనూభవ యట్టినాయడన్ । భానుకులావతంసుడు కృపారహితుండగుటేమి చిత్రమో ॥

క॥ తనయంతటి శౌర్యోన్నతు । వనితామణి యొక్క యసుర వంచించినచో । కినియకనుండుట తగునే । యనిచెప్పుము శాంతమిట నసహ్యంబనుమీ ।

వ॥ అనిపలికి పవననందనా నిశాచరులలోన నుండుటకు గడిందియై యున్నయది యెవ్విధంబుననైన రామచంద్రుని వేగంబ నిచటికిం గొనితెమ్ము నీకు సేమంబయ్యెడు పోయిరమ్మని దీవించి తనకొంగున పదిలంబుగ ముడియంగట్టిన నవరత్నంబగు శిరోరత్నంబు ప్రయత్న పూర్వకంబున మీకు నానవాలుగా నిమ్మని నాచేతికిచ్చినం దెచ్చితివాడ నిదియే యవధరింప వలయునని కపిరత్నం బారఘురత్నంబు

చే కందిచ్చిన ॥

ఉ॥ ఆనరవాయకుం డదిరయంబున నక్కనజేర్చి యయ్యెడన్ । మానుష కృత్యముల్ జరిపి మానసపీడు దలంచినిక్కమే । జానకికై పగంబొగులు చందము గైకొని పెక్కుభంగులం । వానరులెల్లగుంద తలవాంచిమహావ్యధ జెందెవారకన్ ॥

వ॥ పెద్దతడవు వేడబంబు సలిపి యప్పవమానశూను నుద్దేశించి యిట్లనియె ॥

చ॥ అనఘచరిత్రనన్ను వసుధాత్మజ తానెడబాయదెన్నడున్ । వినవిదిబోద్య మయ్యెడిని నీవ్రసురారి పురంబులోన నే। యనువునజూచి వచ్చితివి యత్తెరగంతయు యేర్పరింపుమీ । జనకజగాక వేరు యొక జానకియున్నదిరో తలంపగన్ ॥

క॥ కరమనురక్తినినా డ । గ్గరయున్నది జనకతనయ కనుగొనుమిదె యా । తరుణీమణి చూడామణి । గిరిచరవర యనుచుబలికి క్షితిపతిమరియున్ ॥

క॥ కలలోనెన్నడు బాయని । జలజాననయట్లు రాత్రిచరభామల లో । పల యున్నదిరో విరహా । నలమున గ్రాగుచును వాయు నందనయచటన్ ॥

గీ॥ ధరణీసుతనుబాసి తనువున ప్రాణముల్ । నిలుపుటలుగడింది నిజముగాన । నన్ను జనకతనయయున్న చోటికిగొని । చనియవస్థమాన్పు వనచరేంద్ర ॥

వ॥ అని పెక్కుతెరంగుల విలపించి యినవంద నానిలనందను లూరార్చ యట్ట కేలకుం దేరి యాభూరమణుండు సామీరికిట్లనియె ॥

క॥ అనిలజ జనకజనేక్రియ । కనుగొంటివి వనధియట్లు గడచితి దనుజే । శుని పురములోనజొచ్చితి । వినవలతుం దెలియబలుకు విశదముగాగన్ ॥

మ॥ అనుచావాయు తనూభవుం డకట మోదాయత్తచే తస్కుడై । వనజాప్తాన్వయ భర్తతోడుతను శేవందానునంబోధి దా । టినవృత్తాంతము దైత్యులందునిమి వాడింబోనిశౌర్యంబుతో । దనుజాధీశుపురంబు గాల్చుటయు సీతంజూచి తావచ్చుటల్

వ॥ సవిస్తరంబుగా వినుపించెనని శివుండు భవానికింజెప్పెనన్న సూతుండు శౌనకాదులకుం జెప్పినవిని తరువాతి వృత్తాంతం బెరిఁగింపుమనుటయు ॥

మ॥ రతిరాజప్రతిమాన సుందరల నత్ప్రజ్ఞోరగాధీశ్వ రా । చ్చతురోదార గుణ పరిపూర్ణ శృతి యుక్తాచార యేకాదశీ । వ్రతకుక్మాంగద లోకపూజ్య శనివార న్నేమ సంస్థాన సూ । నృతవాక్యాదిమ చక్రవర్తిరిపు దంతిశ్రేణి కంఠీరవా ॥

క॥ అనుపమసద్గుణ సంఘా । ఘనపావ తమఃపతంగ గంభీరసుధా । వనరాశి నంతతాశ్రిత । జనకల్పమహీజకుజన శైలబిడౌజా ॥

స్వాగత ॥ శ్రీకిడాంబికుల శేఖర పుణ్యా । శ్లోకకీర్తి పరిశోభితభక్తా । నీకపోషణవినిర్మల చిత్తా । బ్రాకృపాంబునిధి బంధురపుణ్యా ॥

గద్య ॥ ఇది శ్రీభవానీద్రి రామభద్రి వరప్రసాద లబ్ధకవితావిచిత్రి గిరుమ నామాత్య పుత్రి గౌతమగోత్రి ప్రసిద్ధ సిద్ధనమంత్రి ప్రణీతంబైన శ్రీసదాశివ రామాయణం బను మహాకావ్యంబునందు హనుమంతుండు మకరాలయంబు గడచుతరివార్థి పంపున మైనాకుండు మారుతికడ కరుగుదెంచుటయు ఆంజనేయ సురసాఖ్యల యుద్ధంబును బ్రహ్మలోక గమనంబును రఘువరుండు పవనసుతునకు చతురానన పదవి కృప నేయుటయు సముద్రోల్లంఘనంబును లంకాప్రవేశంబును సీతాన్వేషణంబును సీతా దర్శనంబును త్రిజటా స్వప్న వృత్తాంతంబును వనభంగంబును అక్షకాది నిశాటుల వధయును హనుమదింద్రజిత్తుల ప్రతాపంబును రావణిచేత పావనిపట్టుబడుటయు రావణ దర్శనంబును బంధమోక్షణంబును లంకాదహనంబును వాయుసూనుండు కడలిగడచి మరలివచ్చుటయు కపుల సంభ్రమంబును అంగదప్రముఖ వానరులు మధువనంబు సొచ్చుటయు రామచంద్ర దర్శనంబును పవమానసూనుండు రామలక్ష్మణులకు సీతా వృత్తాంతంబు జెప్పుటయు ననుకథలంగల సుందరాకాండ సర్వంబు నేకాశ్వాసము. శ్రీరామార్పణమస్తు సర్వమంగళా వాప్తిరస్తు సర్వశోభనమస్తు సమస్త ది గ్వి జ యా భవంతు ॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ

♦ శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః ♦

# యుద్ధకాండ ప్రారంభము

శ్రీ నారాయణ పద సే ♦ నానూనాసక్త నదమలాంఛితహృద యు ♦ జ్ఞానీవ్ర పూర్ణసిద్ధి సి ♦ త్యానందకిడాంబి వేంకటాచార్యవర ॥

వ॥ విన నవధరింపుము సూతుండు శౌనకాదుల కిట్లనియె నట్లు మహేశ్వరుండు హిమవన్నగ రాజనందనం గనుంగొని ॥

చ॥ పవనతనూజుడట్లు మురిపంబుమనంబున నందడింపగా ♦ నవనిజవార్త జెప్ప టయు నాత్మనుమోద ఏపాదమెంతయున్ ♦ దవిలి రఘూద్వహుండపుడు తానొక మానవుభంగి నాకపి ♦ ప్రవరునితోడనిట్టులని పల్కెనువానర పంక్తులున్వినన్ ॥

చ॥ అరయమహాత్ము డెవ్వరికి నాసయొనర్పక నేయుకార్యమున్ ♦ పరువడి మద్యముండొక ప్రాపునజేయుచు నుండుహీను డే ♦ తెరగుననేయ దొద్దియు మదిం దలపోసిన నిన్నుబోల్ప నీ ♦ ధరణినిలేరు శూరులిది తథ్యమునీకును నీవెసాటనీ ॥

శా॥ వ్యాళారాతికి నగ్నిమిత్రునకు శేవన్నీవునుందక్క నీ ♦ లీలన్ తోయధి దాటనెవ్వరికి తొల్లింజెల్ల దింకొక్కటిం ♦ భూలోకంబున నంబుజాసనుడు దాబొల్పెంద మాబోటి భూ ♦ పాలానీకమ్ము బ్రోవుమంచునిను శుంభల్లీల బుట్టించెజా ॥

క॥ ఆ దేనికడలిదాటి స ♦ మాదరమున సీతగాంచి యసురేశునితో ♦ వాదంబు జేసి మరలన్ ♦ రాదొరయునె పవనపుత్ర రమ్యచరిత్రా ॥

చ॥ అనుజుడయేను నాయనుజ యాధరణీసుతకై నితాంతమున్ ♦ మనమున బిట్టుగుందుచు హిమంబును నెండకునోర్చి ధాత్రిపై ♦ మనుట కసూయచేమెలగు మమ్ముననీకృప నుద్ధరించి పా ♦ వనమగు నస్మదన్వయము వర్ధిల జేసితివేమి జెప్పగాన్

చ॥ కపికులవర్య యిట్టి యుపకారమొనర్చితి విందుకెట్లు ప్ర ♦ త్యుపకృతి నేయగా గలుగు నో హృదయంబున నించుకేని యే ♦ నుపడదటంచు నారఘువరుండు మహాబలసూతి నాత్మలో ♦ నపరిమితాను మోదమగు నట్టుల కౌంగిటజేర్చె పేర్మితోన్

గీ॥ అంతరఘుభర్త మారుతి నట్లుగార ♦ వించి జనకతనూజదలంచి మదిని ♦ వంతనొందంగ గన్గొని వారిజాప్త ♦ నందనుండిట్టులనియె నానందముగను ॥

క॥ ఆర్యమవంశోద్భవ మన ♦ కార్యంబూహించి కడలి గడచి విరోధిన్ ♦ శౌర్యస్ఫూర్తి జయింపుమ ♦ ధైర్యమువలదింక నొకటి తగనెరిగింతున్ ॥

తరల ॥ మనుజవర్యుడు ధైర్యమూనుచు మందబుద్ధి జెరింప భూ ♦ జనములెల్లెడ నిర్భయంబున సంచరింతురు వైరుల ♦ ప్వనములియ్యరు చుల్కజూతురు బంధు వర్గము నిశ్చయం ♦ బనఘ కావున నిట్టివృత్తి యొకప్పుడేనియు జెందకే ॥

ఉ॥ కొట్టెద నెట్టి శాత్రవుల గుండెలు వ్రయ్యలు గాగ జేతులం ♦ బట్టెద నగ్నినైన సురపంక్తి నుతింపగ రావణాసురుం ♦ గట్టిగ ద్రుంచివచ్చెద ననంతబలోద్ధతి మాట మాత్రిలో ♦ నెట్టన వార్ధిదాటి బహునేర్పుల దెచ్చెదనిప్డు జానకిన్ ॥

ఉ॥ మిత్రికు లేశమేనిదె నిమిత్తములెన్నియు నేనిగంటి మూ ♦ ర్తిత్రయ మడ్డమైనను ధరిత్రినిడాగిన మిన్ను బ్రాకినన్ ♦ శాత్రవసంచయంబు పటుశౌర్యము బేర్మిని సహ్మరించి భూ ♦ పుత్రిని దోడితెచ్చెదవు భోరున తథ్యము నాదువాక్యముల్ ॥

వ॥ కావున ।

క॥ లంకపయి జనుదమురువడి ♦ మింకిటజాగేలయనిన నినవంశజుడా ♦ పంకజమిత్రసుతుంగర ♦ పంకజమున నివిరిపల్కె పరమప్రీతిన్ ॥

గీ॥ సూర్యతనయ యెల్లి శుభదినంబరునుండు ♦ పూర్వశిఖరిమీద బొల్చువేళ ♦ శైలచరులగూడి చనుదము పరగసై ♦ నని రఘూద్వహుండు నంతనచట ॥

వ॥ నారేయింగడపి మరునాడరుణోదయంబున కాలోచిత కృత్యంబులు నిర్వర్తించి గమనోన్ముఖుండై ।

సీ॥ అంగనవినుము దాననిలజారూఢుడై యంగదునెక్కె నిజానుజన్ము ♦ గరుణనియోగించి గవయగవాక్షులు బలములముందర ప్రోక్షినేగ ♦ వలనొప్పఋషభుండు వలపలికెలవున డాపలగంధమాదనుడు నడువ ♦ భల్లుకేశసుషేణ భాస్కరనందను లగ్రభాగంబున నసలిమైందు ♦ లాదిగాగగల్లు నగచరుల్ కొందరు ♦ గలయదిక్కులందు బలసికొలువ ♦ నఖిలసేనగూడి యవనితనూభవుల్ ♦ కడగిలంకదిక్కు నడచుతరిని ॥

ఉ॥ దిక్కరిపంక్తి మ్రొగ్గరిలె దీనదశన్ మధుకైటభారికిన్ ♦ మ్రొక్కెనహీశ్వరుండవని మోవగలేనని యాదికూర్మమిం ♦ కెక్కడబోదునంచు దిశలెల్లగనుంగొనె రామునేనల ♦ ట్లొక్కటగూడి యేగు భరమోపక భూమి దలంకెనెంతయున్ ॥

వ॥ అంత ।

క॥ ముంగలనొక కొందరు కపి ♦ పుంగవులేగంగ నఖిల భూరుహపంక్తుల్ ♦ గృంగుచుతుత్తుమురై ధా ♦ త్రింగలసితదియ్యె ధూళి తెరగొప్పారెన్ ।

క॥ సేతువుగట్టకమున్నే ♦ సీతేశునిహితవుగూర్చి క్షితితో సమముం ♦ జేతునిదె సాగరంబను ♦ భాతినిజనె వనగజడధి పైపడినరిగెన్ ॥

చ॥ ధరణిజనిట్టులన్ మొరగి దానవనాథుడు దుర్మదంబునన్ ♦ జెరగొనిపోవ గానరకు సేయకనంచు మదిందలంచు భా ♦ స్కరకుల భర్త రోషము జగంబుననిండుచు సాంధ్యరాగమై ♦ పరగనొకో యనంగ కనుపట్టెనువానరు లేగుచందముల్ ॥

వ॥ ఇట్లరుగుచు నవ్వానరులు మార్గంబున ॥

ఉ॥ పమ్మినవేడ్క తోడను నభంబునకేగి పదాంగుళంబులన్ ♦ జిమ్మచురద్రి శృంగములు జెచ్చెరహోత్థిత మీరపాంత భూ ♦ జమ్ములతో జెన గుదురు చారుల కాంతగళుచను ల్నఖా♦ గ్రిమ్ములద్రుంచి వైతురధి కమ్ముగ నేతురు సిమ్మగర్జనల్ ॥

క॥ గండకుధరములు పుష్పల ♦ చండులగతి కొందరెగర జిమ్మిన నవివే ♦ రొండొకకొందరు పటు దో ♦ ర్దండత మీరంగ కేల్ల దాల్తురులీలన్ ॥

క॥ దండిమగడొకడు రయమున ♦ పండిన భూజములు పెరికిపండులు దినుచో♦ నొండొకడు వెండగొమ్మని ♦ మెండుగనవిమ్రింగివేళ్లు మీదుగజూపున్ ॥

ఉ॥ యేపుననొక్కరుం డొకని నెక్కునువేరొకరుండు నొక్కనిం ♦ పైపడ ద్రోచు నొక్కరుడు పండ్లిగిలించు నొకండునవ్వినం ♦ గోపము జేయు నొక్కరుడు కూరిమితోడుత బాహుయుగ్మమున్ ♦ జూపిమరొక్కరుండొకని సొంపునకౌగిట జేర్చు నవ్వుచున్ ॥

గీ॥ ఇటుల తమజాతిచేష్టల నెల్లగపులు ♦ తోడనరుదేరగా వరితోషమునను ♦ గండశైలంబులతృలు కాననములు ♦ నేరుపునదాటి యొక్కింత దూరమునను ॥

మహాస్రగ్ధర ॥ కరమర్థింగాంచిరి రాఘవులుతిమిర్ఘష గ్రాహపాఠీన దర్వీ♦ కర ప్రోత్తుశృంగి జంబూకధులిమకర సంఘాతసంచారమున్ వి ♦ స్ఫురితాతిస్నిగ్ధ ఫేనంబును సకలసరిత్పూర్ణ గాంభీర్యశుంభ ♦ ద్వర రంగోత్తుంగభంగోజ్వల ఘనరవ సాంద్రంబు సంద్రంబునంతన్ ॥

గీ॥ కనితదియ్యమహిమ గొనియాడుచును వేగ♦డాయనరిగియఖిల తరుల తాంత♦ కుంజపుంజములను రంజిల్లువేలావ ♦ నమ్ములోనదిరిగి వయమెలర్ప ॥

వ॥ అంత నక్కడ ॥

ఉ॥ రావణదైత్యుడప్పు రఘురామునివార్తలు వేగువారిచే ♦ తావినిజానికిన్ ప్రతి విధంబెటులంచు విచారయుక్తుడై ♦ భావమునందుసారెకు నుపాయములారసి చూచిచూచియుం పావనిచేతమున్ బడిన బన్నములెల్లదలంచి గ్రిన్ననన్ ॥

వ॥ ఆస్థానంబెల్ల కలయంగనుగొని ॥

చ॥ వననిధిదాటియొక్క కపివర్యుడునాడల భూమినందనం ♦ గనివనమంతయున్

బెరికి కావలివారల నుక్కడంచి పో ♦ రను నలయక్షకుందునిమి గ్రన్నన నీపురమెల్ల
వాయు మి ♦ త్రునకు నొసఁగిపోయెపుడు తోడుకవచ్చినవాడు రాఘవున్ ॥

వ॥ అతండిప్పుడు యనేక వానరసేనా సమన్వితుండై వేలావనంబున విడిసి
యున్న వాడెవ్విధంబునసైన కడలిగడచి యిందులకు నేతేరగలవాడు కావున వాన
మతని జయించునట్టి మార్గంబూహించుండని పల్కి వెండియు ॥

క॥ జనసమ్మత ముత్తమమగు ♦ ననయంబును బహువిచార మదిమధ్యమమై ♦
చనుగూడదనగ జేసిన ♦ పనియధమంబండ్రు నీతి పల్కెడువారల్ ॥

క॥ కావున నందరుమంత్రులు ♦ భావంబుననిశ్చయించి పల్కుడు తెలియం ♦
గావాధిగడవకట మును ♦ పేదీ పగవారిగెలువ నెమ్మగుమనకున్ ॥

మ॥ అనుడాకొల్వున గల్గుదైత్యవరు లుద్యత్క్రోధదీప్తాస్య సం ♦ జనితోగ్ర
స్ఫుటి విస్ఫులింగములు దృగ్జాలంబులం దెల్పగా ఘనశౌర్యోద్ధతి ఖడ్గరోచులు సభం
గస్పట్టవేద్రిప్పుచున్ ♦ దనుపుల్ కెంచుచు నప్పుడిట్లనిరి సుత్రామారాతితో నొక్కటన్ ॥

మ॥ పురుహూతాది సురాలిగెల్చితివి శంభున్ మెచ్చగాజేసి యు ♦ ద్ధరతన్
రాక్ష మహీంధ్రమెత్తితివి తోడ్తోవేగ మాకిన్న రేశ్వరునాలంబున దోలిపుష్పకము
కేవన్ బుచ్చుకొన్నట్టి నీ ♦ కరయన్మాడు జగంబులందుల నశక్యంబున్నదే రావణా ॥

చ॥ భయమునబోరగా వెరచి పారిదివౌకసు లెల్లవెట్టికిన్ ♦ మయికొనిరోడి
నాగపతి మానకసీకరణంబుసొచ్చె నా ♦ మయుడుతనూజనిచ్చి బహుమానముగాం చె
సు రారులెల్ల నీ ♦ దయనుదరించి రిందరితో దాశరథెవ్వరిబోలు చెప్పుమా ॥

చ॥ అనిమిషపూర్వదేవ నివహంబులనాహవ భూమిజేకిం ♦ గొనడాకయించు
కేనియు నకుంఠిత విక్రమశాలి యంబుజా ♦ సన వినుతప్రభావుడ నహాయుడనూన
బలాఢ్యుడారయన్ ♦ ఘనుడుసురేంద్రజిత్తు గలుగంగనునింకిట చింతయేటికిన్ ॥

క॥ ఉరగాధీశుని దంష్ట్రలు ♦ పెరుకుదుమోదండధరుని పీచమణతుమో ♦ ధర
గృంగజుతుమో యం ♦ బరమేమిగ్రింగుదుమొ తెలియబలుకు జితారీ ॥

క॥ దనుజులకాహారంబగు ♦ మనుజులు వనచరులగూడి మగటిమినెరపం ♦ బని
బూనివచ్చిరనగా ♦ వినదిచోద్యంబుగాదె విబుధారాతీ ॥

వ॥ అనుసమయంబున ప్రహస్తుండను వాడిట్లనియె ॥

ఉ॥ తేరులుగుర్రముల్ కడుమదించినయేనుగు లుగ్రశౌర్య గం ♦ భీరతనొప్పు
నట్టి భటబృందములాయుధ పుంజముల్నిజం ♦ బారయగల్గునీకడ నిరాయుధహస్తులునా
గోత్రతులెంతయా ♦ వారధిబోలునే యసుర వల్లభతక్కిన యేరులన్నియున్ ॥

చ॥ అదియటులుండనిమ్ము త్రిదశాసురకోటుల రైనబోరని ♦ న్నదురనశక్తులమ్మనుజులెంత దశాస్యవనాటుడట్లు దు♦మ్మదమున లంకగాల్చుటలు మావలనంగల తప్పునిక్క మా ♦ నదియెట్టులన్న నేము మునుపేమరియుండితి మంచుబల్కినన్ ॥

[illegible] డిట్లనియె ॥

ఉ॥ అంబుధిలోన డాగిన రయంబున ధాత్రియణంగినన్ మహీం ♦ దంబుల క్రిందదూరిన విధాతృని జేరిన నొక్కపెట్టుగా ♦ నంబరవీధి బ్రాకిన మహాటవిజొచ్చిన పోవనీక శీ ♦ ఘ్రంబున నవ్వనాటుని కరంబులధ్వంచెద నంపునన్నగిన్ ॥

వ॥ అని యనేకు లనేకవిధంబుల గబ్బిగూడి కైదువలు త్రిప్పుచు నిప్పుడేచని యానర వానరులంబరిమార్చి వచ్చెదమని పలుకుచున్న యట్టికేలకు విభీషణుం డిట్లనియె ॥

ఉ॥ ఆవసుధేశుకాంతను రయంబున నీతడుదెచ్చునాడె యు♦ యోగ్యవిహితంబు గాదనక నూరకయుండితి రిప్పుడైన నీ ♦ రావణుకంటెమున్న సమరంబున కేగెదరెంత శూరులో ♦ మీవలె శౌర్యసంపదల మీరినవీరుడు గాడెయాతడున్ ॥

ఉ। ఊరకపర్ణశాలకడ నుండగ వారలకగ్గొనర్చ దు♦ శ్చారిణియైన శూర్పనఖ సద్విధిఖండన గాంచె దానికై ♦ పోరఖరుండుగూలె నదిబుద్ధిదలంపక పోరిలుచుందురీ♦ నేరమివారిదో మనదొ నిక్కముగా బరికించిచూడుడా ॥

క॥ ఆదాశరథులె మున్నే ♦ వాదంబొనరింపగదలి వచ్చిరె మనపై ♦ వైదేహి నితడుదెచ్చిన ♦ గాదే మనతప్పుభూమి కాంతునిపాత్రే ॥

ఉ॥ పాడియునీతియుందెలియ బల్కిన మేలగుగాక మీకు మె ♦ మోడక రజ్జులాడుటడి యొప్పునె యింతటిశూరులయ్యు యా ♦ నాడు మరుత్తనూజుడు జనంబు పురంబు దహించువేళ మీ ♦ రీడనెయుంటిరో మఱియునెక్కడికేనియు పోయి యుంటిరో ॥

క॥ పోడిచదమను వంతటిలో ♦ బడ్డరేమీ చేతరిపులు పదరులుగా ♦ కెక్కడి మాటమీరలే నా ♦ ఘడమీశునితోడ నెదిరిపోరెదువారల్ ॥

చ॥ అనుపమశౌర్యధుర్యుడగు వాపవనాత్మజునంతవాడు భూ । వునిభటులందు నెవ్వరినిబోలడు పోరెడిచోననంగనే ♦ మనగలదింకవారి విధమట్టి బలాధ్యులకెల్ల నేలికై ♦ పనిగొను రామభూవరుని బాహుపరాక్రమ మెన్నశక్యమె ॥

క॥ వినుడీదశకంఠునితో ♦ ననుమానము లేక పలికినట్లగునే యా ♦ వనచరుల ముష్టిఘాతల । తనువులు బగిలించువేళ దానవులారా ॥

వ॥ అని మరియును ॥

చ॥ సరవినిమూడుపాయముల చిక్కకిరాక కడంగి రేనియుః ♦ మరిగద విక్రమంబదియు మత్తుడునై చరియించెనేనియుః ♦ వరియుష్టునటిత్రైల బలదర్పమెలర్పగ జోలుపోలదే ♦ వరుసనుజూడనండ్ర బలవంతునితో ద్విభనీతిశ్రే పిటిరాక్ష కావున వాన

ఉ॥ కావున నప్రమత్తుడు నఖండ పరాక్రముడైన యారఘు ♦ త్స్మావరుతోడ బోరగ నశక్యము పంకజసంభవాది దేవావలికైన నాఘనుడ వార్యబలాఢ్యుడ జేయుడంచు నీ ♦ భావమునందలంపుము శుభంబగు జానకినిచ్చి పుచ్చవే ॥

చ॥ అయుతములైన కర్యములయందులయేసడి సన్నయెట్టి దుర్జయుడను నాకుమర్త్యులెదురాయనిచూడకు మెట్టివారికే ♦ నియు నవసత్యమేలయను నిక్కముగా పరికింపధర్మమే ♦ జయమనునట్టి వాక్యము నిశాచరనాథ మదిందలంపుమా॥

చ॥ మనలగడంగియొక్క హనుమంతుడు నాడటులంత జేశె యే ♦ మనగల దిప్పుడారఘుకులాగ్రణి భూరిబలప్రయుక్తుడౌ ♦ వనచర సేనగూడుకొని వచ్చినవాడు విరోధమేలయో ♦ దనుజకులాగ్రగణ్యయని తద్దయుపెక్కులు సూపిచెప్పచుః ॥

వ॥ ముకుళిత కరకమలుండై యున్నదెసంగనుంగొని ॥

మ॥ సుతులన్మంత్రిల మిత్రవర్గముల నీచుట్టంబులంభృత్యులః ♦ జ్రితుకంబూచెదవేని జానకిని శౌర్యాంభోధి యారామ భూ ♦ పతికర్పింపుము పంక్తికంఠ రఘుభూపాలోగ్రఘోరాశు గా ♦ ద్భుత కీలాహతినాఖరుండు దెగుటల్ బుద్ధిః విచారించుమిూ ॥

చ॥ అనిబహుభంగులంబలుక నాతనివాక్యము లించుకేనియుః ♦ వినుటక నూయనొంది కడువేగముగద్దియడిగ్గి మందిరం ♦ బునకు నరిగె రావణుడు పొల్పుగ తక్కిన వారలెల్ల గొ ♦ బ్బున తమయిండ్ల పట్టులకు పోయిరియంత ప్రభాత మాటయున్ ॥

గీ॥ అరద మెక్కి విభీషణుడక్షణంబ ♦ యమరవిద్వేషణుని మందిరమునకేగి ♦ యచ్చటను తేరుడిగ్గి యభ్యంతరమున ♦ కర్హమగువారలనుగూడి యరిగియందు ॥

క॥ వరమణి గణకీలిత భా ♦ సుర హేమాసన మయూఖ శోభితరేఖా ♦ భరిత దిగంతరు దశకం ♦ ధరుగనుగొని మ్రొక్కియంత తదనుమతిచేన్ ॥

వ॥ యొక్కపసిండి పీఠంబునందాసీనుండై కొంతవడికి యున్నదెసంగనుంగొని ॥

ఉ॥ సీతనునీవు దెచ్చుటలుజేశి దశాస్యపురంబులో మహా ♦ త్పాతములు పుట్టుచున్నయవి పట్టపగల్ గమిగూడినక్కలుం ♦ గూతలుపెట్టు నేనుగులకుం మదమిం

కెడు నుత్తమాశ్వ నం ♦ ఘాతము కన్నులందొరగగా దొణగెం జల ధారలెంతయున్ ॥
క॥ [redacted] పవ్వ పు♦ ధూమంబడరెడినిదిశల దోచు మనుండున్ ♦
వేమరుగా [redacted] ఌజనీకేల మరలబు [redacted] సురాశీ ॥
వ॥ దుగు [redacted] మంత్ర్యలెరిగి నీకు ♦ వెరచి తెలియంగబల్కరు వినుమునీవు ♦
విన్నవినకున్న దిట్టిన విన్నకున్న ♦ నహితులై యూరకుండుట విహితమగునె ॥

మ॥ అనవుండిట్లనిపల్కె నానృపతి దేవాధీశునింగూడి వ♦చ్చినవై నన్నరలంగ బుచ్చునికనే సీతన్నిజంబెంత కా♦వున పల్మారును చక్కజెప్పకుము నీవున్నాపరిత్రా పంబెరుం♦గని వానింబలె నిన్నుగావవలసెం గాకేమియిప్పట్టులన్ ॥

ఉ॥ రాముడనంగ నెవ్వడు సురప్రభుడో జముడో కృశానుడో ♦ సోముడో విత్తుడో పురనిషూదనుడో యలకాధినాథుడో ♦ వేమరుబెద్దజేశెదవు వీరలబోలునె పోలనేని యే♦ భూమిజనీను సారెకును బుద్ధులు జెప్పక మిన్నకుండుమిా ॥

సీ॥ అనిపల్కి యక్షణంబున మందిరద్వారమురువడి వెడలి భాసురతనొప్పు ♦ నట్టిహేమస్యందనారూఢుడై ధవళాత పత్రంబులు నకులచామ ♦ రములువెలుంగ జర్మకృపాణంబులుదాల్చి కొందరు నరతంబుసుట్టి నేతేరనొకకొందరి దుగెలంకుల నగ్రి భాగంబున పిరుందకరిఘభిండి ♦ పాలముద్గరశూలముల్ వరుసబూని ♦ నదువవిస్ఫుర వరరత్న నవ్యరుచిర ♦ సాంద్రమైతనరునట్టి యాస్థానమంట ♦ పమున కరుదెంచి సింహాసనముననుండి ॥

గీ॥ మరియు తగువారి రప్పించి మహితగతుల♦ నర్హపీఠంబునందు నెయ్యంబుతోడ ♦ నుండనియమించి కొంతసేపూరకుండి ♦ యల్లవారల జేర్చొని యిట్లులనియె ॥

క॥ మనకుంభకర్ణుడెరుగడు । గొనకొనియే నవనిసుతను గొనివచ్చి వనం ♦ బున జెరబెట్టుటనేడీ ♦ తని మేల్కనియున్నవాడు తత్క్రమ మెల్లన్ ॥

వ॥ సవిస్తరంబుగా నెరింగింపవలయునని యతనిదిక్కు మొగంబై ॥

శా॥ ఘోరాకారిణియైన శూర్పణఖ ముక్కుంబోవుటల్ దానికై ♦ పోరంబోయి ఖరుండుగూలుటయు నాభూపుత్రితా నయ్యెడన్ ♦ కారామంబునదెచ్చి యుంచుటలు నుద్యత్క్రోధుడై వాయుజుం ♦ డారూఢిన్ పురమెల్లగాల్చుటలు రాజాధీశుడే తెంచుటల్ ॥

క॥ యరగంగజెప్పి దశకం♦ ధరుడా సభికులనుగాంచి నాకేమనకున్ ♦ సుర లెట్ల దైత్యవరులం ♦ దరునాకని వల్కిమరియు తగవారలతోన్ ॥

క॥ వెరవక వర శైల బిలాం ♦ తరమున నిక్రించునట్టి దంతిరిపుని నిద్దుర మేల్కొలుప బూనిన ♦ కరులపగిదివచ్చి వారు క్ష్మావరతనయుల్ ॥

వ॥ అనిన మహాపార్శ్వుం డిట్లనియె ॥

చ॥ సమరతలంబునందున ప్రచండమదోద్ధతి రామచంద్ర రక్తము మురుగ్రోలి లక్ష్మణుని కాలునివీటికి జేర్చియంత నా ♦ ద్యుమణి సుతాదికీశులను దూకొనియొక్కట కుంభకర్ణుడు ♦ న్నమలకపోడు నిక్కము ఘనంబగు వాకలి దీరునట్లుగన్ ॥

వ॥ అనిమఱియును ॥

చ॥ సరగున నంతదాక మఱి చక్కన నెవ్వరు పోగనిచ్చు నీ ♦ సురరిపు లొక్కరొక్కరుడ సృక్కక సేయ సమర్థులెన్న దా ♦ మరుల జయింపబూని యని కై చల రేగుచున్నవార లిం ♦ దరూను విభీషణుండొకడు దక్కనటన్న నతండుక్రోధియై ॥

ఉ॥ ఎక్కడనుండివచ్చితిరొ యిప్పుడునాడు మరుత్సుతుండు దా ♦ గ్రిక్కున లంకగాల్చి చనగా నెటకేగితిరో తలంప నే ♦ డొక్కరుడైన సీతను రఘూత్తముకిమ్మన రాహవంబులో ♦ చక్క నెదిరిగాని ల్పెదరొ సాటిగనా నృపసూతి ముందటన్ ॥

వ॥ అని రావణునుద్దేశించి ॥

మ॥ సురవిద్వేషణ నిట్టులూరకను రజ్జుల్ పల్కనీమాత్ర నే ♦ పరిపంథుల్ తెగిరే తలంప రఘుభూపాలాశుగవ్రాత బం ♦ ధురఘోరానల కీలలంటుకొన నీతోపంతముల్ బల్క నీ ♦ వరణిం వీరలు సంగరాంగనములో శౌర్యంబుచూపేరుగా ॥

మ॥ ఇలపై మిమ్ముల నౌను గాదనెడు వారెవ్వారులేరంచు స ♦ భ్యులుమీరుం బలుమారుపేర్చిలెరయో న్సాహింపరింతైన మీరలుకయ్యంబున పేరుగల్గి రిపు వారంబుల్ విదారింపగా ♦ తలపన్ భానుకులప్రదీపకుడ గ్నస్యభాంతకో రావణా ॥

క॥ అనిపల్క మేఘనాథుడు విని నెయ్యంబోయునగ్ని విధమున నపుడా ♦ త్మను భేర్చినరోషంబున ♦ తనరుచు తనపిన్నతండ్రి తమ్మునకనియెన్ ॥

క॥ ఎప్పుడు రిపులం బొసపుగ ♦ చెప్పెదనునీతిపిరికి జెందగమాకీ ♦ చొప్పల వడ దెట్లన్నను ♦ నిప్పనకుంజెదలుపట్ట నేర్చు నెచెపుమా ॥

చ॥ అగణితశౌర్యసంపదల యందధికుండన తేజరిల్లి శ్రీ ♦ ఘ్నగతిదివంబుజేరి సురరాజిరణంబున యోర్చియుద్ధతిన్ ♦ నగరిపుబట్టితెచ్చి కరుణాపరతన్ గృపజూచి వెంటనే ♦ జగములెరుంగపద్మజుని సన్నుతిగైకొని మళ్లబుచ్చనే ॥

గీ॥ సమరమునదేవదానవ సమితినైన ♦ నుక్కణంగించు సన్నొక్క డోర్వనోప ♦ దదియునటులుండె వారు మదస్రవహ్ని ♦ పాలుగానిటవత్తురు పల్క నేలా ॥

వ॥ అని మరియును ॥

చ॥ కెరలిజగత్త్రయంబు తగగెల్చివియచ్చర సిద్ధకాంతలన్ ♦ జరగొనివచ్చి విక్ర
మమునచే నుతికెక్కిన యట్టిపంక్తికం ♦ ధరునిన హోదరుండవు ఘనంబగుశౌర్యము
వీటబుచ్చి యీ ♦ కరణిని దీనవాక్యములు గైకొనిపల్కెదవేమి చెప్పుమా ॥

వ॥ అనిన విభీషణుం డతనికిట్లనియె ॥

గీ॥ అల్పమూర్ఖుల బహిద్వాషి నన్మతుబాలు ♦ నాత్మకుని గార్యములయెడ
నొనరగడియు ♦ నిచ్చోట నుచితమనియది నెన్నిచూచి ♦ వెడలనడుతురు నీతికోవిధులు
మున్నా ॥

వ॥ కావున బాలుండవు మూర్ఖుండవునగు నీవున్నయెడల కార్యావలోకనంబు
సేయుచున్న వాడీ రావణుని బుద్ధికేమి యనవచ్చునని పలికి యున్నదెసం గనుంగొని॥

ఉ॥ ఈశతమన్యుజిత్తు డిపుడీక్రియబల్కిన నమ్మెదేమొ దై ♦ త్యేశమనంబు
లోపల నరేశశిఖామణి కార్యమొప్పగా ♦ దాశరమెచ్చివింట విదితంబుగబూనిన ముజ్జ
గంబులన్ ♦ నాశమునొందుపీడు రఘునందనుతోసని సేయువీరుడే ॥

వ॥ అని మరియును ॥

సీ॥ తాటకినొకకోల గీటడగించెను లీలసుబాహుని నేలగలిపె ♦ యలవిరాధుని
యంత కాంతికంబునకనిచె నేచుమారీచుని బీచమణచె ♦ ఖరదూషణాదుల దురమున
బలిజేశె తక్కిన సమరశాత్రవులనెల్ల ♦ నుక్కణంగించెను పెక్కువిధంబుల నసమాన
బలుడు మహాస్త్రవేది ♦ సత్వసంఘుండు విదళితశాత్రవుండు ♦ చాపకౌశల విద్యావి
శారదుండు ♦ పుణ్యపురుషుండు త్రిభువన పూజితుండు ♦ కలరెయాతనిసాటి జగంబు
లందు ॥

క॥ కసిమసగరాఘవుడు ర ♦ క్కసిమూకల నిన్నునిజముగా నాతడు చే ♦ కస
వంటిన బ్రహ్మాస్త్రము ♦ పసగలబాణములచేత బట్టిన వశమే ॥

గీ॥ కానతనితోడ కయ్యంబుసేయగా ♦ వశముగాదు భూతవసునకైన ♦ వైర
ముడిగి మనుజవల్లభునకు మహి ♦ తనయనొసగుమొందు తలపమాసి ॥

క॥ తోయధిలోపలయుల్లని ♦ తోయంబులవారికూడి తృళ్లకుమతమున్ ♦ సాయ
కము వింటబూనిన ♦ తోయధిబిడౌనసీకు తుడిగీడాదవ్రున్ ॥

క॥ అనిమిషులబారదోలితి ♦ నెనయాగైలాసకుధర మెత్తితి నన్నీ ♦ మనుజుండు
గెలుచువాడే ♦ యని చూచుటమానుమీ దురాగ్రహమేలా ॥

క॥ రామాధీశునినాసు ♦ తామూదిదిగీసుబంసు తగనొక్కనిగా ♦ నీమదిలోపల

దలచెద వా ♦ మేటివిధాతృగన్న యామేటిసుమీ ॥

మ॥ దనుజాధీశ్వర యిట్టినీబలము వ్యర్థంబయ్యెడింజూడు రా ♦ మునిబాహా బల మీావెరుంగవు సుమీా మున్వాలపాశంబుచే ♦ నినుబంధించిన వానవింమనిమె నంతేకాదు యూహింప నా ♦ యనఘుండమ్మారి బోయుచోదొడర ఫాలాక్షుండుదా శక్తుడే ॥

సీ॥ నాబుద్ధివినుము దానవకులాంభోనిధి కువలయబాంధవ వివిధగతుల ♦ భాసిల్లునంబుధి బంధించకటమున్న రఘుపిరుసేనలు రాకమున్న ♦ గరిమసువేలాద్రి దరియకయుటమున్న వికటించిలంక సుట్టకయమున్న ♦ కోపించిదైత్యుల గూల్పకయట మున్న పురుహూతజిత్తాది పుత్రవరులు ♦ ప్రధనరంగంబులోపల బడకమున్న ♦ రాము బాణాగ్నినీమీాన రాకమున్న ♦ కడగినీవారలెల్ల మ్రగ్గకయమున్న ♦ నీతిగని రాఘ వునకును సీతనిమ్ము ॥

మహాస్రగ్ధర ॥ అనుడాదైత్యాధినాథుం డచటినబికులత్యమ్నాతం బంధిమాడ్కన్ జలితోగ్రక్రోధ దీప్తోజ్వలనిఖిల దిశాసాంద్రుడై సానుజున్మాన్ ♦ దునుమంగానిశ్చ యింపన్ దొడిబడగప్రహస్తుండు వారించనంతన్ ♦ ఘనగర్వోద్రేక మొప్పన్ గదసి యురువడిన్ కాలఘట్టించి తన్నెన్॥

క॥తన్నినబెట్టుగమూర్చిలి ♦ గ్రన్ననతెలివందిసభను గల్గినవారల్ ♦ మిన్నక వినుచుండగనమ యన్నదెసంజూచి రోషమూపకపల్కెన్ ॥

ఉ॥ చెప్పినసీతులున్నరకు సేయకమచ్చర మూదిధర్మముం ♦ దప్పిచెరించెదీవు విదితంబుగమీాదట గాంచెదీఫలం ♦ బిప్పుడెఱుంగవచ్చునె మహీశశిఖామణి దివ్యబాణ ముల్ ♦ తెప్పలుగాగఁజప్పగ మదిందలపోశెదు నాదువాక్యముల్ ॥

వ॥ అనిన దశాననుండు వెండియు నాజ్యాహుత ప్రవర్ధమాన హుతాశ నుండునుంబోలె మండుచు నిష్ఠురాత్ముండు విరోధి నాశ్రయింపం బోవుగాక వెడలం ద్రోపించిన పోవునన విభీషణుండు నచ్చోటువాశి తల్లియున్నయడకేతెంచి నమస్కరించి యంత వృత్తాంతంబును యున్నతెరంగున విన్నవించి తదనుమతివడసి నిజమంత్రియుక్తుండై రామచంద్రుని పాలికరుగుచుండె నట్లు ఖేచరమార్గంబున నమాత్యసమేతుండై చనుదెంచు నాఖండలవిరోధి రెండవతమ్మునిం గన్గొని వానరులు తరులు గిరులు కరతలంబుల ధరియించి ఆకాశవీథింబరతేంచు రాకాసుల త్రుంచుత్రుంచుండను నెలుంగు లిచ్చుచుండ నద్దశాననానుజుండు భయాకుల మానసుండై వారలతోనిట్లనియె ॥

సీ॥ కపివరులారనిక్కంబుగాచెప్పెద వినుడుమీారంతయు విశదముగను ♦ దేవ

జలద సన్నిభగాత్ర శరణుసీతానేత్ర జలజమిత్ర ♦ శరణు పావననామ సంగరాంగణ భీమ శరణుదీనత్రాణచారుబాణ ♦ శరణుమానీంద్ర చిత్తకాసార హంస ♦ శరణు శతశతకరకుల జధిచంద్ర ♦ శరణుమూర్ధాన వాటోపశైలభిదుర ♦ శరణుశుభమూర్తి రఘువంశ చక్రవర్తి ॥

ఉ॥ దేవరమేశ విన్నపము దేవరగొల్వగ నేడుదెంచితిన్ ♦ రావణు తమ్ముడీ కుటిలరాక్షసుడంచుదలంప వల్దు మీ ♦ సేవకుపాత్రుజేయు మెడసేయక దీనశరణ్య మూర్తివిం ♦ గావున వచ్చినాడ నను గావుము కావుము భక్తవత్సలా ॥

వ॥ అనిఇవ్విధంబున శరణంబువేడు రక్షోవీరానుజుంజూచి రక్షణీయ్యా దక్షుండగు పుండరీకాక్షుండు నభయంబుగా నిఖిల దాసజన శ్రీకరంబగు కరంబతని శిరంబునానిచి జలదగంభీర భాషణంబుల నిట్లనియె ॥

క॥ నమ్ముమవిభీషణ రావణు ♦ తమ్ముడనను శంకమాను తథ్యమునిను నా ♦ తమ్ములతో పోషించెద ♦ తమ్ముల చుట్టంబె సాక్షి తగనిందులకున్ ॥

గీ॥ అనుచునమ్మంబలికి యాతనినిలంకకు రాజుసేయదలచి రామచంద్రు ♦ డనుజు మోముజూచి యవ్విభీషణుజూపి ♦ యినసుతాది ముఖ్యులెరుగ బలికె ॥

మ॥ శుభలగ్నంబిదె యిప్పుడీతనిని రక్షోరాజుగా శీఘ్రమే ♦ యభిషేకంబొనరింపవేయనవుడత్యానందముంజెంది దై ♦ త్యభటుల్ బెగ్గిలవార్ధితో యములు నర్హాంబొప్ప నమ్మాడ్కి జే ♦ శెభళీయంచు వియచ్చరుల్ బొగడ రాజీవాస్య సౌమిత్రిదాన్ ॥

వ॥ విభీషణుండప్పుడ దానవరాజ్య రమావిభూతిం దనరినట్టపొలుపు మిగిలెనా సమయంబున ॥

ఉ॥ రాముని జేరి యాదివసరాట్టనయుండు నమస్కరించి సుత్రామువిరోధి సోదరుని రాజగజేసితి లంకకౌనసం ♦ గ్రామముసేయనోడి దశకంధరుడిమ్మెయి నాశ్రయింపఝుం ♦ కేమి యొసంగువాడవు నరేశ్వర వానికి నేర్పరింపవే ॥

గీ॥ అనుడు దరహసితాననుండై నరేంద్రు ♦ డనియెకపివర్య నీచెప్పినట్ల యాసుర ♦ వరుడునను శరణంచగా వచ్చెనేని ♦ యతనికిచ్చెద మనయయోధ్యా పురంబు ॥

వ॥ అనిపల్కిన రాజేంద్రుని పల్కులకలరి యితని హృదయంబింత మృదులంబు గదే యని యల్లవానరులు బహుభంగులంగొని యాడిరని చెప్పియంధకారాతి వెండి యునిట్లనియె ॥

సీ॥ అంతఁ బ్రియంబున నంబుజబాంధవ నందన పవమాన నందనులును ♦ సయ్యన నవ్విభీషణుఁ గాంచి రఘుకులస్వామికి వానరసహితముగను ♦ వననిధిఁ గడవ నేయనువున నొడఁగూడు నెఱిఁగింపుమన నాతఁ డిట్టులనియె ♦ నవనీశ్వరుండు రత్నాకర ప్రార్థన గావించి లంకపైఁ బోవ్వనగును ♦ గార్యమనుచు వారు గ్రమమొప్పనత్తెరంగపుడు రాఘవునకు నెఱుఁగఁ జేయ ♦ నతఁడు మనుజునట్లు సవినయంబున కోడ ♦ బడియెనపుడు నియతిఁ గడలిఁ గూర్చి ॥

వ॥ మొక్కి రమ్యస్థలంబున నుండెనంత శార్దూలుండను వేగుల వాఁడట్టిదంతయు నెఱింగి కాని రావణుం జేరి యిట్లనియె ॥

శా॥ రక్షోనాయక యావిభీషణుఁడు చేరం బోయినం గాంచి రా ♦ మక్షోణీధవుఁ డప్పుడు యాఘనుని సంభావించి ప్రార్థ్య మరా ♦ ధ్యక్షుం గాన భిషిక్తుఁ జేసె నతిమోదంబొప్పఁగా నింక న ♦ త్యక్షీణోద్ధతి వార్ధిఁ దాఁటఁగలవాఁడై యున్నవాఁ డిప్పుడున్ ॥

క॥ లెక్కయిడ తరముగాదే ♦ మొక్కటి వినుమా నసమున నూహించినచో ♦ చుక్కలసంఖ్య గణించుక ♦ యెక్కువగా నొప్పు రాఘవేశుని సేనల్ ॥

క॥ నాకుం జూడవశమె ♦ నీకంబ్బులగనిన మొదలు నీవే కాదీ ♦ లోకత్రయంబునం దా ♦ ఘాకాంతుని గెలువలేమి బుద్ధిఁ దలంచన్ ॥

ఉ॥ కావున సామమాదిగను గల్గు నుపాయములందు నీకు నిం ♦ కేవిధి బోలు దాన నెరవేర్పడఁ జేయుమటంచు బల్కు సు ♦ గ్రీవుని భేదపుచ్చుట గాగిందన డెందము నాదలంచి ర ♦ క్షోవిభుఁ డక్షణంబున శుకుండను చారుని జీరి యిట్లనున్ ॥

క॥ వినుసుగ్రీవుం డను నొక ♦ వనచర నాయకుఁడు రామవసుధేశుకడన్ ♦ పెను ప్రాపై యునమీఁదను ♦ జనుదెంచుచున్నవాఁడు సయ్యన నీవున్ ॥

వ॥ వానికిఁ జెప్పంబోయి నావచనంబుగా నిట్లనుమా

క॥ సుగ్రీవ నీకు తగునె ద ♦ శగ్రీవునితోడ నిటుల జనుదేర వృథా ♦ విగ్రహము నూనుచున్న ♦ య్యుగ్రాక్షుం డైన నెదురనోపు నెబోరన్ ॥

సీ॥ హరిహరాదినిలింపు లాహవంబొనరింప నోడి ముట్టెట్టి జేయుచుండురు వినుము ♦ నాతోడి వైరంబునకు నోడి వేగరన్ శరణంబుఁ గాంచెనయ్యురగవిభుఁడు ♦ భుజబలంబొప్పగాఁ భూతేశుతోఁ గూడ కైలాసమెత్తనే కడకమెరసి ♦ యలకాధినాథుని యాహవంబున నోర్చి పుష్పకంబవలీల బుచ్చుకొంటి ♦ చరలబెట్టితి దిక్కనదారల నెల్ల ♦ భువనకంటకుఁడన నెప్పుడు మెలంగు ♦ వెరపులేక చరింపుదు నెల్లదిశల ♦ నిట్టి నాతోడ నీకేల పట్టివాదు ॥

వ॥ అదియునుంగాక ॥

ఉ॥ తమ్ముడుభూమిబుచ్చుకొన తాపస వేషము బూనివచ్చి నా ♦ డిమ్మొయి నిట్టి సఖ్యమున కేమి విశేషముగద్దనీకు నా ♦ తమ్ముని యట్లమాచెద సతమ్ముగనమ్మి నరేంద్రుడించి శీ ♦ ఘ్రమ్మునరమ్ము నాకడకు ♦ గాసరసీరుహ మిత్రనందనా ॥

ఉ॥ ఆలము సేతుఖోలదని యట్టివిధంబదియల్ల రామ భూ♦ పాలుని జూచికాదు హారిపంక్తుల నోర్వగనోడి కాదు నీ ♦ తాలిమిమెచ్చికాదు గుణధామికుడుంగడు సఖ్యుడైన మీవాలినిజూచి చూచె కపిగల్లభ మాలలు వేయు నేటికిన్ ॥

శా॥ నీతోపొందొనరింపబూనియక దా నేనల్ల నాడమ్మ రు♦ త్పూతిన్ బాహు బలైకధుర్యుడగు నా సుత్రామ జిత్తుండు వి ♦ ఖ్యాతింబట్టుక చేరదెచ్చిన మహాకాము న్యాచిత్తుండన్నై ♦ ఘాతల్ సేయక శోకచుట్టి మరలంగాబుచ్చుటల్ చెచ్చరన్ ॥

చ॥ తనపనిచూచెగాని వసుధంగల గోత్రులనిట్లుదెచ్చి యీయనుజుని బోరి దోచుటల ధర్మరుటంచు దలంపడెప్పుడీ ♦ జన్నపతియంత ధన్యులిక త్ర్యొస్థలిమీదట లేరుచూడగా ననవలెనించు కేనియు మనంబునజూడ వివేకమున్నదే ॥

వ॥ అనిచెప్పనంపిన వాడట్లచని సుగ్రీవునితో డంబలుక నబ్బలీముఖు లలుకవడమి యాదూతంబట్టి కపిరాజు కట్టెమురంబెట్టి ముష్టిఘాతలనొప్పించ వాడరచుచు రఘుపతికి మొరయిడిన నప్పుడమిరేడు విడిపించి పుచ్చిన బ్రతుకుమందలగంటినని వియత్తలంబున నిలచి ॥

క॥ జలమూది పెద్దయెలుగున ♦ జలజాప్త తనూజ యాదశగ్రీవునితో ♦ బలికెడు విధమేమనుడా ♦ చిలుకకు నవ్వనాట శేఖరుడనియెన్ ॥

శా॥ వాలింజూచికదా దశాస్యుడు వృథా వైరంబుగాదంట న♦ వ్వాలింజూడక జానకీసతిని దేవస్తుత్యుడా రామ భూ ♦ పాల శ్రేష్ఠున కిపుమనిమ్మనుము నప్పద్మాక్షి నీకుండె నా ♦ వాలింజూచుటలే నిజంబనుము దేవద్వేషితో గ్రన్ననన్ ॥

క॥ పసువడిధరణీ పుత్రిని ♦ చరబెట్టినయట్టి విధము చిత్తములోనన్ ♦ మరువకుమనుమీ చావుకు ♦ వెరవకుమను వాలిపొందు ఏడుమకుమనుమీ ॥

క॥ ఇంక నెటకేని జనుమను ♦ లంకవిభీషణుని దనుము రాముడనుజుడున్ ♦ గొంకకనిను నీనందను ♦ బొంకమణతు రాహవమున బోరుననుమీ ॥

వ॥ అనిపలికిన ॥

క॥ కడురయమున దశకంఠుని ♦ కడకేగిభయంబు గదుర గ్రాల్లనెన ♦ ప్పుడు వాడునాకు నిదే యా ♦ యడుగులు మరలంగజూడ నచ్చెసురారీ ॥

కం॥ వరమణి భూషణహేమాం ♦ బర వివిధోపాయములును పరగంగొని
యా ♦ వరవరునిశరణుజొర నా ♦ తురుడై యావిభునియంప తుదనొగినొదిగెగా ॥

వ॥ ఇట్లుభయభ్రాంతుండై యానదీరమణుండు ॥

సీ॥ దశరథ పుత్రాయ ధవళాబ్జనేత్రాయ సీతాకళత్రాయ శ్రీధరాయ ♦
నిత్యాయశృతిగణ స్తుత్యాయ పోషితా దిత్యాయ కారుణ్య దీపితాయ ♦ కమనియ్య
శీలాయ కాంచనచేలాయ భూరికౌంస్తుభమణి భూషణాయ ♦ పరమపవిత్రాయ భక్తా
ఘమిత్రాయ నీరదగాత్రాయ నిర్మలాయ ♦ శంఖచక్ర గదాశార్ఙ్గ సాధనాయ ♦
రమ్యచరితాయ త్రిభువనరక్షకాయ ♦ విద్విషద్భయ పటుతరవిపులబాణ లాఘ
వాయన మోస్తుతే రాఘవాయా ॥

వ॥ అనిమరియును ॥

సీ॥ ఇనకులాంబుధిసోమ యిందీవరశ్యామ నగరాజసుతనుతనామరామ ♦
రామాభిరామ శాత్రవసముచ్చయభీమ శంజితవిభవ సుత్రామ రామ ♦ చారు య
శస్తోమ సదమలగుణధామ ప్రకటితనృపసార్వభౌమరామ ♦ సాకేతపురధామ
సమ్మోద విశ్రామ విజితభార్గవరామ వీరరామ ♦ కంజభవజనక సంపూర్ణకామ
కామ ♦ యామినీచర హిమతీవ్రధామరామ ♦ భావభవకోటి సౌందర్యదేవతాల ♦
లామ రఘురామదశరథరామ రామ ॥

ఉ॥ నీకోపంబున కెంతవాడనకటా ... కయాసాంద్ర యా ♦ లోకంబుల్
మముబోటివారలను నెల్లంబుట్టగాజేసి నా♦ నాకంజాత భవాండముల్ కడుపులో నం
దాల్చి రక్షించు లక్ష్మీకాంతుండవునీవు నీకగునెరాజీవాక్ష తెంపూదగా ॥

క॥ రావణుని పొరుగువాడని ♦ భావంబునదలపవలదు పదివేలవనే ♦ నీవెద్ది
పంపుబెట్టిన ♦ వావిరినట్లాచరించువాడ మహీశా ॥

క॥ కట్టుమునాపై సేతువు♦ పట్టుగదశకంఠుతలలు భల్లప్రతతిం గొట్టుములంకవు
పట్టను ♦ గట్టుము శీఘ్రంబ కుంభకర్ణావరజుగా ॥

వ॥ అనిపల్కి ప్రసన్నవదనుంజేశిన రఘువరుండిట్లనియె నదీంద్రా మదియ్యా
సాయకంబు వృథకానేరదు నియ్యమోఘ బాణంబు నెందుమీద ప్రయోగింతు నెరుం
గింపవేయనిన నతండిట్లనియె ॥

సీ॥ మనుజేంద్ర దృశ్యకుల్యంబను పేరిట నొక్క మహాహ్రదంబున్నదిటవు ♦
నానరను త్తరభాగమున నాదునెనయగు భూరితరగాధంబు పూరమగుచు ♦ నందు
దుర్మదులైన యట్టి నిశాచర సంఘముల్ వసియించిశంకదక్కి ♦ చనుదెంచి జలచర

సంపాతితోఁగూడి నాయందు సలిలపానంబుసేయు ♦ చుందు రెవ్వరు దర్పంబు క్రిందు కొనగ ♦ వారి సమ్మర్దనంబెంత భారమగున ♦ మేయ విక్రమ భవదీయ్య సాయకంబు ♦ సేయుమంచనగా నతండేయుటయును ॥

క॥ ఉరుగతి చనియా బాణము ♦ సురరిపులను ద్రుంచి మరుగ శోషిలగా న ♦ ద్ధరగాడి మరలి రఘుభూ ♦ వరుని నిషంగంబుజొచ్చె వలనొప్పంగన్ ॥

గీ॥ అంతవారిరాశి యనిమొ రఘువరుతోడ ♦ నంఘువిశ్వకర్మతనయుడైన ♦ నలుని సేతుబంధనం బొనరింపగా ♦ నాజ్ఞయొసగుమనుడు నప్పుడు విభుడు ॥

చ॥ జలనిధిపాతమిందిసూతిగని సయ్యన సేతువు గట్టి నట్టులన్ ♦ బలిముఖ సంఘముల్ బనుపు నాప్రతతంబు నరేంద్రునాజ్ఞ వా ♦ రలకు నెఱంగ జెప్పిన కరంబను రాగము నొందితుల్ల డి ♦ క్కులకు నరింగి యుద్ధతిని గోత్రములన్ గొని తెచ్చిరొక్కటన్ ॥

క॥ వననిధిపై బడ వైచుచు ♦ మునిగి పిదపదోఁపకున్న మునుకొని వెస న ♦ వ్వనచరులత్తెరగారా ♦ మునకు నెఱింగింపగా సముద్రుండపిరోన్ ॥

గీ॥ జలజనేత్ర రామచంద్ర తిక్కనయట్టి ♦ కపిసమూహమేయ గామహీంధ్ర ♦ ములుమునుంగుచుండు మునుగొనియొక్కట ♦ నలుడువైవదోచు నగచయంబు ॥

వ॥ అని విన్నవించిన రామచంద్రుండు నలునిరావించి కపులంగూడుకొని సేతుబంధనం బొనర్పుమని యాజ్ఞాపించిన నతండు వర్ధమాను రాగుండై సుగ్రీవాను మతంబున ॥

గీ॥ మనుజవరునియాజ్ఞ మస్తకంబునదాల్చి ♦ విశ్వకర్మదలచి విష్ణురాజు ♦ ప్రస్తుతించివారి రాశిసమ్మతిగొని ♦ నలుడుతనదు నేర్పు కలిమి మెరయ ॥

చ॥ కరమునవొక్క భూధరము గైకొనివారిధి పైనివైచుచుం ♦ బరువడినమ్మహీధరము పన్నగలోకమువారికిం దివా ♦ కరకులవర్ణనుండు దశకంధరుద్రుంచునటంచు చెప్పగా ♦ నరినిమాడ్కి మున్మునిగి యాదట లేచె కపుల్ చలంగగన్ ॥

వ॥ అంత ।

ఉ॥ ఎక్కడజూచినం బుడమి యీనినయట్టుల గీశసంఘముల్ ♦ గ్రిక్కననేగి శైలములు గైకొని తెచ్చియొసంగు డానలుం ♦ డొక్కట కేలగైకొని మహోత్సవ లీలను వారిరాశిపై ♦ గ్రిక్కిరియంగవైచుచును క్రీడ యుపోలెను గట్టుచున్నడన్ ॥

చ॥ అపరిమితప్రతాపులగు నక్కపివీరులు దెచ్చునట్టి పా ♦ దపములు నద్రులుద్ధతి ముదంబుననొక్కట నానలుండు నే ♦ రుపమరనొంటి కేల గొనరోషము నొంపుచు వాయుసూతి వ ♦ చ్చపగిదిగాంచి రాముడు యశోధనుడాతనినీవాద

ప్రేమతోన్ ॥

చ॥ ఎనయఁగ వానలుం బిలచియిట్లనె తక్కిన కీశులిచ్చు వా ♦ నినియటులైన గైకొనుము నెమ్మిమహాబలనందనుండు దె♦ చ్చిన గిరులుం గరద్వయము చేనొగి నందు కొనంగబోలు నా ♦ ఘనుడు బలాఢ్యుఁడాఢ్యుడు నఖండపరాక్రమ శాలియనా టయుః ॥

వ॥ అనిపల్కిన రామచంద్రునకు మారుతిపైగల కారుణ్యంబునకు నచ్చెరు వందుచు నట్లగైకొనుచుండునంత ॥

చ॥ బలిముఖవాదరుల్ మదిని ప్రబ్బినవేడుక నల్ల దిక్కులం ♦ బలుఁగడి నేగి శైలముల పారముగా వెస దెచ్చియిచ్చుచో ♦ నలుడవలీలమైఁ గొని ఘనంబుగ సేతువు గట్టుచుండె నుజ్వలతర కౌశలంబునను వారలకందర కన్నిరూపులై ॥

వ॥ మరియునుః ॥

సీ॥ బ్రహ్మాండభాండంబు పగులంగ నార్చుచు వనచరుల్ దశలకు జనువిధంబు ♦ చనిభూరివాలంబులను తరులద్రులు లీలమై వెసబెకలించు విధము ♦ వెనురేగు వారికి నేడ్తెర నందిచ్చి మరలను గిరులకై యరుగువిధము ♦ గొనితెచ్చి తోడిబడంగ నలు నిచేతికిని నలయకనందిచ్చునట్టి విధము ♦ మనమలర నాతడవియు గైకొనువిధంబు ♦ వార్ధిపై వాని బూనగంగవైచువిధము ♦ సురలుగుమిగూడి తప్పకచూచుకతన ♦ న నిమిషత్వంబు సార్థకంబయ్యెనపుడు ॥

గీ॥ కపిబలంబులు సేతువు గట్టుతఱిని ♦ పశ్చిమోత్తర పూర్వదిగ్భాగములను ♦ దలప నెందును నెక్కడ దారయగుచు ♦ పుడమియూనినయట్టుల పొలుపుమిగిలి ॥

సీ॥ చలరేగ గోత్రపంక్తులు దెచ్చువారును దెచ్చియంతంత నందించువారు ♦ నందిచ్చిపిదప దె నరిగెడువారలు నరుగుచు నలయకనురుకువార ♦ నురికెద రేమని యరయబోయెడువార లరసినవారికి నత్తెరంగు ♦ నెరుగంగబల్కక నేగెడువారలు నేగిన వెనువెంట నెరుగకుండ ♦ తోడిబడంగజూచి దోతెంచి మిత్రుల ♦ గూటియచటి తరులుగొనగజనెడు ♦ వారికన్న మొదటవడి నద్రులనుదెచ్చు వారలైరి నెచట వారె యగుచు ॥

మ॥ ఒకభూభృచ్చర పుంగవుండొక మహోర్వీధ్రముం దెచ్చుచో ♦ నొకకీ శుండది బల్కిగైకొనిన నా ♦ యుండ్రుండు నిందోర్చి వే ♦ రొక శాఖామృగ మెత్తు కొచనగ నోహోహాహో యనుచు పోకంచు గొం ♦ కక వేరొక్కరు డానగంబుగొను గీకల్ [illegible]

ఉ॥ కొండలు పెక్కు గొంచు నొక కోతి యనేకముదంబు జెంది యు ◆ వ్వెండవి
జూచునో యనుచు వానిని వేరొక చోటడించి తా ◆ పండుల వెంబడించిరుగ బాహు
పరాక్రమ దుర్మదాక్కు కీ ◆ శుండవి యెత్తుకొంచనిన చోమదిగుందుచు వాడు
వానికై ॥

చ॥ ఘనతరమైన యీనగముఖండ పరాక్రమమొప్పగొంచు బో◆ యిన రఘు
నాయకుండు కపులెల్లగనుంగొన మెచ్చునంచు నే◆ పునవొకడొక్క యద్రిగొని పోవగ
నొక్కడు వానిదోంచి భో◆ రుననదిదెచ్చి దానుజలరాశిని వైచు విభుండునవ్వగన్॥

మ॥ ధరణీధ్రంబులు దొంతిబెట్టుకొని మోదస్ఫూర్తిమై నొక్కరుం◆ డరుదేరం
గనియొక్క శైలచరుడుద్యద్భూరి సంరంభముల్ ◆ మెరయం దానొక యద్రిమోచుకొని
తాల్మిన్ వానిపై నెక్కి వా◆నరులున్ నవ్వగ నేగుచుండు పరమానందాబ్ధి కస్వాంతుడై॥

గీ॥ పన్నిదములాడి యచలముల్ బంతులట్ల ◆ గగనమంటంగనొక్కట నెగర
వైచి◆ యవిమగుడనోలి కరముల నందుకొనుచు◆ కేళిసలుపు మరొకతయు నెంచుకొనుచు ।

క॥ శిరముల వాలంబుల గురు◆తర భుజముల కరయుగముల దరుచరులు మహీ ◆
ధర భూరుహములు దెత్తురు ◆ కరమర్థిన్ రామవిభుని కార్యాపేక్షన్ ॥

చ॥ అలఘుతరప్రతాపుడగు నారఘురాముని నాడుదక్కగా ◆ చెలగుచు
వానరుల్ బనులు సేయుట భూరి మహీధ్రసంఘముల్ ◆ జలములమీద దేలుటయు శై
లతనూభవ యెన్నడేని భూ ◆ తలమున జూడచెప్పవిన తథ్యము సుమ్మసి పల్కె
వెంశియున్ ।

చ॥ వనచరవీరులిమ్మైయుని వారధిగట్టను ధారుణీస్థలం ◆ బునగల వృక్షసంచ
యము భూధరముల్ గొని పోవుచుండగా ◆ యనువుననేగుదెంచి రజతాచల మెక్కడ
గొంచుబోదురో ◆ యనితగగాచియుంటి సురలట్లనకాచిరి కల్పవృక్షముల్ ॥

ఉ॥ దూరమెరింగి పద్మజుడు దొల్లక నేరుపు జేసెగాక నా ◆ డారవికీక యున్నను
దయార్తిసనగంబులు వానరావళుల్ ◆ భూరివిశాలవాలముల బోరునజుట్టి పెకల్చి తెచ్చి
యు ◆ న్వారిధిలోన నుద్ధతిని వైవక యుందురె సర్వమంగళా ।

వ॥ ఇవ్విధంబున ॥

సీ॥ దశయోజనముల విస్తారంబు శతయోజనాయతంబుగ నేరుపమరవేగ ◆
నద్రిపటావల యవలీలగట్టిరి సేతువు త్రిభువన ఖ్యాతిదనర ◆ నమరగంధర్వ విద్యాధర
సిద్ధులు కపులను గొనియాడి క్రమమెలర్ప ◆ మను జేసు సామర్థ్యమునకు నచ్చెరు
వంది యొనరనీ సేతువుగనిన వారి ◆ కధికమగు నాయువును శ్రీయు నాత్మజులును ◆

యశముగలిగియునుందురు విశదముగను ♦ హరిపురంబను నరచేతయమరియుండు ♦ ననుచుబలికిరి యొక్కటనములలర ॥

సీ॥ నలునిసామర్థ్యంబునకు మెచ్చి బలములనడిపింపుమని రఘునాయకుండు ♦ నీలునితోఁబల్కి నెమ్మిసుగ్రీవుఁడు నంగదుపైనెక్కి నరుగుదేర ♦ ననుజుండు సేవింప హనుమదారూఢుడై చనుసమయంబున శైలచరులు ♦ నిక్కుచుదాటుచు నింగికి నెగయుచు నార్పులుచెలగంగ నఖిలదిశల ♦ నెలయూనిన తెరగున నిండిపరగి ♦ శంకనేయక నుద్ధతి సంభ్రమమున ♦ నడుపసేనలతోఁగూడి కడలిదాటి ♦ వివిధగతుల సువేలపై విడశిరంత ॥

వ॥ అంతనక్కడ దశకంధరుండత్తెరంగంతయు వేగులవారివలన విని యాస్థాన మంటపంబున కేతెంచి మంత్రులంగూడి కార్యావలోకనంబు సేయునెడ నెల్లవారలు విన నతికాయుండిట్లనియె ॥

మ॥ దనుజాధీశ్వర రామభూవిభుని కాంతారత్నముం దెచ్చు యీ ♦ పనినీ మంత్రులగూడి కార్యము దలంపన్నీతియోగాక యా ♦ మనువంశాగ్రణి మెత్తి రాక గని యిమ్మాడ్కిన్ విచారంబు జే ♦ సిన నయ్యేఫలమేమి యాఘునుని నిర్జింపంగ నీశక్యమే ॥

మ॥ వినువెయ్యింబలుకంగనేల సమరోర్విన్ రామభూపాల ఘో ♦ రనిశాతాంబకధాటికించుక నెదుర్పంజాలగానిమ్మహా ♦ దనుజానీకముకాదు భూరితర దోర్దర్పంబు చేయున్న ని ♦ న్ననిలోనోర్చిన యర్జునార్బుదములై నాశక్తులేరావణా ॥

చ॥ అయుతములైకయ్యముల యందులయేసడిగొన్నవాడ దు ♦ ర్జయుడను నాకుమర్త్యులెదురాయనిచూడకు మెట్టివారి కే ♦ నియునవసత్యమేలయము నిక్కము గా పరికింపధర్మమే ♦ జయమనునట్టివాక్యము నిశాచరనాథ మదిందలంపుమా ॥

చ॥ పరులకునెగ్గుజేసి పరభామలగూడిన యట్టిమర్త్యదుం ♦ డరయనధోగతిం బడయు నందురు పెద్దలు నీవురామభూ ♦ వరునిజనంకియాఘునుని వల్లభనుంజెరదెచ్చి యుంక నెం ♦ దరగదలంచినాడవు రయంబుననాకు నెరుంగజెప్పుమా ॥

ఉ॥ ఆరవివంశవారిధి సుధాంశుడు మాధవు దమ్మహాత్ముతో ♦ బోరజయింప లేరునిను బోటిదశానన కోటులైన ని ♦ ష్కారణవైరమేటికి నిశాచరనాయక జానకీ సతిన్ ♦ భోరుననిచ్చినీవు రఘుపుంగవుపాదము లాశ్రయింపవే ॥

వ॥ అనిపల్కు హితోక్తులు మనంబునంబెట్టక పంక్తికంధరుండు శుకచారణులం గనుంగొని ॥

క॥ వనచరులతోఁ యనిధి దా ♦ టినవిధమును వారలును నటించు తెరం గ ♦ య్యినసూతి మెలఁగుగతి రా ♦ మునిచందంబరసిరందు మునుకొనిమీరల్ ॥

వ॥ అని నియోగించిన ॥

క॥ ఆరక్కసులిరువురు కపు ♦ లై రవితనయునిబలంబు నరయుచునుండన్ ♦ వారలతెరఁగువిభీషణు డారసిఁబట్టించి తెచ్చి యప్పుడుకడకన్ ॥

వ॥ రామచంద్రుని సమ్ముఖంబునకుం గొనిపోయి దేవా వీరలు శుకసారణు లను వారలు రావణుని గూఢచారులు కపిరూపంబులం దాల్చి సకలలోక మర్మంబు లరసివత్తురని విన్నవించు నవసరంబున వారలు భయభ్రాంతులై భూకాంతునింగనుం గొని ॥

క॥ నృపవర దశముఖుపంపున ♦ కపటప్రచారులమయ్యి కపిబలమరయన్ ♦ న్నెప మూని వచ్చితిమి మా ♦ యపరాధముదీర్చిపుచ్చు దనుజవిభుండున్ ॥

గీ॥ ఎంచిచూడదూత లెందు నవధ్యులు ♦ కానిమీరుపంక్తి కంఠుదూత ♦ లగుట చేసి వధ్యులనిపల్కి వారికి ♦ మనుకులావతంసు డనియె మఱియు ॥

క॥ మీముద్ద్రంపఁడీన నేమగు ♦ క్రమమునకపి సేనఁజొచ్చి కలయంగని వే ♦ గమ రిగి యిట్టిధమంతయు నమరారాతి కెఱుంగఁ జేయుఁడని పుచ్చుటయున్ ॥

క॥ రావణుని వేగువారలు ♦ భూవరునకు మొక్కి లేచి పొలుపుగ విజయ ♦ శ్రీ విభవముగ్గై కొమ్మని ♦ యావనచరసేన వెడలి యతిరయ మొప్పన్ ॥

వ॥ లంకసొచ్చి దనుజవిభునింగని మ్రొక్కి కరంబులుమోడ్చి యందు శుకుండను వాడిట్లనియె ॥

సీ॥ అసురనాయక భవదాజ్ఞశిరంబున బూనియావానరసేన జేర ♦ నరిగికృత్రిమ ప్లవగాకృతిగ్గై కొని వారలమర్మంబు వరుసతోడ ♦ నరయుచోన త్తెరంగంత విభీషణుం డెరిగిమమ్ములబట్టి యినకులేశు ♦ ముందరబెట్టి కేల్మోగిచిప్పికలు పంక్తి వదనుని వేగుల గారలనుచు ♦ చెప్పటయు నెగ్గుదలపక శ్రీరఘూత్త ♦ ముండు విడిపించిపుచ్చెను నిండు మఱ ♦ నరసినారముక సిసేన యటకమున్న ♦ యవధరింపుము వినుపింతు నవ్విధంబు ॥

గీ॥ అస్త్రబలముకలిమి యతులితబాహా బ ♦ లంబు కలిమివిక్రమంబుకలిమి ♦ ంటినేర్పుకలిమి వెలయనారాముని ♦ సాటిమగలులేరు జగములందు ॥

చ॥ అరయసుమిత్రపట్టియును నారఘురాముని యట్లతోచు భా ♦ స్కరసుతు ప్పనేమిటికి గంధవహాత్మజు జూచినాడవే ♦ వరబలుడాసుషేణుడు నవారితవిక్రము ప్లగా సురే ♦ శ్వరుమనుమండు ధూమ్రుడను వాడుదలంపన జేయుదేరికిన్ ॥

సీ॥ అతిబలాఢ్యుడు నీలుడనువాడు నీమీద నాడుగరచుచునుండు ననుదినంబు ♦ నలుడెప్పుడును దవానలునివిధంబున లంకభస్మముసేయ బింకమాడు ♦ సురవరుండను నాతడరిని పరాక్రముం డాతడు నినువిన్ననడచిపడును ♦ వేగదత్తుడు నిన్ను నాగలోకంబున కనిచెదనని విభునాజ్ఞవేడు ♦ శ్వేతుడనువాని తెరగేమిజెప్పుద సుర ♦ నాథ యుపప్లవుడునిన్ను నీనందనులను ♦ సంగరంబున ద్రుంప నుప్పొంగుచుండు ♦ గవయుడాలంబు సేయంగ గవయు మరియు ॥

సీ॥ దంభుండు వినుమహాశుంభ విక్రమునిల కయ్యంబునకు వెసకాలుద్రివ్వ ♦ హరుడను కపినీదుపురమెల్ల పెకలించి యంబుధివేశెద ననుచుదివురు ♦ వినతుండు సురలెల్ల వినుతింపనిన్నుదా ననిలోన మర్దింతు ననుచుపలుకు ♦ ననయుంబు గంధమాధనుడు దధీముఖ శరభుడు గజుడును జాంబవంతు ♦ యలగవాక్షుండు కేసరియనెడువాడు ♦ కుముదుడనువాడు పనసుండు విముఖ సుముఖ ♦ ముఖ్యులగువారు నారాజముఖ్యుజయము ♦ తలపుచున్నారు సువ్వచిత్తములయందు ॥

గీ॥ అసురనాథ వారలందొక్కఁడొక్కఁడు ♦ చాలు జగములన్ని సమయసేయ ♦ నట్టివారనేకులరుదేర నికనెందు ♦ నెదురుగలదు వారికెరుగ జెప్పుమా ॥

లెక్కఁబెట్టవచ్చు చుక్కలనొక భంగి ♦ యవని విభునిసేన యందుగలుగు ♦ నీరుత్రైన కపులవేర్వేర వినుపింప ♦ వశముగాదు భుజగవరునకైన ॥

క॥ దనుజాధీశ్వర నీవిక ♦ మనమున వేరొండుచింత మానిసుబుద్ధిగ ♦ జనపతికి సీతనొసగుము ♦ మనజూచెదవేని రిత్తమచ్చర మేలా ॥

వ॥ అనిన విని ॥

చ॥ నరులనుశ్రోత్రియులంగని మనంబుననీవు భయంబుజెంది యీ ♦ తెరగుననేల చెప్పెదవు దేవషభుండో కృశానుడో దినే ♦ శ్వరసుతుడో యపాంపతియొ వాయువో నైఋతియో కుబేరుడో ♦ హరుడో రఘూద్వహుండు దివిజావలియో కపిసేన జూడగా ॥

వ॥ అనిపలుకు నవసరంబున మాల్యవంతుండు మఘవద్విరోధి కిట్లనియె ॥

క॥ హరితాలోక హితార్థము ♦ నరుడై జన్మించినాడు నగవైరి ముఖా ♦ మరులే యిట్టులధరపై ♦ తరుచరులై పుట్టినారు దైత్యకులేశా ॥

గీ॥ అటులగాకయున్న నంబుధిగట్టగా ♦ నోపులకు నుదరంబెయుదకమునను ♦ శిలలుదేలునోటు చింతింపకీశులు ♦ పనులుసేతురొక్కొ యనిమిషారీ ॥

సీ॥ తమ్ముచూలినిగూర్చి దశసహస్రాబ్దముల్ తపముగావించిన ధన్యతయును

కాలకంఠునితోడ కైలాసకుధర మూప్పంగుచు నెత్తిన భుజబలంబు ♦ యింద్రాది సకల దిగీశులనవలీల ననినోర్చినట్టి శౌర్యంబుకలిమి ♦ భార్గవునొద్ద తాత్పర్యంబుతోడను వెలయంగ నేర్చిన విద్యపెంపు ♦ నాత్మలో నమ్మబోకుమో యసురవర్య ♦ రామచంద్రునితో మచ్చరంబు మాను ♦ మతడు మనుజుండుగాడు బ్రహ్మాండనాథు ♦ డబ్జలోచను డాది నారాయణుండు ॥

వ॥ అని పెక్కుభంగుల రఘుపుంగవుతో సంగరంబు సేయంగూడదని చెప్పిన వానిమాట లాదరింపక దశముఖుం డమాత్య సమ్మతంబున నధిక సేనా సమన్వితుండై ప్రహస్తుండు తూర్పుగవనికి మహోదర మహాపార్శ్వులు దక్షిణద్వారంబుకు మేఘనాథుండు పడమటి వాకిటను యేనును మీరలు నుత్తర గోపురంబునకు జాలుదమ్మ పల్కి యూపాక్షు మధమస్కంధంబున నిలువ నియోగించి నిజమందిరంబున కరిగెనంత నవ్విధంబంతయు విభీషణుని మంత్రులు నరసివచ్చి విన్నవించిన రామచంద్రుండు రవినందన ప్రభృతులంగూడి యిట్లనియె ॥

సీ॥ అరిదిపరాక్రముండగు నీలుడా ప్రహస్తుండు గాచుకయుండు తూర్పుగవని ♦ తోడరి వాలిసుతుండు తుదమహాపార్శ్వుండు కాచియున్నట్టి దక్షిణపు గవిని ♦ ఘనబలాఢ్యుడు వాయుతనయుండు రావణి యమరియున్నట్టి పశ్చిమపుగవని ♦ భానుజుండేనను దానవాధీశుడు మెరయుచునుండు నుత్తరపుగవని ♦ నరయతక్కినయట్టి దొరలు వనాటులు ♦ పీటిచుట్టుగలయ విడియ వలయు ♦ ననుచు నిశ్చయించి యవనిజారమణుండు ♦ వరగవారితోడ మరలననియె ॥

వ॥ బంధురవిక్రమాటోపధుర్యులగు మైందద్వివిదులు నీలునకు ఋషభగజగవాక్షగవయులు దక్షిణపరాక్రమ పుంగవుండగు నంగదునకును కులాచల సమానాంగులగు ప్రమాదజంఘుల సమానబలవంతుండగు హనుమంతునకును తమతమబలంబులతో గూడ తోడుగా విడియవలయు మరియుందగిన యెడల వలయువారు నుండునది కార్యంబని నియమించి యా రాత్రిగడపి వేగుటయు ॥

సీ॥ సన్నద్ధకవచ కాంచన సుసూత్రనిబద్ధ తూణీరుడును బాణ పాణియగుచు ♦ రాముండుముంగల రవిజవిభీషణుల్ గెలకులవానర బలమునడుమ ననుజన్ము డుపిరుంద నంగద జాంబవత్ప్రముఖులు చుట్టును బలసినడువ ♦ నంబరతలము బిట్టవియంగ దిక్కరుల్ బెగ్గిలి యొక్కంత మొగ్గరిలగ ♦ దిశలుబగులంగ ధరణి దిదిరదిరంగ ♦ భూతతతికెదరంగ నాపుణాలు చలంగ ♦ నరిగితమలోన మున్నుతారనిన యటుల ♦ వీటి చుట్టును కలయంగ విడసిరంత ॥

వ॥ శ్రీరామచంద్రుండు పరమకారుణ్యమూర్తియు శరణశరణ్యుండును నయ
గుణవిశారదుండు గావున రాజనీతి దలంచి సుగ్రీవదశగ్రీవానుజ మతంబున నంగదు
రావించి యతనితో నిట్లనియె॥

గీ॥ వాలినందననీవు రావణుని జేర ♦ నరిగియాతనితోడ నిన్నురుగబల్కు ♦ నదియు
మెలగ్పంగ నా వచనంబుగాగ ♦ నెల్లవారలు వినుచుండ నిట్టులనుము॥

క॥ మునుధరణీనందన దె ♦ చ్చినయట్టి చలోక్తివిడచి చిత్తములోన ♦ న్నిను
నీవు తెలసి నీతిం ♦ గని యింకేనియు సుపంక్తికంధరనీవుఁ॥

ఉ॥ ఏనుగృతాప రాధినని యెంచక భానుకులావతంస నీ ♦ సూనునిగాగ
నన్ను కృపజూడు భయంబెడలించి యస్మది ♦ య్యానుజుబ్రోచి తంచుక మలాత్తతు
నూభవునేలి తంచునో ♦ దీనశరణ్యమూర్తి భవదియ్య పదాబ్జము లాశ్రయించెదన్॥

క॥ జననాథోత్తమ ధరణీ ♦ తనయను మరలంగనిచ్చెదను త్రిదశుల తో ♦
డను వైరముడిగి మెలగెద ♦ నిను గొలచెదనింతనుండి నిర్మల మతినై॥

వ॥ అనివచ్చి శరణాందుమట్లు సేయంజాలవేని॥

చ॥ పెనకువనీతిగాదని విభీషణుడుంబలుమారు సాటిచె ♦ ప్పిన విననింపుగాకతని
బ్రోలిచి త్రోచితివేకదా దశానన సమరంబుసేయు తరినాటి విభీషుణు వెర్రిబుద్ధి నీ ♦
మనమునకిష్టమై తనరుమాడ్కిగ జేశెద నన్నుజూడుమిా॥

వ॥ అనిపల్కుమని పంచిననియ్యకొని యంగదుండు రఘునందనునకు నమస్క
రించి సుగ్రీవునియును మతంబువడసి యట్లచని రావణుని సమ్ముఖంబునకుంబోయి
యతనితో నిట్టనియె॥

సీ॥ అమరులగెల్చినయట్టి నీవిక్రమంబెన్న నేటికి జగమెరిగినది యె ♦ నట్టి నిన్నని
నోర్చి యవలీలచరగొన్న యర్జునులావు నీవెరిగినదియె ♦ కడగియయ్యర్జునుకర సహ
స్రంబులు ఖండించినట్టి భార్గవుని జెప్ప ♦ గా వినియుండుదెకా యట్టివీరుని భంగపెట్టిన
రఘుపుంగవునకు ♦ బంటనంగదుడనువాడ శౌర్యధినిన్ను ♦ వాలమున జుట్టిపోసిక వారి
నిధుల లీలమునుముంచి విడచిన వాలిసుతుడ ♦ నారఘుస్వామి నీకడకనిచెనన్ను॥

గీ॥ అమరశాత్రవ నన్నిటకనుచువేళ ♦ నమ్మహారాజునీతోడ నాడుమనుచు ♦
పరగజెప్పిన తెరగునీకెరుగజేతు ♦ నతనివచనంబుగాగ నీవాలకింపు॥

క॥ మునుధరణీనందన దె ♦ చ్చినయట్టి చలోక్తివిడచి చిత్తములోన ♦ న్నిను
నీవ తెలసినీతిం ♦ గని యింకేనియును పంక్తికంధరనీవుఁ॥

ఉ॥ ఏనుకృతాపరాధినని యెంచుక భానుకులావతంస నీ ♦ సూనునిగాగనన్ను

కృపఝాడు భరయుం బెడలించి యన్మది ♦ య్యనుజుబోంచి తంచు కమలాప్త తనూభవు నేలి తరిచునో ♦ దీనశరణ్యమూర్తి భవదియ్య పదాబ్జము లాశ్రయించెదన్ ॥

క॥ జననాథోత్తమ ధరణీ ♦ తనయను మరలంగనిచ్చెదను త్రిదశులతో ♦ దను వైరముడిగి మెలగెద ♦ నిను గొలిచెద నింతనుండి నిర్మలమతినై ॥

వ॥ అనివచ్చి శరణంబుమట్లు సేయంజాలవేని ॥

చ॥ వెనుకవనీతిగాదని విభీషణుడుంబలు మారుసాటి చెప్పిన విననింపుగాకతని ద్రోలిచి త్రోచితి వేకదా దశా ♦ నన సమరంబుసేయు తరి నాటి విభీషణు వెర్రి బుద్ధి నీమనముల కిష్టమైతనరు మాడ్కినికే కెదనన్నుజూడుమీ ॥

వ॥ అని పలికెనని చెప్పి యంగదుండు వెండియు నతనితో నిట్లనియె ॥

చ॥ ఉడుగక రామభూవిభుని నోడ్చెద ♦ నంచు దురాశనిందు్రిడుం ♦ బడ యగ లేనియట్టి శిరిబాహుబలంబును దూలపుచ్చగా ♦ నెడద దలంచెదేల దనుజేశ్వర వేరొకచింతమాని యా ♦ మొడయుని నాశ్రయించి సుఖముండును దైత్యులగూడి లంకలోన్ ॥

చ॥ నతకమలాసనుండు రఘునాథుడు లంకకు నవ్విభీషణున్ ♦ హితమతి రాజు జేశెనిక యేకరణంబిన లాభమెద్ది యా ♦ ప్రతికృతి చెప్పుమన్న వినుపట్టముగట్టును నిన్నయోగ్య కా ♦ శ్రిత సురవృక్షమా తని ప్రసిద్ధియు దారతలివెరుంగవే ॥

క॥ కలయట్టి నుల్లులు సీతా ♦ లలనామణి నొసగి మత్కులము నీకృప వ ♦ ర్ధిలలజేయుమనుచు మ్రొక్కిడి ♦ జలజాప్తకులేశుగొలువు సద్భక్తిమెయిన్ ॥

ఉ॥ కూ్రరతకోర్చి రావణుడు క్రొవ్వున జానకిదెచ్చెనంచు మ ♦ ద్ఘోర శరంబు లేశి వెనద్రుంపగ గొల్పడు బుద్ధిదాని కీ ♦ దారెరిగించి సావునకు దప్పెడు చందము సేయుమంచు న । న్నారఘురాము డంపుటకు నచ్చెరువయ్యెడు రాక్షసేశ్వరా ॥

వ॥ అనిమరియును ॥

సీ॥ తాటకప్రాణ విదారథుకీణంబు ప్రబలసుబాహు నిరాన కరము ♦ ఖర దూషణాదిరాక్షస నాశకారణి కృత్రిమరూప మారిచభేది ♦ స్థూలమహాయత్తుంగ తాలవిచ్ఛేదని వాలిమహాటోవ శైలభి దుర ♦ మంభోధి భూరిగర్వాంధ కారచ్ఛే ద♦ నూరతేజోమూర్తి పేరుకెక్కి ♦ నవియునివియు కొందలుగాగల్గునట్టి యు ♦ మోఘ శరములధిప మొదటనన్ను ♦ బంపుమద్దశాస్యు జంపెదమని దొన ♦ వెడలుచుండు విడము విభుడువాని ॥

చ॥ అగపడినప్పుడేనిను రయంబునకాలు నివీటికంపగా ♦ తగుతగుపట్టిదే నృపతి

ధార్మికుడౌటను నీకు బుద్ధి దె ♦ ల్పగవనుబుచ్చె నూరక చలంబున ప్రాణముగోలు
పోవు నీ ♦ తెగువదిమాని రమ్మి రఘుధీరుని పాదములాశ్రయింపగ౯ ॥

శా॥ రామత్వ్మావరు పోరగెల్తు నను శౌర్యంబెద్దిరో యద్దియే ♦ నీ మేనుం దెగ
జూచు మృత్యువని యంతేబుద్ధి నూహించి యా ♦ భూమీశాగ్రణి నాశ్రయించి
త్రిజగంబుల్ బ్రస్తుతింపంగ సు ♦ త్రామప్రక్రియ భోగముల్ గొనుము దైత్యవ్రాత
చూడామణీ ॥

క॥ రావణనీయ పరాధము ♦ భూవరుడు సహించినన్ను బుత్తెంచుట నీ ♦
చావునకోర్వక నిట్టి ద ♦ యావననిధి శరణువడయు టహా౯మకాదే ॥

చ॥ అనగనలొంది గ్రక్కున దశాస్యములొక్కటబెంచి కన్నులన్ ♦ కనదురు
విస్ఫులింగములు గ్రమ్మనిశాటుల మోముజూచి యా♦ వనచరుపట్టి కొట్టుడన వారలు
పల్వురువచ్చి వాలి నం ♦ దనుని రయంబునంగదసి నంగని నవ్వుచు నాతడుద్ధతి౯॥

క॥ నలువురి గరచగణంబులు ♦ బలువిడిగొని మింటికెగసి పడవైచుడు వా ♦
రలు నడుమ నమృతిబొందిన ♦ నలిగినిలింపారి యువ్విడంగదుమీదన్ ॥

చ॥ పలువుర దైత్యులంబనుప ప్రాసగదాము సలాది సాధనం ♦ బులుగొని
వారలదిరిచర పుంగవునొక్కటదాక నమ్మహా ♦ బలుడు చలంగి యార్చుచు సువ
ర్ణులు నివ్వెరగంది చూడగా ♦ బలువిడి వారితో నెదిరి బాహుపరాక్రమ మొప్ప
నుద్ధతి౯ ॥

క॥ ఉరుతరవాలంబున కొందరనొక్కట బిలుకుమార్చి తనరనఖములన్ ♦ మరి
కొందర ముష్టిని కొ ♦ ద్దరనొవ్వగ జేశి యార్చినంగనికినుక౯ ॥

గీ॥ ఖరునితనయుడైదు కాండంబులా వాన ♦ రేంద్రు మేననాటినేశి విశిఖ ♦
దశకమేర్చి నిటలతటమున వెసగ్రుచ్చి ♦ యమరవితతి బెదరనార్చుటయును ॥

చ॥ తడయక వాలినందనుడు దైత్యునిపై బడి రోషయుక్తుడై ♦ పిడికిటబోటు
నంబొడచి భిన్నశిరస్కునిజేశి పంక్తి కం ♦ ఠుడు మదిలోన గుందుచు కనుంగొని
బిమ్మటి నొందనేగి య ♦ వ్వుడు రవివంశభర్తను బోరునమ్రొక్కి క్రమం
బెలర్పగ౯ ॥

వ॥ రావణుని దురుద్యోగంబు తెరంగెరింగించిన విని యానృపాల శేఖరుండెల్ల
వానరయోధులం బేరుగొని మీరలింక నిశ్శంక నెదిర్చి లంకానాథుని బలంబుల గెలు
వుండని యాజ్ఞాపించిన వారలప్పుడు ॥

సీ॥ అధికాహవోత్సాహమాత్మలో రెట్టింప కుముదుండు శతవలి శమిత విమతు♦
డైన సుషేణుండు నాదిగాగల కొండ రగచరుల్ దశదిశ లద్రువనార్చి పదియు నే బది
యరవదికోట్ల వానర బలములతో లంకపజ్జకేగి ♦ క్రమమున పూర్వపశ్చిమ దక్షిణద్వార
ములయందు దోంచిరి బలియులైన♦ యూధనాథులు తానమ్మహాగ్రీవృక్ష♦సత్వరంబు
న నరిగి యాసారసాప్త ♦ తనయుడెంతయు సింహనాదములు చెలగ ♦ పూనియుత్తర
గోపురంబునకు గవిసి ॥

వ॥ మరియును మెలుగు సుగ్రీవులు బలయు గవాక్షధూమ్రాక్ష విభీషణులు
రఘుపతి యిరుగడల నిలచిరి శరభగజగవాయ గంధమాధనులు చెంగటనిలచి కయ్యం
బునకు పురికొలుపు చుండిరంత ॥

క॥ బలిముఖ సంఘములొక్కట ♦ బలువిడి పాషాణపాద పంబులుగొని వి ♦
చ్చల విడిగనార్చి యుగ ♦ త్తలు పూడ్చ్వదొరంగిరంత దశవదనుండున్ ॥

క॥ సేనానాథుల గనుగొని ♦ సేనలతోగూడిమీరు చచ్చరజని యా ♦ వాన
రుల మొనగనియ్యక ♦ పూనివెసంద్రుంచిరండు పొండనియనుడున్ ॥

క॥ స్యందనఘోటక సామజ ♦ దుందుభి నిస్వనము దిశల తోడ్తోనవె సం ♦
గ్రిందుకొని భూషణ ప్రభ ♦ లందంద దినేశకాంతు లట్లమెరయగాన్ ॥

సీ॥ ఏపున తుండంబులెత్తెత్తి మిన్నంది కొనునట్లు గనుపట్టుకుంజరములు ♦
వాగెలబిగువున కాగక సారోహకులను జెగ్గలసేయు ఘోటకములు ♦ నంబరంబునకే
తనంబులు గ్రాలంగ సరభసగతినొప్పు స్యందనంబు ♦ లెంచు జూచిన నేల యీన్నిన
యట్టుల వివిధభంగులనొప్ప వీరభటులు♦ గలిగి బలకూళిదిక్కుల గలయపర్వి♦ భూరిత
రవివుల ఘోరాంధ కారమగుచు ♦ పరగ నానాయుధ ప్రభల్ భానురుచుల ♦ ననుక
రింపంగ నడిచిరయ్యా సురవరులు ॥

వ॥ ఇట్లునడచి సత్వరంబున ॥

చ॥ ముసలగదాకృపాణ ధను ముద్గరతో మరభిండి వాలప♦ ట్టె సముఖ సాధ
నంబులు కడింది పరాక్రమ మొప్పబోని యీ♦ రసమున దాకి కీశులుగరంబు వెసందము
వైచుశైల వృ ♦ క్షసముదయంబు దుత్తుమురుగావి శిఖంబులు నేశి యార్చుచున్ ॥

వ॥ బహువిధంబుల బెనంగుచుండిరంత యిరుగెలంకులవారికి పోరుఘోరంబుగా
సెల్లెనందు వాలినందనుని మేఘనాథుండును హనుమంతునిజంబుమాలియు విభీషణుని
మిత్రఘ్నుండును నలుని దప్పుండును లక్ష్మణుని విరూపాంక్షుండును నీలుని నికుంభుండు
ను మైందుని వజ్రముష్టియు గజునితపనుండును రామచంద్రుని అగ్నికేతు యజ్ఞకేతు

రశ్మికేతు సుప్తఘ్నులును సుషేణుని మహోదరుండును ద్వివిదుని నశనిప్రభుండును జాంబవంతుని మకరాక్షుండును పనసుని నరాంతకుండును శరభుని త్రిశిరుండును ధూమ్రుని కుంభుండును ఋషభుని సారణుండును గవాక్షుని దేవాంతకుండును వినత దంభుల నతికాయుండును గంధమాదనుని మహాపార్శ్వుండును వేగదర్శిని శుకుండును శతవలిని విద్యుజ్జిహ్వుండును కేసరిని ధూమ్రాక్షుండును దలపడిరి యందు ॥

క॥ గదగొని రావణి వెస నం ♦ గదుపై చన కపివరుండు గడునుగ్రుండై ♦ త్రిద శేంద్రజిత్తు తేరా ♦ గదగొని నింతింత తుమురుగా నొనరించెన్ ॥

గీ॥ మారుతాత్మజుపై జంబుమాలి శక్తి ♦ వైవ వాతండు దలకక వడి రథంబు ♦ మీది కుద్ధతి లంఘించి మించి యాని ♦ శాచరు నెత్తి గ్రుంగంగ జరిచె నపుడు ॥

క॥ మిత్రఘ్నుండు విభీషణు ♦ గాత్రము విశిఖము గ్రుచ్చ గనలుచు గదచే ♦ చిత్రంబున గైకసీ ♦ పుత్రుం డా ఖలుని వక్షముం బగులించెన్ ॥

క॥ అలిగి ప్రజంఘుడు మూడ ♦ మ్ముల వడి సంపాతి నేయ మొగ్గమమదిలో ♦ పల మండి యతడు దైత్యుని ♦ చలమున మర్దించె రాత్రిచరులు గలంగన్ ॥

క॥ కనలి ప్రహస్తుడు భల్లం ♦ బున గాత్రము జొనుప గెరలి ఘోరున రవిజుం ♦ డు నఖముల దైత్యు మస్తక ♦ మున మస్తిష్కములు సూపి ముదుకొని యార్చెన్ ॥

గీ॥ కులిశఘోరాస్త్రవితతిచే నలుని యంగ ♦ సంగములు నొవ్వజేసిన శైల చరుడు ♦ బలిమి మై తపన దైత్యుని బాహుయుగ్మ ♦ మింద్ర తరుతాడనంబున నేచి నొంచె ॥

గీ॥ ప్రౌఢి సౌమిత్రిపై విరూపాక్షుడార్చి ♦ సాయకావళి బెట్టుగా నేయనపుడు ♦ రత్నచిత్రితశరము గాత్రమున జొనిపి ♦ దానవుని మాన్చె నాసుమిత్రాసుతుండు ॥

ఉ॥ నీలునిపై నికుంభ రజనీచరుడంబుజ మిత్రరోచులం ♦ బోలి వెలుంగు భూరి తర పుంఖశతంబును గీలుకొల్పినా ♦ శైలచరోత్తముండు రథచక్రము గైకొని వాని సారధిన్ ♦ కాలుని ప్రోలికిం బనిచె గాఢపరాక్రమ ముప్పతిల్లగాన్ ॥

మ॥ కరవాలంబున వజ్రముష్టి బలదోర్గర్వంబుచే మైందు పె ♦ న్నురముం బెల్లున నొవ్వజేసిన నతం డుద్రేకమే పారగా ♦ కరిపై నేగు మృగేంద్రవైఖరిని యాక్రవ్యాదు పై నేగి ని ♦ ష్ఠురముష్టిం బడ గ్రుద్ది పంచె జమునిం జూడంగ నొక్కుమ్మడిన్ ॥

క॥ శూలంబున తపనుం డవ ♦ లీలన్ గజు బొడువ నతడు లెక్కగొనక హిం ♦ తాలము గైకొని యాదు ♦ శ్శీలుని మస్తకము నేసె జావు యలర్పన్ ॥

గీ॥ అగ్నికేతుండు సుప్తఘ్న యజ్ఞకోప ♦ రశ్మికేతుల నేక శరంబు లేయ ♦

నాలుగమ్ములుగొని రఘునాథుడప్పు ♦ డానిశాటులనల్వుర నవనిగూల్చె ॥

చ॥ అలిగి మహోదరుండు కఠినాంబక పంచక మాసుషేణుపై ♦ బలువిం
నేయ నాఘనుడు బాహుపరాక్రమ ముప్పొంగ ♦ కులగిరిబోనియట్టియొక కొండఁ
యంబున వైచియుగ్రముల్ ♦ సొలయుచు గూలవాని రథచోదకుడుర్విల వ్రాలె
వ్రేల్మిడిన్ ॥

క॥ ద్వివిదుం డశనిసన్నిభుడును ♦ వివిధాయుధ వితతినొంప వృత్తుచరుండా ♦
జవమున నొకశైలముచే ♦ దివిజాహితునేయువాడు ద్రెళ్ళెంధరణిన్ ॥

క॥ మకరాక్షుడు వింశతి సా ♦ యకములు భల్లూకవిభుని నలయించినయో ♦
డక యతడు స్యందనము మీ ♦ దికి జనియయ్యసుర సారథిం ద్రెళ్ళించెన్ ॥

చ॥ పనసునిపై నరాంతకుడు బంధురరోషముబూని కొట్టుగా ♦ సునిశితసాయక
ప్రతతి జొన్పనతండొక భూరుహంబు చే ♦ గొనకొని వానిరథ్యముల గూలిచిసారథి
గీటణంచి కే ♦ తనమటుశించి చాపము విదల్చె నిశాచరులెల్ల బారగాన్ ॥

క॥ శరభుని మస్తకమురుతో ♦ మరమున త్రిశిరుండునొంప మసలుచునతడా ♦
సురవిద్వేషణుడెక్కిన ♦ కరికుంభస్థలము బగులగా వడిమోదెన్ ॥

గీ॥ కుంభుడైదునాల్గు ఘోరనారాచంబు ♦ లేర్చిధూమ్రునేశి యాగ్ర్పటయును ♦
గినిశియతడు పెద్దగిరి దెచ్చివైచి యా ♦ ఖలుని తేరునుగ్గుగా నొనర్చె ॥

చ॥ కుముదునిపై యకంపనుడు క్రూరమతిన్ పరిఘంబువైవశీ ♦ ఘ్రిమ
యతడుర్విమోదగిలగాబడియుం తనలేచివాని వి ♦ క్రమము సహింపలేక తనకన్నుగ
వంకడు నెర్రదోవ పే ♦ ర్చిమదిని రోషమూప కవిచేష్టితుజేశె విశిథిసీచరున్ ॥

క॥ సారణుడమ్ముల గప్పిన ♦ యీరసమున ఋషభుడొక మహీధరమేయన్ ♦
ఘోరున నతడుపిరుందుకు ♦ పారెనుభయమూదికుధర ధ్వరచాపుండై ॥

క॥ దేవాంతకుడు గవాక్షుని ♦ పైవారక కంకపత్రి పంక్తిబరపుచో ♦ నా
పీరుడు గిరిశిఖరము ♦ చే వానిని నృక్కజేశె చాపుయలర్పన్ ॥

క॥ అతికాయుండు శిలీముఖ ♦ తతిపై గప్పటయు వినతదంభులుదమలో ♦
ధృతిచడక భూరిశైల ♦ క్షితిజంబులు వైచికలగ జేశిరివానిన్ ॥

క॥ పూనియా గంధమాదను ♦ పైని మహాపార్శ్వడస్త్ర పంక్తిబరప నెం ♦
తేనియు గొంకకవాడ ♦ ద్దానవు శౌర్యంబుతాళ తరువున మాన్పెన్ ॥

గీ॥ శుకుడునితశరంబు లొకపడియావేగ ♦ దశిన మేననాటతలగకతడు ♦ పొంగి
దైత్యవరు ర ♦ థాంగవ రూధంబు ♦ కపులు చలగనుగ్గుగానొనర్చె ॥

క॥ అదలిచి విద్యుజ్జిహ్వుడు ♦ ప్రదరపరంపరలు మేనబరపి శతవలిన్ । బెదరింపవాడు ధైర్యము ♦ వదలక తరుతాడనమునవాని దెరల్చెన్ ॥

క॥ కనుగొని ధూమ్రాక్షుడు శిం ♦ జిని మ్రోయింపుచు నరయచెలగెడు చిత్తం ♦ బున కేసరిగిరి శిఖరం ♦ బున బిట్టుగనేశివాని మూర్ఛన్ముంచెన్ ॥

క॥ మరియు ననేక నిశాచర ♦ వరులుం గిరిచరులుగదసి వైరముతోడన్ ♦ దరలక నన్యోన్య జయా ♦ తురులై సంగరముసేయ దొడగిరంతయున్ ॥

సీ॥ శూరత్వమునలేరు లారోహణము జేశి విసువకపోరాడి విరథులయ్యు ♦ తెరలక కరటికంధరములపై నెక్కి సంగరంబొనరించు సామజములు ♦ కూలినదలకక గుర్రంబులెక్కియు నాలంబుగావించు హయులుబడిన ♦ నలయక కాల్వురై యనిచేశి యంతయు నాయుధంబున చూర్ణమైన ముష్టి ♦ యుద్ధమునకుజొచ్చి యోడక పెనగుచు ♦ నార్చినొచ్చి మూర్ఛలంది యపుడు ♦ తెలసికపుల ద్రుంచి తెరలుచు తరుశిలా ♦ హతినికుప్పగూలి రసురవరులు ॥

చ॥ కపులును ఘోరసాయకని కాయముచేకడు నొచ్చి విచ్చి యూ♦ ధపతుల ప్రోపునన్ మరలి దైత్యులనుద్ధతిగిట్టిభూరి పా ♦ దపములు భూధరంబులును దారుణ భంగినివారు వేగనే ♦ యు పటుశరాగ్ని కీలలరయోద్ధతి నుర్వరవ్రాలి రయ్యెడన్ ॥

చ॥ వనచరులున్నిశాచరులు వారకనమ్మెయిబేర్చి వృక్ష భూ ♦ రి నగమహాస్త్ర సంహ్వాతి బోరింబోరి నొండొరు లేటులాడగా ♦ తనదెసవచ్చి తాకవు గదాయని చిత్తమునం గలంకి గ్రక్కున కడకేగెనో యనగ గ్రుంకెను భానుడు పశ్చిమాంబుధిన్ ॥

ఉ॥ అప్పుడు రామచంద్రుడు మహాటవి పావకుడేర్చునట్టు యా ♦ చొప్పు వహించి వాని రథసూతపతాక కరీంద్ర రాజిపై ♦ గుప్పలుగా నమోఘతర ఘోరశరానల కీలలుద్ధతిన్ ♦ గప్పి విభావరీచరని కాయములం బరిమార్చుచున్నెడన్ ॥

ఉ॥ దానవులంత రామవసుధావరు సాయకధాటి కాత్మనెం♦ తేని దలంకి వీచినలు దిక్కులబారుచు వెండియున్ బృహ♦ ద్భానునితూండు మ్రిగ్గుశలభంబుల భాతినదిర్చి మ్రిగ్గుచుం ♦ బోని చలంబునంగపుల పొంకమణంపుచు పెక్కుభంగులన్ ॥

వ॥ సమరకేళీ విహారంబు సలుపుచున్నంత రఘువీరుండు కన్నుంగవ నెర్రిదోప నవక్రి పరాక్రమంబునం బేర్చి నిజధనుర్జ్యారవంబు శెలంగ ఘోరనారాచ పరంపరలానిశాచర యోధుల సర్వాంగంబుల దట్టంబుగా నాటింపుచు రెక్కలుగల కాలభుజంగంబులం బోలె నెక్కడజూచిన తానయై చతురంగ బలంబులంబారి సమరు

చున్నంగనుంగొని తదియ్య విక్రమంబున కెముగ్ర్వజాలక నిఖలనిశాచరులు దీనదశం బొంది మేనరుధిరంబులు దొరంగ తలలువీడ పోరుదొలంగి చల్లాచదరులై పరచుచుండి రయ్యవసరంబున ॥

చ॥ రయముననొక్క భూరి కుధరంబు కరంబునబూని రక్కసుల్ ♦ భయమున కైదువల్ విడచి పారగదిక్కులు వ్రియ్యనార్చి దు ♦ జయుడగు వాలినందనుడు రావణిపైజన వాడదృశ్యుడై ♦ జయమున కానసేయక వడింబురిలోపల జొచ్చి ఖిన్నుడై ॥

ఉ॥ భూరిపరాక్రమంబెసగ బోరనిలింపులు జూచుచుండగా ♦ ధీరతతోడనిం దుర్చిర దెచ్చినయేగలు గంగనివ్వపి ♦ తీరునలంకకుగ్రమిగుల దీనతవాటిలె నేటి పౌరుషం ♦ బారయనింకలోకములయందున రామునికీర్తి చెల్లెడిన్ ॥

సీ॥ అనిపెక్కుభంగుల నాత్మలోదలపోశి యహితులనని నోర్చునట్టి కొరకు ♦ దారుణంబగునట్టి మారణకర్మంబు సేయంగనూహించి శీఘ్రగతిని ♦ రక్తపర్ణాంబ రంబులు ధరియించి హోమశాలకుజని యుచిత భంగి ♦ నొనరంగ దైత్యగురూప దిష్టంబగు నయ్యాధర్వణతంత్రము మరసేయ ♦ నంత నప్పుడకుండ మధ్యంబునందు ♦ నర్చులనుబేర్చియొప్పు సప్తార్చివలన ♦ వివిధశస్త్రాస్త్ర యుక్తమై వెలయునొక్క ♦ యరదమెగసిన గైకొని యంతవాడు ॥

వ॥ పరమానురాగంబున ॥

క॥ భూరిశరాసన ధరుడై ♦ యారూఢిని శాతసాయ కావలిచేదే ♦ వారుల నాలములోపల ♦ బారినెమరుచున్న యానృపాలు రగనియెన్ ॥

క॥ కనియునలక్షితరథుడై ♦ తనమాయావిద్య బలిమి తానెవ్వరికిం ♦ గను పట్టకనమ్ముల వె ♦ ల్లిని దేల్చెగినుకమెయి బలీముఖరాజిన్

వ॥ ఇట్లయ్యిన తనయుప్రముఖులు గనుంగొనుచుండ పెక్కండ్రవ నాటులంగీ టడంచి యంతంబోవక ॥

చ॥ నరగున రామచంద్రుని నిశాతశరంబుల నొంచి యెక్కదు ♦ స్తరతర ఖాండమేర్చి కవచంబును నుగ్గుగజేశి యమ్మహి ♦ వరునను జన్మమద్దతిగ వాక్షిత దక్షునిగా నొనర్చె భూ ♦ ధరచరవాహినుల్ దలకి తద్దయునాత్మల భేదమందగన్ ॥

వ॥ మరియును వానరులమీద నమ్ముల వానగురిశి ముంచి మాయాబలంబున మించి దిశలదలక నార్చుచు నెక్కడం దానెయయ్యి సమరకేళీ విహారంబు సలుపు చున్నంత ॥

సీ॥ తొడిబడిబరతెంచు బెడిదంపుటంపర కోర్వక నేలపై నొరుగువారు ♦ నొక్కొక్క కాండంబు పెక్కండ్రగాడిన గుదులుగ్రుచ్చిన యట్లగూలువారు ♦ వారక యేతెంచు ఘోరనారాచముల్ వాలమ్ములనునాటి వ్రాలువారు ♦ చిత్రంబులగు కంకపత్రంబులకుగాక నొండొరుమాటున నొదుగువారు ♦ నురుశరాసనబాధకై తెరలి తురగ ♦ కరికళేబరములు మాటుగాకనొడ్డి ♦ కొనెడువారును విశిఖముల్ తనువునాటి యవనిద్రెళ్లెడువారైరి యద్రిచరులు ॥

క॥ భూపాలుని శితశరముల ♦ నేపునయ్యింద్రజిత్తు నేయువిశిఖముల్ ♦ రూపర జేయుచు కపిబల ♦ మోపినచందమున బ్రోచుచుండిరి యంతన్ ॥

క॥ ముందటనమ్మాయ వనచర ♦ బృందముగూలుటలుజూచి బిట్టుసుమిత్రా ♦ నందనుడు వగచివిద్విషు ♦ నెందునరయ లేక యన్నకిట్లని పలికెన్ ॥

క॥ ధరణీశచూచితివె మన ♦ కొరకై చనుదెంచికపులు గూలెదరరిచే ♦ వెర వెద్ది వీరిబ్రోవగ ♦ నెరిగింపుమువీడజేయు డెందునెంచగన్ ॥

వ॥ కావున ॥

క॥ సురవిద్వేషణుమాయలు ♦ బరిమార్పగ నొకటగాదు పరికింపంగా ♦ నర వరయిదె బ్రహ్మాస్త్రము ♦ నరగునవై చెదన రాక్షసముగా జగతిన్ ॥

గీ॥ అనినరామచంద్రు డనుజునిగనుగొని ♦ యనఘచరిత యొకనికై యనేక ♦ జీవతతినిహింస సేయంగనుచితమా ♦ యరసిచూడుమయ్య నాత్మలోనా ॥

వ॥ అదియునుంగాక నిరాయుధహస్తుని నిద్రించువానిని వెరచిపరచిన వానిని యేమారియున్నవానిం జంపుట లనుచితంబు నీయరంగని సమరధర్మంబుగలదె కావున బ్రహ్మాస్త్ర ప్రయోగంబునకుం దరికాదు మనమెవ్విధంబున నైనను యీనిశాచరుని మాయాతిమిరంబుల మోఘసాయకాంబుజాప్త కిరణంబులవలన నణంగంజేసి వానిం బరిమార్పుట కార్యంబని యాతనినుపశమిత క్రోధుంజేసి శరభాంజనేయ ఋషభగజ గవయ గవాక్షనీలాంగద ద్వివిధమైంద సానుప్రస్థులను వారింబిలచి మీరలారావణిం బరిమార్చిరండని పుత్తెంచిన ॥

ఉ॥ ఆకపివీరులుద్ధవిడి నార్చుచునందరు నొక్కపెట్టుగా ♦ నాకసవీధినేగుచు నిశాటకులాధిప నందనుండు ఘో ♦ రాకృతిబూనియంతయు రయంబుననేయు కఠోర సాయకా ♦ నీకముదాకివార లవనింబడిరంతట వాడుదగ్రుడై ॥

గీ॥ పలుతెరంగుల నాలుకలుగ్రోలునుగ్రాహి ♦ సాయకంబులపుడు సకలదిశల విషములుమియునట్లు వెసబరగించిన ♦ నవియురోజుచును మహాజవమున ॥

క॥ కనియాదశరథసూనుల ♦ గనగొనుటయు జగములెల్ల భీతిల్లమనం ♦ బున గుందినగచరులు రా ♦ మునితమ్ముడు పెద్దబెట్టు మూర్ఛంజెందెన్ ॥

వ॥ అప్పుడు ॥

చ॥ వలనుగ వర్ణివేషముల వజ్రిహితార్థము దైన్యవృత్తిచే ♦ బలికి పదత్రయంబడగి పైకొని కొంకక కట్టికట్టి త ♦ త్ఫలమొగివచ్చి చుట్టుకొనె తప్పునెయేరికి పూర్వకర్మ మె ♦ వ్వలననటన్న భంగి రఘువల్లభుడుండె మహాస్త్రబద్ధుడై ॥

క॥ అనవిని శాంకరియిట్లనె ♦ ననఘాత్మనిజానుజన్ము డట్టులమూర్ఛి ♦ ల్లిన పిదప రాఘవుండే ♦ యనువునవర్తించెనాకు నానతియీవే ॥

వ॥ అనిన నయ్యంగనకు నంగజారాతి యిట్లనియె ॥

గీ॥ నరవరుండుమున్ను నాగాస్త్రబంధంబు ♦ చేతజిక్కి ధైర్యమూతగాగ ♦ బరగుచుండియిట్లు బడియున్న తమ్ముని ♦ మోముజూచితాను మూర్ఛజెందె ॥

వ॥ అయ్యవసరంబున భానునందన వాలినందన వాయునందన నీలసుషేణ ప్రముఖులు భయంబున రయంబున బరతెంచి యానృపాలురగాంచి పలుతెరంగుల బలవించ విభీషణుండు వారించుచుండె నంత మేఘనాథుండు రాఘవులు తనచేతనిల్చిన వారకాదలంచి నిశ్శంకుండై లంకకుంజని దశకంధరుంగనుంగొని తద్వృత్తాంతంబంతయు నెరింగించిన నద్దనుజపుంగవుండు ప్రహృష్టాంతరంగుండై నందనుం గౌగిటంజేర్చి వీడు కొలిపినవాడు జయధ్వనులెసంగని జని కేతనంబునకుంజనియె నంతనక్కడ ॥

క॥ జనవరుడుకొంతవడికిం ♦ దనలోనందెలివినొంది ధాత్రిస్థలి వ్రా ♦ లిన యట్టి సుమిత్రాత్మజు ♦ గనుగొని భాష్పములు దొరుగగా నిట్లనియెన్ ॥

చ॥ అడవికివచ్చువాడు వలదంచునుమాటికి సాటిచెప్పినా ♦ యుడుగక నేగుదెంచి దనుజోరగదుష్ట మృగోగ్రకాననం ♦ దిడుములనొందివేసరత నేడ్తెరరేయుబగల్లుగాచి యి ♦ ప్పుడుననునొంటిడించి చనబోలునె నీకరయంగలక్ష్మణా ॥

చ॥ నినుమదినమ్మికాదె ధరణీసుతజాడల నేగుదెంచి గ్రి ♦ క్కుననొక కోల వాసవిని గూలిచిభానుజు రాజుజేసి యీ ♦ వనచరసేన గూర్చుకొని వచ్చిసురాహిత కోటినిమ్మెయిం ♦ జనకుటనీవుయిప్పుడిటు జేసిన నెమనువాడ నక్కటా ॥

చ॥ ఒనరగపర్ణశాలకడ నుండగనోడక సీతనిట్లు దె ♦ చ్చిన దశకంధరుం బొలియ జేసినపిమ్మట గాకనయ్యయో ♦ మునుకొని యీనిశాటపతి ముక్కుననూపిరి గల్గియుండ నీ ♦ కును నిదురింపనెవ్విధిని గొల్పెమనంబు విరోధిభంజనా ॥

వ॥ అని మరియును ?

సీ॥ బాలత్వమునగూడి పాడియాడెడునాడు వెలయంగగురుశిక్ష మెలగునాడు ♦
గాధేయుజన్నంబు గావనెగెడునాడు నలిగితాటకికూల్చ నట్టినాడు ♦ తపసియిల్లాలును
దయదలంచిననాడు జనకునియింటికి జనెడునాడు ♦ శివువిల్లుఖండించి సీతజేకొనునాడు
పరశురాముని భంగపరచునాడు ♦ చలగిసాకేతమలరంగ జేరునాడు ♦ నించుకేనియు
నెడబాయ డెన్నడీట్టి ♦ లక్ష్మణునిబాసి నిల్వతరంబెనాకు ♦ నేమిసేయుదునింక
నేనెందుజొత్తు ॥

చ॥ తనయునికంటె నాయడను తాలిమిమెక్కువ యాసుమిత్రకున్ ♦ మన
మున వాక్కునంగలను మానుగచెయ్యాల యందునిట్టి యా ♦ జననికిపోయి లక్ష్మణుని
సంగరభూమికి నప్పగించి వ ♦ చ్చినకలుకాడయేనని యిసీమదినొంకక చెప్పబోదునే॥

చ॥ అనఘుడులక్ష్మణుండు వెలియైననయోధ్యకు నేగనేల యా ♦ జనకజయేల
యోమిటికి సంగరమున్ భరతాదితజ్ఞులన్ ♦ కనుగొననేల యందులకు గాని శరాసన
మేలనిమ్మహా ఘనవిశిఖంబు లేమిటికి కాయమదేటికి జీవమేటికిన్ ॥

క॥ అనియిట్లురామచంద్రుం ♦ డనుజునకై వగలబాగల నఖిలవనాటుల్ ♦
మనమున గుందుచునుండిరి ♦ కనుగవలనపారవారి కణములుదొరగన్ ॥

సీ॥ అపుడుగదాపాణియై విభీషణుడుదా నగచరసౌరక్షణార్థముగను ♦ నొనర
జరింపుచు కనుగొనికొంపరు శక్రజిత్తుండను శంకవడమి ♦ పారగావారల వారించినొలు
గెత్తి బిలచుచునెడయడ బలిముఖౌఘ ♦ ములకుధైర్యము దలకొలుపుచుమనుజేంద్ర
వరునిచెంతకుడాయ నరుగుదెంచి ♦ జలజబాంధవతనయ ముఖ్యులనుజూచి ♦ యుచిత
మేయిట్లుగుందుట యుద్ధమునకు ♦ వెళ్లయగుగాకయనుడు నవ్వాలిదనయు ♦ డచటి
వారలువినగ నిట్లనుచుబలికె॥

మ॥ ఉరగాస్త్రంబుల జిక్కిదాశరథు లిట్లున్నారలీవేళ నే ♦ మరగాబోలదు
గాచియుండుటయె పోమర్యాదయెల్లింక యు ♦ ద్ధరతన్ మీరలు బంపయేనచని దోర్దో
పంక్తికంఠాది యా ♦ సురవర్గంబుల ద్రుంచిశౌర్య మెసగన్ యుర్వీసుతందెచ్చెదన్ ॥

మ॥ అనుడాభాస్కరసూతి యిట్లనియె నెయ్యంబొప్పగాసేనలన్ ♦ గొనికిష్కిం
ధకు నీవుబొమ్ము సమరక్షోణిం దురాత్ముం దశా ♦ స్యుని ఖండించి విభీషణుండగను
రక్షోరాజుగావించి రా ♦ మునికీర్తుల్ దిశలందునిండగను భూపుత్రిన్ వెసందెచ్చెదన్॥

సీ॥ నావినిరవినంద నవ్వాలినందను జేరినిట్లనియె సుషేణుడకట ♦ దేవతలసు
ర్థులు తెంపునబోరునో యనిలోనదైత్యులయ్యమరవరుల ♦ బాణపాశంబుల బంధింప
నొచ్చిన వారలకాసుర వరగురుండు ♦ వలనుదివ్యౌషధుల దెచ్చిరక్షింప యేనెఱుంగుదు

నట్టి నిపుడుమనకు ♦ నాచరింపయుచిత మదియుచంద్ర ద్రోణ ♦ పర్వతంబునందు బరగుచుండు ♦ గానవానిపేరు కపికులోత్తములార ♦ విన్నవింతువినుడు విశదముగను॥

వ॥ విశల్యసంధాన సౌవర్ణ సంజీవకరణులనం బొగడ్త కెక్కియుండు నట్టిమహౌషధంబులు గొనితేర మారుతాత్మజుండు దక్క తక్కినవారికి నశక్యంబు గావున నిమ్మహాను భావుని బంచుటకా కార్యంబనిన నంతయు తన దివ్యజ్ఞానంబున నెరింగి దైవయోగంబున॥

సీ॥ భాసురంబున మేన బూసినభసితంబు నిండువెన్నెలతోడ నెత్తమాడ ♦ బంధురోన్నత జటాపటలకెంపుఛాయ బాలభానుద్యుతుల్ ప్రతిఫలింప ♦ శరదభ్రరుచితోడ సరివచ్చుమేనిపై పొదలుచు వెల్ల జన్నిదముదనర ♦ ననవరతంబు నారాయణశబ్దపరిపూర్ణమైతంత్రి విస్ఫూర్తి జలగ ♦ సవ్యకరమునందు స్ఫటికాక్షమాలికా ♦ చెన్నొసంగ హితము సేయబూని ♦ రామచంద్రుడాయ ప్రేమమైనరుదెంచె ♦ నారదుండు నయవిశారదుండు॥

గీ॥ ఇట్లుజనుదెంచి తనుగేశులెల్లమిగుల ♦ నభ్రపడిచూడ నమ్మహాయవధికాత్మ♦ లోనవగచుచు నప్పుడాజానకీధ ♦ వునకు నారదమునివర్యు డనియెనిట్లు॥

సీ॥ బొడ్డునగాంచిన బిడ్డడీలోకముల్ నేర్పున సృజనమొనర్పుచుండ ♦ యురమందు వసియించు తరుణీలలామంబు శిరులిచ్చిభక్తుల నరయుచుండ ♦ శంఖచక్రగదాది సాధనంబులుదుష్ట నహ్మారమునకును జాలియుండ ♦ పానుపైవసియించు పన్నగాధీశుండు ధరణీభరంబెల్లదాల్చియుండ ♦ నెపుడుసురలబ్రోచు నెపమూదియవనిపై ♦ మనుజవేషమెత్తి మసియుజిహ్మ ♦ గాత్రములకుజిక్క నాత్మలోపలసీకు ♦ వేడుకయ్యెనోటు విశ్వగర్భ॥

సీ॥ కమలజోచినపద్మ గర్భాండకోటులు క్రమమున మీయుదరమునదాల్చి ♦ అరయుచుమూర్తి త్రయాకారమునను ప్రవర్తింపుచును సురవర్గములను ♦ పాలింపరక్షింప పాకశాసనుడవై లీలమీధునికాయ మేలుకొరకు ♦ ధర్మ్మడనంగను దనరుచునుందువు నీకన్నపరముడే లోరమునను ♦ తెలసిచూడలేవు తెరగొప్పగానీవు ♦ విశ్వమయుడవాది విష్ణుమూర్తి ♦ వనఘునిన్నుబాసి నట్టిదియొకటైన ♦ కమలజాండమునను గానబడదు॥

ఉ॥ వేదములుద్ధరించితివి మీపునమోదితి వద్రిఘోరశివై ♦ మేదినియెత్తితర్భకుని మిక్కిలిప్రేమను బ్రోచితబ్బలిగ ♦ పాదముక్రిందద్రోచితివి పార్థివకోటి నడంచితింత నీ ♦ పేదశకంఠుద్రుంచి నుతికెక్కెదుజూబల బుద్ధకల్కివై॥

చ॥ తెలియనగోచరంబు భవదియ్యమహత్త్వము రామచంద్ర యో ♦ గుల కును నిన్నుగట్టనోడ గూడవజేయుడ వెన్ననిట్టు నీ ♦ వలయకజెందినట్టు లురగాస్త్ర వితానము చేతజిక్కుటల్ ♦తలపగలీల యోయనుగు తమ్మునిశౌర్యము జూచునందుకో॥

క॥ బలభేదికౌరకు మూడడు ♦ గులువేడి చలంబునెరపి కుచ్ఛితస్ఫూర్తిన్ ♦ బలి బంధనంబొనర్చిన ♦ ఫలమిదియని జెనులకెరుక పడజేయుటకో ॥

క॥ నీకిట్లుక్రీడసేయగ ♦ నీవనచరులెల్లనాత్మ నెరగకనీకుం ♦ గావగ చెదరదె కను వసు ♦ ధావరనీమాయ దెలియ ధాతకువశమే ॥

చ॥ ఇనకులవేడబంబులిక నింతియచాలును యింకమీకు వా ♦ హనమగుపక్షి వల్లభుని నాత్మదలంపుము వేగమాఘనుం ♦ డునిటకు నేగుదెంచిన కదుర్ఘపవ నాశన బంధసంఘ మ ♦ య్యనఘుడొకండుదక్క వినుమన్యులశక్యమె వీనిమాన్పగాన్ ॥

క॥ అనియిట్లుబంధమోచన ♦ మునకునుపాయంబుజెప్పి మునుకౌనిధరణీ ♦ శుని చేననుమతిగైకొని ♦ యనిమిషముని ముదమెలర్ప యరిగె నిజేచ్ఛన్॥

వ॥ అంత రఘుపుంగవుం డంతరంగంబున తనతురంబగు విహంగపుంగవుం దలంచిన ॥

మ॥ జగముల్ మూడవడంకకూర్మవిభు డోజన్ బిట్టుభీతిల్ల ప ♦ న్నగనాథుండు తలల్ వణంకగుడ్వగ మహేంద్రివారితముల్ గ్రుంగగా ♦ దిగిభంబుల్ కడుమోదిగిల్ల ఒడ దాత్రీచక్రమల్లాడ నా ♦ ఖగరాజుద్దతివెచ్చె ఖేచరగతిన్ గాఢప్రతాపోన్నతిన్॥

వ॥ అయ్యవసరంబున ॥

క॥ గరుడునిరెక్కలచప్పుడు ♦ యురగములకు చెవులజోకు దులికిధరిత్రీ ♦ శ్వర సుతులబాసియొక్కట ♦ బరచెనఖిలదిశలయందు పటువేగమునన్ ॥

క॥ ఉరగాస్త్రబంధనంబాగి ♦ పరిహారణియ్యంబుచేత బరునైరఘు భూ ♦ వరు నకు నిజభక్తమహా ♦ త్మ్యరహస్యంబెరుగసేయు దలచుటగాదే ॥

గీ॥ అంతవైనతేయు డమ్మోయిబంధ మో ♦ చన మొనర్చికపులు సంభ్రమమున తన్నుజూచుచుండ ధరణికినెతెంచి ♦ ప్రకటలీల దాశరథులడాసి ॥

వ॥ ఇట్లనియె ॥

మ॥ కమలాక్షాయ శుభ్రదాయ విలసత్కల్యాణ శీలాయ శ్రీ♦ రమణీశాయ నిరామయాయనృప వీరవ్రాతవీర్యాయ పు ♦ ణ్యమునిస్తుత్య పదాంబుజాయ కరుణా స్వాంతాయ ఘోరాఘ సం ♦ తమసాంభోరుహా బాంధవాయ పరమోదారాయ తుభ్యంనమః ॥

వ॥ అనిపలికి ॥

చ॥ అరిమరలేని ప్రేమ హృదయంబున హెచ్చ నృపాలసూనులం • గరముల మేనులన్ని పురగా వెస నప్పుడు రక్షితంబులు • దురగతి కప్పియాఘనులు తొల్లిటికంటె ప్రకాశమానులై • పరగిరియంత రామ జనపాలుడు తార్క్ష్యునితోడ నిట్లనెన్ ॥

క॥ పక్షివరమమ్ము గాచిరి • రాక్షసు బంధించి పన్నగాస్త్ర గ్రథితుల్ • మోక్షణమయ్యెం గానర • ఘుక్షితిపతి దక్షరక్షులుగ గొలచెదమనిరున్ ॥

క॥ అనవిని రాక్షసు డద్భుతము • జననాయకయింత బలుక జన్నేసిబం • టను గానె తలపయేనని • వినయంబున మ్రొక్కి నృపతి వీడ్కొని యరిగెన్ ॥

వ॥ అంత

ఉ॥ గ్రక్కున కీశసంఘములు గాఢనగంబులు భూరుహంబులొ • క్కొక్కడు పెక్కు గైకొని మహోగ్రతచే భయదగ్రవృత్తినే • దిక్కులు వ్రయ్య నార్చుచును ధీకొని దైత్యుల దాకి ద్రుంపుచున్ • మిక్కిలి బాహుసంపదల మీరి చరింప దశాస్యు డయ్యెడన్ ॥

సీ॥ ధూమ్రాక్షుఁ జూచి దైత్యుల సేనలగొని యాలంబు సేయగా నరుగుమనుడు వాడు సురారికి వలను గా మ్రొక్కిడి స్థానంబు వెలువడి సత్వరమున • చను దెంచి తనవెంట సమదకుంజరహయ • రథఘటాస్తోమంబు రాబకిండి • తేరెక్కి యుద్ధతి దిక్కులు వ్రయ్యంగ నార్చుచు ప్రశయాగ్ని ననుకరించి • హేతిబృంహితనాదంబు లెసగ భూష • ణములరుచులును వివిధాయుధముల కాంతు • లోలి మిరుమిట్లుగొనగ మహోగ్రవృత్తి గవిసె కపిసేనపై బిట్టు పుడమియద్రువ ॥

వ॥ తత్సమయంబున

చ॥ ఎదనెడ దుర్నిమిత్తముల కించుకగొంకక నేగివాడు రా • రడవిదళించు పావని యట్టులజేర్చి నిజాస్త్రవహ్నిచే • కడువడి కీశకాననము కాల్పగజొచ్చిన నొచ్చి విచ్చి తత్ • ల్లడమున పారె వానరబలంబులు దానవులుబ్బి యార్వఁగన్ ॥

వ॥ ఇట్లు బలంబులు తెరలుటగని వాయుతనయుం డెలింగిచ్చి మరలం బురికొల్పిన వార లద్దానవసైన్యంబు మార్కొని ॥

చ॥ బలువిడిగండశైలములు పాదపముల్గొని వైచి రాక్షసా • వలి ధరగూల్చు మార్ సమదకుంజర రథ్య శతాంగకంబులన్ • బాలియగ జేయుచున్ రథికముఖ్యుల నేచ మణంచి వ్రచ్చుచున్ • కలహమొనర్చిరచ్చెరువుగా సురసంఘము బిచ్చలింపగన్

చ॥ సునిశితపుల ఘటదగతి జట్టిమహింధప్రచరాళిపైని ని • ష్ఠురపరిశింబు

లేయుచును జొప్పడవారలు బూనివైచుచున్ ♦ ఘరఘరఘోరహుంకృతుల తద్దయునానక ముసేయుచున్ దిగం ♦ తరములునిండ నార్పుచు మదంబున శూలపట్టిత్రుంచుచున్॥

వ॥ రణవ్యాపారంబులు సల్పుచుండిరి వివిధంబున నిరుపాగుము బోరుచుండు నెడ వాయునందనుం డుద్ధవిడికి నుకందలకడచి యొక్క పిపాసిలో త్తుంగమహీరుహంబు కేలంబూని పరిపంథి సందోహంబు పైగవిసి గజవాజిరథ పదాతి వర్గంబు జదియమోది బడలు పడంజేయుచున్న జెబ్బులినాంచిన లేళ్లకమిం బోలె దానవసేనలు నలుగడలం జెరలిపరచి నంగని ధూమ్రాక్షుండు క్రోధారుణ తామ్రాక్షుండై యుగవణించి వాయుసూనునిపై తేరుజరపించి॥

ఉ॥ మంటలుబోనిమార్గణ సమాజముల్గ్రక్కుట నేర్చివేర్చిబల్ ♦ వింటనమర్చి యాప్లవగ వీరునిమేనను గీలుకొల్పి యే♦నింటనురంబునాటి పదియేనిట వాలముగ్రుచ్చి దేవతా కంటకుడార్చుచున్ విలయ కాలభుజంగము భంగిరోజుచున్॥

చ॥ అనిలతనూభవుండొక మహానగమున్ధతి నెత్తితెచ్చి యా♦ దనుజునియుగ్య ముల్జదియ తద్రథసారథిమగ్నకేతువుం ♦ దునియగ నస్త్రశస్త్రములు నుగ్గుగశాత్రవు డంతకాంతికం ♦ బునకు నరుంగగావయిచె భూరితరాద్భుత విక్రమంబునన్॥

వ॥ఇట్లు ధూమ్రాక్షు విగతప్రాణుంజేసి సింహనాదంబుగావించిన మారుతివరాక్ర మంబునకుం దలకి హతశేషులు లంకసొచ్చి గీర్వాణవైరికి యాతనిచావుజెప్పిన విన్నం బోయి యొక్కింతవడికి యనుకంపనుం గనుంగొని నీవానరవానరులం బరిమార్చిరమ్మని వీడుకొల్పిన నియ్యకొని వాడప్పు డపారబల సమన్వితుండై సత్వరంబున జనుదెంచి వానరసేనపై గవసెనంత॥

చ॥ ప్లవగసమూహదయంబ సురపంక్తియుదిక్కులు వ్రియ్యనార్చుచుం ♦ దివిరి యనేకభంగులను నిల్చినిలింపులు మెచ్చునట్లుగా ♦ లవనుమతీజసాధన బలంబునబెంపు వహించియొక్కయు ♦ ద్ధవిడిని బోరిరొండొరులు దాగుణవిక్రమణక్రమంబునన్॥

వ అంత॥

చ॥ కెరలియకంపనుండప్పుడు కీశులపై పటుఘోరకాండముల్ ♦ బరపిజలంబు పెంపునను బాహులునూరులు మధ్యదేశముల్ ♦ చరణములుత్తమాంగములు చెక్కలొ రింపుచు భూరివిక్రమ ♦ స్ఫురణరణంబుసల్పె నృపహూనులు నివ్వెరగందునట్టులన్॥

ఉ॥ అప్పుడుహ యుమూతి విలయాంతకుచల్వ వహించికన్నులన్ ♦ నిప్పులు రాలనాతడరి నిర్జరవైరి రథంబుమీదికిం ♦ గుప్పనదాటిరథ్యముల గూలిచిసారథి బట్టిచంపితే ♦ రుప్పరవీథివైచి సమరోర్విదయకంపను దృంచెవ్రేల్మిడిన్॥

వ॥ ఇట్లన్నిశాచరు కృతాంత సేవాపరుంజేసి రౌద్రరసోల్లసిత మూర్తియై శేషసైన్యంబుగదసి బారిసమరుచుండ నతని శౌరి కర్గలంబుగాక తొలంగిన దనుజులరిగి యనిమిషారాతికి నకంపనుపాటు జెప్పినవిని నిట్టూర్పులుచ్చి మహాకాయుంబిలచి నీవు పుడ చతురంగ బలసమేతుండవై యరిగి యరాతుల గీటణంగించి రమ్మని పంచిన ॥

సీ॥ అమ్మహాకాయు డత్యంతసంభ్రమమున నప్రహస్తానిస్థాన మంటపము వెడలి ♦ జవసత్వమమర పిశాచముఖంబుల బొల్పుగుఱ్ఱంబుల బూన్చినట్టి ♦ రథమెక్కి కార్ముకప్రముఖాయుధంబులు గైకొనిచక్రి రక్షకులమేయ ♦ బలులగురక్కసుల్ పలువురు బలసిరా వరరత్నభూషణావళుల రుచులు ♦ దిక్కులందునమిక్కిలి పిక్కటిలగ ♦ భూతతతిబెదరుచెంద నార్పులుజెలంగ ♦ సొరదిచతురంగబలములు చుట్టునడువ ♦ తరలె శీఘ్రంబదక్షిణ ద్వారమునను ॥

వ॥ ఇట్లువెడలి యాందంగనంబకు దుశ్శకునంబులకు దలంకక నీలమేఘంబులం బోని నిశాటవీరులుం దాను నురయంబునం బరతెంచి శరాసారఘోరంబుగా మర్కటవారంబులం బొదివిన ॥

చ॥ కపులుమహోగ్రవృత్తి సురకంటకవర్గము పైనిశైల పాదపములు ♦ నొక్కటంగురిసి దండడినేపడగించుచుండ నొ ♦ చ్చి పెలుచయామినీచరులు చెచ్చెర ఘోరతరప్రకాండముల్ ♦ తపనసుతాది వానర వితానముమేనుల గ్రుచ్చియుద్ధతిన్ ॥

వ॥ ఇట్లు భయబలంబు లుద్దండభుజావిక్రమంబు కలిమి జలంబు మెరసి పోరుచుండి రయ్యవసరంబున వజ్రనాభ, రుధిరాశన కాలదంష్ట్ర కాలకల్పవిపాశ శతమాయ ధూమ్రదుర్ధర మహానాదులను నిశాటవీరులు బలంబులవదలక దలకడచి ప్రళయకాల భైరవాట్టహాసంబులు నెరపుచు వాడితూపుల వేడిమిచూపుచు మునుమిడి పరశుపట్టె సప్రాసగదాది సాధనంబులు బరపి కపిబలంబుల నేపడంగింపుచున్నం గాంచి సహింపక పృథుగవాక్షబుమభ పనసగజ శతవలిశోధన హేమపుష్పాంగద వనాటముఖ్యులు పర్వతపాదప నివహంబుల నద్దనుజయోధుల రథరథ్యసారథి సహితంబుగా నుగ్గుగావించి దిక్కులువ్రయ్యవార్చి చతురంగంబుల బొలియింపుచున్నం గని ॥

ఉ॥ ఆయెడరోషముంజలము నాత్మనుసంపడిపెట్ట నమ్మహా ♦ కాయుడు విస్ఫులింగములు కన్నులగ్రాల మహోగ్రమూర్తియై ♦ సాయకజాలముల్ ప్లవగ సంఘము మేనులబిట్టునాటి తా ♦ తోయదమట్లుఘర్జిలుచు తోమరపట్టె సశస్త్రముఖ్యముల్ ॥

వ॥ బలువిడింబరపుచు నొక్కటం బలువుర గుదులుగ్రుచ్చినయట్లు గూల్చుచు మహా వాతప్రేరితంబైన దవానలుని చందంబున ననుకరించి కపిసేనా శాసనంబేర్పు

చున్నం గనుంగొని ।

చ॥ అలిగి లయాంతకాకృతిని నయ్యసురాధిప పౌత్రకుండు భూ ♦ తలమదృవంగ నార్చి సమదస్థితినొక్క మహీధరంబు దై ♦ త్యులు నలుదిక్కులంబరవ నుద్ధతిబూని నిశాటు తేరిపై ♦ బలువిడి నేయవాడవియు బాణయుగంబున ద్రుంచి యుగ్రుడై ॥

క॥ దండిగ సితకాండము లా ♦ ఖండలపౌత్రుకుని మేన గాఱించిన నా ♦ తండు పటురోషమున నొక ♦ కొండ పడిం గేలబూని గురుతరశక్తిన్ ॥

గీ॥ ఆర్చి వైవ నప్పు డమ్మహాకాయుండు ♦ తేరితోన చదిసె త్రిదశులార్త ♦ సంతసింప దితిజ సంఘంబు దుఃఖింప ♦ నరిగె కాలుప్రోలి కక్షణంబ ॥

వ॥ అంత ॥

గీ॥ సమరమున జాకతప్పిన యమరరిపులు ♦ పరచి లంకాపురము సొచ్చి పంక్తి కంఠు ♦ గాంచి యులుకుచు నమ్మహాకాయు తెరగు ♦ జెప్పవిని రావణుండు మూర్ఛిల్లి తెలిసి ॥

వ॥ కొండొకవడికి ధైర్యంబు దెచ్చుకొని సేనాధిపతియగు ప్రహస్తునిం గనుంగొని ॥

గీ॥ అఖిలసేనా ప్రయుక్తుండ వై రయమున ♦ నీవు చనివృక్షచరులను నృపసుతులను ♦ గీటడంగించి రమ్ము నీకీర్తి దిశలు ♦ నిండునట్టులయానయామి నీచయుండు ॥

వ॥ కయ్యంబున కాయితంబై చతురంగ బలంబులం గూడి తనమంత్రులు నరాంతక కుంభహనుమహానాద సమున్నతులు తోడరా నత్యున్నతంబైన తెరెక్కి శంఖ కాహళ భేరీమృదంగ రావంబులు దిక్కులు కలయ నిండ జను దెంచి కపిసేన దరియం జొచ్చె నా సమయంబున ॥

క॥ ఫలభుక్కులు కపిసంఘ ♦ మ్ములపై జెల్లుగను బాణములు గురిసిన గో ♦ తులు వానిచేత నొచ్చియు ♦ తలకక రోషమున పొంగి దర్పోద్ధతులై ॥

క॥ తరులు గిరులు ద్ధవిడిగొని ♦ సురవైరులమీద వైచి జూపరులకు ని ♦ బ్బరకము దోపగ గూల్చిరి ♦ ధరపై రాఘవులు కడుముదంబున చలగన్ ॥

వ॥ అదిగని సహింపక నరాంతక కుంభహనుమహానాద సమున్నతులు దల మిగిలి ప్రళయకాలా భీలంబుగా నార్చుచు పరశుపట్టిస ప్రాసకుంతాది సాధనంబులు బరపి గిరి చరనివహంబులం దరమినం గినుక వాడమి ద్వివిధ తారజాంబవంత దుర్ముఖులు వారి నలువురం దలపడి పోరు ఘోరంబుగా నొనరించి రందు ద్వివిధుం డొక్క గండశైలం జేసి నరాంతకుని యంతంబునొందించె తారుండు సాలవృక్షంబున కుంభహనుని పొలి

గలనికి బనిచె జాంబవంతుండు విపులభూమీంధ్రంబున మహానాదుని బిలుకుమార్చె దుర్ముఖుండొక మహీరుహంబున సమున్నతుని గతజీవునింజేసె నివ్విధంబున సచివ చతుష్టయంబునుం బొలియుటగాంచి కుపితాంతఃకరణుండై ప్రహస్తుం డుపవా నగురిఁ కపిసంఘంబును బడలుపడంజేయు నవసరంబున ॥

ఉ॥ నీలుడుభూరిరోషమున నింగియుభూమి దలంకనార్చి యా ♦ శైలవరాగ్రమస్థితిని శేర్చినిశాటునెదిర్చి వానిపై ♦ శైలము వేయవాడది నిశాతశిలీముఖ పంచకంబుచే ♦ తూలగజేసె జెట్టిదవు తూపులవానర వీరు నేయుచున్ ॥

గీ॥ దానవొచ్చివాడు తలగకనొకసాల ♦ విద్రుమంబుబూని విబుధసమితి ♦ పొగడవానిరధము భోరునజడిసిన అలుక వడమి యావప్రహస్తుడపుడు ॥

క॥ ధరణికిలంఘించి నిశా ♦ చరవీరులు బొంగతీవ్ర సాయకముల జ ♦ ర్ఘరితాంగుని జేసిన యా ♦ తరుచరవీరుండుబాహు దర్పమెలర్పన్ ॥

గీ॥ ఒక్కపర్వతంబు నుక్కనగొనిదిక్కు ♦ లద్రువనార్చివేయ నాప్రహస్త ♦ డాఙభూమిగూలె హరిహయుపవిచేత ♦ గూలునట్టిదొడ్డ కొండపగిది ॥

వ॥ ఇట్లు ప్రహస్తుండు దండధరునియుండకుం జనుడు హతశేషులు లంకకేగి దశకంఠున కతనిపాటుచెప్పిన యొల్లంబోయి కొంతతడవునకుందేరి దీర్ఘనిశ్వాసంబులుచ్చి మహానాగంబు తెరంగున బిట్టురోజుచు కన్నులనిప్పులురుల దిక్కులుగలయ బరికించి నేడుసమరంబున పగతురపొడచిగెలుతు కాదేని వారిచేతంజత్తునని నిశ్చయించి ప్రస్థానభేరివాయించిన ॥

క॥ కూలబడెకుధరములు ది ♦ క్పాలుర గుండియలుబగులె కలగెపయోధుల్ ♦ వ్రీలెను ధారుణిశిరములు ♦ వ్యాళేంద్రుడు మిగులవంచె వణకెజగంబుల్ ॥

సీ॥ అంతనాదశకంఠు డతులితోన్నతమైన తేరెక్కితనవెంట వీరవర్యు ♦ లగునట్టి యింద్రజిదతికాయదేవాంత కనరాంతకనికుంభ ఖడ్గరోమ ♦ త్రిశిరమహాపార్శ్వవృశ్చికోరగరోమ యూపాక్షకుంభ మహోదరాగ్ని ♦ వర్ణవిద్యుజ్జిహ్వ వజ్రనాభాది మహాయోధగణము సతాంగ గజతు ♦ రంగములనెక్కి వివిధశస్త్రాస్త్రసంఘకములుధరియించి చనుదేరగానరాతి ♦ సంచయంబులనవలీల సహ్మరింతు ♦ ననుచు నుద్ధతినేతెంచె నాలమునకు ॥

వ॥ ఆసమయంబున రామచంద్రుండు విభీషణుం గనుంగొని ॥

సీ॥ అనఘవిభీషణ హరిదశ్వవిధమున యీవచ్చుచున్న వాడెవ్వడొక్కొ ♦ గావుడీతడునరనాయకలోకవి ద్రావణుండగునట్టి రావణుండు ♦ భండనమున ప్రహ

స్తుండు గూలుటవిని యాగ్రహంబూని బలాఢ్యులైన ♦ దానవవీరులు తనపజ్జనే తేర బరతెంచుచున్నాడు ప్రబలుడితడు ♦ సంగరంబునయందు నిశ్చయముగాను ♦ దేవ మీరలు దృఢతరస్థితిదనర్చి ♦ వలనుమీరంగ శరలాఘవమునుజూప ♦ వలయు లేశము కృపజూడ వలదు వలదు ॥

ఉ॥ నావుడురామచంద్రుడు మనంబుననబ్బురమంది వీడు రా ♦ జీవహితుండ పోలె నతిచెల్వొసఁగొప్పుచు నున్నవాఁడు స ♦ ద్భావముతో మెలంగిన శుభస్థితినీత్రిజ గంబులేలు వా ♦ డైవిలసిల్లగాదగిన యాతఁడటంచును బల్కుచుఁ వెసఁ ॥

క॥ అనుజన్ముండును తానును ♦ ఘనతరకవచములుదాల్చి కార్ముకములుచే ♦ కొనిరంత గిరులుతరులుఁ ♦ ఘనతరముగబూనినిల్చె కపిసంఘంబుల్ ॥

వ॥ అప్పుడు ॥

క॥ తనవెంటనరుగుదెంచిన ♦ దనుజులనందరనునిలపి దశకంథరుఁడే ♦ జనియిదె విమతులనోర్చెద ♦ గనుగొనుడీయంచుబలికి కడునుద్ధతుఁడై ॥

క॥ సారథియారదముఁదోలఁగ ♦ భూరమణునికడకునేగి భోరునకీశుల్ ♦ ప్రారూఢి గిరులుతరులుఁ ♦ ఘోరముగానొక్కపెట్ట గొనకొనివైవఁ ॥

క॥ అమరారివానివెస జూ ♦ ర్ణముగానొనరించి పటుశరంబులచే భూ ♦ రమణుండు జూడకీశుల ♦ క్రమముననోడించె బాహు గర్వస్ఫూర్తిఁ ॥

శా॥ అంతంబోకదశాస్యుఁడేయు చటులోగ్రామోఘ పుంఖాళి దా ♦ రెంతే ధీరతనోర్చి బాద్రిచరు లుర్వీంధ్రంబులం దెచ్చి య ♦ త్యంతక్రోధముతోడ వైచినను దైత్యాధీశుడుఁ వాని దా ♦ నింతింతల్ నురుమూడికట్టలుకచే యేవంకనుందానవై ॥

క॥ బలువిడిశరములు బరపుచు ♦ పలువురగూల్చుచునుతొడరి భంజింపుచు భూ ♦ తలమద్రువనార్చుచును దో ♦ ర్బలమొప్పగ ప్రళయకాల భైరవుపగిదిఁ ॥

వ॥ కపిబలంబులం గడతేర్చుచుండంగని రోషావేశాంతరాత్ములగుచు సుగ్రీవాంగదాంజనేయ నలాదివానరముఖ్యులు కులగిరులంబోని మహీధరంబు లొక్కుమ్మడిం గొనివచ్చి యానిర్జరారిపై వైచుడు వాడుచలింపని ధైర్యంబున నిజవిశిఖంబు లంబరపి వానిచూర్ణంబుజేసి మహాగ్రహంబున ॥

మ॥ చటులోగ్రాశుగ యుగ్మమంగదు భుజాస్తంభంబుగీలించియే ♦ నిటసుగ్రీవుని వక్షముంజొనిపి పన్నెంటన్నలునొంచి యొ ♦ క్కటవాతాత్మజు దూలనేసి ప్లవగాంగంబుల్ వెసందూరగా ♦ పటునారాచ పరంపరల్ బరపి కుంభద్విక్రమారంభుఁడై ॥

వ॥ ఇవ్విధంబున కపిమొత్తంబులంగలంచి యవష్టంభ విజృంభ సారంభుండై

విహరించు నద్దానవరాజుం గాంచి సుమిత్రానందనుం డెడసొచ్చి యప్పుడు ॥

మ॥ ఘనరౌద్రాకృతి విల్లునారి మొరయుంగా జేసి యొక్కుమ్మడిం ♦ దనుజాధీశుని మేన ఘోరతర కాండశ్రేణి గీలించి వెం ♦ టనె మూడమ్ముల కేతువుం దునిమి రెంటన్ సారథిన్ ద్రుంచి స ♦ య్యన వెయ్యుంటహయాంగముల్ జొనిపె బాహాకౌశలం బేర్పడన్ ॥

ఉ॥ వానికిఁ జీకికింగొనక దానవనాయకు డల్లనవ్విరా ♦ మానుజు మేన నస్త్ర నివహంబు ఘనంబుగ గీల్కొల్పి లో ♦ మానినసన్మ్యశక్తిఁ గొని యుద్ధతి నేయు నురంబు గాడి యెం ♦ తేనియు వ్రాలె నాతఁడు జిగీషలు గీషలు సంచలింపగన్ ॥

వ॥ ఇట్లు సుమిత్రానందనుండు మూర్ఛాక్రాంతుండైన నతని లంకకుం గొనిపోదు నని తలంపున దశకంఠుండు రథంబు డిగ్గి డగ్గఱి తనవింశతికరంబుల నమ్మహావైష్ణవ తేజోమూర్తి గాత్రంబు గదలింపనోపక జలంబునొంది తనలోన ॥

గీ॥ శివునితోడఁగూడ నవలీల ఖర్జూర ♦ భూధ్రమెత్తినట్టి భుజబలంబు ♦ వమ్మొ జెందె జిరుత వాని నిల్పెత్తలే ♦ నైతి ననుచు బలుకు నవసరమున ॥

ఉ॥ గ్రద్దన వాయుపుత్రుఁ డలుకం బరతెంచి నిశాచరేశ్వరుం ♦ గృద్ధిబడంగ ద్రోచి కపికోటి నుతింప సుమిత్రపట్టి దా ♦ నుద్ధవిజెత్తి తెచ్చి సమరోర్విని యాతని పాటుజూచి యా ♦ పద్దశనొందునట్టి నరపాలుని సన్నిధి డించెనంతయున్ ॥

గీ॥ అనిలజుని ముష్టిహతి నొచ్చి యద్దశాస్యు ♦ డవని మూర్ఛిల్లిపడి లేచి యతని చేతి ♦ బలిమి కచ్చెరువందుచు నలుకగదుర ♦ నరిగె రథమెక్కనంత నాసరవరుండు ॥

చ॥ అలుకమనంబునం గదుర నయ్యనిలాత్మజు హంసమెక్కినడై ♦ త్ర్యులు బెదరంగ డాసి చటులోగ్రశరంబుల రావణాసురుం ♦ జలువిడి నాట వాడతని పైకొని మమ్ములగృచ్చికేసులుం ♦ దలకగ నార్చె వానృపుడు దారుణవిక్రమణక్రమంబునన్ ॥

ఉ॥ ఆకటి పెల్లుచే మృగకులాధిపుఁడుద్ధతి సామజంబు నె ♦ చ్చోకదలంగనీని గతి ద్రిస్సురారిని గిట్టి దేవతా ♦ నీకము బిట్టు మెచ్చ దననేర్పు శరాసన కౌశలంబు న ♦ స్తోక రౌఘులాఘవము జూపెదగన్ సమరాభిరాముఁడై ॥

ఉ॥ ఇక్కడ బెట్టు గాదగలె నిక్కడ లేతన నాకయుండ సు ♦ క్కెక్కిన సాయక శ్రతి యేడ్తెరగా దశకంఠుమేనిపై ♦ గ్రిక్కిరియంగ నాటె యురికిన్ మదిలోపల మెచ్చుట్టియి ♦ జిక్కటి బోర బోలదన యేమగతిం గనుపట్టునట్టులన్ ॥

క॥ భూరమణుని కఠినశరా ♦ సారంబున తొవ్వదోగి శక్రరిపుడు తా ♦ వైరులు స్వగలంకకు ♦ బారెం బదితలలుపీడ పటువేగమునన్ ॥

వ॥ ఇట్లుపారి లంకసొచ్చి యల్లవారల నిజనివాసంబులకుం బోవంబనిచి తాను నభ్యంతరమందిరంబున కరిగి డప్పిదీర్చుకొని మరలి యేకాంత మంటపంబున కేతెంచె నిట రామచంద్రుండు హనుమదంసావతరణంబొనర్చి సుమిత్రానందనుండు మూర్ఛదేరి లేచి యన్నపాదంబులకు ప్రణమిల్లె రఘువరుండు ప్రముదితాంతరంగుండయ్యెనని శంకరుండు కాత్యాయనీదేవికిం జెప్పినట్లు సూతుండు శౌనకాదులకు వినిపించిన విని సంతోషచిత్తులై తదనంతర విశేషంబానతిమ్మని వేడుటయు ॥

మ॥ సమదారిందమ రామమూర్తి ఘన భాస్వత్కీర్తి శ్రీవైష్ణ వో ♦ త్తమ విజ్ఞానధురీణమాధవ పదధ్యానాంచితస్వాంత త ♦ త్వమహాంభోనిధి మందరాచల దయావత్సల్య సంధాయి న ♦ న్యమతాళిప్రజ గంధవాహబుధ లోకారాధ్య సత్యవ్రతా ॥

క॥ రంగేశపాదసారస ♦ భృంగీశకుతర్కజన విభీషణసాంగో ♦ పాంగశ్రుతి గణపారగ ♦ రంగద్బుధ జనకులాంబురాశి హిమకరా ॥

వనమయూరవృత్తము॥ సూరిజనసన్నుత విశుద్ధగుణ ధీరా ధారనిజసేవక నిధాన సమవాస్త్రా ♦ ధారకులదీపక జగన్నాథసుత వ ♦ స్సారపావేత రవిచార పరివారా ॥

గద్య॥ ఇది శ్రీభద్రాద్రి రామభద్ర వరప్రసాద లబ్ధకవితావిచిత్ర గిరుము నామాత్య పుత్ర గౌతమగోత్ర ఆపస్తంబ సూత్ర ప్రసిద్ధ సిద్ధనమంత్రి ప్రణీతంబైన శ్రీసదాశివ రామాయణంబను మహాకావ్యంబునందు రామభద్రుండు వనచరసేనలం గూడుకొని లంకపై నెత్తి వచ్చుటయు విభీషణబుద్ధియు రావణుండు విభీషణుని వెడలం ద్రోపించిన నతండు రామచంద్రు నాశ్రయించుటయు సముద్రప్రార్థనంబును రఘువరుండు వారిరాశిపై కోపించితొడగిన బ్రహ్మాస్త్రంబు దృశ్యగుల్మంబుపై నేయుటయు సేతుబంధనంబును సకల వానరసేనలు సువేలాచలంబున విడియుటయు అంగదరాయభారంబును దైత్యవానర యుద్ధంబును నాగపాశబంధంబును రామచంద్రుని కడకు నారదుండువచ్చి హితోపదేశంబు సేయుటయు గరుడాగమనంబును నాగపాశ బంధమోచనంబును ప్రహస్తాది దానవులు సంగరంబున కూలిన రోషించి రావణుండు యుద్ధంబునకువచ్చి పలాయితుండై లంకకుమరలి చనుటయు నను కథలంగల యుద్ధాకాండ ప్రథమాశ్వాసము సంపూర్ణము. శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః ॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ





శ్రీసీతారామ లక్ష్మణ భరత శత్రుఘ్న

◆ శ్రీ రా మ చం ద్ర ప ర బ్ర హ్మ ణే న మః ◆

# యుద్ధకాండ ద్వితీయాశ్వాసము ప్రారంభము

శ్రీమహితకీర్తి నిఖిల ధ ◆ రామండిత సద్గుణాభి రామ బుధేంద్ర ◆ స్తోమతను చారుసీత ద ◆ యామూర్తి కిడాంబి వెంకటాచార్యవరా ॥

వ॥ విన నవధరింపుము సూతుండు శౌనకాదుల కిట్లనియె నట్లు క్షోణీధర కార్ముకుండు పరమాదరంబున భూధర రాజ నందనం దనం గనుంగొని ॥

చ॥ రణమున నత్తెరంగున పరాభవముంగని విన్నబోయి రా ◆ వణుడు మనంబులో భయము వంతయు నార్తిని జెందిదీనుడై ◆ ప్రణుతపరాక్రముండగు నృపాలుని బాహుబలంబు శౌర్యముం ◆ గణనమొనర్చి గెల్వకృతి గానకయుల్లన ధైర్యమగ్నుడై ॥

క॥ అనుపమ బలవిక్రముడగు ◆ మనఘటకర్ణుండు గలుగ మనుజులకపులం ◆ దునుముటకు చింతయేటికి ◆ యనువున మేల్కొలిపియిచటి కతనిం దెమ్మా ॥

వ॥ అని యూపాక్షుం బనిచిన నతండు నిద్రించుచున్న యాడకుంజని యప్పుడు ॥

సీ॥ దనుజులనేకులు దండిగా కుంభకర్ణునిజేరు గొనిపిలచి వినయమెసగ ◆ కదలించిబిట్టుగా ఘర్జనంబొనరించి కన్నురెప్పలువిరచి కరచిచరచి ◆ పరగున మేనిపై శకటముల్ బరపించి మూపుపైగుదియలు మోదిమోది ◆ యినుపశలాకలు కనలెడు నూనెయు చవులముక్కులనించి వివిధగతుల ◆ మేలుకొలుప నెట్టకేలకు తెలసిన ◆ వానికపుడు వలయు వంటకములు ◆ మాంసరాసులస్థి మస్తిష్కములుమధ్య ◆ భాండ చయములిడిన పరగవాడు ॥

వ॥ లేచికూర్చుండి వానినన్నిటి నొక్కపెట్టమెసంగి కనతిదూరంబున నిలచి యున్న యూపాక్షుం గనుంగొని నన్నిట్లనిద్రదెల్పుటకు గతంబెద్దియనిన దేవా రాజ పనుపున నిట్లాచరించిన వారము మీరలచ్చటికి విజయంచేసి యతనితో మాటలాడు టకు ప్రయోజనంబుగలదని విన్నవించిన యానిలింపద్వేషి యప్పుడు ॥

ఉ॥ గ్రద్ధనలేచి మబ్బొదవగా దశకంఠుని జేరిమ్రొక్కి నా ◆ నిద్దురమేలుకొల్పు టకు నివ్వెరగె న్యది రాక్షసేంద్ర నీ ◆ వెవెనకన్నగాదలచి తే యదికార్యమెరుంగ జెప్పుమా ◆ యుద్ధవిడేగయచ్చట యథోచితశౌర్యము జూపివచ్చెదన్ ॥

వ॥ అనిన నతండు గద్గదస్వరంబున రామచంద్రుని యద్భుత విక్రమంబును

నిశాచరవీరుల మరణంబును తనకైన పరాభవంబును క్రమంబున నెఱింగించి యారాఘవుల జయించు నుపాయంబు లేమికి చింతించి నాకైన యడకువాయుటకు నీవుదక్క తక్కొరులు జాలరని నిన్ను నిదుర దేలిపించితినని పల్కిన కుంభకర్ణుండిట్లనియె ॥

చ॥ దనుజకులేశ రామ వసుధావరుతో ననిలో నెదిర్చి గె ♦ ల్వనరిది శూలికేనియు దలంపనశక్యము రమావరుండు దు ♦ ర్జనులను సంహరింపగ ధరాస్థలిపై మనుజత్వమూనెడిదా ♦ జననమునొందినాడమర సంఘము ప్రార్థన సేయనిమ్మెయిన్ ॥

వ॥ కావున నతని యంగనారత్నంబు మరలనిచ్చి యాదయానిధి శరణంబు వడయుట యుత్తమకార్యంబని వెండియు ॥

చ॥ మనకును ధాత తాతయు నమూర్త్యుడు దేవరయైనయట్టియ ♦ వ్వనరుహసంభవుండతని వారనిభక్తిని నాశ్రయించి శో ♦ భనములు నందుచుండు నను భవ్యులమై శరణొంది యమ్మహా ♦ త్ముని కృపగాంచినందలప దోసము వచ్చునె రాక్షసేశ్వరా ॥

క॥ అనుడా రావణుడిట్లనె ♦ వనజాక్షుడు రాఘవుండు వసుధాత్మజయే ♦ వనజాలయ యగుటెరుగుదు ♦ మనమున నిల్లెరిగి యెరిగి మానితబుద్ధిన్ ॥

గీ॥ అవనితనయదెచ్చి తారఘువీరుచే ♦ బొలసి మోక్షలక్ష్మి బొందుకొరకు ♦ వలయునేనిపోరు వాంఛమైజీవింప ♦ మదిదలంచితేని నిదురబొమ్ము ॥

వ॥ అనిన నతండు దరహాసిత వదనుండై యన్న పాదంబులకు ప్రణమిల్లి మున్నొక్కనెపంబున నీపరమరహస్యంబు దిన్నవాడనై నీకువిన్నవించితి నింతియె కాక నాకు నీహితంబొనరించుట కంటె లాభంబున్నదె యిదియె నిపుడచని యరాతులం జమఃమ్రింగెద నీమెచ్చువచ్చెదనని శీఘ్రగమనంబున లంకానగరంబు ప్రాకారంబు దాటి ॥

సీ॥ చరణఘట్టనలచే ధరణిదలంకంగ యార్పునబిట్టు బ్రహ్మాండమగల ♦ బొమముడిపాటున భూతముల్ గంపింప హుంకారమున దైత్యులులికిపరవ ♦ యట్టహాసమున దిశాధిపుల్ బెగడొంద యుశ్వాసమున కపులూగియాడ ♦ నవుడుకరపున సురలాత్మల ధైర్యముల్ వదలంగభూరి నిశ్వాసగతిని ♦ వార్ధితరగలు బెనకువ వంగిచనగ ♦ నీలతనుకాంతి యప్పద్మినీ మనోహ ♦ రుని వికాసంబుగప్ప నక్రోధుడగుచు ♦ కపులపై వచ్చె యక్కుంభకర్ణుడపుడు ॥

క॥ ఆతనియాన్నత్యము న ♦ య్యతులతను స్థూలమునకు నచ్చెరుపడి కి ♦ శతతివినంగను రాక్షస ♦ పతితమ్ముని తోడ రామభద్రుండనియెన్ ॥

క॥ అనఘవిభీషణ యీావ ♦ చ్చు నగోన్నత కాయుడెవడు జూడము దశకం ♦ ఠునకు సహాయముగా వ ♦ చ్చిన జముఁడో భైరవుండో చెప్పుము తెలియన్ ॥

వ॥ అనిన విభీషణుఁడిట్లనియె దేవా యితండు కుంభకర్ణుండు దశాననానుజుం డతిబలసంపన్నుఁడు దేవా సురలకజేయుండు పుట్టినప్పుడే యొకటి పెల్లున నఖిలభూత క్షయంబొనర్ప పరమేష్ఠి యితని కారు నెలలు నిద్రయు నొక్కదినం బాహారంబుగా నుండునట్లు వరంబొసంగి బలాత్కారంబున నిద్రమేల్కొల్పం బడిన యప్పుడే సచ్చు నని యానతిచ్చినవాడు గావున నేడు రావణుని ప్రేరేపకత్వంబున మేల్కొంచివచ్చిన వాడని విన్నవించినవాని యాకారంబునకు రామచంద్రుండు వెరగంది చూచుచుండె నంత యన్నిశాచరుండు వనాటులం డాసిన ॥

క॥ కపులొక్క పెట్టు భూరుహ ♦ విపులమహీధరములేయ వెననవియా దే ♦ వ పతిరిపు వక్షనిహతి జ ♦ ర్జరపలై యుక్కుమ్మడిని ధరిత్రింబడుడున్ ॥

ఉ॥ అచ్చగువంది యాప్లవగు లార్చుచునుద్ధతి గండశైలముల్ ♦ జెచ్చెర నేయ వాడవియు జీరికొకించుక యుంగొనాక కా ♦ ర్చిచ్చు మృగంబులం బొదువు చెల్వున కోతుల వ్రింగజొచ్చె దా ♦ పెచ్చుపెరింగిజీవముల బట్టిదిగీకులు తల్లడిల్లగన్ ॥

క॥ అమ్ముల గపుల ననేకుల ♦ నమ్మనుజాశనుడు మ్రింగ నప్పుడు వారో ♦ క్కుమ్మడి వెడలుదురద్రి బి ♦ లమ్ముల కెనయైనవాని రంధ్రములవెనన్ ॥

గీ॥ అదిమొరిగికుంభకర్ణు డయ్యచలచరుల ♦ పదుర నూర్వురనొక్కట బట్టి నులిచి ♦ యించుకేనియువిసువక నెప్పటట ♦ మ్రింగుచుండెను దైత్యులుప్పొంగుచుండ॥

వ॥ ఇట్లు తుంగమదువు గలంచు మాతంగంబు విధంబున కాననంబేర్చు దవాన లంబు చందంబున కాలహక్వజన సహ్మరక్రీడ నలుపులీల భూధ్రచరులబట్టి నులిచిపేర్చి మ్రింగుచున్నంత ॥

చ॥ పులిబొడగన్న లేళ్లగమి పోలికనిల్వక నల్లదిక్కులన్ ♦ బలిముఖసంఘముల్ దలకి పారగ సేనలనిల్పి నాకవా ♦ సులు తనుమెచ్చనగ్గలిక సొంపునభానుజు డేచి యాచుంచున్ ♦ కులిశముబోనిముష్టిహతి గ్రుద్దెనిశాటుని రొమ్మువిట్టుగాన్ ॥

వ॥ ఇట్లు గ్రుద్దిన ॥

క॥ దానికిదనలోమెచ్చి ద ♦ శాననుతమ్ముండు భీషణాకారుండై ♦ పూనుక శూలముబొడిచెను ♦ వానరపతివక్షమందు వారనియలుకన్ ॥

వ॥ ఇట్లు రవిసూనుండు శూలపుపాటున బెట్టునొచ్చి చచ్చిన విధంబున నొల్లం బోయి నేలవ్రాలిన నద్దశముఖానుజుండు యతనింబట్టి మూపున నిడుకొని కపుల

యాహారవంబులు చలంగ లంకానగరంబున కరుగుచుండె నయ్యెడ నాంజనేయుండా వనచరపతి విడిపించుటకు శక్తుండయ్యు నతండభిమానియు బలపరాక్రమశాలియు నగుట నెఱింగి యదనిగాచుకొని పిఱుందనుం జనుచుండె నంత సుగ్రీవుండు కోట లోనబోవ కుంభకర్ణుని యొడిలిమీద మూర్ఛదేలి తన్నువాడు బట్టితెచ్చుటెఱింగి

మ॥ మునుతన్నేలినవాడు శూర్పణఖకుం మోసంబుగావించుటల్ ♦ గనడీ దుష్టుడు పినికిప్పు డెరుగంగాజేతు నన్నటుల ♦ ద్దిననాథప్రియసూతియొక్కటను వానికిం లోకముల్ నవ్వ ము ♦ క్కును చెవులుందునియంగ గొర్కికొని దిక్కుల్ వ్రియ్యగానార్చుచుం ॥

వ॥ రామచంద్రుని సన్నిధానంబునకుంజని మ్రొక్కినిలచె నంత కుంభకర్ణుం డత్తెఱంగున పతంగసూతిచే భంగపాటుంగాంచి ఈయోజముఖంబున రావణుని ముఖం బెమి చూతునని లజ్జించి ముక్కునవెడలు రుధిరంబు నోటికిరానుమియుచు తన్నుదానె రోయుచు నాదవిన కినుకబ్రితుకు నాసపిటబుచ్చి మరలి దొడ్డుక్రొంచంబు దలంపక కాలమృత్యువు ననుకరించి మున్నుగడచిన దినంబుల నాటియాకలి దీరునట్లుగా కపి బలంబులకుం గవిసిమ్రింగుచు నెదురులేక చరింపుచున్నంత ॥

క॥ వనచరులు దైన్యవృత్తిని కనుకనిపరువంగజూచి గంధమాదనుం ♦ డనిలజ ముఖ్యుడు పొగడగ ♦ ఘనశైలము కేలబూని కడుశౌర్యమునన్ ॥

గీ॥ అసురమీద వైచి యాగ్రహంబునవాని ♦ రొమ్ముదన్ని నిర్జరులునుతింప ♦ వాడిగోళ్ల మేను వ్రిచ్చినగోపించి ♦ కుంభకర్ణుడపుడు కుధరచరుని ॥

క॥ అరచేత వ్రేసిమూర్ఛం ♦ దొరసిన నందుకొనినులిచి దుర్మదవృత్తిన్ ♦ గిరి చరులు దలకమ్రింగి యె ♦ దురులేని కడంకమెరసి తోడ్తో మెరయున్ ॥

వ॥ అగపడిన యగచరులం దెగటార్చుచు రఘుపుంగవుం జేరి ॥

మ॥ విలుకాండ్రందున పేరుకెక్కిన మహావీరుండవంచున్ సము ♦ జ్వలవిస్ఫార నిశాతఘోరశర రాజశ్రేణియుంబెట్టుగా ♦ గలవాడంచును యేటుకాడనుచు సంగ్రా మోర్విలో యట్టి రో ♦ ధుల లెక్కింపవటంచు జెప్పగను విందునిన్ను భూపాలకా ॥

క॥ నీవింటి నేర్పుభుజబల ♦ లావును శరలాఘవంబు లవిగనియెదరా ♦ జీవాత్మ శంక సేయక ♦ వేవేగంజూనుపుమాప వితతిపెల్లుగాన్ ॥

వ॥ అని పెచ్చుపెరిగి సంగరంబున తన్నుతానె యెఱుంగక నాకడింది నిశాచ రుండు మార్కొనిన ॥

ఉ॥ ఆరఘువీరుడయ్యెడ వనాటులుగన్గొని సంతసింపగం ♦ ధీరతవిక్రమాకృతిని

ప్రరంబుజేర్చి నా ♦ జంగతినోగ్రహస్తమున జెచ్చెరవ్రేసె కపుల్ చలింపగన్ ॥

ఉ॥ కెరలిమహోదరుండు బలుకెంపు కనుంగవ దెల్పసీలుపై ♦ పరిఘము వేసియార్చుటయు బంధురరోషము పేర్మివాడు భూ ♦ ధరమొకటెత్తి బాహుబల దర్పముమైగరితోడ నాసిశా ♦ చరుని రణోర్విఁగూల్చె సురశాత్రవులెల్ల కలంగిపారగన్

గీ॥ పటుబలమ్మున నమ్మహాపార్శ్వుఁడలరి ♦ శక్తిగొని వేయ బుషభుండు చచ్చి పల్లు ♦ మూర్ఛపడిలేచినఁడునెత్తి మోదవాడు ♦ గ్రుడ్లువెలికురుకగా తన్నుకొనుచు జచ్చె ॥

వ॥ ఇట్లు త్రోసి యోధులు కపియోధులచే తన పగతప్రాణులగుటకు వగపడి అతికాయుఁడు కపిసేనబాదవి దనమీద సుగ్రీవాంగదాంజనేయ ప్రభృతి వానర లోకమెట్టుగఁ గిరియు తరుగిరి వర్షంబునకు సరకుగొనక నిజవిశిఖంబుల వానిచూర్ణంబు గావించి యమ్మేటిప్రపుల యవయమ్ములుచ్చిపోవ క్రూరనారాచంబులు నిగుడించి యసముడింపక బెగడుపుట్టించి ఖరాంతకుం డెచటనున్న వాడతనిపై తేరుతోలు కొనుచు నుబ్బరంబగు నుబ్బునజనుచుండ సౌమిత్రిబోలచి నిలచిన నయ్యనిమిషప్రత్యర్థి యతని గనుంగొని ॥

క॥ రామభూపాలువిధమున ♦ భీమాహవరంగమునను పేరెక్కవు నా ♦ త్రో మెఱయ లేవుపిన్నవు ♦ భూమీశునిబనుపుమరలి పొమ్ముకుమారా ॥

గీ॥ అనుడు సౌమిత్రియొర్రనౌ యాననమున ♦ పేరుగలపోటువిపోత పెత్రితె దీవు ♦ యనికి గొడదము నీపెద్దతనము నాడు ♦ పిన్నతనమయ్యెడను గనిపించుగాని ॥

మ॥ అనియుర్వీర వరాగ్రగణ్యుడు మదేభారాతిశౌర్యంబు పెం ♦ పుననొక్కు మ్మడి భీషణాస్త్రముల నప్పావాఁడు మరున్నొంపనా ♦ చ్చనిశాటుండు నరేంద్రసూతిపై నక్షీణోద్ధతిన్ గాఢభూ ♦ రినిశాతాంబకరాజిజొన్పెను జయశ్రీకాంక్ష దీపింపగన్ ॥

వ॥ ఇట్లిరువురు కొంతతడవు చిత్రకౌశలంబు మెరసి చలంబుడింపక దివ్యాస్త్రంబులం బోరిరంత సుమిత్రానందనుండు కోపోద్దీపిత మానసుండై ॥

మ॥ అతిఘోరాస్త్ర పరంపరల్ బరపి దేహంబెల్లనొప్పించి యు ♦ ద్ధతి బాణాసన సూత కేతన తనుత్రాణాశ్వ శస్త్రాస్త్ర సం ♦ హతిమూర్ణంబుగ జేసిచాపమున బ్రహ్మాస్త్రంబు సంధించి య ♦ య్యతికాయుం బడనేసె రాత్రిచరు లాహాకారముల్ సేయగన్ ॥

వ॥ ఇట్లు మానుషవిక్రమ స్ఫూర్తియగు సౌమిత్రిచేత ప్రకంపిత దేవతానికాయుఁడగు నతికాయుండు గూలిన ॥

క॥ ఆవార్తవాక్తి కంపుడు ♦ దేవాయులుజెప్పనెఱిగి క్ష్మతిమాలి ధరి ♦ తీవరుల శౌర్యమసుముల చావునుదలపోసి శోకసంతప్తుండై ॥

వ॥ నాడు విభీషణుండు జెప్పిన యుక్తివంతయు పరమార్థంబై కనుపట్టుచున్న యదియని కొండొక చింతించి యాఖండలజిత్తుం గాంచి ధైర్యంబు చిక్కంబట్టి వానితో నిట్లను కదనంబునకుఁ జనిన దనుజయోధులెల్లను కడలియందు నణంగుమేఘులచందంబున రామచంద్రునియందు మగ్గుచున్నవారు కావున నీవేగి యాయరాతులం బరిమార్చి రమ్మనిన వాసిష్ఠసన్నద్ధుండై యప్పుడు తండ్రియనుమతిం గైకొని వెడలి ॥

సీ॥ జగములన్నియు నొక్కట సమయసేయ ♦ వచ్చు ప్రళయాంతకునిభాతి పెచ్చుపెరిగి ♦ పటహకాహళ భేరీశబ్దంబులులియ ♦ నడచె వానరసేనపై పుడమి యద్రువ ॥

వ॥ ఇట్లు నెగుదెంచి దిగంతర ప్రకటాట్టహాసుండై కపిబలంబులం దొడరిన నవ్విడుదెరంగుల నారికి పోరు ఘోరంబుగా చెల్లె నయ్యోధవరులు నానాస్త్రంబులను పరిఘపట్టిసభిండివాలాదిసాధనంబులను భూరిభూధర భూరుహంబులను ముష్టాముష్టి తతులను బహుభంగులం బెనంగిరందు మేఘనాథుండు డెమురులేని కడంక మెరసి కపిబలంబుల పారిబుచ్చుచున్న నలుకవడమ వాయుసూనుండు ॥

క॥ తరులుధరణీధరంబులు ♦ గురిశశతాంగంబువిరచి గుర్రింబులు ను ♦ ద్ధుర భంగి నొంపవాడం ♦ బరపీఠికి నెగసె సురసమాజము దలకన్ ॥

వ॥ అదృశ్యుండై యథర్వణతంత్రం బనుష్టించి దివ్యాస్త్రకలిత భూరిజవోత్తుంగంబగు నొక్క పశిండి తేరుబడసి దాని నెక్కి మిన్నుజొచ్చి నిజమాయాబలంబు శీఘ్ర సబంధురంబగు నంధకారంబు గల్పించి మహాగ్రహంబున ॥

సీ॥ నిశితనిష్ఠురతర విశిఖంబు లొక్కట నురుజవంబొప్పంగ కురిశి కురిశి ♦ చండభూరినిశాత ఖాండపరంపర నెమకలుదూరంగ బరపిబరపి ♦ వజ్రసన్నిభమగు వాడిభల్లంబుల కరచరణంబులు దరిగితరిగి ♦ చక్రాదిసాధన సమితిప్రయోగించి దూకొనికంఠముల్ ద్రుంచిద్రుంచి ♦ ఖరకరాంభంబులగునట్టి శరములేసి ♦ పసుర మూర్ఛర వేవుర గుములుగ్రుచ్చి ♦ బడలువడజేసి నొంచెను ప్లవగవరుల ♦ ప్రళయకాలాభ్రమట్లు నారాతిచరుడు ॥

వ॥ ఇట్లేచి చీకాకుపరచి వెంటనే బ్రహ్మాస్త్రంబు ప్రయోగించిన రాజనందనులు నానాకీశసందోహంబును ప్రాణంబులం బాసినయట్ల ధరిత్రిపై వ్రాలిరి విభీషణ జాంబవదాంజనేయులు నద్దివ్యమంత్రం బెఱింగి పరియింపుకతన మూర్ఛంబొరయక

నిలచియుండిరంత నారక్కసుండు విపక్షులు తనచేతనిక్కువంబుగా తెగుటదలంచి పర మానురాగంబున విజయధ్వనులుచలంగ లంకజొచ్చి దశవదనున కభివందనంబానర్చి యిట్లనియె ॥

గీ॥ మందుకేనియులేకుండ మనుజవరుల ♦ తరుచరులద్రుంచివచ్చితి దానవేంద్ర ♦
నిఁకనీమదిలోపలి శంకదక్కి ♦ యుండుమనిపల్కవిని రావణుండుబొంగి ॥

వ॥ యట్టి తనూభవుండు గలుగ నాకుపడరాని విశేషంబులు గలవెయని వానింగౌగలించుకొని నిజనివాసంబునకు పీడుకొలిపి త్రిజటరావించి దానితోనిట్లనియె॥

చ॥ మనుజులకీశసంఘముల మందునకేనియు లేకయుండగా ♦ తునిమెనురేంద్ర
జిత్తు వినుతుల్ చలగన్ జనుదెంచెగావునన్ ♦ జనకజనీవుదోడుకొని సంగరభూమికి
బోయునప్పథం ♦ బును ముద మొప్పజూపి జలజాననమళ్లను దెమ్మునావుడున్ ॥

వ॥ మహాప్రసాదంబని నిర్జరారాతి యానతిక్రమంబున నమ్మహాదేవిని పుష్పకంబుపై నెక్కించి యనేకశతసహస్ర సంఖ్యల దానవాంగన లాయుధంబులు ఝళిపించుచు వెంటరా పొలిగలనికిం గొనిపోయి రణవ్యాపారంబు చాలించి యతినిద్రాసక్తులంబోలె పడియున్న రామలక్ష్మణులం జూపిన ॥

చ॥ వగమది నొట్టికన్నుగవ వారికణంబులు బిట్టురాలగా ♦ పగలిటిచంద్రుభాతి
ముఖపద్మమువెల్వెల బారనగ్నిచే ♦ పొగలుప్రవాళవల్లిగతి పొల్పగు మేనురుచుల్
దలంగ నా ♦ శుగహతిదూలు భూరుహము చొప్పనమూర్ఛిలి వ్రాలిసీతదాన్ ॥

వ॥ వ్రాలి కొండొకసేపునకుం దేరి వెంటవచ్చిన దనుజకాంతలెల్ల తన్నుఁజూచి వగలంబొగల నిట్లనివిలపించె ॥

ఉ॥ హాజలజాప్తవంశ వరహారఘుపుంగవ హాగుణాఢ్య ధా ♦ త్రీజనపాలనంద
నులు సర్థిభజంప జలంగువాడ వీ ♦ యాజితలంబులో కపి నిశాటశవంబులు గొల్వ
నిమ్మెయిన్ ♦ రాజిలుచున్నవాడ వెకరంబువిరోధులు పిచ్చలింపగన్ ॥

ఉ॥ శూరుడవంచు రావణుని జట్టిసురారుల గూడయుద్ధతిన్ ♦ ఘోరరణంబు
లోను వెసగూల్చెదవంచును నమ్మదంబు చే ♦ కూరగ నన్నుదోడుకొని గొబ్బున
నింటికినేగుదెంచ నే ♦ కోరితికోరినట్ల యొనగూర్పకవ్రాలితె నీవుయిమ్మెయిన్ ॥

గీ॥ ఏమిచేతునింక యేగతిమేన ప్రా ♦ ణములునాల్గు నేక్రియమనునిల్తు ♦
నెద్దితెరగునాకు నెయ్యదిమార్గంబు ♦ తెలియజెప్పుమధిప తెల్లమిగను ॥

క॥ ఇచ్చెదప్రాణములివిగొను ♦ వచ్చెదనీవెట దివిజవల్లభ పురికిన్ ♦ చెచ్చెర
తోకొనిపొమ్ము ప్రభ ♦ వచ్చరణములేనుబాయ వచ్చునెనెందున్ ॥

వ॥ అని సౌమిత్రింజేర్కొని ॥

చ॥ ప్రతిహతశత్రువిక్రమ విపద్దశలం గదునోర్చిరామ భూ ♦ పతిహితమాచరింపుచును బంధురకానను సంచరించి ని ♦ ద్రితమిని నిల్పలేక రణరంగములోబడినీవు నిద్రపో ♦ యితె విభుగాచియుండుటకు నెవ్వరుగొబ్బున లెమ్ములక్ష్మణా ॥

క॥ కుడుచుచుగట్టుచుమీా భర♦ తుడు రాజై యుండనీవు తూకొని మావెం♦ బడివచ్చి యడవిలోగడు ♦ యిడుములబడి విశివితుదకు నిటుమైకొంటె ॥

వ॥ అని పలుభంగుల విలపించు జలజాక్షి నూరార్చి త్రిజటయేకాంతంబుగా నిట్లనియె ॥

చ॥ అలికులవేణి చింతిలకు నాజితలంబున రామలక్ష్మణుల్ ♦ బొలియుటలేదు మూర్ఛిలగ బోలుదురెట్లన రాజులీల్గినన్ ♦ బలములునిల్వ వింతకయి పాయును పీడున మంగళస్థితిన్ ♦ వెలయునుగాని నిక్కముగ విస్మృతి బొందిన వారుచూడగాన్ ॥

గీ॥ అదియుగాక విధవలారోహణముసేయ ♦ నీవిమానరాజ మించుకేని ♦ తరలకుండు భూమి ధరణీధరంబట్ల ♦ గానదీననేమి గానబడదు ॥

వ॥ మరియును ॥

క॥ జలనిధులింకినధాత్రి తలమల్లాడినను రెండు తప్పనువిను నా ♦ కలనిక్కవమదిమున్నే ♦ తెలియంజెప్పితినికాదె తెరగొప్పంగన్ ♦

వ॥ అదియు కొంతదృశ్యంబయ్యె చింతింపకు మెల్ల వెంట శుభంబందెదవని యాసాధ్వినితోడితెచ్చి యప్పటియట్ల యశోకవనంబున డించిరంత నక్కడ ॥

క॥ కపులునృపాలతనూజుల ♦ నుపమింపగ రానిమూర్ఛ నొందుటగని దై ♦ త్యపతిననాహ్లాదము దురుగతి ♦ నపుడవ్వాయుజునిగూడి యతిధైర్యమునన్ ॥

వ॥ వీడెల్లం గలయంబరికించి యాజాంబవంతుని గనుంగొని సుగ్రీవాది వానరులును నృపాలనందనులును రణంబునబడిన తెరంగతనితో నెరింగించిన యాభల్లూకేశ్వరుండు విషాదచిత్తుండై యట్టకేలకు ధైర్యంబవలంబించి విభీషణునితో నిట్లనియె♦

క♦ శరములునాటుటగన్నులు ♦ తెరవంగారావునాకు తెరగొప్పంగా ♦ పరికించు వాయుపుత్రుడు ♦ ధరపై మూర్ఛిల్లకునికి దానవవర్యా ♦

క♦ అతడుమనభాగ్యవశమున ♦ బ్రతికినయాభూచరులు పార్థివరులున్ ♦ బ్రతుకుటనిక్కంబను నీ ♦ మతిదలపుమటన్ననలరి మారుతిప్రేమన్ ♦

వ♦ అతనిండగ్గరి తనసేమంబెరింగించిన నయ్యిలుగురేని ముదితమనస్కుండై మహాత్మా దివ్యౌషధంబులు గొనితెచ్చి నృపసుతులకు హితవాచరించి కపివ్రాతంబుల

పునర్జీవితులం గావింపుమని సౌవర్ణసంజీవ సంధాన విశల్యకరణులన నవి ద్రోణాద్రి యందుండు నీవుదక్కఁ దక్కొరు లప్పని నిర్వహింపఁజాల రచ్చటికరుగుటకు మార్గంబు చెప్పెద లవణవారాశి లంఘించి కుశద్వీపంబు దాటి పాలకడలిఁగడచి చని దానికినుత్త రంబున ద్రోణాద్రియుండు నయ్యద్రిపై దివ్యౌషధంబులు గలవవి రాత్రులందు వెలుంగు నచ్చట వివిధాయుధ హస్తులును బలపరాక్రమ సంపన్నులగు గంధర్వులనేకులు కాచియుందురు కావున నప్రమాదుండవై కొనితేరవలయు నచ్చటికి రాకపోకలకు నలుపదియారు లక్షలుగలు పదియారువేల యోజనంబులని చెప్పి వెండియు ।

గీ॥ పూర్ణవితతి తెలుపు పుష్పముల్ రక్తిమ ♦ తెలుపు తెలుపు పచ్చఫలము
లందు ♦ వాని తెరగునీకు వలనుగాఁజెప్పితి ♦ నతిజవంబుకలిమి నరుగుమనుడు ॥

క॥ పావనియందుల కొడబడి ♦ భావములోపలను రామభద్రుని పదముల్ ♦
సేవించిసత్వరంబున దేవతలలర్పంగ గగనసీమకు నెగసెన్ ॥

చ॥ ఎగసిమహాతరంగిణులు నేలలుకోనలు పుణ్యభూములున్ ♦ నగముల
పట్టణంబులు వనంబులు చారుసరోవరంబు ల ♦ త్యగణితమైనయాశ్రమము లంబుధు
లుద్ధతి దాటిమ్రోల ద్రో ♦ ణగిరి ప్రియంబునంగని వినమ్రితగై కొని పల్కెనొయ్యనన్

క॥ భూమిద్రోత్తమ దశరథ ♦ రాముని పనిబూనియిటను రావలసెను నే ♦
సామీరియనెడువాడ ద ♦ యామతివై మందులొసగి యనుపుమునన్నున్ ॥

వ॥ అనిన నతండతిగర్వితుండపోలె పల్కకున్న నగేంద్రు ధట్టించి కోపోద్దీపిత మానసుండై ।

క॥ సురలందోలిఖగేంద్రుడు ♦ బరువడి యమృతంబుదెచ్చు పగిదిని వెన త ♦
త్పరిరక్షకులనుతోలి కు ♦ ధరమును బెకలించియార్చి దర్పస్ఫూర్తిన్ ॥

క॥ ఘనుడామారుత పుత్రుం ♦ డనుపమబలమొప్ప నౌషధాచలమును దె ♦
చ్చిన వానిగాడ్పుసోకున ♦ వనచరులు నృపాలసుతులు వలనుగనంతన్ ॥

వ॥ మేఘనాథు బాణక్షతంబులుగప్పికొని మూర్ఛందేరి యప్పటియట్ల పొలుపు మిగిలిరంత రామచంద్రుండంతయు మారుతి కృత్యంబగుట యెరింగి యతని పరిరంభ ణంబున మన్నించి పెక్కుతెరంగులం గొనియాడి యయ్యౌషధాచలం బెప్పటియట్ల యునిచిరమ్మని యాజ్ఞాపించిన నతండట్లచేసి వచ్చెనని చెప్పి కైలాసవాసుండు వెండియు నిట్లనియె ।

గీ॥ అంతకీశులురవిజుని యనుమతమున ♦ లంక రాత్రింటివేళ వప్రములుదాటి ♦
వలనుమీరంగ యాదేవవైరిపురము ♦ సుట్టినలంబుదరికొల్పి చిట్టుగాల్చి ॥

సీ॥ సకలరాత్రించర సద్మంబులనుకరి శాలలనుత్తుంగ సౌధములను ♦ హయ
శాలలందున నాయుధశాలల రాజవీథులయందు రచ్చపట్ల ♦ సుగ్గాణములయందు
నోపరియింట్లను ధాన్యగృహముల సరదంబులుండు ♦ చోటులయందును సూతసమూ
దయ సదనంబులనుపాన శాలలందు ♦ నగ్నిపెల్లుగదరికొల్పి యాతులసిహ్మా ♦ నాద
ములు రాత్రించరులు దైన్యంబునొంద ♦ పుడమియీనినయాటుల బొలచినిలచి ♦ గేరు
చును కీశబలములు క్రీడవోలె ॥

క॥ యెక్కడజూచినతారై ♦ పెక్కువిధంబులనుపెచ్చు పెరిగియసురులం ♦
దొక్కరుని బోవనియ్యక నుక్కడచిరి యనలశిఖల నొదవినకినుకన్ ॥

వ॥ ఇట్లు చుట్టుముట్టి బహుభంగుల గాసి యొనర్చుచుండ రావణుని పనుపున
ఖరునికొడుకు మకరాక్షుండను కుంభకర్ణుని కొడుకులు కుంభనికుంభులను వారిద్ద
రును యుద్ధసన్నద్ధులై చనుదెంచి వనచరులం గదసిన ॥

క॥ మనుఘటకర్ణుడు రఘు రా ♦ మన్నృపతిచేపొరసీల్గి మగుడగనిటులం ♦
దనుజద్వయమయివచ్చెను ♦ మనమీదటననుచుకపులు మానసభీతిన్ ♦

వ॥ చల్లాచదరలై నలుదిశలకుం బరచుచుండి రవుడినజా నిలజులు సేనలం
దాకిన ♦

శా॥ కుంభుండయ్యెడ దేవతల్బెదర దిక్కుల్ వ్రయ్యగానార్చి య ♦ య్యంభో
జాప్త తనూజుమేన వివిధాస్త్రానీకముం జొన్పి దో ♦ స్తంభాటోపము జూపియోధు
లను చెంతంజేరగానీక సొం ♦ రంభ స్ఫూర్తి చలంగెనద్రిచర వారంబాత్మలో గుందగన్ ♦

ఉ॥ అప్పుడుభానునందను డహంకృతి పెచ్చుపెరింగి రోజుచున్ ♦ నిప్పులుకన్నులన్
వెడల నిర్జరసంఘము బిచ్చలింపగా ♦ నుప్పరవీధిబెల్లురికి హుమ్మనిపై బడి గాఢముష్టి
చే ♦ నప్పిశితాశనుంబాడచి యంతకుప్రోలికి బుచ్చెచెచ్చరన్ ♦

మ॥ హనుమంతుండు నికుంభునిందొడరి జెట్టాలంబుగావించి య ♦ ద్దనుజుం
డుజ్వల శక్తి వ్రేయసది దోర్దర్పంబెలర్పంగ దు ♦ త్తునియు లేసి నిశాచరుంగదిసి రక్షో
రాజి హాహాయనన్ జనితక్రోధ విశాసబంధురదిశా సంకాశుడై యొక్కటన్ ♦

క॥ హరిమున్నుచక్రిధారను ♦ పరువడిస్వర్భానుదునుము పగిదిందోపన్ ♦
నరిగిఖరకరరుహంబుల ♦ శిరమును గాత్రమునువేరు చేశెంబెలుచన్ ♦

వ॥ అంత ♦ చ॥ ఖరునితనూభవుండు ఘటకర్ణసుతుల్ సమరోర్విసిట్లు చె ♦
చ్చెర రవిపుత్రవాయుజుల చేజము శేరుట చూచికన్నురన్ ♦ బరగెదువీతిహోత్రకణ
పంక్తికిదేవతలుఁదలంక భీ ♦ కర భ్రుకుటీలలాట పరికంపితరోష్ఠ యుగంబులర్పగన్ ♦

మ॥ మకరాక్షుండనువాఁడు సంగరజయోన్మాదంబు రెట్టింప భూ ♦ రికరోరాంబక శస్త్రసమ్మాతి గపిశ్రేణిన్విదారించి గొం ♦ కక నన్నుం గనిపట్టితండ్రి కొలయీ గంబోలునం చుర్వ లయాం ♦ తకు నొక్కించుక జీరికింగొనని దోర్దర్పంబు పెంపేర్పడన్ ॥

శా॥ ఏదేడీ ఖరసూదనుండనెడు వాఁడెవ్వోటనున్నాఁడు పో ♦ రాడంగా గలడా యొకించుకై నాయశ్లేనియుఁ వాని గ్రొ ♦ వ్వాడింబాల్చు మదియ్య నిష్ఠుర శరవ్రాతంబు లన్మించి వే ♦ కూడంబుచ్చెద కుంభకర్ణముఖ రక్షోవీరులం జేరగన్ ॥

గీ॥ అనుచుయుక్కుమిగిలి యగచర వీరుల ♦ బడలువడగ జేశి పుడమిరేని ♦ దాయనేగి యతుల సాయకంబులగప్పె ♦ పేరువాడిరిపులు పెల్లగిలగ ॥

వ॥ రామచంద్రు నుద్దేశించి ॥

మ॥ ఖరునింగూల్చిన చొప్పుగాదు త్రిశిరున్ ఖండించుటల్ గాదు ని ♦ ష్ఠుర బాణానల హేతిసమ్మతుల రక్షోవీర వారంబులన్ ♦ బోరిగొన్నట్టుల గాదెదుర్ప ఘటులామోఘాస్త్ర సంఘాత జ ♦ ర్ఘరితాంగున్ మును జేశి ద్రుంతునినుం నాశౌర్యంబు పెంపేర్పడన్ ॥

క॥ నేఁడునాభాగ్యవశమున ♦ చూడంగాగల్గె నిన్ను శుభదినమయ్యెన్ ♦ పోఁడిమడగించి వెంటనె ♦ సూడీడేర్చెదను పూర్వసుకులగ్గింపన్ ॥

ఉ॥ వారధిజొచ్చినన్ భుజగ వల్లభుడాశిన ధాత్రిదూరినన్ ♦ మారటరూపు దాల్చినను మానుగవేడిన శాంతమూదినన్ ♦ ఘోరవనంబు దూరినను గోష్టము జేరిన బోధనేర్చినన్ ♦ సారపురాతవైన నినుజంపకపోను నిజంబురాఘవా ॥

వ॥ అని పెరింగిన దర్పంబున చిత్రప్రచారంబులు మెరయుచు వనచరుల నురుమాడుచు తనతోమార్కొనుచున్నం గనుంగొని ॥

ఉ॥ ఆరఘునాయకుండు దరహాసముదోప విరోధిమార్గణా ♦ సారమునుగ్గుగాదునిమి సామజముం బొలివుచ్చు రాజకం ♦ ఠీరవ మట్లయానిశిధి నీచరవీరు శిరంబు గాత్రిమున్ ♦ వేరుగజేశిపుచ్చె జముపీటికివాడి శరంబుచే వెసన్ ॥

వ॥ ఇట్లు కుంభ నికుంభ మకరాక్షప్రముఖ త్రయంబు జమునిలయంబు చేరుటయు నిజరాజాతివిని కినుకవడమి మేఘనాథుని యాననం బాలోకించి ॥

క॥ అగచరుల నరులబోరం ♦ దెగటార్చితిననుచు బలికితివి నాతోడన్ ♦ పగతురదె యెదురులేకన్ ♦ మగటిమినెరపెదరు చూడుమా హీనబలా ॥

గీ॥ నిన్ను నమ్మి పెక్కు నీతులు తమ్ముండు ♦ చెప్పనించుకేని చెవులజొనువ ♦

నైతిసీవు పిరికివాలెరింగిన పత్రికి ♦ జనకతనయ నొసగి శరణుపోరనే ||

వ|| అని వెండియు ||

క|| ఓపిన సమరక్షోణిని ♦ మాపరగాజేయుమీ విరోధులలేదా ♦ నీపినతండ్రి విధంబున ♦ భూపాలుని నాశ్రయింప బొమ్ముకుమారా ||

వ|| అని యుల్లసంబులాడిన గినుకయు లజ్జయు మనంబునం బెనంగొన తండ్రికి మ్రొక్కి యపారజలసమన్వితుండై యపుడు కదలి యవ్వానాటుల మార్గాని కొంత మగటిమి నెరపి యొక్క మారణకర్మం బాచరించి శత్రునిక్షేపంబు జేసెదనని తలంచి బలీముఖులతోడ బోరుటకు, తనబలంబుల పాలించి యదృశ్యుండై హోమశాలకుం జని కృత్రిమకర్మంబు విహితంబుగా నాచరింపు చుండెనంత ।

చ॥ కినుకని శాటులుద్ధతిని కీశసమూహము మేనులకా వడిన్ ♦ సునిశితసాయక ప్రతతి జొన్పియునంతట బోవనీక దెం ♦ పునదగ కాళ్ల మెట్టుచును మోములు చక్కలు వాయ వేయుచున్ ♦ తనువులు ద్రుంపుచున్ గదుముదంబున దిక్కులు వ్రయ్య నార్చుచున్ ||

వ|| సమరక్రీడసలుపుచుండిరి కపిబలంబులు దైత్యులచేత నొచ్చియు చలింపక నొండొరుల బిరికొల్పుకొని తరుపాషాణంబులు గైకొని సురవైరులవైచుచు యార్పులు సింగిముట్ట నొక్కుమ్మడి గజవాజిరథ పదాతివర్గంబులబారి సమయుచున్నంత ।

ఉ॥ కన్నుల నిప్పులొల్కలయు కాలునిబోలి సురారిసూతి దా ♦ గ్రన్నన సృక్స్రువంబులు ధరంబడవైచి నిశాటబృందముల్ ♦ తన్నుభజింప తేరు సముదస్థితినెక్కి బలీముఖావళిన్ ♦ వెన్నడిద్రుంపజొచ్చె పటువిక్రమమేర్పడ దుర్నివారుడై ।

క॥ అదిగని రోషముమదిలో ♦ గుదిగొనగా వాయుసుతుడు కుధర మొకటి బె ♦ట్టిదమైనదిగొని యప్పుడు ♦ త్రిదశారి తనూజునేసె దృఢతర శక్తిన్ ।

ఉ॥ ఏసిమహీరుహం బొకటి యేపున గైకొని దైత్యసేనలున్ ♦ డాసిమహా గ్రరోషమున దండడిగావడి మోదుచుండ రా ♦ కాసులరేనిపట్టి యదిగాంచి సహింపక యుగ్రమూర్తియై ♦ యీసునఘోర సాయకము లేర్చి మహాబలసూతి నాటిదాన్ ।

క॥ ఎండిన యడవిం గాలుచు ♦ చండ కృశానుండుపోలె శైలచరుల మా ♦ర్తాండనిభమై వెలింగెడు ♦ కాండంబుల నేచుచును సగర్వస్ఫూర్తిన్ ।

వ॥ ఉక్కుమిగిలి యొక్కింత తడవు విక్రమవిహారంబు జరిపి హోమంబు పూర్ణంబు గావింపం దలంచి యేగిన నక్తంచరనందనుండు నవ్విధం బెరింగి లక్ష్మణు

నచ్చోటికిం దోకొనిచని యతనియునికిఁజూపి యతనితో నిట్లనియె ॥

గీ॥ ఇచటఁబేదు మున్ను నిమ్మెయి హోమంబు ♦ చేసి భూతములకు చిత్రము లక ♦ సమతబలియొసంగి సంప్రాప్తకాముఁడై ♦ యమరనాథుఁ గెల్చె నట్లుగాన ॥

వ॥ హోమంబు పూర్ణంబుగాక మున్న యీదుర్మదు బరిమార్పుమనుండు సతంజశేని సదృశంబగులగు కాండంబుల నయ్యాఖండల శత్రునొప్పించిన వాడలుక వడమి హోమకృత్యంబు పాలించి యరదంబెక్కి రెండవ దండధరుండునుం బోలె వాయసే తెంచి విభీషణుంగనుంగొని ॥

ఉ॥ క్రూరతకోర్చి శాత్రవుల గూడివధింపగ బంచెదిష్టులన్ ♦ వారకనన్ను గెల్వగ దివస్పతియోపడు మానవాధముల్ ♦ పోరజయింప గాగలరె బుద్ధివిహీనత జేసి దుర్వ్యర ♦ స్సారము మూటగట్టితి నిశాచర ధర్మము బాసి దుర్మతీ ॥

వ॥ అనిన విభీషణుండు వానికిట్లనియె ॥

గీ॥ మేఘనాథమేలు మేలునీకించుక ♦ ధర్మబుద్ధిమీది తలపుబుట్టె ♦ సంగర మునసింక సౌమిత్రి శరముల ♦ తెగియెదేని మిగుల తేటపడును ॥

వ॥ నీవు పాకశాసనాది నిలింపుల సరకుగొన నియోధవు ధర్మంబు దలంచుట పౌరుషంబునకు వమ్ముగాదె యిప్పుడు నాపై యధర్మంబు జూపి పలికితివిగదా నించుక తడవునకు మనధర్మాధర్మంబులు సుమిత్రానందనుండు తగవరియుపోలె యేర్పరింపు చున్నవాడు తత్తరపడకుమన్న పల్కు నప్పలుకులు చవులంజొనుపక మేఘనాథుండు ॥

క॥ ఒక్కనిశిత గ్రిశరమున ♦ నక్కజముగ యురఘునాటి యవనీశ సుతున్ ♦ న్రక్కించి యవ్విభీషణునొక్కట నిటలంబుసొన్ప యుగ్రతరశక్తిన్ ॥

క॥ ఎక్కడఁజూచినదానై ♦ యక్కపిపీరులను రూపమడపుచు దిశలం ♦ బిక్కటిలనార్చుచును పే ♦ రుక్కు మిగిలి శక్రవైరి యొప్పెంగలనన్ ॥

వ॥ ఇట్లు ముహూర్తమాత్రంబునం గపిసేన బడలువడంజేసి సుమిత్రానందను పై నాగాస్త్రంబు ప్రయోగించిన ॥

చ॥ ఘనతరదీర్ఘ కాయములు గల్గివిషమ్ములు గ్రమ్ముచుండగా ♦ గొనకొని బెట్టునాలుకలు గ్రోలుచుకోటుల సంఖ్యలై నరేం ♦ ద్రుని సుతుమీద రానతడు రోషముబూని తదియ్యశక్తి యే ♦ పున గడగించునట్టులను ఘోరునగారుడ బాణమే యుడున్ ॥

ఉ॥ యొక్కటి బెక్కులై పరగి యుగ్రతబేర్చి ధరిత్రి యంతయున్ ♦ బిక్కటి లంగవచ్చి యురిబృందము మేనులుసించి తృంచె బే ♦ రుక్కడగించ నిమ్మెయి మహో

వగ బాణము దూలపోవ లో ♦ వెక్కుడు రోషమూది దనుజేశతనూజుడు సత్వరంబునన్ ॥

క॥ ఆరాజసుతునిమీద కు ♦ జేరాస్త్రంబేయ నతడు జెల్గలక మహా ♦ ధీరుండై యమబాణం ♦ భోరున ఖండించి యాగ్నిహోమముడిపెన్ ॥

వ॥ ఇట్టిఘోరంబున ॥

క॥ పరిబోరి రిద్దరును భా ♦ సుర దివ్యాస్త్రములపూర్వ సురలు దలంకన్ ♦ శరలాఘవ కరలాఘవ ♦ మరసిమూపరెల్ల మిగులనద్భుతపడగన్ ॥

వ॥ ఇట్లు కొంతతడవ చిత్రిశాలంబు మెరశి సుమిత్రా నందనుండు కన్నుల కెంజాయ చెన్నొంది విలసిల్ల గీర్వాణ వల్లభుండిచ్చిన శరంబు వింటనరిబోశి యెల్లవేల్పులంజేర్కొని ॥

చ॥ తలపగ రామభూవిభుడు ధర్మరతుండగునేని సీత ని ♦ ర్మల సుచరిత్రియేని రఘురామునిసత్కృప నాకునెప్పుడుం ♦ గలిగనయేని యీ తెరగుగన్గాన భూతహితంబయేని దివ్యులు ముదమందవీడు సమరోర్విని గూలెడుగాత గ్రక్కునన్ ॥

క॥ అనివలికి దైత్యనాథుని ♦ తనయునిపై చూడ్కి నిలిపి తననేర్పలరన్ ♦ ధనువాకర్ణాంతంబుగ ♦ ఘనశక్తిందిగిచి వైచె కపులార్వంగన్ ॥

వ॥ అట్లేశిన ॥

సీ॥ పాకశాసనుడంప పరతెంచి వృత్రుని బొలియించునట్టి దంభోళిలీల ♦ పురములు మూడునిర్మూలంబుగావించి నట్టిమదియ్య సాయకము భాతి ♦ నమవర్తి యనుమతి చనుదెంచి ప్రాణుల దరసిచంపెడు కాలదండ మట్ల ♦ యచ్చుతుపంపున నరిగి యా మధుదైత్యు ఖండించునట్టి చక్రంబు మాడ్కి ♦ మెరుగుతీగెలు మంటలు మిక్కుటంపు తేజమలరంగ నొక్కట దివిజశాత్రి ♦ వులు దలంకంగవచ్చి యాయుగ్రశరము ♦ క్షిప్రమున మేఘనాథుని శిరముద్రుంచె ॥

వ॥ ఆసమయంబున ॥

క॥ దుందుభులు మ్రోశెనిజర ♦ బృందంబులు కుసుమవృష్టిజెల్లుగ పరమా ♦ నందంబున గురిసిరి సుర ♦ సుందరులాడిరి మనముల సొంపుదలిర్పన్ ॥

వ॥ అంత సుమిత్రా సూనుండాంజనేయ విభీషణులు గెలంకులనలర కపులు సింహనాదంబులు సేయుచు తోడంనుదేర నన్నకడకుంజని యభివందనంబాచరించిన నతండు మక్కువదీపింప నక్కునంజేర్చి సంతసంబు వెలిదెల్ప నతనికిట్లనియె ॥

చ॥ అనుపమశీల లక్ష్మణ మహాబలుడైన సురేంద్రజిత్తునే ♦ యనువున

గూల్తు సంగరజయంబెటులాగున గొందునంచు రే♦ యును బగలేను జిత్తమున నొక్కటగుంచుచు నుందునట్టిదై ♦ త్యుని విదళించితౌర లలితోన్నత బాహు బలంబు పెంపునన్ ॥

వ॥ అని పెక్కుభంగులంగొనియాడె నంత కపివీరుల బారింబడక బ్రతికి సనిన దైత్యులుతల్లడంబునం జారి లంకసొచ్చి రావణుంగనుంగొని ॥

సీ॥ దానవాధీశ నీతనయుడా కపిసేన చించి చెండాడితా చలువ్రమెరసి ♦ పటుబాణ సమితిచే పవనతనూభవ ప్రముఖయోధులనెల్ల బడలు పరచి ♦ భీషణాస్త్రముల విభీషణు నొప్పించి తన్నురెండవదండ ధరుడనంగ ♦ బంధు రశౌర్య విస్ఫురత బొలుపొంది ధాత్రీదలంక సౌమిత్రి నెదిరి♦ యతనితో గొంతపోరాడి యలసి కపులు♦ నబ్బియార్వంగ రక్కసులోడి పార ♦ న పరవారాశిలో గ్రుంకునర్కునట్లు ♦ నాహవాంబుధిలోపల నస్తమించె ॥

క॥ అని సుతునిపాటుజెప్పిన ♦ తన వీనులయందువేడి దనరుశలాకల్ ♦ జొనిపినటులైన మూర్ఛన్ ♦ మునిగి ధరంగూలె పిడుగు మోదినభంగిన్ ॥

వ॥ ఇట్లుమూర్ఛిల్లి యెట్టకేలకు తెలివంది లేచి దీర్ఘ నిశ్వాసంబులుచ్చి బహుభంగుల విలపించి యిట్లనియె ॥

క॥ శిలలుసలిలముల తేలెడు ♦ బలిముఖులుం బనులుసేయ బట్టిరి దివిజా ♦ రుల దునిమివై చెదరు నరు ♦ లిలపై కుటిలంపుకాల మీగతివచ్చెన్ ॥

ఉ॥ నాడువిభీషణుండు రఘునాథునివిక్రమ ముగ్గడించి మో ♦ మోడక పెక్కుభంగులన యోక్తులుచెప్పిన నట్టివాక్యముల్ ♦ గూడదటంచునాచవుల గూర్పగనొల్లక నాగ్రహించి యా ♦ కీడుఫలంబుగంటి పరికింపగలేనయితిన్ వివేకమున్ ॥

వ॥ అని కొంతతడవు చింతించి యింద్రజిత్తునకై పెక్కుభంగుల పలవించి సుపార్శ్వుండూరార్పన్ విగతశోకుండై ॥

శా॥ క్రూరభ్రూకుటిఫాల సీమగడియన్ ఘోరాంతకాకారుడై ♦ మారీచాంతకు నేడుసంగరములో మర్దింతుసౌమిత్రి దు ♦ ర్వారోద్రేక మడంచిద్రుంతు కపివీర వ్రాతముంగూల్తు విల్ ♦ తారాతిప్రముఖామరుల్ గరముదైన్యంబందగా నుద్ధతిన్ ॥

వ॥ అనిపలికి భూరిబలోత్తుంగ తురంగ సన్నిహితంబైన శతాంగంబు నారోహణంబుజేసి పటహకాహళ శంఖనినాదంబులు మదవారణ బృంహితంబులు తురంగమహేషితంబులు రథనేమినిస్వనంబులు నిశాటబృంద కోలాహలంబును వందిమాగధ వినుతులును భూనభోంతరాళంబు నిండి పర్వపర్వత సన్నిభంబగు తనగాత్రంబు గనుం

గొని వనచరులురువడిం బగచుచు-డ నంబరవిశ్వంభరలు దలంకనార్చుచు జవుదెంచి కపిసేనా సముద్రంబుసొచ్చి తరుచరయోధుల సరకుగొనక రామచంద్రునిం దాకిన ॥

చ॥ కనుగవనొక్కచెన్నలర గా ఘనకార్ముకమెక్కువెట్టి యా ♦ యినకులవర్ధనుండు దనుజేశునిపై పటుసాయకంబు లే ♦ సిన గమకొచ్చి రావణుడు జెచ్చెర నాజగదేక వీరుని ♦ సునిశితకాండసంఘముల జూపరమెచ్చగముంచె నీసునన్ ॥

క॥ అశ్లేసిన ॥

చ॥ హరతిమిరంబడంచుగతి యారఘువీరుడు వానినన్ని భా ♦ స్కరకిరణంబులంబోలుచు కాండపరంపరద్రుంచి వంక్తికం ♦ ధరుని యురంబునందు బఒనారసమొక్కటి నాటికేతన ♦ బరిమురి యొక్క టందునిమి యంత్రటబోక ప్రచండమూర్తియై ।

వ॥ తేరిచూడ రాకయుండజేసి యొక్కరనూపి బెగడుపుట్టించి యొక్కవాడినారాచంబు బెన్నురంబునం గీలుకొల్పి నష్టచేష్టితునింజేసిన యరదంబుమీద మోదగిలంబడి యొక్కింతవడికిందేరి యవ్వింశతిభుజుండు కంఠీరవంబుపై నురుకు కుంజరేంద్రుని వడపున నారాజకంఠీరవుపై నేతేర నయ్యెడ ॥

మ॥ ఉరుబాహాబలమొప్పసంగర జయోద్యోగంబు జిత్తంబులో ♦ బురికొంపంగ నెదిర్చిలక్ష్మణుడు తూపుల్ వింట సంధించి ని ♦ ర్జర విద్వేషికఠోరవక్షమున యార్యస్ఫూర్తిగీలించి భీ ♦ కరభల్లంబున సారథిం జొనిపె వీకన్ బాణయుగ్మంబునన్ ॥

వ॥ వింటి నారిదునిమివైచి మూడువాడితూపులు నిటలంబున గ్రుచ్చి వాల్గింటనూరంబుగాడనేసి యుగ్యంబుల పగ్గంబులునుగ్గుజేసె నయ్యవసరంబున నతనియడంగొని విభీషణుండు ॥

క॥ సురవైరిమీద నార్చుచు ♦ బరువడిగదవ్రేయుడదియు పైబడ దశకం ♦ ధరు డిలకుదాకె తేర ♦ త్తురగంబులతోడగూడ తుత్తుమురయ్యెన్ ॥

వ॥ ఇట్లు విరథుండయ్యు నిలింపవైరి వేరొక్కయరదం బారోహణంబుజేసి గినుకగదిరిన కన్నుల నవ్విభీషణుం గనుంగొని ॥

గీ॥ నిజకులాచారమంతయు నీరుజేసి ♦ పగతుమాటుననొదిగిలి బ్రతుకువాన । నట్టిసడిసాలదొట్టి నన్నని నెమర్చ ♦ జూచెదవుమేలుమేలు రానీచ చరిత ॥

వ॥ అనిపలికి వారింపరాని రోషంబున ॥

చ॥ త్రిదశవిరోధిశేర్చి జగతీస్థలివ్రయ్యగ నార్చిదేవతల్ ♦ బెదరనిశాటులుబ్బ కపిబృందము లొక్కటగుంద దీనికె ♦ క్కైదిరెదవోయటంచు మయుడిచ్చిన భూరితరోగ్రశక్తిచె ♦ ట్టిదముగనవ్విభీషణుని డిందిపరాక్రమ మొప్ప నేయుడున్ ॥

ఉ॥ కాలునిదండమోయనగ కౌశికు చేవనిబూనివచ్చు దం ♦ భోళియొకోయనంగ
మరి కాలభుజంగము కోయనన్ మహా ♦ జ్వాలలు పెల్లుగా నొరుగ వచ్చె విభీషణుపై
రయంబునన్ ♦ చాలభయంబుచేత కపిసంఘము మోముల వాడి తూలగన్ ॥

వ॥ ఇట్లెదురులేని దర్పంబునం బర తెంచుదానిం జూచి రామచంద్రావరజుండు

మ॥ మదిబరికించె రావణ సమాగము దుర్దశ దెచ్చు మున్నె నే ♦ న్పొదవగ రాము
జేరి సుఖముండెదనంచు నకల్మషాత్ముడై ♦ బ్రతుకగ వచ్చె రాఘవుని ప్రాపున నీతని
నిట్టిశక్తి కా ♦ ప్పిద మొనరింపగాదని విభీషణు వెన్కకు ద్రోచి ధీరుడై ॥

వ॥ ఇంచుకేనియుం దలంకక పిరికివడమని యుల్లంబున దలమిగిలి నిలచి ॥

సీ॥ అత్యుగ్రముశతకాంతి నరుదెంచు దానిపై యేపున విశిఖంబు లేయుచుండ ♦
వానికిదలక కవ్వాలబారజడియుచు మొగిపెక్కుపిడుగుల మ్రోతగలిగి ♦ యే తేర రఘు
వరుం డొంతయువగచుచు సౌమిత్రి దీనిచే చావుదప్పి ♦ జీవించుగాకని దీవనలొసగంగ
ప్లవగులాహాయని పలువరింప ♦ యభ్రవీధినుండి యమరులు గుందంగ ♦ నసురసమితి
ప్రమదమందిచూడ ♦ యుగ్రశక్తి పటురయోన్నతి లక్ష్మణు ♦ నురము గాడియతని
నుర్విగూల్చె ॥

వ॥ ఆసమయంబున ♦

క♦ శరణాగతు నర్పింపక ♦ సురరిపుశక్తికి నిరొమ్ము సూపె సుమిత్రా ♦ వరపుత్రు
డిట్టిసాహస ♦ మరుదరుదని భూతసంఘ మభినుతి జేసెన్ ॥

వ♦ ఇవ్విధంబున ♦

మ♦ ఉరుబాహాబల విక్రమక్రమము నత్యుల్లాసముం బాసి యు ♦ ర్వర పై గూలు
మహేంద్రమోయనగ పోరం గూలియున్నట్టి భా ♦ సుర తేజుండగు లక్ష్మణుం గని రఘు
క్షోణీశుడెంతేని దు ♦ స్తరశోకంబును బొందిచేరజని యంతన్ ధైర్యసంపాదియై ॥

వ♦ సౌమిత్రియురంబునం దూరి ధరిత్రిం గాడి వెలుంగొందెడు శక్తి తన బాహు
శక్తిని పెకలందిగిచి కోపోద్దీపిత వదనుండై ♦

క♦ ఉరగము నుద్ధరించు గరుడుని ♦ కరణి రసాలంబు నుమ్ము కరిగతి దానిం ♦
బలువడి దృంపగ దశకం ♦ ధరుడయ్యెడ నమ్మురేశ ధరణిపుమీదన్ ♦

వ♦ ఇట్లేయుడతేండా దశకంఠ క్రూరనారాచంబుల రవాయిగొనక శరకావర్షం
బోర్చు కుధరంబు భంగి సుస్థితుండై నిలచి విభీషణుంగానక యాతండునుం దెగియు కాన
లంచి మిగుల వగచుచు దిక్కులంగల యంజూచి తనచరమ భాగంబున కన్నీరు దొరంగ
తన్ను తానెరుంగక సుమిత్రాతనయునకు గావగచుచున్న వానింగని సంప్రాప్తకా ముని

వనువున నుబ్బుమిగిలి గొబ్బున కౌగిటం జేర్చి సుగ్రీవ ప్రభృతి యోధులకిన నిట్లనియె ॥

సీ॥ కపివరులార నిక్కముగాగ జెప్పెద గదనోర్విలోన లక్ష్మణుడు కూలి ♦ నందుకు వగనొంద ననుజుకై కుంద నాత్మీయ జీవిత మాసజెంద ♦ విభీషణుడు ప్రాణేశ మైజను డెంచి ననుశరణొందె గావున నితండు ♦ శక్తిచే వెకట నిశ్చయముగా దల పోసి చింతచేయునిగిత నింతతడవు ♦ నిప్పుడు నాభాగ్యవశమున నితడు బ్రతికి ♦ యున్న వాడింక లక్ష్మణుడుద్రితనయ ♦ యేను జీవించియున్నార మింపులకును ♦ సంశయము లేదు మీరలీ జాలిబాసి ॥

వ॥ అప్రమానులరై సౌమిత్రింగాదిగొని యుండుండేను సురకంటకున కించుక నావాడి నారాచంబుల వేడిమి చూపెదనని కోదండంబు గుణంబు సారించి ॥

మ॥ వడిపంచాస్యమిభేంద్రుని బాదువు తెవన్ భూరిదోర్దర్పమే ♦ ర్పడగా రాఘవుడా నిశాచరవరున్ బాణంబులం గప్పియె ♦ క్కుడు శౌర్యంబున సారెసారె మదిలో క్రోధంబు రెట్టింప బ ♦ ల్విడి నారాచ పరంపరల్ పరపి తాల్మిం దూలపో జేయుచున్ ॥

క॥ సురవిద్వేషుడను ధారా ♦ ధరముద్ధతినేచి రామధరణీశ్వర భూ ♦ ధరము పై బాణవర్షము ♦ గురియించిన రాఘవుండు క్రోధస్ఫూర్తిన్ ॥

మ॥ కనదస్త్రంబుల పింజ పింజ గరువంగా నేసి యద్దాన వే ♦ శుని నొప్పించి పతాకసించి యొకటన్ సూతున్ వడిం ద్రుంచి వెం ♦ టనె వెయ్యింట హయంబులం జొనిపి బాణశ్రేణిచే వాని పూ ♦ చినపెన్ మోదుగనంగ క్రిమ్మరగ ముంచెన్ నెత్తుటం జొత్తిలన్ ॥

వ॥ ఇవ్విధంబున ॥

క॥ పదినూరు వేయిలక్షలు ♦ పదిలక్షలుకోటి కోట్లు పటుభల్లము లా ♦ త్రిదశారిమీద బరపెను ♦ వదలనిరోషమున సమర వైరులు దలగన్ ॥

వ॥ ఇట్లు జితరిగతుల మెరసి వెండియు గెలుపునుబ్బును విదుచ్చరుల కబ్బురంబుసేయ దశకంధరు దశకంధరముకుట దశకంబునొక్క విశిఖంబున వసుధపై ద్రొల్లం జేసి యొక్కొక్క రోమకూపంబున పెక్కమ్ములు గాడనేసినం జేయి కాలాడక చిత్తరి రూపవుకై వడి కొంతతడసి యతని బెట్టిదంపుటంపర కోర్వంజాలక ॥

చ॥ వెనుకొని యుత్తమాంగముల వెంట్రుకలున్ విడి యూడుచు డగాం ♦ చన నవరత్నసంఘటిత చారువినూతన భూషణంబు లూ ♦ డ్చినగతి రాలరాజకుల

సిహ్మునకు వెన్నడి ముట్టివచ్చునో ♦ యని తలలెత్తి చూచుచు దశాస్యుడు బారెను లంక
డిక్కునన్ ॥

వ॥ ఇట్లుపరచి లంకానగరుసొచ్చి బ్రితుకుమందలగని యుండునంత ॥

సీ॥ కరులయందును తురగంబులయందును దైత్యులయందు రథంబులందు ♦
వప్రంబులందు దేవస్థలంబులయందు గోపురంబులయందు కొలనులందు ♦ హార్మ్యాంబు
లందు నుద్యానవనంబుల క్షితియందునంబర శీమయందు ♦ కుడ్యంబులందు దిక్కుల
యందు సర్వజంతువులందు తనయందు తోయజాప్తు ♦ నందురామసహస్రంబు లగుచు
తనదు ♦ కన్నులకుగానబడిన రాక్షసవరుండు ♦ కళవళమునొంద యట్టిట్టుకదలలేక ♦
నచలమునుబోలె నిశ్చేరగందుచుండె ॥

వ॥ ఇవ్విధంబున నొక్కింతసేపు రిచ్చవడి గ్రిమంబునం దెలవంది యుచ్ఛ్వాసము
వాసి యంతఃపురంబున కరిగి శ్రిమంబుదీర్చుకొని మండోదరి రావించి యిట్లనియె ॥

క॥ మును పెక్కుసంగరంబులు ♦ నొనరించితిగాని మానవోత్తముడగు రా ♦
ముని కెనయగువిలుకానిం ♦ గనియరుగను యేను ముజ్జగంబులయందున్ ॥

చ॥ హరిహయుడేచియుద్ధతి మహాస్త్రములొక్కట వేయునింతయుం ♦ జొరవ
యొసంగకదిగ్గతి శోభిలుచుండు మదియ్యగాత్రిమా ♦ నరపతిచేతితూపులు కొనంగడు
బెగ్గలి నార్ద్రిభిత్తి చో ♦ ప్పరయవహించు నయ్యెముడు యంబకకోటికి తానిమంగమా॥

క॥ విలుబలిమినృపతి బాహా ♦ బలముకలిమివాడిదేరు ఘటుతరభల్లం ♦ బుల
మత్తనువుందూరెడు ♦ చలిమియులెక్కింపతరమె శివునకునైనన్ ॥

సీ॥ దిక్పాలకులమదోద్రేకంబడంగించి గైకొన్న బిరుదులు గాశిజందె ♦ వేల్పుల
చేత ముప్పెట్టిజేయించిన పౌరుషబంతయు భంగమయ్యె ♦ గరకంఠుతోగూడ కైలాస
మెత్తిన భుజబలంబెల్లను బూదిగలసె ♦ జగములకేనధీశ్వరుడ వేరొకడు లేడనునట్టి
నహమిక నణగిపోయె ♦ నొక్కమానవుకతననో యుత్పలాక్షి ♦ యెటులరఘువీరు
దృంతు నేనెటులయుద్ధ ♦ జయముగైకొందు నేదేవుశరణుజొత్తు ♦ నద్దికార్యంబుహితము
నాకెరుగజెప్పుమా ॥

ఉ॥ అంబకమొక్కటైనపతి యందెడుబోవదియానుపూనివే ♦ యంబదియారు
బాణవిమొనారయవేయును వేనవేలునై ♦ కంబుకవచ్చిమత్తనువు గాడిహిమాచల
తుల్యమైన ధైర్యంబెడలంగసేయుచును రక్తముగ్రోలిచనుం గ్రిమంబునన్ ॥

క॥ చిరువజనియొరుగబహు నం ♦ గరముల మున్నెన్నడిపుడు త్రావరుతోడం ♦
దొరసినమరమునదె జ ♦ ర్ఝరితాంగుడనైతిసువ్వె సరసిజవదనా ॥

మ॥ బలవిద్వేషముగట్టుకొంటి రఘుభూపాలాగ్రి దివ్యాస్త్రసంగా ♦ వలిసామా
ర్థ్యము బాహుశక్తియును దుర్వారప్రతాపంబు నా ♦ డలమారీచ విభీషణుల్ దెలుప
కార్యంబాత్మలోనూది వా ♦ రలమాటల్ వినకైతినా ఫలము పోరంగాంచె నింకేమనన్॥

వ॥ అని గద్గదికందోప బలికిన వల్లభునింగనుంగొని మండోదరి యిట్లనియె ॥

చ॥ దనుజకులేశనీమది వృథావిరసంబు దలంచిపోరసి ♦ తనయులబంధులన్
హితుల దదడిరాముని బాణరాజికా ♦ హ్వనమొనరించితింత పరిపాటిగమున్న విభీష
ణుండు చె ♦ ప్పిన సునయోక్తులం జెవుల బెట్టకనిందకు నోర్చితేమనన్ ॥

చ॥ గతజలసేతుబంధనము గావున నెన్నగ కేలవాసి నం ♦ చితమణిభూషణంబు
లను సీతనుమున్నగ నిచ్చియమ్మహీ ♦ పతి శరణంబుగాంచుము నృపాలుడు భూరి
దయాళుడెగ్గు జే ♦ సితివనడమ్మెయిన్ మరచి సిద్ధముగా నినుబ్రోచు గ్రన్ననన్ ॥

ఉ॥ ఆనరసీరుహాక్షుడు దయాపరతన్నిను బ్రోచుటబ్రిమా ♦ భూసుతచారు
వక్షమున భూరినఖంబులు జుట్టినాటగా ♦ జేసి శరంబువెన్నిడిన జిక్కితనున్ శరణంబు
వేడ కా ♦ కాసురు గాచిపుచ్చిన దయాపరిపూర్ణు డతండెరుంగవె ॥

వ॥ అదియునుంగాక ॥

క॥ భగవంతుడతనికెందును ♦ పగచెలుములు లేవు దుష్టమర్దనమునకై ♦ జగతిం
బుట్టెదు రాత్ముల ♦ తెగజూచున్ సజ్జనులకు దిక్కయి ప్రోచున్ ॥

గీ॥ యెదిరిగెలవనోప రెమ్మెయినాది నా ♦ రాయణుండుసూవె రామభద్రు♦
డవనితలయలక్ష్మి యటుగాన రాముని ♦ శరణుజొచ్చిబ్రతుకు చావవలదు ॥

ఉ॥ నాకినిరావణుండనియె నాతినిజంబు రఘూద్వహుండు రా ♦ జీవదళాక్షు
పాటయును సీతరమామణి యూటమున్నె నా ♦ భావములోనెరింగి నరపాలునిచే
మృతిబొందినుక్తికిం ♦ బోవదలంచినిచ్చటికి భూమిజదెచ్చితి వేయునేటికిన్ ॥

క॥ నరవరశరదత్తంబై ♦ కరమెదురుగవచ్చుముక్తి కాంతామణి నే ♦ పరిణయ
మై సుఖముండెద ♦ సరసిజభవభవులుగాంచి సన్నుతిసేయన్ ॥

వ॥ అదియట్లుండనిమ్ము ॥

సీ॥ శ్రీరామచంద్రుడాశ్రితపారిజాతంబు సత్యవ్రతుండతి శాంతమూర్తి ♦ శర
ణాగతత్రాణ పరుడాటమెరుగుడు జలజాస్యనాకింత దెలుపవలదు ♦ ధరణిజనిచ్చి
వందనమొనరించిన కాచిరక్షించు నిక్కంబుకాని ♦ తనయులమిత్రుల దనుజవీరులనెల్ల
బలివెట్టినింక నేబ్రతికియేమి ♦ సౌఖ్యమనుభవింతు సాలునీబుద్ధులు ♦ మిన్నకుండు
మత్ప్రసన్నతకును ♦ గాచియుండుసురలు గన్గొనినవ్వరే ♦ నితడు మనుజనాశ్రయించె

సనుచు ॥

శా॥ ఆమాటల్ దలపంగ నేమిటికి రామాధీశుచే యేను స ♦ గ్రామోర్విస్థలి
గూలువాడనిది నిక్కంబింక నాతోడుత ♦ న్నీమేనుం బడవైవుమగ్నినాగి నెంతే ప్రేమ
మైనాజగ ♦ త్స్వామిం జేరుదమంత మీదమదిలో సంతాపముం బాయగాన్ ॥

వ॥ అనిన శోకవ్యాకుల చిత్తయై మండోదరి యిట్లనియె ॥

ఉ॥ దానవనాథ నీపలుకు తథ్యము ధర్మలకింతు లర్హలై ♦ ప్రాణములిచ్చుకంటె
తలపన్ మఱిధర్మము లేదెఱుంగుమన్ ♦ గానిమయుండు రాఘవు నపకారమొనర్చెను
జావులేమి నె ♦ ద్దానను మేనుబాయుట హితంబొనరింపుము నీకు నెమ్మదిన్ ॥

క॥ అనవిని రావణుడిట్లనె ♦ మనియుండెదవేని కడునమంగళవై యొం ♦ దును
గాక సరసి బాసిన ♦ వనజంబును బోలెయుండు వందుచు నెపుడున్ ॥

వ॥ అని మఱియును ॥

క॥ ముదితలవని సీవె కాదీ ♦ గతి పురుషులు పావబ్రతుకు కాంతలు శోకా ♦
న్వితులై సుఖమంగళవర ♦ హితులై వర్తించు వారలెందు ధరిత్రిన్ ॥

వ॥ అనిపల్కి యచ్చోటువాసి వచ్చి తల్లడంబున నిలువనోపక వాసవారాతి
శజ్జపై మేనుజేర్చి చింతార్ణవంబున మునింగియుండె నంత నక్కడ రఘువల్లభుండు
సమరంబు చాలించి మేరు భూధరంబునుం బోలి యూహావక్షోణిం బడియున్న సౌమిత్రిం
జేరవచ్చి యిట్లని విలపించె ॥

చ॥ జననుత శీలలక్ష్మణ నిశాచరనాథుని బారినొంటివై ♦ ననుదిగనాడి పోవు
టలు న్యాయమె దానవ రాజ్యపాలనం ♦ బునకు విభీషణున్నిలుప బూనినయట్టి ప్రతిజ్ఞ
రిత్తపు ♦ చ్చిన విను మెత్తురే జనులు చిత్తములోన దలంచి చూడుమా ♦

ఉ॥ ఏమనువాడ నీవు మనెదేనియు లేక మరొక్కడైన చో ♦ నేమనువాడ నోటు
దనుజేశుని బాంధవ పుత్రసంయుతుం ♦ గాముని ద్రుంచి యామల గర్భముఖామర
కోటికూల్చి యు ♦ ద్దామపరాక్రమం బెసగ తమ్ముడ నిన్నిదె కూడవచ్చెదన్ ॥

వ॥ అని వెండియు తనలోన ♦

ఉ॥ ఈమహానియ్యమూర్తిని సురేశ్వరవిద్విషు మ్రోలడించి నిం ♦ కేమనియే
నయోధ్యకడ కేగుదు తల్లులు నన్నుగాంచి పు ♦ త్రామన లక్ష్మణుండిటకు రాడదెమో
యన వారితోడ నేనేమనువాడ తల్లులకు నేమని చెప్పుదు బాపుదైవమా ♦

చ॥ భరతుడయోధ్య యేలుటకు బాల్పడకుండినవాడు మున్న యా ♦ తెరగున
లక్ష్మ ణుండారగ తెంపొనరించెను రాముడంచు దా ♦ నెరుగన రిఘ్నుగూడి వసికేగును

తల్లులు విన్నయప్పుడే ♦ మరణమునొందగఁగలరు మామకకృత్రిమ మయ్యెనింతయున్

చ॥ అనఘచరిత్రసారస హితాత్మజ నాకొరకిట్లుగుందగా ♦ జనదప్లవంగ సంఘకము సమ్మతితోఁగొనిపొమ్ము నీపురం ♦ బునకు సుఖస్థితింబరగు మున్నునినుం బిలువంగవచ్చి నా ♦ యనుజుడు రోషమూని వెసనాడినమాటల తప్పుసైచుమీ ॥

వ॥ అనిపల్కి రాక్షసులరేని రెండవనమ్మునిం గనుంగొని ॥

క॥ అనఘవిభీషణ దశకం ♦ ఠునితోడం బోరియిట్లు ననుజేరితివి ♦ న్నును నేను నమ్మబల్కిన ♦ పనికిప్విధమునను నెపము పాటిల్లెసుమీ ॥

వ॥ అనియిట్లు బహుభంగుల శోకింపుచున్న రామచంద్రుని జేరవచ్చి సుషేణుం డిట్లనియె ॥

క॥ ప్రాణంబులున్నవియును ♦ మేనన్ ముఖకాంతిగలదు మేలైకన్నుల్ ♦ గానంబోసగెడుమందులు ♦ దేసంపుము పవనసుతుని దినకరకులజా ॥

ఉ॥ నావినిరామచంద్రుడు మనంబునశోకము బాసియాంజనీ ♦ దేవితనూజు నెంతయు నుతించిమహాత్మక నిర్వహింపుర ♦ ద్రోవరుశక్తిచే ధరణిగూలినలక్ష్మణు నమ్మహాపధ ♦ గ్రావముదెచ్చి శీఘ్రము జగంబులు నివ్వెరుతించునట్టులన్ ॥

క॥ పలుకులువెయ్యేటికి మును ♦ వలుపురసోదరులు మేము నగచరనీవున్ ♦ వెలయగనైదవవాడవు ♦ సలలితగతి మమ్ముబ్రోవు శాత్రవభేదీ ॥

వ॥ అనిన హనుమంతుం డాభూకాంతునితో నిట్లనియె ॥

శా॥ రాజాధీశ్వర చింతబోవిడచి ధైర్యంబూది చిత్తంబులో ♦ రాజీవాప్తుడు పూర్వశైలము దెసన్ రాజూచుచున్నంత పో ♦ రాజింగూలిన లక్ష్మణార్థముగ ద్రోణాద్రిన్ వెసందెచ్చి ని ♦ ర్వ్యాజంబేసెద నిన్ను నాపలుకు తథ్యంబొందుగా జూడకే ॥

క॥ నావంటిబంటుగల్గ ధ ♦ రావల్లభనీకుదిర్ప రానిదిగలదే ♦ యేవిధినిసౌమిత్రి పున ♦ ర్జీవితుగాదలపుమయ్య చిత్తములోనన్ ॥

వ॥ అనిపల్కిన సమీరాత్మజవచనంబులకు రఘువల్లభుండు ప్రహృష్టాంతరంగుండై యతనిం గౌగిటం జేర్చి యాశీర్వదించి పోయిరమ్మనుండు భక్తిపూర్వకంబుగా నారాజ శేఖరుని పాదంబులకు ప్రణమిల్లి యల్లవారలం గనుంగొన నప్పుడు ॥

మ॥ భుజగాధీశుడు వ్రీగుకోర్వక శిరంబుల్వంప శైలంబుపై ♦ బుజమార్గంబున పాదముల్నిలిపి పేర్మిన్ జేతులున్ వాలమున్ ♦ విజయస్ఫూర్తిని మిన్నుతో నొరయ నుర్వీంధ్రంబులుంగ్రుంగ భూ ♦ రిజవంబొప్పగ దాటుబోదికిని పేర్మిన్నిర్జరుల్

మెచ్చఁగన్ ॥

వ॥ ఇట్లెగసి కైటభారాతి కరవిముక్త సుదర్శనంబునుంబోలె నతివేగంబున నరుగుచుండె నంత వార్తాహరులు వేగుదెంచి పంక్తికంఠున కచ్చటి వృత్తాంతం బంతయు నెఱింగించిన విని వారలవీడుకొల్పి కరంబున చంద్రహాసంబు ధరియించి యొక్కరుండ కాలనేమి యింటికిం జనిన నప్పుడు ॥

శా॥ ఆమారీచ సుతుండెదుర్కొని మనంబానందముం జెంద సు ✦ త్రామ ద్వేషికి నాసనార్ఘ్యములు నర్హంబొప్పగా నిచ్చి మీ ✦ రీమై నేకతమీ నిశీసమయ మందే తెంతు రేకార్య మొం ✦ డేమైనం గలదేని పిల్వమన రాదే రాక్ష సాధీశ్వరా ॥

వ॥ అదియట్లుండె మీరలు విజయం చేయుటకు గతం బెద్ది యెఱింగింపుడు సాధ్యం బగునేని యప్పని దీర్చెదననిన నప్పౌలస్త్యుం డిట్లనియె ॥

సీ॥ సౌమిత్రి నాచేత సమరరంగములోన బొలసిన నారామ భూవరుండు ✦ బ్రతికింపగా బూని పవనతనూజుని యౌషధాచలము దేననుప నాత ✦ డరిగెడు వానిక్క నీవంతంబు నొందించెదేనియు కడు లెస్సనివ్విధంబు ✦ కాదేని నడుమ విఘ్నంబుగావించిన నెరమేలు జూ పద్మినీవరుండు ✦ పూర్వగిరిమీదవిమతుండు బోవుగాన ✦ తివిరి యొటులైన నాకోర్కె దీర్చుటొప్పు ✦ నీకు దక్కంగ నీపని నిర్వహింప నింక నెవ్వరు లేరట కేగవలయు ॥

వ॥ అనిన వాడు వెడనవ్వు నవ్వి దశకంధరున కిట్లనియె ॥

గీ॥ కడగి నీవు బనుప గాదె మాయామృగం ✦ బైమదియ్యజనకు డారఘూత్త ✦ మాంబకంబున గూలె నదిగాన యీపని ✦ కేను సౌరగ వెరతు నెన్నిగతుల ॥

వ॥ వలయుదేని నీకుగలవారిం బనుపుమనినం గాలకృతాంతుపోలికె నుగ్రాకారుండై దైత్యేంద్రుం డమ్మారీచ నందనునిం జంద్రహాసంబున నేయం బూనిన వాడిప్పుడితనిచేతం జచ్చుటకంటె మీద నెట్లయిన మేలనితలంచి యప్పని కొడంబడి యరిగె పంక్తికంధరుండును గ్రమ్మర నిజనివాసంబున కేతెంచి యంతరంగంబున సంతాపంబునొందుచు శయ్యపై బడియుండె నంత నక్కడ కాలనేమి ద్రోణాచల మార్గంబుబట్టి యతిత్వరితగతింజని ముందట నానాతరుల తాశోభితంబును విగతవిరోధ మృగకులంబును నిఖిలవిహంగ సముదయ కలకలంబును రమణీయ్యంబును నతిమనోహరంబుగా నొక్క యాశ్రమంబు గల్పించి యందు జడావల్కల ధారుండును భసితలిప్తాంగుండును దర్భాసనాసీనుండును నాసావలోకనుండును ధృతజప మాలికుండును కృశీభూతుండునునై కుహనాతపోవేషంబున వర్తింపుచుండె నంత ॥

చ॥ వరబలుడై సమారుతి జవంబున బంధుర కాననంబులున్ ✦ పరమతపోవనంబులును భవ్యనదుల్ గిరిసంఘముల్ సరో ✦ వరములు రమ్యదేశములు వాసికినెక్కిన

పట్టణంబులన్ ♦ గిరిమనురక్తి దాటిచని కాంచెనిశాటుని యాశ్రమంబువాన్ ♦

క♦ కనికెరగందుచు నిదియే ♦ మునివర్యుని యాశ్రమంబొ మును నేనిట వ ♦ చ్చిననాడుజూడ నింకే ♦ మనబాలును తోత్రివదప్పి యరుదేవల కేన్ ♦

క♦ క్షీరసముద్రంబెక్కడ ♦ నారయ హేమాద్రి యెక్కడతిమిర్గమ స్థా ♦ రారణ్య భూములెక్కడ యేచులుధరణీధరంబు లెక్కడతలపన్ ♦

వ॥ అనితలపోసి యారక చింతింపనేల యిచ్చట దప్పిదీర్చుకొని యీమునీంద్రు చేత పథక్రమంబు లెరింగి యరుగువాడనని కృతనిశ్చయుండై ధరణీతలంబునకు డిగ్గి యకుహానా తపస్విం జేరి నమస్కరించి ప్రియంబలర నిట్లనియె ♦

క♦ అనఘాత్మ వాయుపుత్రుండ ♦ హనుమంతుండనెడువాడ నారఘువీరుం ♦ డనుపగ జనియెదనిచ్చో ♦ ఘనమగుదాహంబుదీర్ప గలవే జలముల్ ♦

చ॥ అనవుడు మందహాసమున నాకుహనాముని వాయుపుత్రునిం ♦ గనుగొని తృష్ణదీరగను క్రిన్ననవాదు కమండలోదకం ♦ బనువునద్రావి యోగ్యమగు నట్టిఫలంబులు బుచ్చుకోమ్ము నీమనములరంగ కొంతవడి మానుగనిద్దుర జెందుమిచ్చటన్ ♦

వ♦ అని వెండియు ♦

సీ♦ భూరివిక్రమ నుత్తపోబలంబునగాన నయ్యెనిరాకదైత్యాధినాథు ♦ డకు పంక్తికంధరుం డారాముదేవని వంచనగొనిపోవ వసుమతీశు ♦ డదినిమిత్తముగ శక్రాత్మజు దునుమాడి యర్కజుచేపట్టి హరులగూర్చి ♦ కంధిబంధించి లంకాపురిసుట్టిరా విడిశినిశాచర వీరవరుల ♦ గూల్పనెంతయుగినిసి రక్షోవిభుండు ♦ లక్ష్మణునియాజిభూమి వ్రాలంగనేయు ♦ డతనిబ్రతికింపబూని మహౌషధాద్రి ♦ నెత్తికొనిపోవజను దెంచి తెంక వినుము ♦

క॥ జీవించులక్ష్మణుండా ♦ రావణుననిలోనదృంచి రాముడుసీతా ♦ దేవియు దానునసమోధ్యకు ♦ వాసిరిజనిరాజ్యమేలు వలనొప్పంగన్ ॥

వ♦ కావున ♦

క♦ రాముని హితముం జేయుట ♦ లేమాకును లెస్సతమము లీనంబైనన్ ♦ సౌమిత్రిబ్రతుకునట్టుల ♦ గామందులొసంగుదిచట గలయది యరయన్ ♦

ఉ♦ నావిని వాయుసూతి ప్రథనంబునలక్ష్మణు డీల్గియుండ నే ♦ నీవనభూమిలో నిలచి యెట్టులపండులు దిండునిద్రయే ♦ నేవిధిబోనునీక్షణము యేగెదనీదు కమండలాంబుముల్ ♦ ద్రావినతృష్ణదీరను నటంబుసరోవర మున్న జెప్పవే ♦

వ♦ అనిన వాడు తనయాశ్రమంబునకు పూర్వభాగంబున సరోవరంబునందొక్క

జలగ్రాహంబుండి యచ్చట సలిలపానంబు సేయబోయిన వెట్టివారినైనంబట్టి మ్రింగు
చుండ నదిమెఱుంగుటంజేసి తనచేయుకార్యంబు సఫలంబయ్యెనని తలంచి నయ్యా దీని
కించుకదూరంబున కాసారంబుగల దంపులజలంబుల మృతోపమానంబులు గావునని
దాహంబుదీరద్రావి తడయక రాముకార్యార్థ్యం బరుగుమని తనశిష్యులచేత మార్గంబు
చూపించిన పవనతనయుండు వానిమృదులవాక్యంబుల కలరుచుంజని యాకమలాకరంబు
గనుంగొని తదియ్యవైభవంబు గొనియాడుచు నిమీలితనేత్రుండై యప్పుడు ॥

శా॥ విస్తీర్ణక్షితిబోల్చు నక్కొలనిలో వేవేగమేడిగ్గి దా ♦ హస్తద్వందముచేత
పైకలక బాయందోచి యుగ్రాటవిన్ ♦ హస్తిశ్రేష్ఠము మేఘమోయనగ తృష్ణన్
బేర్మిచేసంత లో ♦ కస్తుత్యుండగు వాయుజుండు కడుకాంక్షన్ నీరముం ద్రావగన్ ॥

క॥ కరిబట్టినమకరముగతి ♦ పరతెంచిజలగ్రాహంబు పాదయుగంబు ♦ ద్ధుర
భంగి బొంగిపట్టిన తరలంగాలేకనపుడు తనమదిలోనన్ ॥

శా॥ కూ్రరగ్రాహముగానెరింగి కపివీరుండుద్ధతింబేర్చి దు ♦ ర్వారక్రోధముచేత
దాని రదముల్ వాలంబునందుల్చి దో ♦ స్సారపౌఢిని జిహ్వాద్వంపనది యంతంబోక
హుమ్మంచు న ♦ ప్వీరుందుర్మద లీలమ్రింగెను నభోవీధిన్ సురల్ గుందగన్ ॥

వ॥ అప్పుడు ॥

క॥ గ్రాహంబుతన్ను నతులో ♦ త్సాహంబున మ్రింగనతడు తనబ్రతుకుట సం♦
దేహించియంతలోనై ♦ దేహీవిభున్ మదిదలంచి దృఢచిత్తుండై ॥

వ॥ యమ్మహాగ్రాహి కుక్షియందు ప్రవేశించిన నది తనకుతగిన యాహారంబు
లభించెనని యానందింపుచు నుదకమధ్యంబునకుం జనియెన త నప్పవమాన నందనుండు
తనగాత్రంబు పెంచిన నదియూపిరి వెడలక నుబ్బనకుడుచుచు తత్తీరంబునకువచ్చిన దాని
యుదరంబుసించి సురలుగొనియాడ వృత్రాసురు యుదరంబు భేదించి నిర్గమించు
దంభోళిధరుని యనువున విధుంతుదవక్త్రగహ్వరంబు వెడలి వెలుగొందు దినేశుని
పోలికె తేజరిల్లుచుండె యనంతరంబ ॥

క॥ ఆతడుగనుగొననది కూ్ర ♦ రతయంతయు బాసియపుడు రతియో వనదే♦
వతయో శచియో యనబా ♦ ల్పైతగవిమానముననను చెలువమరంగన్ ॥

చ॥ అదిగనివాయుసూతి హృదయంబున నివ్వెరగందినీవు బె ♦ ట్టిదముగ
తొంటిమేనుగతి తేవసురాంగన రూపుదాల్చి తె♦ య్యదిగతమంతయుం దెలియు నట్టుల
జేయుమటన్న నింతి ప ♦ య్యదనవరింపుచున్ వికసితాననయై ప్రియమొప్పనిట్లనెన్ ॥

వ॥ అయ్యా యేను ధాన్యమాలి యనుదాన నమదియ్యానాట్యంబునకు మెచ్చు

బుట్టి నొసలికన్నువేల్పు నొక్క దివ్యవిమానంబు కృపచేసిన దానినెక్కి భుజగంబుల విహరింప నొక్కదినంబున నిక్కాసారంబునకు వచ్చి యవగాహనం బొనర్చుచుండ శాండిల్యుండను తపస్వివరుండు నన్నుంగాంచి పంచాశుగా యత్తచిత్తుండై పొందనడిగిన నతనితో మహాత్మా యేను రజస్వలనై యున్నదాన చతుర్థ దివసంబునంగాని నన్నుంగదియుటకు నొనగూడదనవుండు నమ్మునితిలకుండు నాటికేనియు నొడంబడుమని ప్రార్థించినయె నవ్వనికియ్యకొని యచ్చోటువాసి గంధమాదన పర్వతంబునకుం జని దానిపై విశ్రమింపుచుండ తొలుతటిదినంబున పంక్తికంధరుండు దిగ్విజయంబుచేసి యఖిలసేనాపరివృతుండై మరలిపోవుచు నాయున్నయెడకువచ్చి సంచలితమనస్కుండై రతివేడిన యేను వానికిట్లంటి ॥

క॥ వినుమురజస్వల బరతం ♦ త్రిను నన్నుంగలయనీకు తగదనిపలుక౯ ♦ దనుజేశుడుతనకది లె ♦ క్కనినన్నుం గదిసె ప్రియుదితాత్ముండగుచు౯ ॥

వ॥ అంతనాకు సద్యోగర్భంబున నతికాయుండనువాడు జన్మించిన వాసవారాతి వానిందోలుకొని చనియె యేను వాసరత్రయంబుబుచ్చి కృతస్నాతనై శాండిల్యుని పాలికరిగి నమస్కరించి నన్ను పరిగ్రహింపుమనిన నాతపోధనుండు నావిధంబెరింగి కోపించి నీవునన్ను వంచించి యిట్లన్యపురుష సంగమంబుజేసితివి గావున నిక్కమలాకరంబున మహోగ్రగ్రాహివై యుండుమని శాపంబిచ్చిన యేను భయభ్రాంతనై నాతెరంగుచెప్పి యేన నపరాధినని వేడుకొనిన నతండు ప్రసన్న హృదయుండై నాయెడకరుణించి రామచంద్రునిపనుపున కొన్నినాళ్లకు వాయుతనయుం డిచ్చోటికి వచ్చు నతనికతన నీకు శాపమోక్షణంబగునని యానతిచ్చి యంతర్ధానంబునొందె నేడు భవత్ప్రసాదంబున కృతార్థనైతినని పలికి వెండియు నిట్లనియె ॥

గీ॥ ద్రోణగిరికినిదియె త్రోవతప్పదువీడు ♦ పంక్తికంధరుండు పనుపవచ్చి ♦ కపటమునివిధంబు గైకొనియున్నాడు ♦ వీనిద్రుంచినీవు వేగజనుము ॥

వ॥ అనిచెప్పి ధాన్యమాలి నిజలోకంబున కరిగె పవనతనయుండు మరల కాలనేమి పాలికిం జనుదెంచిన వాడతనితో నిట్లనియె ॥

చ॥ మడువుననీరుద్రావజని మర్కట జాగ్రవరించబోలు నె ♦ కడువడిజీవనౌష ధము గైకొనిపొమ్ముపదేశ మిచ్చెద౯ ♦ తడయక తెమ్మునాకు గురుదక్షిణనావుడు వానివక్షముం ♦ బిడికిటవ్రేసెవాయుజుడు బెల్లునదక్షిణయంచు నుగ్రుడై ॥

గీ॥ దానసోలితెలసి దర్వీకరముభంగి ♦ రోజుచునుమహోగ్ర రోషమునను ♦ కాలనేమియపుడు కరువలిపట్టిపై ♦ బహువిధములమాయ బరపుటయును ॥

వ॥ నమ్మహాబలసూనుండు వానినన్నియు సరకుగొనక నక్కాలనేమియు పగత పాణుంగావించి ద్రోణాద్రికిం జని దానినారోహణంబు జేసి యిట్లనియె ॥

ఉ॥ రాముని బంటయేను నగరాజ యతండనుపంగ వచ్చితిన్ ♦ ప్రేమమహౌషధంబులకు మేయగుణాకర వానినిచ్చి సం ♦ గ్రామతలంబు లోపలను రావణుశక్తిని గూలినట్టి యు ♦ ద్దానభుజున్ సుమిత్రిజు ప్రతాపనిధిన్ బ్రతికింప వేడెదన్ ॥

గీ॥ అనిన యాగిరీంద్రుఁ డతిగర్వితుని పోలె ♦ పలుకకున్న గినిసి పవనసుతుఁడు ♦ దయయు నిజముకరుణ ధర్మంబు కళినాత్మ ♦ లందు లేవయాంను నరయననుచు ॥

వ॥ నత్యుగ్రరోషంబునుం బొంగి మహోత్సాహంబునం జట్టి యభూమిధ్రంబు పెల్లగిలం దిగిచి తొల్లి విష్ణుండు మందగిరి యెత్తు విధంబున నెత్తి యంభోదరంబు పగువున ఘర్జించిన తద్భీషణారావంబు విని చిత్రసేనాది గంధర్వు లనేక సహస్ర సంఖ్యలు గూడుకొని పరశుముద్గర గదాతోమర పట్టిస ప్రాసకుంతము సలాది సాధనంబులు ధరియించి సిహ్మనాదంబులు సేయుచు సత్వరంబున బరతెంచిన భస్వదాత్మజు జుట్టుముట్టి ॥

చ॥ కుధరచరుండు వీడె కడు క్రొవ్వున నాడరుదెంచి నిమ్మహౌ ♦ షధ ధరణీధరేంద్రము ప్రచండబలోద్ధతి గొంచుబోయి యా ♦ విధమున నేడు వచ్చె పటువిక్రమ మేర్పడ వీని దం ♦ డధరుని పట్టణంబు జతనంబున జేర్పుడటంచు నుగ్రులై ॥

ఉ॥ అందరునొక్క పెట్ట వెసనార్చుచు డాకిన వాయుసూతి దా ♦ కొందర ముష్టిఘాతలను కొందర వాడి నఖంబులన్ మరిం ♦ గొందర భూరివాలమున గూల్చి మహోగ్రత బేర్చి యార్చినన్ ॥

వ॥ అందు కొందరబ్బలియుని శాకిందప్పి కనుకనం బరచి యంబరతలంబున నిలచి నయ్యా నీకు మార్గంబు సుకరంబై శుభంబు లొనగూడుగాత నింక నిమ్మహౌషధాచలంబు గొనిచనుమని ప్రార్థించిన దరహాసిత వదనుండగుచు యాకపిపుంగవుం డప్పుడు ॥

క॥ గిరియంత నంసతలమున ♦ సరగున నిడి గగనవీధి జనుచుండెను దా ♦ నురుగతిని నాటిరేయును భరతుడు దుస్స్వప్నమంది భయచిత్తుండై ॥

గీ॥ మేలుకాంచి దుర్నిమిత్తంబులొక కొన్ని బయలజూచి రామభద్రునకును ♦ జనకసుతకు లక్ష్మణునకు సుకీడు వా ♦ టిల్లబోలు జువ్వె తెల్లమిగను ॥

వ॥ వనంబునకుం జని పదునాలుగేండ్లు గావచ్చె నిదివరకు వారి వార్త లేమియు వినబడదని కుందుచు భూసురుల నార్యుల రావించి తనదైన స్వప్నంబు జెప్పి వారల

యనుమతంబున శాంతికవిధులొనర్చి వెండియు చింతింపుచుండెనంత నభ్రవీధినరుగుచుం బవమానపుత్రుండు భూరిజటాకలితోత్తమాంగుండును తపోవ్రతుండునునగు భరతునిం గనుంగొని రామచంద్రుండు సుమిత్రాసూనుండు బడిసపిమ్మట జనకసుతను విడచిపోరు టకు విసివిరాబోలునని తలంచి యంతలోనా ॥

ఉ॥ అనఘుడురామభద్రుడు మహాద్భుతవిక్రము డాదశాస్యుని ♦ మనిమి ప్రమోదమొప్ప తనతోయ్యలియుం ప్రియసోదరుండు తో ♦ డ నరుగుదేరవానర దళంబులుగొల్వ నయోధ్యకుంబ్రియం ♦ బున జనుగాకదైన్యగతి బూనినరాక మదిందలంచునే ॥

వ॥ ఇతండు రామచంద్రునిం బోలిన పురుషుండు గాబోలునని తలంచుచు పోవుచుండె నంత ॥

గీ॥ భరతుడంబరమున నరుగుమారుతిగని యమ్మవోడగి భూతమనితలంచి ♦ యేయబూనుడుడుగు హితుడుహితుడని ♦ వాణిబలికెనపుడు వలనుమీర ॥

వ॥ అత్తెరంగునకు భరతుండానంద విస్మయంబులు మనంబున రెట్టింప రామ చంద్రునకు శుభంబులు చేకూరు గాకయని యతినియమస్థితుండై దేవతార్చన మొనరించె

ఉ॥ అంతప్రభాతభాసిత దినాధిపతేజుడు భూరికాయుడ ♦ శ్రాంతరఘూత్తమాంఘ్రి యుగళాంబుజ సంస్మరణాధురీణు డత్యంతబలోరు ధైర్యసము పార్జితుడద్భుత శౌర్యుడా హనూ ♦ మంతుడు గాంచె జంతుయుత మానితభద్రము నా సముద్రముల్ ॥

గీ॥ కనితదియ్య:విభవమునకును మెచ్చుచు ♦ జనగనద్దశాస్యు పనుపుబూని ♦ మాల్యవంతముఖర మనుజాశనులు వది ♦ కోటులొక్కపెట్ట గూడబారి ॥

క॥ వివిధాస్త్రంబులనొంచిన ♦ యవిరళగతి జేర్చియార్చి యనిలాత్మజుడా దిజాతులపైనుద్ధతి ♦ గవిశేల వెసప్రశయకాల కాలుడపోలెన్ ॥

సీ॥ కదిసివాలంబున కంధరంబులజుట్టి కొందరవారధియందువైచి ♦ చరణ తాడనముల పసువడికొందర నంతకుపురమున కనిచిపుచ్చి ♦ ముష్టిఘాతంబుల మును మిడి కొందర శౌర్యవిస్ఫూర్తిచే నమయజేసి ♦ పార్శ్వప్రహారముల్ బరపియుద్ధతి జేర్చి దలకకకొందర బిలుకుమార్చి ♦ నంబుధినిదిరుగునాది మీనంబుభాతి ♦ హారిణ ముల బెగడుపరచు సింహంబుపగిది ♦ తుంగమదునృగలంచు మాతంగవిభుని ♦ కరణి దనుజులగలచె నాకపివరుండు ॥

చ॥ అదిగనిమాల్యవంతుడు మహాగ్రహవృత్తి నెదిర్చియప్పుడా ♦ త్రిదశవరుల్ దలంకగ నధిజ్యశరాసనుడై శరాలి దు ♦ ర్మదమున నేసిబెట్టు పవమానతనూభవు

నొంచియార్చినన్ ♦ బెదరక యాంజనేయు డతిభీషణభంగిని జేర్చి గ్రుక్కినన్ ॥

క॥ విల్లుద్రుంచి దైత్యువక్షము ♦ బలుముష్టిం బొడువవాడు బడిపడియపుడే ♦ పాలసినవిధమునమూర్ఛిలి ♦ తెలిసికపిప్రవరునేశె ధృఢతరశక్తిన్ ॥

వ॥ అశ్లేసిన కినుకవడమి యది ద్రుంచివైచి సత్వరంబున ॥

క॥ వాలమునజుట్టిసంధులు ♦ వీలగనమ్మాల్యవంతు వెసద్రిప్పి సుప ♦ ర్వాలి ముదమందగా మక ♦ రాలయమునవైచె వైవనాబలుడంతన్ ॥

వ॥ శౌర్యబలంబులు దూలి రసాతలంబునకుం జసియె గెలుపునుబ్బున వియచ్చరు లబ్బురంబుజంద పవమాననందనుం డామందుల కొండంగొని పోవుచుండె నంత॥

చ॥ ఘనతరరత్నసంచయ వికాసతబోలు మహీధరంబు హె ♦ చ్చినవడిగొంచు బోవ రఘుశీలుడుదవ్వుల జూచితద్యుతుల్ ♦ దినకరరోచులంచును మదిందలపోసి విషణ్ణచిత్తుడై ♦ వనచరముఖ్యులెల్ల బలవంతపు నెవ్వగ నొందనిట్లనెన్ ॥

చ॥ అదెయుదయాద్రిమీదట సహస్రమయూఖుడు బొల్చెనన్న దా ♦ న దయదలంచి నిక్కము గసాసుతెలక్ష్మణు డెంచిచూడ నా ♦ నదియెపథంబుభూసుతకు నాస్పదమే యదిగాకతక్కినన్ ♦ బ్రతుకగవచ్చునే యితని బాసినమీద నిమేష మేషియున్ ॥

వ॥ అని సుమిత్రానందనుం బేర్కొని ॥

చ॥ పరమదయాపరుండ వనుబంధివి నాయనుజుండవంచునిన్ ♦ కరమనురక్తి నమ్మియుట కానకునీవెను వెంట వచ్చినన్ ♦ నిరుపమశౌర్యలక్ష్మణ మనీషణకూరిమి మానియిట్లు దు ♦ స్తరమగుశోకవారధి వెనన్ననుతోఁచి చనంగపాడియే ॥

గీ॥ అటవినయోధ్యయై యొప్పె ననఘయపుడు ♦ నీవునాకడగలుగుట నిక్క మరయ ♦ అటవియై యొప్పె నయోధ్య యనఘనిపుడు ♦ నీవునాకడలేమికి నిక్క మరయ ॥

వ॥ అని యివ్విధంబున లీలామానుష విగ్రహంబగు రఘునాయకుండు విలపింపు చున్నంత ॥

చ॥ తనతనుకాంతిసన్మణి వితానముకాంతి మహౌషధంబు లం ♦ దనరెడు కాంతిగన్గొన దినప్రభు కాంతిని ధిక్కరింపు పా ♦ వని యరుదేరగాయతడె వారిజమిత్రుడటంచునుల్క యవ్వనచరులత్తెరంగు రఘురామునితోడ నెరుంగజేయుడున్ ॥

మ॥ లయకాలాంతకు బోలిభ్రూకుటి విశాలంబైన ఫాలస్థలిన్ ♦ రయమొప్పారగచేర్చి కన్నుగవ యరుణింపెల్పగా విస్ఫురిం ♦ గయుతంబుల్ ప్రతిరోమకూపముల

వీకంగ్రిమ్మ లోకంబులుక ♦ భయదవ్రిక్రియ నొందరోజుచును భూనాథుండు సక్రోధుడై ॥

ఉ॥ మందులకోడఘంజనిన మారుతసూనుడు రాకమున్న యా ♦ జిందెగినట్టి లక్ష్మణుడు చెల్వగలేవకమున్న క్రొవ్వుచే ♦ నిందకునోర్చినిట్లు నలినీరమణుండు దయాద్రిదోచి సం ♦ క్రందనవైరికేహితవు గైకొనిచేయుదలంచి చూడుడా ॥

వ॥ అనిపలికి ॥

క॥ నాకునసాధ్యంబెయ్యది ♦ భీకరమద్విశిఖవహ్ని బేర్చికడంకక ♦ లోకంబులు భస్మీపట ♦ లాకృతిజేసెదను బొంకమణచెద తపనుక ॥

వ॥ అని సంవర్తవేళా ప్రవర్ధమాన దావదహనుంబోలి పెచ్చుపెరింగి యుద్దండ బాహుదండంబున కోదండంబు ధరియించి గుణధ్వనిజేసిన ॥

చ॥ ధరణివడంకెదిగ్గజ వితానము మ్రొగ్గె కలంగెనంబుధుల్ ♦ తరతెనుకూర్మ ముద్దవిచి తారలుడుల్లె నభంబుమ్రోసె న ♦ య్యురగవిభుండునొంచె తలలొక్కట బెగ్గిలి రాసురల్ మహీ ♦ ధరములుపెల్లగిల్లెమది తల్లడమందిరి లోకపాలకుల్ ॥

వ॥ ఆసమయంబున సుషేణజాంబవంత విభీషణాదులు రఘువీరుజేర నేతెంచి వినమితోత్తమాంగులై కరంబులుముకుళించి జగదేకవీరా మీరలలుకబూనిన ముల్లోకంబు లాకులతబొందుచున్న యవి యుపశమిత క్రోధుండవుగమ్ము వచ్చువాడు దివ్య మణివిభాసి తౌషధాచల శోభితుండగు హనుమంతుండుగాని యంశుమంతుండుగా డెట్లంటేని ॥

క॥ పాలింపప్రౌఢ్యగంటిమి ♦ నాలవజామిలుదుసొచ్చె నరనాయక వా ♦ తూల తనూభవ్రడాతడు ♦ వాలాయంబతనికెదురు వంపుముగపురక ॥

వ॥ అనిన రఘువరుండు మాసినకోపంబున నట్లనియమించె నాసమయంబున॥

ఉ॥ మామకవంశకర్త గుణమండనుడంచి తధర్మమూర్తియా ♦ రాముడుసోద రార్థ ముకరంబును జింతిలుచున్నవాడు హా ♦ తీసమనుగానలక్ష్మణుని దేర్చిప్రమోద మొనర్తునంచు దా ♦ భూమికివచ్చె భానుడన భోరునమారుతి వచ్చెయుబ్బునక ॥

మ॥ నరనాథాగ్రణి యుత్సహింప కపిబృందంబెల్ల నగ్గింప నా ♦ సురసందోహము తల్లడింప నమరోస్తోమంబు గీర్తింప భా ♦ సురరత్నాంచిత శైలరాజము తగక క్షోణీస్థలిన్నిల్పి దా ♦ శరథింజేరి నమస్కరించి యపుడా సామీరితానిట్లనెక ॥

గీ॥ ధారుణీశ్వర దివ్యౌషధములుగాన ♦ బడమిగిరిగొని తెచ్చుచో నడుమగలిగె విఘ్నములుపెక్కునందుచే వేగరాక ♦ తడసితినియుల్లమున నాదు తప్పసైచు ॥

క॥ అనిన రఘువీరుడాతని ♦ కనుగొని మాయయ్యసీకు గలవే తప్పుల్ ♦ మను కులము నిలిపితివి నా ♦ యనుజన్మని బ్రతుకజేసి యార్యస్తుత్యా ॥

వ॥ అనిబహువిధంబులం గొనియాడె నంత భానునందనుండు సుషేణుం గనుం గొని నీవీయచలంబుపై కరిగి వలయునౌషధంబులు దెచ్చి సౌమిత్రిం బునర్జీవితునిం జేయుమనుం డత డనేక వనాకానీకంబుల తోడంగూడ నప్పర్వతంబెక్కి యందుగల విశేషంబులు వారలకుంజూపుచు విశల్యకరణిం గొనివచ్చి సంప్రయోగంబు సేయు తక్షణంబున ॥

మ॥ తమిత్రోనిద్దురజెందిమేల్కనిన చందబయ్యుడందోప నం ♦ గనులొప్పం గపిసంఘకన్ను మరికాంతుల్ జూచి యుప్పొంగ ను ♦ త్తముడాలక్ష్మణు డొయ్యలేచిన ప్రమోదస్ఫూర్తిచే రాఘవుం ♦ డమరంగాగిటజేర్చె శీఘ్రమున సౌహార్ద్రంబునన్ లక్ష్మణున్ ॥

వ॥ అంత ॥

మ॥ నరనాథాగ్రణి పంపుగైకొని యనూనస్ఫూర్తిచే పేశుడై ♦ సరవిన్ విఘ్న చయంబులోర్చి పటుదోస్సారంబువీపింప స ♦ త్వరచే మందులకొండ తెచ్చి కడుతేవన్ లక్ష్మణుంబోచె న ♦ చ్చెరువీపావని విక్రమంబనికపుల్ నెగ్గించిరామోదులై ॥

వ॥ ఆసమయంబున ॥

చ॥ కపివరనీప్రసాదమున గల్గెనునాకు సహోదరుండు మ ♦ త్తపనకులంబు వర్ధిలె సతంబుగదీనికి నీకు నేను ప్ర ♦ త్యుపకృతి సేయనేరనని యుర్వీవరుండు సమీర సూతి న ♦ త్యపరిమితాను మోదమున నప్పుడుకౌగిట జేర్చి నర్మిలిన్ ॥

వ సుషేణుం జేరబిలచి సంభావించి నీకతంబున సౌమిత్రి సంజీవితుండయ్యె మదియ్యాన్వయంబు వృద్ధినొందెనని బహుభంగులం గొనియాడి వెండియు మారుతి నుద్దేశించి యిట్లనియె ॥

గీ॥ అనఘచారిత్రయిందుని యాజ్ఞగడవ ♦ మనకుబోలదు గావున ఘనజ వమున ♦ నరిగిద్రోణాద్రిమునుపటి యచటనటుల ♦ నునిచిరావలెననుడు నయ్యనిల సుతుడు ॥

వ॥ మహాప్రసాదంబని నయ్యచలంబు గొనిచని తొంటిచందంబున నిలిపి మరలి వచ్చి రామలక్ష్మణులకు ప్రణమిల్లిన వారలతనిం గృచ్చియెత్తి పరమానందంబునం గనుంగొని ద్రోణాద్రికిం బోయివచ్చిన తెరంగెరుంగ వేడుటయు నవ్వాయు నందనుం డంతయు ననుక్రమంబున నెరింగింప నింతయొప్పనేయని బహుభంగుల ప్రశంసించిరి

సుగ్రీవాంగద సుషేణప్రముఖ వానరయోధులు వేరువేరంగానియాడి సంభావించిరంత।

గీ॥ అంతవృత్తాంతమపుడు వార్తాహరులరిగి • విన్నవించినమదిలోన వెరపు జెంది • విక్రమముసాహసంబును పీటిబోవ • వంక్తికంధరుడాశుక్రు పాలికరిగి ॥

వ॥ యతని యడుగులకు ప్రణమిల్లి కృతాంజలియై దైన్యవచనంబుల నిట్లనియె।

చ॥ వనచరకోటిగూడి రఘువర్యుడు తానరుదెంచి లంకను • ట్టున గలయుంగ డిగ్గియు కడుంజలమొప్పగ బోరిలోపలం • దనుజులజంపికుంజర వితానముగూల్చి తురంగమంబులన్ • దునిమెశతాంగకంబులను నుగ్గొనరించె మహాస్త్రసహ్మతిన్ ॥

గీ॥ ప్రజ్వలిల్లెను నగ్నిలోపలను జొచ్చి • మర్గుశలభములట్ల రామక్షితీశు • దివ్యశరవహ్నినణగిరి దితిజాలందు • బ్రొప్పునకునొకడుబ్రతికిన చోటులేదు ॥

గీ॥ ఎటులనిర్వహింతు నేగతిజీవింతు • నెటులనుందునాకు నెరుగజేయు • నీవు జెప్పినట్లు నిక్కంబు జేసెద • చదరిట్టి రాజ్యపదవినిలుపు ॥

ఉ॥ నావినిశుక్రుడా దనుజ నాథునకిట్లను శత్రుసంహతి • న్నీవుకడంగి ద్రుంచుటకు నిక్కముచెప్పెద దివ్యమంత్రముల్ • రావణయేనుగల్గ గనరాతి సమూహము నీకెదిర్చి తా • రేవిధినిల్తురాజిలతి నిమ్ముగప్రాణము తోడ సెప్పుమా ।

వ॥ అనివలికి దివ్యంబగు మంత్రంబెరింగించి యింకనీవు నిశ్శంకంబని యథావిధి హోమంబుగావింపుము విఘ్నంబుగాక జరిగెనేని యందు దివ్యఖడ్గ బాణాసన రథ రథ్య కవచకుండలంబు లుద్భవించువానింగొని సమరంబున పరిపంథులం దెగటార్చెదు నందియంబులేదు నమ్ము హొమ్మని పీడుకొల్పిన భార్గవునకు వలగొని మ్రొక్కి యురు జవంబున లంకసొచ్చి దుర్గసంరక్షణంబునకుం దగినయోధుల నియమించి యప్పుడు ॥

సీ॥ స్నానంబొనర్చి రాక్షసనాయకుడుమది జలగుచుపాతాళ బిలముసొచ్చి • ఘనరక్తపుష్ప చందనములునొగి దాల్చి గంధపుష్పాద్య లంకరణమైన • వేదికలో యథావిధిననలంబు ప్రతిష్ఠించివానికి తిరిగరాగ • హోమయోగ్యములగుపాత్రలునిచి యాడగ్గర నస్త్రశస్త్రాదులుసేర్చి యహంభంగి • తనరథల్లాతసమిధలు తక్షలములు • నగరుగుగ్గులుదూర్వంబు లాజ్యరక్త • ములునుసురయును పాయసమును భుజంగ • కాకగృధ్రజలగ్రహ కచ్ఛపములు ॥

వ॥ మీనశ్వాగ ఖిల్లంబులు కర్పూర కుంకుమంబులును కేశకుసుమంబులును క్రమంబున వేల్చుచున్నంత ॥

శా॥ ధూమౌఘంబులు గవ్వారాంతరమునన్ దోద్ధూతనంజాతమై • భీమప్రక్రియ నంబరస్థలి మహాభీమంబుగానిండి య • చ్చోమార్తాండుని గప్పెపైపయి సురస్తోమంబు

బెగ్గిల్ల నా ♦ నామానీ-దుస్థిలు తల్లడిల్ల కపిబృందంబుల్ దలంకన్వడిన్ ।

వ॥ అంత విభీషణుండది దశానన హోమధూమంబుగా నెఱింగి రామున కవ్విధం బెఱుకపడంజెప్పి మఱియును ॥

గీ॥ నరవరోత్తమ యాదశాననుడొనర్చు ♦ నట్టి హోమంబవిఘ్నమై యమరె నేని ♦ యతనిగెల్వంగరాదు పురారికైన ♦ కానవిఘ్నంబు సేయుట కార్యమిపుడు ॥

క॥ అనిన నగుగాక యనినృపు ♦ డనిలజముఖ్యులనుబిలచి యసురాధీశుం ♦ డొనరించు హోమకృత్యం ♦ బనువునవిఘ్నంబు సేయుడని పలుకుటయున్ ।

సీ॥ పనిబూనిపవనజ బలనిషూదనపౌత్రి గజనీలశతవలి గవయపనస ♦ తార గవాక్షమైందద్వివిదాదివానర సంఘముల్ తరులు గిరులుగనక ♦ కరములదాల్చి లంకాపురిసొచ్చి తర్జనభర్జనధ్వనుల్ జగతినిండ ♦ జేయుచుఘనతర సింహనాదంబులు గావింపుచును దైత్య గణముదృంచి ♦ నగరుసొచ్చియచటి నక్తంచర శ్రేణి ♦ తోలిరథ చయంబు గూలదన్ని ♦ నురుముచేసి కరులలోగొనియుద్ధతి ♦ హరులజదియమోది యార్చి పేర్చి ।

వ॥ మఱియును నాయుధశాలలుసొచ్చి నానాశస్త్రవితతి విరచియు భాండాగారంబుల యందున్న ధనంబులపారవైచియు వివిధమణిసంఘటిత కాంచనసౌధంబులు పడతన్నియు దశాననుం డెక్కడనున్నవా డెఱుంగజేయుండని నిశాటుల నొప్పించియు బడలుపరచియు నేలంజదియమోదియు త్రుంచియు నవ్వనచరులు విహరింపుచున్నంత॥

గీ॥ సరమయనునది నవ్విభీషణునిభార్య ♦ పతిహితంబూని దేవేంద్రి పౌత్రి నకును చూపెచెనన్న నాకౌటుసుండు వేల్పు ♦ బిలమువానరబృందంబు పిచ్చలింప ॥

వ॥ అంత ॥

ఉ॥ ధీరుడువాలినందను డశీత్వరచేజని యప్పుడాబిల ♦ ద్వారములోనజొచ్చి యటదైత్యకులేశుని గాంచియుగ్రుడై ♦ క్రూరనిశాటుజూచితిప గొబ్బునరండని పిల్వ నేగియా మారుతపుత్రముఖ్యులు క్రమంబున నక్కహారంబు సొచ్చియున్ ।

ఉ॥ అచ్చటగల్గురాక్షసుల నందరబీచమణంచి యంతయున్ ♦ బొచ్చములేక వేల్పు నలపూర్వసురప్రభు గూడివేల్పగా ♦ వచ్చినవారపోల కపివర్యులునచ్చటి ద్రవ్యపుంజముల్ ♦ బుచ్చుకహోమగుండమున భోరునవైచి చలంబుపెంపునన్ ।

గీ॥ సురవిరోధిచేతి సుక్స్రువంబులు వెస ♦ దిగిచిపారవైచి తివిరిముట్టి ♦ పాష్ణిఘట్టనలను బలువిడినొప్పింప ♦ యసురదలకకునికి యంగదుండు ।

వ॥ నత్వరంబున నంతఃపురంబు సొత్తెంచి ॥

మ॥ లలితరత్నాంచిత భూషణప్రతతి రాలన్నీనుగంపింప క ♦ జ్జలధారల్ నయ
నంబులన్ వెడలన్ హృత్సంతాప మంతంత క ♦ గ్గలముం జేయగ మోవియుం డపద
యుగ్మంబుల్ గుమ్మజ్జెంద ది ♦ వ్యలుపాపాయన నీడ్చి తెచ్చెను దశాస్యుండా య
మండోదరిన్ ॥

వ॥ ఇట్లు దానవ రాజ్య లక్ష్మీంబోనిమయ పుత్రిని ముందలబట్టి యీడ్చి తెచ్చి
రావణుని కట్టెదుర నిల్పి గాశియొనర్చుచుండ నయ్యతివ దశకంఠుని నుద్దేశించి ॥

మ॥ దనుజాధీశ్వర రాముభార్యగాని యుత్సాహంబునన్ వృవం ♦ చన చే
వచ్చుట యంతదిక్రియది నా శౌర్యంబు పెంపేర్పడన్ ♦ గనుసీదేవిని తెచ్చినాడని పె
చక్కంజూపుము రాయంచు నీ ♦ కు నెరింగింపగ వచ్చినట్టునను నీకూ్రరుండు దెచ్చెన్
వడిన్ ॥

గీ॥ అనుపమానశౌర్య డకదంతినివహాకం ♦ ఠీరవుండు శక్రవైరియైన ♦
యస్మదీయసూను డామేఘనాథుడు ♦ గలిగియున్న నాకు గాశిగలదె ॥

వ॥ అనిమఱియును ॥

ఉ॥ మాయలు మంత్రజాలములు మర్మవిభేదము లెన్నియున్నియున్ ♦ పోమె
సురేంద్రజిత్తు దెగిపోయినయప్పుడ చెల్లదింక నా ♦ రాయాలుకైనరాము శరదితరం
చుట యొండెపోరత ♦ త్సాయక వహ్నికీలలను దగ్ధమునొందుట యొండెతక్కగన్ ॥

శా॥ కైలాసాచలమెత్తినట్టి ఘనదోర్గర్వంబడంగంగ దే ♦ వాళింబోర జయించి
కైకొనిన శౌర్యస్ఫూర్తి దూలంగ ది ♦ క్పాలానీకము బారదోలిన మహాప్రఖ్యాతి
మాయంగ నీ ♦ వీలీలన్ మునివృత్తిబూనిన హితంబె రాక్షసాధీశ్వరా ॥

సీ॥ అమరసంఘంబునోడిగి కప్పములుగొనెడు ♦ నట్టిభవదీయ్యకరముల బెట్టు
వడిన ♦ పారిజాతసుమోక్తమై వరగునాదు ♦ కొప్పునేసిట్టిదురవస్థ చొప్పుగాంచె ॥

క॥ మునులము వారలు దేయు స ♦ వనములు గారించి చెరుమవాడ నీవే ♦ ముని
వృత్తి బూనిహోము ♦ బొనరించిన చూచినవ్వరో సురవర్యుల్ ॥

వ॥ అనిన దశాననుండు కోపాటోపంబు మొగంబుల ముడివడ ప్రళయకాలాంత
కాకారుండును రక్తలోచన వికీర్య ద్విస్ఫులింగోగ్రుండునై పైనూర్పులుచ్చుచు రౌద్రం
బున మేను పొంగ నంగదుంగాంచి కరవాలంబున నతని భుజాంతరంబు వ్రేసి నిజప్రేయసి
రత్నంబును విడిపించిన యంగదుండు పెద్దయు సొమ్మసిల్లిన ॥

క॥ కట్టలుకవాయుపుత్రుడు ♦ ధట్టించి నిశాచరేంద్రు డగ్గరి ముష్టిన్ ♦ నట్టన
శిరము బాదెను ♦ బెట్టుగ రక్తంబునోరగి బిమ్మిటిబొవన్ ♦

శా॥ ఆలోనం దెలివంది యంగదుఁడు సాహంకారుఁడై శౌర్య సం ♦ పల్లీలన్ శతి
నోగ్రి వాలమున దర్పస్ఫూర్తి దూలంగ న ♦ ప్పౌలస్త్యున్ వడిమోదియార్చిన నిలింపా
రాతి కోపించి యా ♦ శైలద్వేషణపౌత్రుఁ డంగదసి దోస్సత్త్వంబు పెంపేర్పడన్ ॥

వ॥ తోమరంబున నొప్పించి ఖడ్గంబున పవమాన నందను నేసి యుంతంబోవక॥

గీ॥ ముసలమున నీలుఁ శతవలి ముద్గరమున ♦ గజుని సంకుశమున మైందు గదను
ద్వివిదు ♦ కుంతమునను గవాక్షుని ఘోరశక్తి ♦ నొంచియార్చెను ధారుణి సంచలింప॥

ఉ॥ అప్పుడు వారలందరు సురాధిపునద్దశి పట్టికన్నుల ♦ న్నిప్పులు రాల రాక్ష
సులు నిశ్వరగందగ ముష్టిఘాతలం ♦ దప్పకనొంచి పాదముల దాచి నఖంబుల వ్రచ్చి
దాంష్ట్రిలన్ ♦ జొప్పడమేనసించి బలసూదనముఖ్యులు ప్రస్తుతింపగన్ ॥

వ॥ సింహనాదంబులు చలంగ రామచంద్రు పాలికిం జనుదెంచి యప్పుడు వాయు
నందనుండు రావణ మహామకృత్యంబు సవిస్తరంబుగా నెంగించిన రఘువరుండానంద
మగ్నుండై యాప్లవంగ వీరుల బహుభంగులం గొనియాడె నంత నక్కడ పంక్తికంధ
రుండు కొలువుకూటంబునకువచ్చి సేనానాయకుల రావించి యుద్ధసన్నద్ధులరై రండని
నియోగించె ॥

మ॥ ఘనరోషస్థితి జేర్చికన్నుల మహాహోద్య ద్విస్ఫులింగచ్ఛటల్ ♦ దనరన్
మానససీమసంగర మహోల్లాసంబు దీపింప శౌ ♦ ర్యోద్రూఢిన్ రిపుసంఘముం దొడరి
గర్వస్ఫూర్తి మాయించి నే ♦ డనిలో గూల్చి వత్తునంచు నమరేంద్రారాతి సారంభియై॥

సీ॥ కనదురురత్న సంఘటితభూషణములు కడువేడ్కదాల్చి సంగరములందు ♦
దిక్పాలకుల గెల్చి తెచ్చినబిరుదులు రత్నపెండెము నూపురములు మెరయ ♦ సాంధ్య
వారిదనిభ చారునవ్యాంబరంబులుగట్టి కరముల ముసలశూల ♦ పరిఘుత్తురీకా కుఠార
ముద్గరకృపాణ ♦ భిండివాలాదిసాధన బృందమమర ♦ భూరిగర్జారవంబున భూమివడక
దిన మణిప్రభ దనరియో దనుజవరుడు ॥

సీ॥ నగవిషోడశచక్రి సంఘటితంబును పటుతరకోటి విస్ఫుటనినాద ♦ ఘంటి
కాకలితంబు ఘనతరభల్లూక చర్మవర్మక సముచ్ఛాదితంబు ♦ పవనజపనవేగ భాసుర
తురగ సహస్రసమారూఢ మతులకేత ♦ నత్రియోశోభి తోన్నతరజితాచల హాసి
తంబు కాలకేతాఖ్యసూత ♦ కౌశలనియామమగు శతాంగమునబొలిచి ♦ పూర్ణ
రాకాసుధాకర స్ఫురితసలిల ♦ తాతపత్రి దశకము విభ్యాదిజోలె ♦ ముందటనురాగ
చామరంబులు వెలుంగ ॥

వ॥ శంఖకాహళ రవంబులు చలింగ మదవారణ వృధుల పటుజవ తురంగమ

వీరదానవవ్యూహంబు బలసియే తేర వందిమాగధ సందోహంబుల వినుతుల గైకొనుచు తనయుభయ భాగంబుల చతురంగ బలసమేతులును ప్రళయకాలోదగ్ర చండపావక మార్తాండ చండప్రోగ్ర ప్రభాపహసిత విక్రమధుర్యులును నానావిధాయుధోపేతులును సమాన బలహంకారయుక్తులును పటుజవాశ్వ సహాయుక్త స్యందనులు సమర కర్కశులును ఘోరాట్టహాసులును నగు నగ్నివర్ణ ఖడ్గరోమ సర్పరోమ వృశ్చిక రోములు బలసియే తేర వక్త్రకంధరుండు వానరసేనా సముదాయంబుపై నడచె నప్పుడు॥

చ॥ దనుజులుదగ్రవృత్తి వడి దాకిరి మహీంద్రి చరాళిమేరులన్ ♦ సునిసితసాయక ప్రతతి జ్వాల్లమహోగ్రత బిట్టురోజుచున్ ♦ ఘనతర సింహనాదముల గ్రందుమిశల్ గలయంగ బర్వ నే ♦ పునజలరాశి యంతటను బోకకడంగి ప్రఘాసమూర్తులై॥

చ॥ శిరములుద్రుంచి హస్తము చెండిరదంబులు వ్రక్కఁజాను పుల్ ♦ నరికి మొడళ్లు నెక్కి కఠినంబగు వక్షము లుంగ పాలముల్ ♦ బరువడి వ్రచ్చి యుద్ధతిల పాదములున్ వెనగ్రుచ్చి పొట్టలె ♦ చ్చురికనుసించి మర్త్యములు జక్కగ జేసి విభావరీచరుల్॥

సీ॥ వరబలోత్తుంగద్వి పవ్రజమొక్కట వెనకాల్పికొందర వేతలబెట్టి ♦ పటుజవాశ్వంబుల పయిపయిదరిమి యత్యుగ్రగతిగొందర నుక్కడంచి ♦ స్యందనరథశ్రేణి వెల్లుగాదోలి మర్దనమునగొందర జదియమోది ♦ విక్రమదైతేయ వీరసమాజంబు పురికొల్పికొందర బొలియజేసి ♦ మనము చింపవిమ్మనియు యతులశౌర్య ♦ ధుర్యులై వృక్షచరులను దరములోన ♦ మారిమసగనవిధమున మానలేక ♦ కలచుచుండిరి దైత్యులు చలము మెరసి॥

వ॥ ఇట్లు పెరిగిన దర్పంబున బరిమార్చుచుండ వానరబలంబులు దెరలిపరచిన నప్పుడంగదాంజనేయ జాంబవంత సుషేణ నలనీల మైందద్వివిద గజగవాక్ష శరభశత వలి ప్రముఖవీరు లొండకొండుకండని జరవనంబున సేనలంబురికొల్పుకొని రోదసీకుహరంబునిండ నార్చుచు నక్తంచరబలంబున దల్పితాకి యొక్కుమ్మడి పర్వతానోకహ సముదయంబులు వైచి వెండియు॥

చ॥ పదములదాచి జానువుల పార్ష్ణితలంబుల నొంచి మేనులన్ ♦ రదములనించి కట్టుముగ రక్తము వర్వక జేసియుంత బె ♦ ట్టిదమగు ముష్టిఘాతలను దెప్పరభంగితలల్ బగుల్చి పే ♦ ర్చిదిశలునిండ నార్చి రిపుసేనగలంచుచు నుగ్రమూర్తులై॥

వ॥ రెక్కలుగల భుజగముంబులం బోలె నెక్కడజూచిన తారలై దనుజ యోధుల సమయింపుచు మహోత్తుంగ మాతంగ తుండాగ్రంబు లుద్దండవృత్తిన బట్టి నిజ బాహుదండంబుల బలముకలిమి మెకయుదిప్పి వాలియింపుచు తురంగముంబుల

వాలంబులఁగేలి వింజామరంబులుగా మహోహాత్రాల వాలంబులఁజట్టి నేలతో వైచి పోకార్చుచు నసురకర్కశులగు రథికవరుల తోడంబోనీయక పొదివి యరదంబులు నుగ్గుసేయుచు పదాతులపై గవసి భీషణకోలాహలంబు లొదవ ననూనవక్షంబున బట్టి బిట్టుగా జానుకూర్పరల ఘట్టించి యట్టిట్టుగదలనీక మర్మంబులతో జడియమోది యుక్కడంపుచు చరణంబుల నురుమాడుచు జంఘంబులుపొరిగొనుచు జానువులు విరచుచు నూరువులు భగ్నంబులుగావింపుచు మధ్యంబులు నొంచుచు రదంబులు డుల్చుచు ముఖంబులు పగులమోదుచు శిరంబులుజిదుపుచు సర్వాంగంబు లింతింతలుసేయుచు పోరునెడ సద్దనుజబలంబులు నొచ్చియువెన్నియ్య శరణవ్యాపారంబు సలుపుచుండి రవ్విధంబున రెండుతెరంగులవారు నన్యోన్యజయకాంక్షులు మనంబునరెట్టింప వాల బు సేయునెడ తెగినతలలును పఱియలైన మోములునురాలిన దంతంబులును తునిసినచేతులును వ్రిచ్చంబడిన కడుపులును విఱిగినతొడలును భగ్నంబైన జానువులును నలిసిన జంఘంబులును నూనంబైన పదంబులును మాహుత్తులంగూడి నేలవ్రాలిన మదకరులును కూలిన యుత్తమాశ్వంబులును శకలంబులైన యరదంబులును వివిధాయుధోపేతులై మడిసిన కాల్బలంబులును యొరలెడి కోరప్రాణంబులును యెగసితిరిగెడు కబంధంబులు ఆడెడునట్టులును కదిసిపాఱెడు నెత్తురుటేరులును ప్రోవులైన గ్రీవులును తెట్టలైన యమ్ములును రాసులైన మేదోమాంసంబులును మూగిన కాకగృధ్రంబులును నోలలాడెడు భూతప్రేత పిశాచంబులునుం గలిగి సంగ్రామరంగంబు చూడ వెఱపురంబై యొప్పెనప్పుడు ॥

చ॥ ప్రథనవిలాస ధుర్యుడన పాయబలుం డహికాగదిక్పతి ప్రథముడు రాము
కార్య ప్రధాన సదాచరణియు ధీమనో • రథుడసమానవిక్రముడు రావణరాజ్య
రమావిభూషి సం • శిథిలుడునాయుసూను డహిశేఖరుభంగిని బేర్చిరోజుచుఁ ॥

క॥ రాఘువల ఘన శౌర్యా • మోఘంబులపెచ్చుపెరిగి ముదమునకపులుఁ •
రాఘవులుతనుకనుంగొన • నాఘనుడాఖడ్గరోము నార్చుచుదాకెఁ ॥

గీ॥ అట్లుదాకినయసుర బిట్టలగియతని • మేనఘోరాస్త్రములనించి భూనభోంత
రాళమునునిండనార్చెఁ దుర్వార శౌర్య • మున జలంగుచుశిలవృష్టి ముంచెబెలుచ ॥

ఉ॥ దానికినించుకేనిమది దల్కకవాయు తనూజుడుద్ధతిఁ • బూనియదిర్చిభాను
సుత ముఖ్యులుప్రస్తుతి సేయనప్పుడా • దానవుతేరుడగ్గరియు దగ్రితసారధీగూల
దోంచి తో • ద్రోనహయంబులఁ జమువదుర్గమలీల గడంగిదైత్యుడుఁ ॥

క॥ గదగొనివైచినపవనజు • డదికరమున నొడిసిదాన నాసురరథముఁ • జది

యంగ నేయునంతన ♦ సరదము వెనడిగ్గి దితిజ రాజు కుతింపన్ ।

క॥ వాలుంబలు కయుగొని దు ♦ శ్శాల్యేము ఖగరాజుమీద వనజవుగతి ద్యృ ♦ గ్జాలముల ననలకణములు ♦ రాలంకపివరుని పైన రాక్షసుడరిగెన్ ।

వ॥ అయ్యవసరంబున వాతూలనందనుండు ।

ఉ॥ దైత్యుని గిట్టి పాదముల దాచినఖంబుల వ్రచ్చివక్షముల్ ♦ వ్యత్యయభంగి సించి సరవిందను వెల్లను నొంచిమింట నా ♦ దిత్య సమూహముబ్బి వినుతింపని శాటులు సంచలింప నా ♦ దిత్యఖలుండు నంభ్రమ ముత్రుబ్బికింప కపుల్ దలంపగన్ ।

గీ॥ కరటిద్రుంచునట్టి కంఠీరవముభంగి ♦ పన్నగ బుద్దనము పక్షిభువి ♦ కిరణిఖడ్గరోము బరిమార్చెనంజనీ ♦ తనయుడహితులాత్మ దలకిపరవ ।

వ॥ ఇవ్విధంబున ।

చ॥ ఉరువడిఖడ్గరోముడు రణోర్విని నప్పవమానసూతిచే ♦ మరణము నొందుటల్ గనియు మర్త్యులు బెగ్గిల సర్పరోముడా ♦ గిరిచరసేనపై గవసి గీడ్వడ జేయుచు గిట్టినొంచుచున్ ♦ శిరములు గాడనేయుచు ప్రచండపరాక్రమ కేళిన చ్చెన్ ।

వ॥ మెలంగుచున్నం గాంచి కోపోద్దీపిత మానసుండై యంగదుండా యహితో ముసదల్చి వానిపై గవసి యప్పుడు ।

మ॥ పృథుశైలంబునవై చుడట్టి విపులోర్వీధ్రంబు దైత్యుండు సం ♦ ప్రథితాస్త్రంబున ద్రుంచిభీషణ మహారావంబు సాంద్రంబుగా ♦ పృథివీచక్రమునిండ రోషము మదింబెంపొంద నయ్యంగదుల్ ♦ ప్రథనోల్లాసము తోనదిర్చి విశిఖవ్రాతంబు పెల్లేసినన్ ।

మ॥ శరకావర్షము శైలమోర్చుగతి నగ్రివాహపౌత్రుండు నా ♦ సుర ఘోరాశుగ పంక్తి గోర్చి విపులక్షోణీంద్రముం గేల న ♦ ద్భుతభంగిం గొనియేసి శీఘ్రముస దైత్యేంద్రాసి తత్సారథిన్ ♦ హరులం గూల్చి రథంబుతో ముని శస్త్రాస్త్రంబు లాతుమ్మడిన్ ।

వ॥ విరచి కోదండంబు ద్రుంచి యుక్తువేండంబు ఖండించు వేదండంబునుం బోలె వానికంఠంబు మునిమి దానవలోకంబు నూచుచుండ జములోకంబున కనిచి ।

ఉ॥ అంగదుడంతబోకను సుభాంధసులబ్బురమంద ఘోర మా ♦ తంగతురంగ సంఘముల దండిగ గూల్చి శతాంగముల్ ధరి ♦ త్రింగలయంగ మోదికడు తీక్ష్ణము చే సరలేక దైత్యులన్ ♦ సంగరభూమి ద్రుంచె పలుచందములన్ కపులుబ్బి యార్వగన్ ।

గీ॥ అతనితో నసీల హనుమత్సుషేణనన లాదికేశవీరు లాగ్రహమున ♦ పేర్చి దనుజబలము పెల్లుగా గూలిచి ♦ కడగి బహుళబలము కలిమి మెరయ ।

వ॥ ఇట్లు కపివీరుల పరిమితవిక్రమంబు మెరసి దైత్యబలంబులం గీటణంగింపు చుండ గనుంగొని యాజ్యాహుత ప్రవర్ధమాన వహ్నియుంబోలె పెచ్చుపెరింగి వృశ్చికరోముం డప్పుడు ॥

గీ॥ పిడుగుతునియలకంటెను పెశిదమైన ♦ సాయకము లేసియొక్కట క్షాధ్రిచరుల ♦ నొంచి మేనులుసించి తూలించికడగి ♦ పొదివిపోసికమిక్కిలి కుదులపరచి ॥

వ॥ వెండియు నసిగదాప్రాస తోమర ముసలముద్గర పరిఘపట్టిసాది సాధనంబులు ప్రయోగించి వానరబలంబుల నేపడంగింపుచున్నం గాంచి నీలుండు ॥

శా॥ భీమప్రాభవ మొప్ప రాక్షసవరుల్ బెగ్గిల్లిచూడంగ యు ♦ ద్దామప్రౌఢి నిశాటువక్ష మరచేతన్ బిట్టుగా వ్రేయ నం ♦ గ్రామోర్వస్థలియందు మూర్ఛవడి చక్కందేరి వాడంత ను ♦ త్రామ దుల్ బెగడొందనార్చుచు మహారౌద్రాకృతి రేకంబునన్ ॥

క॥ నీలునియురము ం బొడిచిన ♦ సోలియతండపుడు లేచి సురవిద్వేషిన్ ♦ వాలమున మోదిరయమున ♦ నేలంబడవై చి పేర్చిన నిష్ఠురభంగిన్ ॥

గీ॥ ముష్టిఘాతలనొప్పించి మోముబగుల ♦ వ్రేసికడకాలుబట్టి యుర్వీంభ్రమునను ♦ జడియమోదినయా నిశాచరుడు తన్ను ♦ కొనుచు కాలునిపురి జేర జనియె నపుడు ॥

వ॥ ఇట్లు వృశ్చికరోముండు కూలినం గనుంగొని కుపితాంతః కరణుండై పెరిగిన దర్పంబున నగ్నివర్ణుండు ॥

క॥ తరుచరులతోరి సమరుచు ♦ కరచరణాద్యవయవములు ఖండింపుచు ని ♦ ష్ఠురతరశరములు తనువుల ♦ పరగింపుచు నెదురులేని పటుశౌర్యమునన్ ॥

వ॥ విహరింపుచున్నం గాంచి తదియ్యాశౌర్యంబును వనచరసంఘంబు దైన్యంబును సహింపక రఘువీరుండు కన్నుంగవ నెర్రంజేసి కపిబలంబుల నోడకుండుడని యెలుంగిచ్చి సత్వరంబున ॥

చ॥ చటులనిశాతబాణతతి సాంద్రముగా సురవైరిమేన ను ♦ త్కటగతినించి యొక్క విశిఖంబునసారధి గూలనేసి యొ ♦ క్కట రథయుగ్మముల్ దునిమి కార్ముకమొక్కట ద్రుంచివర్మ మొ ♦ క్కట వెసజించిచేతులొక కాండమునన్ దెగవేసి వెండియున్ ॥

గీ॥ వెడదవాతియమ్ము వెసవింటసంధించి ♦ యాగ్రహమున నేయ నపుడువాడు కూలెకులిశహతిని గూలునుర్వీధరం ♦ బనగరాత్రిచరులు వగలబొగుల ॥

వ॥ ఇవ్విధంబున నగ్నివర్ణుండు రాఘవుల బాణంబులకు ప్రాణంబులొసంగి

దండధర నిలయంబునకుం జనిన కినుకవడమి రాక్షసుల రేడు తేరుఁ బరపించి సత్వరంబున॥

ఉ॥ రామునిభూరిసాయక పరంపరగప్పిన నాథనూర్ధ్వరేఃఁ ◆ డామనుజాశనాధిప మహోరగపంక్తికి నోర్చిదేవతా ◆ స్తోమముబ్రస్తుతింప పలుతూపులరావణు మేననించి సం ◆ గ్రామతలంబునన్ బ్రళయ కాలుడపోలె ప్రచండమూర్తియై ॥

క॥ తురగములకాలకేతుని ◆ యరదములనాటంగనేసి యుం తేరడకన్ ◆ సుర నాయక శత్రుని జ ◆ ర్ఝరితాంగుని జేసెనమర సంఘముదలకన్ ॥

మ॥ అమరద్వేషి నృపాలశేఖరుని ఘోరాస్త్రంబులన్నొచ్చి చి ◆ త్తములో నుల్కక వాడితూపులవెసన్ వేయన్ దగన్ భూరి రో ◆ షమునన్ రామధరాధినాయకుడు వెచ్చన్మూర్ఛకోపించి పై ◆ క్రమమేపార దశాస్యుపై నెరపె పుంఖవ్రాత మొక్కుమ్మడిన్ ॥

వ॥ ఇట్లు నరనాథ దైత్యనాథు లిరువురు సంగరంబు లొనరింపుచుండం గనుంగొని జంభాంతకుండు నిజసారథియైన మాతలినుద్దేశించి యిట్లనియె ॥

చ॥ అమరహితార్థమై రఘుకులాగ్రణి రావణుతోడ భూరి విక్రమములరార వంగదము ప్రకటలీల నొనర్పుచున్న వా ◆ డమరరథంబుగొంచు జనుమాతని పాలికి దీనినెక్కి దా ◆ సమరమునందు రాక్షసుని సంహరణంబొనరించు గ్రన్ననన్ ॥

వ॥ అనిన నతండట్ల యావ్యోమయానంబు గొనివచ్చి రామచంద్రుని కట్టెదుర నిలిచి దేవా పురందరుండు రథంబు బంచినవాడు దీని నెక్కి యసురవరునితోడం బోరు నదియనిన స్మితవదనుండై రఘువరుం డయ్యింద్ర స్యందనంబునకు జుట్టివచ్చి యారోహణంబు జేసియు దయాచలంబునంబొల్చు దినరాజుంబోలె తేజరిల్లుచు తేరు దశముఖునకు సమ్ముఖంబు సేయించి యప్పుడు ॥

క॥ సునిసితసాయకములు శౌ ◆ ర్యనిరూఢిం బంధురముగ రావణు మేనన్ ◆ జొనిపి రఘువీరుడాగ్రహ ◆ మున శేర్చి సుపర్వసమితి ముదమందంగన్ ◆

క॥ విలువారిదునిమి గర్వం ◆ బులనొంచి మహోగ్ర రోషమున నారాక్ష ◆ సులరేడు వెగడుపడునటు ◆ వలె నమ్ములవానగురిసె పటుతరశక్తిన్ ◆

వ॥ ఇట్లు గురియించి ఘోరనారాచ పరంపరలు దశకంధరు ప్రతిరోమకూపంబులయందు బెడిదంబుగా నాటించి నెత్తుటంజొత్తిల్లం జేసిన పుష్పితాశోకంబునుంబోలె గనుపట్టి పొలివోని బంటుతనంబున ◆

చ॥ చటులనిశాతభూరి శరజాలము రాముని మేననించి యు ◆ త్కటగతిదేవతా హయ వితానముపై పటుసాయకంబు లొ ◆ క్కట గుదిగాగ నేసి విశిఖత్రయముం

గొనిపేర్చిమాతలి ♦ న్నిటలముగాడవై చి ధరణీస్థలిబిట్ట డలంగనార్చుచున్ ॥

ఉ॥ అంతరఘూద్వహుండు విలయాంతకుభంగి చెలంగి దేవతల్ ♦ సంతసమంది చూడ కపిసంఘముప్రస్తుతి సేయవర్మ మిం ♦ తింతలు గాగ జేసి దనుజేశునిగాత్రము గాడిపారగా ♦ నంతయుబల్విడిన్ శరములేసియునేత్త్రెర జూపివెంచియున్ ॥

గీ॥ పిడుగుతునియలకంటెను బెడిదమైన ♦ యట్టిమార్గణసందోహ మవని వముల ♦ గృచ్చిసురకోటిమనముల బిచ్చలింప ♦ నెరయనేర్చినవిలువిద్య మెరయు నటుల ॥

వ॥ అప్పుడక్లేశ యవ్వింశతిభుజుని స్వక్కించి బాణసహస్రంబున తురంగంబుల నొంచి మూటకేతన త్రియంబుద్రుంచి రెండమ్ముల సారథివక్షంబు గాఢ సేసి వేరొక్క యమ్మున రావణాసురుని యురంబు వాటించిన నతండు ప్రాణంబులం బాసిన తెరంగున మూర్ఛాగతుండై వ్రాలిన నప్పుడు భయబలంబుల వారలద్దనుజేంద్రుండు తెగియున కాదలంచిరంత తదియ్య సారథీతేరు తొలంగంగొనిపోయె నెల్లవారలు రఘువీరు పరాక్రమంబగ్గింపుచు సింహనాదంబులు గావించి రా సమయంబున ॥

గీ॥ మూర్ఛదేరిలేచి ముల్లోకకంటకు ♦ డపుడుసూతుగాంచి యధికరోష ♦ మునరబలికెనిటుల నరిసమూహమునవ్వ ♦ రథముదోలుకొనుచు రాకదగునే ॥

చ॥ అనవుడు కాలకేతుడు నిశాటకులాధిప యుద్ధధర్మమే ♦ యనువునతప్పసేయ వినుమారయ యోధులు సంగరస్థలం ♦ బున బరుచేతమూర్ఛిలిన మోసముజెందక సారథుల్ రయం ♦ బున రథముందొలంగగొని పోవుదు నాప్రడు మోదితాత్ముడై ॥

వ॥ పంక్తికంధరుండు రఘునందనునకు తేరు సమ్ముఖంబుగా పరపించి ॥

క॥ ధరణీనాథుని తాను ♦ ద్దరథంగినిడాకి పెక్కుతూపులు మేనన్ ♦ పరగించి యొప్పుడును యా ♦ తరణికులుం డలుకగదిరి దైత్యుని మేనన్ ॥

ఉ॥ చండనిశాతకాండములు సయ్యననించిన రావణుండు మా ♦ ర్తాండకులేశు డైన రఘురామునిపై పటుశక్తి వేయ నా ♦ తండతిఘోర బాణమున తత్క్షణమాత్రను ద్రుంచి యప్పుడా ♦ ఖండలముఖ్య దిక్పతులు కన్గొని సంతసమందునట్టులన్ ॥

వ॥ నిశితనిష్ఠుర సాయకము లారక్షోరాజు మేనగీలించి నిట్టుచలంబు మెరసి జయకాంక్షలు మనంబున బెనంగొన నవ్యాప సవ్యంబులుగా ఘోరసాయకంబులు బరగించి మర్మంబులు భేదించియు సర్వాంగంబుల నించియు తురగంబుల నొంచియు కేతనంబులుద్రుంచియు సారథుల బడలుపడంజేసియు నవక్రపరాక్రమంబు మెరయ ననముడింపక కొంతతడవు దివ్యాస్త్రంబుల వేడిమి నెరపి నొండొరుల బేర్చుకొనుచు

మత్తశుండాలంబుల విధంబున కంఠీరవంబుల చాడ్పున సముద్రంబుల వడువున పర్వతంబుల భాతిని పోరుచుండిరంత నాసురకంటకుండు ॥

చ॥ అలిగిమహోగ్రరోషమున నారఘువీరుని సేసనంబకం ♦ బులు వెడిదంబుగా జొనిపి భూమిదలంకగ నార్చిపేర్చి యు ♦ జ్జ్వలవిశిఖంబులం దివిజవర్యుహయంబుల నూతునొంది బి ♦ ట్టలయగజేసితేరు వెసనమ్ముల వెల్లిని దేల్చివెండియున్ ॥

వ॥ తేరిసూడరాకుండ దశచాపంబుల శరంబులసంధించి ప్రళయాభ్రంబపోలె ఘర్జింపుచు చేయుచుండె నానరదేవోత్తముండు పరిపంథిశరలాఘవ కరలాఘవ బలపరాక్రమంబుల కచ్చెరువందుచు నిట్లు త్రిజగద్విఖ్యాత సత్వపార పరాక్రమనిధిం బెగటార్చిన నయ్యేడులాభంబెద్ది యితని పదంబుల వలన నిశ్శేషకార్యంబున కొడంబడవలసె గాకేమి సిప్పుడేనియు శరణొందిన రక్షణార్హుండు ననుచు దయానిధి మనంబున దలపోయుచు నప్పుడు ॥

క॥ సురవిద్వేషణు డతిని ♦ ష్ఠురతరవర్షంబుగురియ సృక్కక నెంతే ♦ పరమానందమునొందుచు ♦ గిరివిధమున దెరలకుండె క్రీడయపోలెన్ ♦

వ॥ ఇట్లు రఘునందనుండు నిర్భరునివడుపున నిరాయుధుని తెరంగున జిత్రరూపునైవడి యునికింజూచి తనకునోటుపడిమెన కాదలంచి యాదిత్యప్రత్యర్థి భువనభోంతరాళంబునిండ సింహనాదంబుగావించి మారులేకమలయుచు నాఖండలముఖ్య దిక్పతుల గుండియలవియ నాకోదండ దీక్షాగురునిమేన దండధరుని దండంబునుంబోని కాండంబులు గీలింపుచుండె నట్టియెడ ॥

క॥ తలకెజగత్రయమొక్కట ♦ గలగెపయోనిధులు తారకంబులుడొల్లెన్ ♦ గళవళమునొందెశేషుడు ♦ నలినాప్తుడుతోవదప్పె నభమున్ మ్రోసెన్ ॥

వ॥ అట్టిదంతయు తనదివ్యజ్ఞానంబున నెఱింగియు వింధ్యాచలావష్టంభ జంభవ దానవదంభోళి ధరుండగు కుంభసంభవుండు రఘుకులసంభవు పాలికి యరుదెంచి యతనిచే యభివందనంబువడసి యిట్లని నుతియించె ॥

సీ॥ జగములుభూతముల్ సాగరద్వీపముల్ పుణ్యవాహినులు సరణ్యములును ♦ కాసారములువన ఖగమృగజాతులు మనువులుమనుజేశు లనఘులైన ♦ దివ్యమునీంద్రులు దిక్పతుల్ గంధర్వ యక్షరక్షోరగు లమరవరులు ♦ నాదిత్యులునురుద్రు లశ్వనీదేవతుల్ గ్రహతారకలుపితృ గణముశ్రుతులు ♦ పరశదేశకాల పాత్రమంత్రసుతంత్ర ♦ యజ్ఞములునువాని యంగములును ♦ శైలములునునిఖిల జంతుసమూహమ్ము ♦ నరయ నీవెకాదె యాదిపురుష ॥

క॥ విశ్వము నీవ నీలో ♦ విశ్వంబును గలిగియుండు విశ్వేశ హరీ ♦ శాశ్వత సర్వా గమనుత ♦ విశ్వాత్మ వికారదూర ♦ విశ్వాధారా ॥

వ॥ దేవా నీవు నక్షీణానుభావుండవు సురమునిగణ పూజితుండవు అఖేద్యుండవు సమగ్రైశ్వర్య సంపన్నుండవు అమరుండ వజరుండ వజితుండ వప్రమేయుండవు పూర్ణ తేజుండవ వగతపాపుండ వాదిపురుషుండవై స్థూలసూక్ష్మ కఠిన మృదువ్యక్తా వ్యక్త రూపాది రూపగుణగణ రసారస సత్వాదిరూపంబుల మెలంగుచుంటగాన లేనిమూఢా త్ములు మనుష్యునింగా భావింతురు సర్వోత్కృష్టుండవగు మిమ్ముం గొనియాడ నశక్యంబు

చ॥ అనఘచరిత్ర విశ్వమయుడంచు మనంబున నిన్నెరుంగునే ♦ జనుడతడే ఘనుండు కడు శాంతుడు పుణ్యతముండు భూరిశో ♦ భనుడు జితేంద్రియుండు చిరభవ్య యశుండు విధూతపాపుడ ♦ త్యనుపమశీలు డవ్యయ పదాహ్వానుడు నిక్కము వేయు భంగులన్ ॥

సీ॥ కమలాక్షుని న్నెరుంగని మూఢచిత్తుండు భవదీయమాయా ప్రపంచమునను తవిరియనితమే తెలియనరికించి తుచ్ఛ కారణంబధిక దుఃఖైకమూల ♦ మైనసంసార మహాంధ కారంబున ఘోరదుష్కర్మముల్ పెక్కు జేసి ♦ యింద్రియాధీనుడై యెడనెడ జనుదెంచి ఘనశుభాశుభముల కనుమనమున ♦ మోటఖేదంబులందు ముఖ్యమైన ♦ వలనుగానక కడపట కూలసినరక ♦ బాధలను జెందిక్రిమ్మర భవమునొంది ♦ మరలజచ్చును బుట్టును ధరణియందు ॥

క॥ నారాయణ సర్వేశ్వర ♦ వారిజదళనేత్ర భక్తవత్సల జగదా ♦ ధారజనార్ధన శృతిసం ♦ చార ప్రపన్నార్తిదూర జలదాకారా ॥

వ॥ అని వెండియు ॥

సీ॥ రాక్షసాధీశుని రణకౌశలంబును శరలాఘవంబును సురబలంబు ♦ కను గొంచు తరలక త్వన్మహత్వంబు భాతిని నిలచి ముదంబున జలగుచున్న ♦ వాడవు నీయున్కి వలనుగా తెలియక కళవళించినవాని గాదలంచి ♦ యఖిలలోకంబు వారాపత్పరంపర దవిలియున్నారు భూధవ కులేశ ♦ యిట్టిసిక్రీడజాలించి యీదశాస్యు ♦ దునిమి జగముల కనుమోదమొనరజేయు ♦ భవ్యచారిత్ర పంకజపత్రనేత్ర ♦ రమ్యగుణసాంద్ర దశరథ రామచంద్ర ॥

వ॥ అని విన్నవించి అయ్యా నీమనోవృత్తి తెరంగున విహరించుట మాకు విహితకృత్యంబు గాదెయని సతనికి విద్యుక్తంబుగా నాదిత్యహృదయం బుపన్యసించి యత్తపోధనుం డంతర్ధానంబునొందిన నారాజవరుండు నమ్మహాసూత్రంబు పఠియించి

రెండవ పద్మమిత్రుమండమునుం బోలె పొలుపుమిగిలి జగంబుల యసురబాధం దలంచి కోదండంబు గుణంబుసారించి కాండపరంపరలా నిలింపశత్రు మేనంగీలించిన ॥

మ॥ దశకోదండమలోలిదాల్చి పటుదోర్దర్పంబునం బొంగియా ♦ దశకంఠుండు కఠోరసాయకము లుద్యచ్ఛక్తిమైనేసి ది ♦ గ్వళయంగప్పి ననేకచాపధరుడై తాగాంక కన్యావని ఘో ♦ రశరాసారముచే విదల్చెనురు శౌర్యస్ఫూర్తి పెంపేర్పడన్ ॥

క॥ శరమరిబోయుట నక్తం ♦ చరవరుపై నేయుటయు నిషంగముదిక్కున్ ♦ గరమూదితూపుగొనుటయు ♦ సురలకునాదిగనొకింత జూపడకుండెన్ ॥

వ॥ ఇట్లవక్రపరాక్రమ ధుర్యుండగు రఘువరుండు దేవహితార్థంబుగా తన విలువిద్య యచ్చరవైరికి యచ్చెరువు బుట్టింజూపిన ॥

గీ॥ ఆధనుర్ధరగురుని మహాస్త్రవరవి ♦ తానహతిజేసి మేనరక్తంబు దొరుగ ♦ నొప్పెపూర్వామరేశుడా యుద్ధభూమి ♦ ఘోరదశబాల్బుజేవుకు కొండబోలి ♦

వ॥ ఇట్లు బెగడుపరచి తనవిసనక కనకమృగంబనుచుట లాదిగా వాలిఖేదంబులు మనంబున నుగ్గడించి ♦

సీ॥ అతులవిశాల శరాసనరాజంబు పర్వతారాతి చాపంబుగా [illegible] ప్రత్యర్థి భయద సంపరుషవాక్యరవంబు ననుపమమేఘ ఘర్జనముగాగ ♦ ఛండకోదండ సంజనిత గుణధ్వని రూపింపవజ్రనిర్ఘోషగాగ ♦ రామభూపాల ఘోరధరాధరంబు ♦ పంక్తి కంధర శౌర్యాగ్నిమైగణంగి ♦ యచ్ఛతాఖండ ధారామయంబునట్లు ♦ నస్త్రవర్షమంబు గురిశె మహాగ్రహమున ॥

క॥ ఖరనారాచపరంపర ♦ శరశరపులజాలజుండు బెల్లుగాబరవగ ద ♦ చ్చర పంక్తికి నారాత్రిం ♦ చరనాథునియంగము న్నిషంగంబయ్యెన్ ॥

వ॥ ఇత్తెరంగున నిజధనుర్విముక్త ఘోరనారాచ పరంపరాసార జర్ఝరీకృతా వయవుండై ప్రతిరోమకూపంబుల రుధిరంబుదొరంగ పుష్పితాశోకంబునుంబోలె కనుపట్టి చిత్రరూపుడై వడి యొప్పు దశకంధరునిగని రఘువరుం డనుకంపా యత్తచిత్తుండై యేటుడిగిన కొండొకవడికి ధైర్యంబుదిక్కుంబట్టి యానిశాచర నాయకుండు ॥

క॥ గండుమిగిలి రామునిపై ♦ ఛండాశుగవితతిబరుప జననాథుడు మా ♦ ర్తాండ రుచినొప్పు నురుతర ♦ కాండంబుల పంక్తిముఖుని కప్పెన్ బెలుచన్ ॥

చ॥ తరణికులప్రదీపకుడు దానవనాథుడుదగ్రవృత్తి సం ♦ గరజయకాంక్షబూని విశిఖంబులగొంజక యేటులాడ న ♦ య్యిరువుర బాణజాలముల హిందిన రేంద్ర - సురేంద్రలోకముల్ ♦ బలువడినిండియస్తమయ భావముదోచెను చూచువారికిన్ ॥

సీ॥ పంచాస్యయుగ్మంబు పాథోధియుగళంబు నద్రిద్వయంబును హస్తియుగము
బోరాడుకరణి దుర్వారరోషంబున రఘువంశతిలకుండు రావణుండు ♦ కోదండపాండిత్య
ఘోరాస్త్రసంధాన శరమోక్షణంబు నుజ్యానినాద ♦ ఘర్ఘారవంబు వెక్కసముగా
గనుబట్ట నసముడింపక వివిధాశుగముల ♦ నతులితోదగ్రశౌర్య ధైర్యములకలిమి ♦
దనరిసురలునుకపులును దానవులును ♦ గాంచియచ్చరువంద సంగ్రామకేళి ♦ జరిపి
రంచితరోష దిగ్భరితులగుచు ॥

చ॥ సొలయక వేరుయొండుదెస జూడక వేసట నొందకాత్మలో ♦ దలకక వెన్ను
లీక పరితాపమునొందక నిద్రలేక లో ♦ నలయకసప్తరాత్రులు ఘనంబుగనాహవ
కేళిసల్పిరా ♦ జలజహితాన్వయుండును నిశాచరనాథుడు పెక్కుభంగులన్ ॥

వ॥ ఇట్లు చిత్రప్రచారంబులు మెరయుచు పోరిపోరి దశకంఠుం బిలుకుమార్పం
దలంచి ॥

శా॥ ప్రత్యాలీఢపదస్థుడై రఘుకులభ్రాజిష్ణు డొక్కమ్మడిన్ ♦ దైత్యాధీశుని
మేననించెదుము లోత్సాహంబు రెట్టింప నా ♦ దిత్యాభంబుగ ఘోరకాండతతు
లుద్దీప్తిన్ నభోవీధి నా ♦ దిత్యుల్ని బ్బికింబుజెంద సమవర్తిస్ఫూర్తి బొల్పొందుచున్॥

క॥ ఒకటిపదినూరు వేయును ♦ ప్రకటితముగ పదియువేలు పదిపదివేలున్ ♦
ప్రకటముగజూడగా దశ ♦ కకుభంబులగప్పి పంక్తికంధరు బొదివెన్ ॥

వ॥ ఇవ్విధంబున కొండొకవడి ఖేచర గిరిచర వరులకు నేత్రానంద కరంబగు
నట్ల కోదండపాండిత్యంబును శరగ్రహణాకర్షణ సంధానమోక్షణ క్రమంబును నేర్పు
మెరయజూపి యానిలింపారాతి కరంబులు శిరంబులుద్రుంప నుద్యోగించి రఘువంశ
తిలకుండప్పుడు ॥

క॥ త్రిజగజ్జయస్తంభాకృతి ♦ బుజువంచెదు యావిభావ రీచరునతుల ♦ ధ్వజ
ములు మూడునుసంగర ♦ విజయుండై ద్రుంచె నొక్క విశిఖముచేతన్ ॥

క॥ అదిగనినక్తంచరవరు ♦ డదలిచియుగ్రాస్త్రములు జనాధిపుమేనన్ ♦ గుది
గొన నేసిన నెంతయు ♦ మదిలోకోపించి రాజమండనుడంతన్ ॥

క॥ కడువడివాడిందేరెడు ♦ వరభల్లములేర్చి దైత్యవర్యుని పటు కం ♦ ధరములు
కరములుద్రుంచెను ♦ సురసంఘముపిచ్చలించి చూడకడంకన్ ॥

క॥ సురరిపుని తలలుచేతులు ♦ ధరపై బడునంతమున్న తద్దయుమొలిచెన్ ♦
శిరములుకరములు రఘు భూ ♦ వరుడును తరుచరులు క నావాసులుగుందన్ ॥

ఉ॥ వెండియునిష్ఠురాస్త్రముల విక్రమమేర్పడ ద్రుంచెద్రుంచినన్ ♦ మెండితే

భూషణంబులును మార్గణపంక్తులు కార్ముకంబులున్ ♦ దంటగఁగల్గితొల్లిటి విధంబు నుండె శిరంబులున్ భుజా ♦ దండములాసిశాటునకు తామరసానన యేమిచెప్పుదున్

క॥ అలయకనిద్దురజెందక ♦ సొలయక మరిమొందుదిక్కు సూడక రాక్షసులలేని తలలు చేతులు ♦ జలజహితాన్వయుడు ద్రుంచె నత్వరభంగిన్ ॥

వ॥ అయ్యవసరంబున ॥

క॥ శరమడిపోయుటవేయుట ♦ మరలన్ సాయకముగొనుట మనుజాసను కంధరములుదరుగుట మొలచుట ♦ గురుతుపడదు ననిమిషులకు ♦ కుధరతనూజా ॥

గీ॥ తెగియనేనిచలము దింపకమింటికి ♦ నెగసిసురలుదలక నింద్రవైరి ♦ కరము లేయుమొలవగా వెంటబుట్టిన ♦ నాయుధంబులాజి తారిమీద ॥

చ॥ రవికులశేఖరుండ సురరాజుశిరంబులు హస్తముల్ మహా ♦ జవముసద్రుంచు త్రుంగియవి సయ్యనమీదికిరాగ నస్త్ర లా ♦ ఘవమొనరంగ దూరమరుగం వ్రిదరంబుల నేయునేసి యు ♦ ద్దివిజవిరోధి కంఠములు ద్రుంచుకరంబులు ద్రుంచువెండియున్ ♦

వ♦ ఇవ్విధంబున రామచంద్రుండుచిత్రకౌశలంబు నెరపుచున్న యవసరంబున

క♦ ధరపై డొల్లెడుతలలం ♦ బరవీధికి నెగయుతలలు పరిపరివిధులన్ ♦ పరువులు బెట్టెడుతలలును ♦ కరమద్భుతమయ్యెనపుడు కనుగొననెచటన్ ♦

క♦ అలయక రాముడుద్రుంచగ ♦ జలనిధిలో లంకలోన సంగరభూమిన్ ♦ గలదిశలయందురావణు ♦ తలలొక్కటబరచినటుల దట్టంబయ్యెన్ ♦

సీ♦ ఈచందమున దానవేంద్రునికరములు శిరములువెనద్రుంచి నరవరుండు ♦ విసివినయట్లని వ్వైరగందిశత్రుని దెగటార్చుటకునెద్ది తెరగటంచు ♦ నరగుననవ్విభీషణు తోడ బల్కిన వినతుడై యాతడిట్లనియె నపుడు ♦ జననాథకమల గర్భునివరంబున జేసి నగవైరివిద్వేషు నాభియందు ♦ కుండలాకృతినై సుధయుండుగాన ♦ దానికతమున చేతులు తలలునిటుల ♦ నుద్భవంబగుజువ్వె మహాగ్నిపావ ♦ కాస్త్రమున నది నింకింపు మంతమీద ♦

వ♦ నూటాతొమ్మిదిమారులు నెప్పటియట్ల నుదితంబగునట మీద మొలవక యుండు నమ్మబ్జభవుని యనుమతంబట్టిదయని పల్కిన రామచంద్రుం డతనివాక్యంబున కలరి యప్పుడు ♦

ఉ॥ పావకబాణమేయ నది ప్రస్ఫుటకీలలు గ్రమ్మనేగి ర ♦ క్షోవరునాభిగాడి సుధజొప్పడనింకజేసి రామ ధా ♦ త్రీవరుజేకెతొంటివలె దివ్యులు సంతసమందిచూడయు ♦ ద్ధావనిజాళతక్కిన నిశాటులుతల్లడమంద గ్రన్ననన్ ♦

వ॥ వెండియు ॥

గీ॥ సూటిదప్పక నాఖరసూదనుండు ♦ నూటతొమ్మిదిమారుల నూనశౌర్య ♦ లాఘవమ్మును మెరయ భల్లాఘములను ♦ దనుజశిరములు కరములు తునుమెనంత ॥

క॥ అక్షీణశౌర్యుడగు నా ♦ రక్షఃపతియొక్క శిరకరద్వంద్వముతో ♦ వృక్షచరులార్వనిలచెను ♦ పక్షంబులు దెగిన కొండవలెకద నోర్విన్ ॥

వ॥ ఇట్లునిలచిన మఘవంతవిరోధిం గనుంగొని యానృప కంఠీరవుండు తనచేతి యైద్రరసూపిన ॥

శా॥ పూర్వాదిత్య విభుండునుందొడరి యాగ్నప్లింగిముట్టన్నహా ♦ గర్వస్ఫూర్తి జలంగి రౌద్రిరసముం గన్పట్టభూనాథుపై ♦ పర్వంజేసెను ఘోర బాణములు విస్ఫార ప్రభావంబునన్ ♦ గీర్వాణాధిపు డాత్మలోదలక సుగ్రీవాదులుం బెగ్గిలన్ ॥

వ॥ ఇట్లు వింశతిభుజంబుల బలంబుకలిమి కరద్వయంబు ననేకరపిన రఘునాయకుండు కన్నుంగవ కెంపుగదుర నొదవినకినుక రెండవ దండధరుండునుంబోలె రౌద్రరసోల్లసిత మూర్తియై మున్ను తనకుసంప్రాప్తన్ సవనమోదిత స్వాంతుండై గాధేయుం డొసంగిన బ్రహ్మాస్త్రంబు సమంత్రపూర్వకంబుగా వింటసంధించి వేసిన ॥

సీ॥ ప్రళయకాలోదగ్ర పావకాభీలమై మింటను వెసమంట లంటిపరవ ♦ దంభోళిశతధగద్గితప్రకాశమై ♦ మెరుపులుకడునీరు మిట్లుగొనగ ♦ దండధరోద్దండ దండాయుతామోఘ సాంద్రోన్నత ఛటఛటలుగదర ♦ సరసిజలోచన కరవిముక్తోద్భ్వాని నాటోపసొంరంభ మతిశయిల్ల ♦ ద్వాదశాదిత్యరుద్ర గంధర్వదేవ ♦ తాళితనుః వెనువెంటనరుగుదేర ♦ పెట్టుపిడుగుల మ్రోతచేబేర్చి రావ ♦ ణాసురునియురమునుజని గాడి యవనిగూల్చె ॥

వ॥ ఇట్లు విలయమార్తాండ సహస్ర ప్రభాపూరితంబై ప్రచండ వేగంబున దశకంధరు బొరిగొని నిజతనూజికోరకుగా వగలంబొగులు ధాత్రికి రావణవధక్రమంబు నెరుంగంజేయు పగిది ధరిత్రిగాడి నిమేషమాత్రంబునవచ్చి రామచంద్రుని తూణీరంబు సొచ్చెనంత ॥

గీ॥ కులిశహతినిగూలు కొండవిధంబున ♦ గాలితరువుగూలు కరణిదెలుప ♦ ధరణివరుని బాణ మురమునగాడిన ♦ వ్రాలెనాజిభూమి రావణుండు ॥

వ॥ అయ్యవసరంబున నద్దానవాధీశుని మేనియందు నొక్కతేజంబు వెడలి యచ్చురులచ్చురు పడవచ్చి రామచంద్రునియందు గలసెనంత ॥

గీ॥ సురలుపూలజల్లు గురిసిరి రంభాముఖాప్సరసలు నాట్యమాడి రంబ ♦ రంబు దిశలుమిగుల రమ్యమైకనుపట్టె జగములొక్కపెట్టు సంభ్రమించె ॥

వ॥ వానరబలంబులు సింహనాదంబులు సేయుచు నొండొరులం గౌగలించుకొనుచు వాలంబులెత్తి దాటులిడుచు సాంద్రానందంబునం దేలిరి రఘువరుండు కోదండంబు తమ్మునిచేతికిచ్చె నంత ।

చ॥ అప్రతుకరణోర్వియందున మహాద్రినిభంబున గూలియున్న దై ♦ త్యపతిని గాంచిచిత్తమున తాలిమిదూలి విభీషణుడు భ్రా ♦ తృపయునిమొల్లబోయి యటతేరి యతివ్యథ నొందుచుండగా ♦ తపనసుతాదివానర వితానమువల్దని మాన్పవారక౯ ।

వ॥ అంతనక్కడ లంకలో నాదశాస్యుం డాజిగూలుటవిని యప్పుడతని సతులు వీనులను కొరవియూవిన విధముదోప వసుధపైవ్రాలి యొక్కెంతవడికిదేరి ♦

క॥ కరములశిరములు నురములు ♦ నుదురయమున మోదికొనుచు నొక్కట ననిలో ♦ గిరిబోలెపడిన దశకం ♦ ధరునిండాయంగనేగి దనుజాంగనలు౯ ♦

వ॥ బహువిధంబుల శోకింపుచుండీరందు మండోదరి యిట్లనిపవించె ।

సీ॥ భూపాలబాణదంభోళిచేగూలితే యచలంబుపోలికె యమరభేది ♦ రామావనీశ హార్యక్షంబుచేసట్లు సమసితేకరిగతినమరవిజయ ♦ జనకజామాత జంఝూనిలాహతినని వ్రాలితెవృక్షంబువలెసురారి ♦ రఘుకులేశాండజ ప్రభునిచేహాలసితే గోక్షర మట్ల రక్షోరగేంద్ర ♦ దశరథక్షితినాథాగ్రతనయ చిత్త ♦ జనితకోపాగ్రపావక జ్వాల గలదిశ మగ్గితేమిడుతభాతి నింద్రవిముఖ సు ♦ పర్వకృతవర్త్మ సదనయో పంక్తి ॥

వ॥ అని మఱియును ।

సీ॥ కైలాసమెటనెత్తి గరకంఠుమెప్పించి నట్టిదోస్సత్వమెందరిగెనేడు ♦ విబుధ సంఘంబుచే వెట్టిగైకొన్నని యతులసామర్థ్యమేమయ్యెనేడు ♦ వలనుగాదిక్పాలవరుల జయించిన భూరివిక్రమమెందు బోలిసెనేడు ♦ సురకాంతలను దెచ్చి చరలబెట్టినమహాపౌరుషంబెక్కడపరచెనేడు ♦ హామనోనాథ హావీర హాదశాస్య ♦ హానిశాటాన్వయాధిప హామహాత్మ ♦ రాముశరమున గూలితే పృథనభూమి ♦ నింద్రచేబడువిపుల మహేంద్రమట్లు ॥

గీ॥ విభునితోడగూడ వెలదులుసచ్చుట పరమధర్మమట్టి తెరగునాకు ♦ గలుగ నయ్యెనేమ గారతమాతండ్రి ♦ జాకయుండ వర మొసంగుకతన ॥

చ॥ సురతరుణుల్నిరంతరము జొప్పడభక్తినిగొల్చి భూషణాం ♦ బరములలంకరింపుచు క్రమంబునసేవ యొనర్చుచుండగా ♦ కరముసుఖంపునాకు రఘునాథుని

ప్రియసఖియైనసీతకున్ ♦ నరమకుదాస్యముంజరుప నారసయోని లిఖించెకూరితన్ ॥

శా॥ రామాధీశునితో నెదిర్చి గెలువన్ రాదేరికిన్నిప్పు నా ♦ భూమీశాగ్రిణి దేవినిచ్చి ప్రమదస్ఫూర్తిన్ సుఖంబుండు నం ♦ గ్రామంబొప్ప దత డుదైవమని పల్కన్ దుర్మదాంధుండవై ♦ నామాటల్ జెవిజెట్టకాన్నృపతి బాణశ్రేణిపాలయితివే॥

వ॥ అని యనేక విధంబుల పెద్దయెలుంగున శోకింపుచుండ విభీషణుండును దుఃఖార్ణవమగ్నుండై దశాననుధైర్యస్థైర్య విక్రమాటోపంబు లుగ్గడించుచు నడలుచుండె తదవసరంబున రామచంద్రుడు విభీషణునకిట్లనియె ॥

క॥ శూరతములైనపురుషులు ♦ వైరులద్రుంపుదురుతారు వైరులచేతన్ ♦ పోరం గూలుదురిందుల ♦ కీర్తిన్ వగలబొగుల నేటికినికన్ ॥

వ॥ విగతశోకుండవై యీదశకంఠాంగనా సందోహంబు దుఃఖంబువారించి యితనికి యగ్నిసంస్కార విధులాచరించుమని పలికిన నక్కుంభకర్ణానుజుండు దుఃఖంబు మాని దశకంఠునకు విధిపూర్వకంబుగా నగ్నిసంస్కార విధులాచరించి తిలోదకంబులిడి యతనిభార్యల నూరార్చి క్రమంబున దశాహతంత్రం బాచరించి పూతుండై బాంధవామాత్య పరిజనసహితుండై సీతావల్లభుపాలికేతెంచి యతనిపాదపద్మంబులకు ప్రణమిల్లిన కృచ్చియెత్తి యుపగూహనంబుచేసి సౌమిత్రిదిక్కు-నూచి యిట్లనియె ॥

చ॥ అనఘచరిత్రలక్ష్మణ రయంబునలంకకు నివ్విభీషణుం ♦ గొనిచనిదైత్య రాజ్యమునకున్ విహితస్థితిరాజుజేసి ర ♦ మ్మనవుడు ప్రేమనియ్యకొని యాతనితోడ్కొని లోకమిత్రి నం ♦ దన పవమానపుత్రి సురనాయకపౌత్రిక ముఖ్యకీశులున్ ॥

వ॥ తనవెంటజనుదేర ననిమిషనగరంబున కెనయగు లంకానగరంబునకుం జని రాజమందిరంబుసాత్తెంచి పుణ్యనదీతీర్థంబులు దెప్పించి విధ్యుక్తంబుగా నభిషేకం బొనరించి యప్పుడు ♦

గీ♦ కమలహితుడుశశి యుగలయంతనవనియు గలుగునంత రామకథలుజగము♦ లందుశెల్లుచుండు నంతవిభీషణా యుష్మదియ్యరాజ్య మొనరియుండు ♦

వ♦ అని యాశీర్వదించిన నరమానాయకుండు దానవరాజ్య సంప్రాప్తుండై వైభవాఖండలుండునుంబోలె పొలుపుమిగిలి సౌమిత్రికి వందనంబాచరించి యర్కతనయ హనుమానంగదులకు నంజలిచేసి కౌగిటంజేర్చి మంగళోపకరణ మహనియ్య భూషణంబులు గొనిచని రామభద్రుని యడుగులకు మ్రొక్కిన మన్నించి లేవనెత్తి యతండుదెచ్చిన యమూల్యమణి భూషణాంబరంబులు సాదరంబునగైకొని మందస్మిత వదనారవిందుండై ♦

ఉ॥ ప్రీతియుసంతసంబుమది బొంపెసలారగ వానినన్నియుగా ♦ మాతలికిచ్చి పిన్పొలుప మానుగనాతడుభక్తియుక్తికం ♦ జాతహితాన్వయాంబునిధి చంద్రునకున్ దగమ్రొక్కి యజ్ఞలా ♦ రాతినిగొల్వవేగ రథరాజముగొంచు జవంబుపెంపునన్ ॥

వ॥ అనంతరంబా రఘువరుండు విభీషణుంగనుంగొని సీవుల కఱుంజని యందు చరయున్న వారల విడచిపుచ్చి జనకనందన నిచ్చటికి తోడితెమ్మనవుడు నతండు ముదితమనస్కుండై పురంబుసొచ్చి కారాగృహస్థులనందరి నిజనివాసంబులకుపొండని యాజ్ఞయొసంగిన వారలు బహుళభంగుల రామచంద్రుని ప్రస్తుతింపుచు జనిరని వెండియు ॥

సీ॥ అంత విభీషణుం డతి నానహితుడై చనియశోకారామమునను సీత ♦ కనుగొనిమ్రొక్కియో జననిరఘుస్వామి నినుతోడితెమ్మని పనిచెనన్న ♦ యేమితెమ్మ మంగళస్నాతవై దివ్యాంబరాభరణంబులు నవాంగభంగి ♦ ధరియించునావుడు పరమానురాగయై దన ప్రాణేశ్వరాయుపదములు జూడ ♦ నచ్చోటనే యుసుస్నాత నై అతిమహిత♦ వస్త్రభూషణమాల్యముల్ వలనుమీర ♦ నవధరించితిసకల సౌఖ్యంబులోలి గంటిసని పల్కి జానకీకాంతయప్పుడు ॥

వ॥ తన యిరుగెలంకుల దన్నిరిసరమ త్రిజటలుమేతేర మరియు సవ్విటంగల్గు పుణ్యజనకాంతల సంఖ్యలు పరమానురాగంబున ముందటపిఱుంద నిరుపక్కలంబలసి రాన మందగమనంబున లంకాపురంబునిర్గమించి చనుచుండె నయ్యెడ సీతాదర్శనకాంక్షాతత్పరులై నిశాటసంఘంబులు నేలఈనిన తెరంగున నసుదేర సందడికిక్కటంబైన చన నశక్యంబగుచునుండ నప్పుడు ఘూర్ణాయమాన మహాంబోనిధి ననుకరించు భూరినాదంబాదవె నదివిని రఘునందనుండు భానునందనురావించి యతితో నిట్లనియె॥

గీ॥ యేలనొప్పించెదరుమీరల లివ్విధమున ♦ ధారుణిజజూడవచ్చిన వారినందు♦ వింతలెవ్వరువిచ్చిన విడిగనంగ ♦ నిడుతప్పేమిచెప్పెద నింకనొకటి ॥

గీ॥ చీరలిండ్లును తెరలు ప్రాకారములును ♦ దేహళులుకావుగావుగా తెరవలకును చిత్తశిద్ధియుపతిభక్తి శీలమును సు ♦ చరితమార్గంబుదక్కనో గిరిచరేంద్రా ॥

వ॥ అనిన నతండత్తెరంగు విభీషణున కెరుంగంజేసి నృపవరుని యాజ్ఞాక్రమంబునదెచ్చి అతనిసన్నిధానంబున నిలిపిన యానరనాథశేఖరుండు మనుజుండపోలె నడికి వెరచి మనంబున నక్కుహానావైదేహితో నిట్లనియె ॥

క॥ నీకెచటనుండనిష్టం ♦ బాకడకిపుడేగు దానవాధీశునినిన్ ♦ పైకొనితెచ్చుట కతనను ♦ నాకర్హవుగావునీవు నలినదళాక్షి ॥

వ॥ తనమానిని జరబెట్టిన దుష్కీర్తినివదలించి విశిపించలేడయ్యె నితండేపాటి

మానినియని జనంబులు పరిహసింతురను తలంపున సహించి పరిత్యజించితివి మాక్షి నీకైనయడరువాపితి నింక నీవలసినయందు పొమ్మని యనాదరంబుగా బలికిన ।

ఉ॥ వీనులుచూడుభంగి రఘువీరునిపల్కులు వచ్చిజొక్కడ ♦ మ్మానినిసీంత కంత కభిమానశిఖానల హేతిగ్రాగుచున్ ♦ మేనువడంకనుద్భరత మిన్నుపయింబడి నట్టులైగత ♦ ప్రాణయపోలెనిల్వక ధరాస్థలిమీదట వ్రాలి మూర్ఛిలెన్ ।

వ॥ అట్లు మూర్ఛిల్లి పెద్దతడవునకుందేరి ॥

ఉ॥ కన్నులనశ్రుబిందువులు గ్రమ్మగ మేను జమర్పమోముగన్ ♦ చిన్నదనంబుదోప కడువేడిమియూర్పుల మోవియుండగా ♦ గ్రన్ననలేచినిల్చి కరకంజములున్ ముకుళించియెల్ల నే ♦ యన్నలినాక్షి గద్గదిక నైరఘురామునితోడ నిట్లనెన్ ।

మ॥ చనునే రామ గుణాభిరామ నను దుశ్చారిత్రగానెంచి యి ♦ ట్లనయోక్తుల్ బలుకంగ నీవఖిల భూతాంతర్బహిస్సాధ్య ని ♦ త్యనివాసుండవు నామనంబెరిగి మర్త్యప్రక్రియన్నిట్లుకో ♦ పనిమాఢిన్ విడనాడిపొమ్మనినచో ప్రాణంబులేదాల్తునా ।

ఉ॥ భూవర యిప్పుడేసమత బూనిభవత్పదముల్ భజింపుచున్ ♦ చావగబోల నవ్విధము సల్పినమీద మహాపవాదమున్ ♦ బోవదటంచుచిత్తమున బుట్టెనుదీనికి నైక్రమించితిన్ ♦ గావున నాదువిన్నపము గైకొని యానతిబెట్టు క్రిన్ననన్ ।

వ॥ అదియయ్యది యంటేసి ।

చ॥ సదమలరూపవిశ్వమయ సర్వశరణ్య నితాంతపుణ్య శై ♦ లదమనముఖ్య దివ్యులు భళాయని సన్నుతిసేయుకట్ల నీ ♦ హృదయముసమ్మతింపనిదె నిప్పుడెసొచ్చెద చిచ్చువేగమే ♦ సొదయమరింపసేయు మనుచున్ ధరణీసుత బల్కనయ్యెడన్ ।

వ॥ సౌమిత్రిదిక్కు రామచంద్రుండుసూచిన నతండన్న మనోవృత్తి యెఱింగి యట్లకావించుడు సత్వరంబున హవ్యవాహునకు ప్రదక్షిణంబువచ్చి యందు సొచ్చుటకు నుద్యుక్తయై యల్లవేల్పులం జేర్కొని ॥

సీ॥ గణుతింప వాఙ్మనః కాయకర్మములందు పంచభూతములు దిక్పాలురఖిల ♦ వేల్పులుధర్మంబువిశ్వనాథుండును కాలంబుసాక్షిగా గనురఘూద్వ ♦ హునిపగచింతన యొక్కటేతప్ప నొండొకటినామదిలోన నుంచియెరుగ ♦ నటులేనిపావకుం డుగ్రహో దగ్రుడై యాహుతికొనుగాక యనుచుబిట్టు ♦ ప్రీతినబలికిహృదయ పంకజమునరామచంద్రమూర్తి నిలిపి సాహసమున ♦ భూరిశిఖలుగల్గి పొలుపొందునగ్నిలో ♦ జొచ్చె [illegible] ।

వ॥ అప్పుడు ॥

ఉ॥ హాహాకారమునొందె దేవతతి దుఃఖాక్రాంతులై రాసురుల్ ♦ దేహంబుల్ మొదబాసినట్టుగను ధాత్రీనాథపుత్రి సౌమిత్రియు ♦ త్సాహంబంతయు దక్కి గుందిరి కపుల్ దైన్యంబునన్ మ్రొక్కెడన్ ♦ రాహుగ్రస్త దివాకరప్రభల శ్రీరాముండు గన్పట్టె దాన్ ॥

క॥ మతిదలపక పరమ పతి ♦ వ్రతనింతలు జేసె జువ్వె రాఘవపదసా ♦ స్వతుడై నత్యంబని భూ ♦ తతతిపెద్దబిట్టుబలికె ధరగంపింపన్ ॥

గీ॥ అంతకితవపీత యంతహీతంబగు ♦ దవసితనయబోలిచె ననలునందు ♦ కాంతిదనరియగ్ని గాగినపశిశి శ ♦ లాక రోయనంగ ప్రకటముగ ॥

క॥ ఓహో శుచినైతిని వై ♦ దేహిప్రవేశించుకతన తెల్లంబనుచున్ ♦ నూహించి యుబ్బుపెంపున ♦ స్వాహావల్లభుడు నాశనముపొడవంతెన్ ॥

వ॥ ఆసమయంబున ॥

క॥ కందకకుందక వేడిమి ♦ జెందక చీకాకుగాక క్షితిసుత పరమా ♦ నందమున కొందిరఘు నం ♦ దనపదభజనంబుపూని నలినదళాక్షీ ॥

ఉ॥ అప్పుడు ధారణీసుత మహామహిమంబున కాత్మలోపలన్ ♦ జెప్పరమంది మొక్కుటను నిర్జరబృందము మానినంఘుకం ♦ బప్పిశితాశనప్రతతి యద్రిచరౌఘము ప్రస్తుతించుడా ♦ చప్పుడు నభ్రవీథియును ధ్మాస్థలిదిక్కులు నిండెయంతయున్ ॥

వ॥ అంత ॥

క॥ తలచీరకట్టుభూషణ ♦ ములరమ్యముచొప్ప నంగములయొప్పును ని ♦ ష్ఫలమైచదరనియారఘు ♦ కులతిలకుని దేతోడుకొని ప్రియముమలరన్ ॥

వ॥ పావకుండు రామచంద్రు సన్నిధానంబునకువచ్చి యుపనిషద్వాక్యంబుల దేవదేవుని ప్రస్తుతించి సీతంజూపి యిట్లనియె ॥

ఉ॥ ఈసతిపేరువిన్న పతియించినభూరిత రాఘసంఘముల్ ♦ బాసిచనున్ తమంబు ప్రస్ఫుటరోచుల భంగినంబుజా ♦ తాసనసృష్టి కారణుడవంత నెరుంగు దెదింగి యిమ్మయిన్ ♦ జేసినచెల్లుచల్లదిది చెల్లుననంగ నొరుండుశక్తుడే ॥

క॥ కమలాధీశ్వరముని హృ ♦ త్కమలాకర రాజహంస కమలదళాక్షా ♦ విలజ జనకత్రివిక్రమ ♦ కమలోదరభక్తలోక కామితఫలదా ॥

సీ॥ ఘనమైనదివ్యమూర్తి కౌసల్యయెరుగును ప్రకటితశక్తి కౌశికుడెరుంగు ♦ వరేణువు మునిపత్ని యెరుంగును తనుసుందరముపెంపు జనకుడెరుగు ♦ నతిభక్తి

సులభత్వ మాగుహుండెరుగును కాకాసురుండుమీకరుణయెరుగు ♦ నార్తరక్షణరీత లవ్విభీషణుడెరుగు పరతత్వమగుట నాథవుడెరుంగు ♦ మీమనోవృత్తి సౌమిత్రియెరుగ నామకీర్తనవిఖ్యాతి నగజయెరుగు ♦ కానిమముబోటులకు నెరుగంగవశమె ♦ రమ్య గుణసాంద్ర దశరథరామచంద్ర ॥

గీ॥ అదియునటులుండె లేదశికులావతంస ♦ వలనుమీరంగ నాభాగ్యవశమ కతన ♦ నధికశుభమైనసీత నాయుంగుసాచ్చె ♦ నందుచేనేనుశుచినౌట [illegible]

వ॥ అనిపలుకు నవసరంబున యేనును బ్రహ్మాదిదేవతా సముదయంబును పరమ మునీంద్రులంగూడుకొని యాదేవచేమోత్తముని పాలికింజని వేదవాక్యంబుల ప్రస్తుతించి మీయందు కమలగర్భుండిట్లనియె ॥

మ॥ ధరలోనిన్నాకరాజనందనుని మాత్రింబెంతురజ్ఞాను లీ ♦ శ్వరసాక్షాత్పర తత్వమూర్తి వసురవ్రాతంబుఖండించి ని ♦ ర్జరులంబ్రోవ మదియ్యాప్రార్థనముచే రామాఖ్యజన్మించి న ♦ ట్టిరహస్యం బరయంగనోపరుసుమీ డెందంబులో నెంతయున్ ॥

చ॥ శృతులునుతింపనేరని స్వరూపముచొప్పడ దాల్చియిందిరా ♦ సతిచరణంబు లొత్తగను సాగరమధ్యమునందహీంద్రుపై ♦ యొతికితివిప్పచాలక న యుండెడివాడవు నీవుకోసల ♦ క్షితిపతనూజపౌత్రిలి వసించుటచోద్యముగాదె యచ్యుతా ॥

వ॥ అదియట్లుండె జగన్మాతయగు సీతనిత్యానుపాయిని పరమపతివ్రతా సుశీల యగుట యెరింగి యొండుదలపవలదు లోకజనకుండవగు విశ్వకారణుండవగు నీకప వాదంబుగలదె అయినను మేలొదవె నెప్పటియట్ల పరిగ్రహించుటకు దివ్యచిత్తంబున నవధరింపవలయునను నవసరంబున యేనిట్లంటి ॥

మ॥ వరవైకుంఠనివాసఈశ్వర దయావారాశిసూర్యాబ్జ నే ♦ త్రరమాధీశ్వర తార్క్ష్యవాహన జగత్రితాప్రమేయాశ్రితా ♦ మరభూమీరుహవాసుదేవ సకలా మ్నాయస్వరూపంబు జో ♦ దరనారాయణవిశ్వకారణ మునీంద్రస్తోత్రవిశ్వాత్మకా ॥

చ॥ దనుజవధార్థమై దశరథక్షితినాథుని యింటనిక్కమే ♦ మనుజునిభంగిబుట్టి పలుమాయలొనర్పుచు లోకమాతయా ♦ జనకజనొండుగాదలచి సల్పినసాహసకృత్య మంబుగాం ♦ చినమముబోటకెంతయును చిత్తమునాకులమందు రాఘవా ॥

క॥ లోకాధీశుడవాద్యుడ ♦ పీకమలభవాండమునను నేడుగడయ సు ♦ శ్లోకుడవు నీవుతలపగ ♦ నీకపవాదంబుగలదె నిగమస్తుత్యా ॥

గీ॥ సకలలోకమాత సద్గుణసంఘాత ♦ యైనధరణితనయ నక్కటకట ♦ నీచ చరితగాగ నీమదిలోనెంచి ♦ నీతిదప్పి చులుకజూతురయ్య ॥

వ॥ అనిన నతండు మందస్మిత ముఖారవిందుండై యేనుమానవుండ నన్నింత పెద్దజేసిపలికిన నేమనువాడ నకటయట్లుండె లోకపాలురగు మీరలెద్ది పంచినజేయుట నాకుకర్తవ్యంబు జానకి పతివ్రతాశీలం బెరుంగుదునైనను రాక్షసుండు గొనిపోయిన యింతిని గ్రమ్మరదెచ్చి యేలుచున్న వాడితండెంత కాముకుండని జనంబులునిందింతురు నిందాస్పదంబులు నిరయస్థానంబులని శ్రుతులుచాటుచుండు లోకాపవాదభీతి నింత సేయవలసెనని ప్రసన్నుండై పరమాదరంబున ధరణీనందన ముఖకమలం బవలోకించె దేవదుందుభులు మొరసె సురలు పుష్పవృష్టి గురియించిరి జగంబులు గరంబు సంతసిల్లె నని చెప్పి చంద్రమౌళి వెండియు నిట్లనియె॥

గీ॥ అంబుజాననవినుము బలాంతకుండు ♦ పొంగుచును రామభద్రు జేరంగవచ్చి బంధురంబైనయట్టి సంభ్రమమునుమనము ♦ నందు బెనగొన నప్పుడిట్లనుచుబలికె॥

చ॥ నిరుపమపుణ్యశీల రజనీచరమర్దన రామచంద్ర నీ ♦ కరుణకుపాత్రుజేసినను గాచుటనిక్క మెరింగి యేను నీ ♦ గురుతరమైనమాయ కనుగుణ్యుడనై వినుమీకు నిష్టమా ♦ వరమొసగంగ నాహృదయ వారిజశీమ దలంతు గావునన్॥

క॥ మీకెట్టియిష్టమట్టిది ♦ నైకొనుమొనగూర్తుననుడు కాకుత్స్థుండా ♦ నాకేశు గాంచికేశా ♦ నీకముప్రియమంగ నాతనికిట్లనియెన్॥

చ॥ సులభములన్నిమాకు బలసూదనమీకృప వల్లనైన మీ ♦ తలపదియట్టి దేని పటుధైర్యము గ్రమ్మని నిల్చినాకుగా ♦ కలహమునందుబడ్డ ప్లవగప్రతతిం బ్రతికింపు నాయదిన్ ♦ గలిగినకోర్కెయట్టిదది గాకనికొక్కటి విన్నవించెదన్॥

క॥ కపులువిహరింపు కోటుల ♦ నపరిమితంబైనఫలము లంబుపులును న ♦ చ్చ పడంగనెల్లకాలము ♦ కృపచేగలుగంగ జేయు ప్రియమదినాకున్॥

గీ॥ అనుమనతడట్లయగుగాక యనినసమృత ♦ వృష్టిగురిసెనుకపులు నిర్వేద నమున ♦ నపుడునిద్దురమేల్కాంచి నట్టులేచి ♦ రసురబాణక్షతంబుల యవధిదొరగి॥

వ॥ ఇవ్విధంబున॥

గీ॥ చమరియాకటిపిల్లువ నమిలిమ్రింగి ♦ నపుడుఘటకర్ణకడుపులో నరిగి పోయి ♦ నట్టివారలుదక్క ఘోరాజిలోన ♦ జడినకపులెల్లక్రమ్మర బ్రతికిరంత॥

ఉ॥ రామునివీడుకోల్పడసి రాజసభాననయేనుపద్మజుం ♦ డామఘవాదిదివ్యులు మహామునిసంఘక మమ్మహాత్మునిన్ ♦ వేమరువ్రస్తుతింపుచును నెమ్మనరింగితి మవ్విభీష ణా మను జెందుృడగ్గిరి ప్రియంబలరారగ నప్పుడిట్లనున్॥

గీ॥ రామచంద్రదివస రాట్కులార్ణవచంద్ర ♦ నెయ్యమలరనస్మదీయసదన♦
మునకునేగుదెంచి ననుపవిత్రునిజేసి ♦ చనుటయొప్పు భక్తజనవిధేయా ॥

క॥ అనవుడు రఘుపతియిట్లను ♦ ననఘా భరతుండునాకు నైయచ్చోటన్ ♦ ముని
వృత్తి వనరుచుండు ♦ గను నాకుం బూజలందగా నర్హంబే ॥

వ॥ కావున నతనిం జూచుటకు వాంఛగలుగు కదలిపోవలెనని మఱియును ॥

చ॥ అనఘచరిత్రరాక్షస కులాంబుధిచంద్రమ కీశలోకకూటం ♦ బనివడి వార్ధి
గట్టి యటపైకొనివచ్చి నిశాటకోటలన్ ♦ దునిమి సమస్త జీవుల మనోబుజ బాపిరిగాన
నీపురం ♦ బునకు ముదంబునన్గొనుచు పోయి సగౌరవ మొప్పవీరలన్ ॥

వ॥ సన్మానింపుమదియె నాకు నుపచరించుటయనిన నతండు పరమాహ్లాదంబున
రఘుపతియనుమతంబుగైకొని సుగ్రీవాంగద హనుమత్సుషేణ గజగవయ నల నీల
జాంబవత్ప్రముఖుల నిజపురంబునకుం గొనిపోయి మహితవస్త్రాభరణ చందనమాల్యం
బుల వారలనలంకృతులగావించి మఱియు దివ్యాంబరానర్ఘ్య మణిభూషణంబులును
నసంఖ్యాతంబులైన కరితురంగ స్యందనాందోళికా భద్రచామరంబులును గొని రఘు
చంద్రునిపాలికేతెంచి వానినన్నియు సభక్తిపూర్వకంబుగా సమర్పించిన పరమాదరం
బున నవిగైకొని యవి సుగ్రీవాది ముఖ్యవానరుల కొసంగి యనంతరంబ యయోధ్యా
గమన కుతూహలస్వాంతుండై యున్న యన్నరవరోత్తమునకు సరమాధవుండిట్లనియె॥

సీ॥ అనఘాత్మ మీర యయోధ్యాపురి పూర్వప్రహరార్ధమునకును జేరునట్టి ♦
తెరగుజెప్పెదవిను త్రివిధద్వేషియగు పంక్తికంఠుడు మున్ను ప్రధనమునను ♦ ధనదుని
గెల్చి తెచ్చినపుష్పకముగల దిచ్చటమేలుగ నెనయుతురగ ♦ మునను తార్క్ష్యుని వేగ
మును దన కెనరాదు వీక్షింపదానిపై నెక్కియరుగు ♦ టహహ మనవుండు ప్రియమంది
యానృపాలు ♦ డనుమతించిన కుంభకర్ణానుజుండు ♦ నతిరయంబున తగువారి ననిచి
యపుడ ♦ యవ్విమానంబు దెప్పించి యచటనునిచె ॥

వ॥ అదియు చలదురుఘంటికా సహస్రారావయు కామగమనయు సర్వకామ
ప్రదయు నిరంతరశుభావహయు రజితసౌవర్ణ వేదికావ్రజయు మనోబుజ వినాశకారి
ణియు మణిసాలభంజికాంచిత రత్నస్తంభయు విద్యుత్సహస్రసంకాశ సూక్ష్మకాంచన
కుట్టిమసహితయు విశ్వకర్మనిర్మితయునై యొప్పి మఱియును ॥

సీ॥ పద్మరాగాంచిత బంధురవీధితుల్ బాలార్కరోచుల పరిభవింప ♦ లాలిత
యింద్రనీలద్యుతుల్ సాంద్రమై నీలనీరదముల గేలుగొలుప ♦ నలినొప్పచంద్రకాంతామణి
ప్రభల హిమాంశుని కాంతులనావహింప ♦ మరకతరత్న సుమహితమంజితపంక్తి హరి

తురంగచ్ఛవి నాక్రమించ ♦ వజ్రవైడూర్యమౌక్తిక కావళులఘృణులు ♦ దిక్తటంబుల పూర్ణమై తేజరిల్లు ♦ చామరధ్వజదీప్తుల వ్యోమపథము కలియబర్వినయా పుష్పకంబు గాంచి ॥

క॥ దానిసుషమావిశేషా ♦ నూనస్థితియద్ధరాంత ♦ నూజాత సుమి ♦ త్రానందనులకుజూపుచు ♦ మానుగరఘురాము డవ్విమానంబునకున్ ॥

వ॥ వలగొని యెక్కి సుమిత్రానందన ధరణీనందనలతోడంగూడ నారోహణంబు చేసి కపివీరు జేర్కొని మహాత్ములార మీ ప్రాపున నిఖిలనిశాటులంబొలియించి విజయలక్ష్మిం జేకొని విభీషణునకు లంకారాజ్యంబు పట్టంబుగట్టి సీతందెచ్చి కృతకృత్యుండనైతి మీరలింక నిజస్థానంబులకుజనుట యొప్పుననిపల్కిన వారలాదరు రఘువంశతిలకుంగాంచి నరేంద్రా మేము దేవరపాదంబులుగొల్చి యయోధ్యకే తెంచి మీపట్టాభిషేకంబు కనుంగొని భవజ్జనయిత్రులను భరతశత్రుఘ్నులను సమస్తబంధుమిత్ర సచివ పరివారపౌర జాన లోకంబులనుంగాంచి సరయూజలంబుల గ్రుంకులిడి మీయనుజ్ఞవడసి మరలుటకునిశ్చయించి యున్నవారమని విన్నవించు నెడ విభీషణుండును తనయభిమత బట్టివచ్చుని పల్కిన రఘువరుండు ప్రముదితహృదయుండై యటగుగాకయని యొడంబడి యెనప్పుడు దనుజవనచరబలంబులు నేలయీనినతెరంగు నం గనుపట్టినడచుచుండిరి జనకనందనరఘుచంద్రుని యాననంబీక్షించి మహాత్మా విభీషణుని భార్యయగు సరమను నతనిశీలియలు త్రిజటను నయోధ్యకుగొనిపోవుటకు నా మనంబున కోరియున్న దాననని నతండ వ్విభీషణునకెఱంగించిన మహాప్రసాదంబని పరమానురాగంబున రావించెనప్పుడు మైథిలివారలంగాంచి మన్నించి యవ్విమానంబుపై గూర్చుండ నియమించెనంత సీతారమణుండు బహుమాన పురస్సరంబుగా సుగ్రీవాంగదాంజనేయ జాంబవత్సుషేణ నల నీల గజగవయ గవాక్షముఖ్యులగు వనచర భల్లూకముఖ్యులను విభీషణముఖ్య రాత్రించరులను పుష్పకారోహణంబు గావించుటకు నాజ్ఞాపించిన వారలట్లచేశిరంత నావిమానరాజంబు రామచంద్రుని మనోవృత్తి నెఱింగి యంబరతలంబున కెగసి యరుణమండలంబు భాతి తేజరిలుచు జరుచుండె తదనంతరంబున నారాజతిలకుండు పరమాదరంబున ధరణీనందన ముఖకమలం బవలోకించి యిట్లనియె॥

గీ॥ నెలతవిశ్వకర్మనిర్మిత మైత్రికూ ♦ టములుగలిగి భర్మవిమలరత్న ♦ ఘటితసౌధములను కలితగృహంబుల ♦ బొలుచులంక దీనికలయజూడు ॥

క॥ మదకరితురగస్యందన ♦ త్రిదశారిగణంబుతో ధరిత్రింగూలెన్ ♦ కదనత

లంబున నద్దశ ♦ వదనుండ వ్రేటగనుము వారిజనయనా ॥

క॥ వననిధిజూచితె యథర్థిన ♦ దిన్నక్కడ నజేర్పనేగు దెంచునొయనగ ♦ మినుముట్టి యుపగుచందము ♦ గనుపట్టెదరంగసంఘ కముతోనబలా ॥

క॥ సేతువుసుస్నానాస్పద హేతువుఘనపాపదూర హేతువుశ్రేయో ♦ హేతువు మత్సంగర్శన ♦ హేతువు గనుగొనుముభక్తి నిందునిభాస్యా ॥

గీ॥ మత్ప్రతంబిది జలధిపై మహితగతుల ♦ తేలియున్న దిహూడుము పోలినిట్టి ♦ శరధిబంధనతీరంబు సకలపాప ♦ హరణమతిపావనంబునై యమరుగాన ॥

ఉ॥ క్రూరులునీచకర్ములతి కుత్సితులల్పత రాయువుల్ దురా ♦ చారులుపాప వర్తనులు సద్గతిగానరటంచు జూవె యీ ♦ వారధిగట్టితిః వినుము వారలొ కానొక వేళదీనిచొ ♦ ప్పారసిఘోరపాతక చయంబు కొరంగితరించునట్లుగాన్ ॥

వ॥ అని ప్రకృష్ణపాతక వినాశహేతువగు సేతువుంజూపి వెండియు నిట్లనియె॥

సీ॥ ఆతుఱ డైయిచ్చటి కరుదెంచినన్నదా శరణొందెచూ విభీషణుడుతన్వి ♦ యదదినిప్రార్థింపు చుంటినేనిక్కడ కుశశయనుండనై కువలయాక్షి ♦ యలుకమైబ్రహ్మాస్త్ర మందితినిక్కడ నంబుధిపై నేయకంబుకంఠి ♦ కపిసేనలనుగూడి కడకమైయే తెంచి నిలచితినిచ్చటనీలవేణి ♦ యిచటవాలినిగూల్చితి వినజూకొరకు ♦ వానకాలంబు జనునంతవరకు నుంటి ♦ మిమ్మహేంద్రింబుమీద పూర్ణేందువదన ♦ యల్లదియె చూడు కిష్కింధహంస గమన ॥

క॥ అనుడా సతిపతిగనుగొని ♦ జననాయక భానుసుతుని సతులాదిగ న ♦ వ్వనచర కాంతలగూడుక ♦ యనుమోదముతో నయోధ్య కరుగుటయొప్పు ॥

ఉ॥ నాపని సంతసించి జననాయకుడా రవిసూతిగాంచి సు ♦ గ్రీవ నితంగనామణుల ప్రేమదలిర్పగగూడ యోధ్యకుం ♦ బోవవలంచి సీతతలపోశెను నా తెరగట్టుగావునన్ ♦ నీవటకేగి వారలను నిక్కముగాకొని తెమ్ము వేగమున్ ॥

గీ॥ అనిన నతడట్ల కిష్కింధ కరిగి సీత ♦ తలపు రాముని పంపును తార మొదలు గలుగు సతులకు నెరిగించి యలమివారి ♦ నపుడు దోడ్తేరజానకి యాత్మబొంగి ॥

వ॥ పరమాదరంబున వారలపుష్పకంబుపై గూర్చుండ నియోగించెనంత రఘువరుండరుగుచు వెండియు మహీతనయ నిట్లనియె ॥

క॥ వరరత్నాంచిత ఘన కం ♦ ధర బహుళవిచిత్ర మహితతర మృగయుతమై ♦ సురుచిర నంపదనొప్పిన ♦ గిరిజూచితె ఋశ్యమూకగిరియదె సుదతీ ॥

గీ॥ రమణియిచ్చట శుద్ధాంతరంగుడైన ♦ యినతనూజునితో సఖ్యమే మొనర్చి ♦

తంబరము రాయుస ప్త తాళంబులొక్క ♦ శరముచే నూలనేశితి బరవసమున ॥

క॥ కమలకల్హారకైరవ♦ సుమహితకలహంసరాజ శోభితమై స ♦ ద్విమలాంబు పూరితంబై ♦ యమరిన పంపాహ్రదంబు యతివరొకంటె ॥

ఉ॥ సంతతపుణ్యా వర్తనుడు శౌర్య ధురంధరుడప్రమత్తు డ ♦ త్యంత బలోరుద గ్రుడు నిశాటకులాటవి పావకుండు ధీ♦ మంతుడు కార్యదక్షుడు హిమాచల ధైర్యుడు మాన్యుడా హనూ ♦ మంతుడుమమ్ము నిచ్చట వినమ్రయొనర్పగ వచ్చెమానినీ ॥

సీ॥ అతివమాకిచ్చట నాతిథ్యమొనరించె కడుభక్తిమై నీలకబరిశబరి♦ జలజాస్య నిచ్చట బలుడైన యక్కబంధుని పొలియించితి మనువుమెరసి ♦ మగువతా నిచ్చట మననిమిత్తము జటాయువు దశాస్యునెదిర్చి యుర్విగూలె♦ మానినియిచ్చట మాయా మృగంబైన మారీచుజంపితి ఘోరవృత్తి ♦ తెరవయాఖరదూషణ త్రిశిర ముఖ్య ♦ దైత్యవీరుల పెక్కండ్ర దరశియించట ♦ నక్కడంచితి శకకచేముక్కు చెక్క ♦ నిచట శూర్పనఖనునూర్మిళేశుడతరి ॥

క॥ అదియెజనస్థానంబ ♦ ల్లదియె పంచవటినిజూడు మదెమనయుట జం ♦ బదియె యగస్త్యాశ్రమ మిం ♦ పొదవించెగ కన్నుగవకు నుర్వీతనయా ॥

గీ॥ రమణిచూచితివే సుతీక్ష్ణమునియాది ♦ గాగ నివ్వనిగలిగిన ఘనమునివ్ర ♦ జాశ్రమంబులు చూడ్కుల కనిమిషత్వ♦ మొసగుచున్న విహరింప యోగ్యమగుచు॥

క॥ సురుచిర పల్లవదళసుమ ♦ పరిపక్వఫలప్రయుక్త పాదపములచే ♦ కరము కనుంగొన నొప్పెడు ♦ శరభంగుని యాశ్రమంబుజనకజకంటే ॥

క॥ దరణిజనిన్నెత్తుకచను ♦ తరిద్రుంచితినిచటనుష్ట దైత్యవిరాధుగ ♦ సురసము వాయవిరోధుగ ♦ ధరణీదిజావరాధు దండితసాధుగ ॥

క॥ తరుణీచూచితివేను ♦ స్థిరమునిగణపుణ్యఫలము జిత్వోన్నత్యం ♦ భరత లముభూరికందర ♦ గురురత్నజ్వలముచిత్ర కూటాచలముగ ॥

క॥ మనమలర చూడుమల్లదె ♦ జనకాత్మజఘోరకలుష సంఘుకదమనగ ♦ వననిధిగమనగవన ♦ జ్జినహృదయగకలుషతాప శమనన్ యమున్ ॥

క॥ అంగవకడు శుభ్రస్థితి ♦ పొంగుచుచెన్నొందునఖిల పూతప్రదమై ♦ రంగోత్తుంగతరంగన్ ♦ గంగన్గనుగొనుమునిఖిల కల్మషభంగన్ ॥

మ॥ ధరణీనందనకంటివేయిదె భరద్వాజాశ్రమంబెంతయున్ ♦ వరమాహ్లాద ము సేయుచున్నయది లోకస్తుత్యుడానట్టియీ ♦ వరమౌనీంద్రుని జూచియిచ్చటను తెవగ నేడు నిల్వంగ బంధురమై యొప్పెడునామనంబునను సంతోషంబునుం గాంక్షయున్

చ॥ భరతునకంటెనాకు కడుభక్తుడు పుణ్యతముండు సజ్జనుం ♦ డురు గుణవంతుడత్యనుప మోజ్వలకీర్తి దిగంతరుండునై ♦ పరగినయట్టి యాగుహుడు పాయక యుండు పురంబుశృంగి బే ♦ కిరుపుగజూడు మల్లదిగో యిందునిభానన వేడ్కమీరగన్ ॥

క॥ వర వైకుంఠ పురంబుందిరగిన యావిరజ పోలుపుదెలుపు నయోధ్యా ♦ పురిచుట్టు పై పుదనరిన ♦ సరయువు ప్రియమలరజూడు చంద్రనిభాస్యా ॥

వ॥ అని యివ్విధంబున ధరిత్రీనందనకు వేరువేర నెరింగింపుచు భరద్వాజాశ్రమంబున పుష్పకావతరణం బొనర్చి యవ్విమానరాజంబున భ్రితలంబున నుండని యమించి సీతయు తానును తమ్ముండును నమ్ముని పదపాదంబులకు ప్రణమిల్లి యత్త ఘోధనుండాశీర్వదించి పరమాదరంబున కూర్చుండ నియోగించి కుశలంబెరింగికొని కౌంసల్యాది జననులను భరతశత్రుఘ్నులను తదంగనలను క్షేమంబుననున్న వారని చెప్పి వారలకు యథోచితంబుగ నతిథి సత్కారంబు లాచరించియున్నంత రఘువంశతిలకుండు పవమాన నందనుంజేరం బిలచి యతనితో నిట్లనియె ॥

క॥ మహానియ్యగుణ గరిష్ఠుని ♦ గుహునింగని నాదురాకకు తుక మొదవ నా♦ మహిత చరిత్రునకెంతయు ♦ విహితంబుగ నెరుగజెప్పి వీడ్కొనియవలన్ ॥

చ॥ భరతుని పాలికింజని శుభస్థితి యాతనిగాంచి యేము ని ♦ త్తెరగున నేగుదెంచుటలు తెల్లమిగా వివరింపుమన్న భూ ♦వరునకు మొ్రొక్కి మారుతిది వాకరనందన ముఖ్యవానరుల్ ♦ కరమనురక్తితోనను పగానరిగెన్ పటుసంభ్రమంబునన్ ॥

వ॥ ఇట్లరిగి శృంగిభేరి పురంబున రామచంద్రాగమంబు చింతింపుచున్న గుహునింగాంచి యన్నిషాధనాథునకు రఘువరురాకజెప్పిన నతండు పరమానురాగంబునొంది మారుతికి మణిభూషణాంబరంబు లొసంగి వీడ్కొని సంభ్రమంబున బంధుమిత్ర పరిజన సహితుండై మహిత నవ్యాంబరా భరణానర్ఘ్య రత్నంబులు గొని యప్పుడ కదలి భరద్వాజా శ్రమంబునకేతెంచి సీతాలక్ష్మణ సహితుండగు నారాజ పరమేశ్వరునకు సాష్టాంగంబుగావించియు పాయనంబులొసంగి కేలుదోయి గీలించి యతనింగొల్చియుండిన రఘువంశ భర్తసాదరంబున నక్కిరాతవరుని సేమంబొంగి యతనితో నిజవన వాసాయాసంబును రావణాది రాత్రించర పధయును సవిస్తరంబుగా నెరింగించి కరుణా కటాక్షంబునగాంచి మన్నించెనంత నక్కడ హనుమంతుండు సరయూనది యుత్తరించి నందిగ్రామంబు ప్రవేశించి యందు మునివేషధరుండై పాదుకాముఖంబున రాజ్యంబు పాలింపుచు రామచంద్రాగమనంబున కెదురు

సూచుచు దినంబులు గడపుచున్న యట్టి సుచరిత్రుండగు భరతుం గనుంగొని యభివందనం బాచరించి కృతాంజలియై యిట్లనియె ॥

చ॥ అనఘచరిత్రయేనుప వనాత్మజుడన్ రవిసూను సఖ్యుడన్ ♦ జననుతశీలుడైన రఘుచంద్రుని భృత్యుడ సమ్మతీవరుం♦ డనుపగ వచ్చినాడ వసుధాత్మజతానను జ ప్రియుక్తుడై ♦ యొనర చతుర్దశాబ్దములును గ్రవనంబునను౦డి వచ్చెజూ ॥

క॥ అనవుడు వీనుల కమృతంబనువుగ వెసనింపినట్లులై కడుమోదం ♦ బునలేచి కన్నుగ వలం ♦ ఘన మగువానంద భాష్పకరణములు మెరయన్ ॥

ఉ॥ గ్రన్ననలేచి వాయుజుని కౌగిట బిగ్గన సేర్చినేడు మా ♦యన్న భవత్ప్రిపాదమున నన్ను నిజానుజగూడి సీతతో ♦ చెన్నుగ నేగుదెంచెనని చెప్పగవీనుల వింటినా తపం ♦ బెన్నికె కెక్కెనిక్కము మదీప్సితముల్ సమకూరె నెంతయున్ ॥

క॥ అనుచు పునఃపున రాలిం ♦ గన కృత్యముజరిపిదేను కరితురగస్యం ♦ దన విమలమణీ వితానం ♦ బను మోదముతోడ భరతుడతని కొసంగెన్ ॥

వ॥ మరియు మహనీయ్య భూషణాంబరంబులు పసధనంబులును గ్రామశతంబును మనఃప్రీతిగా నొసంగి సాదరంబున గనుంగొని కపీంద్రాచతుర్దశాబ్దంబులు రఘుచంద్రుండెచట వసియించె నెయ్యెయెడల సంచరించె నెయ్యెపనులాచరించె నెవ్విధంబున యతనికి నీకు నెరుకవాటిల్లె నిప్పుడెచటనున్న వాడు నెరింగింపవేయనిన కైకేయీ నందనుతో వాయునందనుండిట్లనియె ॥

గీ॥ కైకవరముచేడి కానకు రాముని ♦ బనుపుమనుట రామభద్రుడట్లు ♦ తపసి సాబకుదాల్చి తమ్ముడు సీతయు ♦ తోడరాగముదముతో నరిగె ॥

వ॥ చిత్రకూటాచల వాసుండగుటయు దశరథుండు పుత్రవియోగంబున లోకాంతరగతుండగుటయు ♦ రాజ్యభారంబు పూననొల్లక నీవు రామభద్రుని తోకొనిపోవవచ్చుటయు నా సత్య పరాక్రముండప్పనికియ్యకొనక పితృవాక్యంబు శెల్లింపదలంచుటయు నీవెరింగినదే నదియట్లుండెనని పల్కి చిత్రకూటాచలంబు నిర్గమించి దండకారణ్య గమనోన్ముఖుండగుటయు నాదిగాతదియ్య వృత్తాంతంబంతయున్న తెరంగున నెరింగించి రఘూవరుండిప్పుడు నిఖిలదనుజ వనచర సేనా సమన్వితుండై సుగ్రీవాంగద ముఖ్యులు తదంగనా జనంబులుతోడరా సీతాలక్ష్మణ సహితుండై రెండవ కుబేరుండు నుంబోలె యరుదెంచి భరద్వాజాశ్రమంబున నిలచియున్న వాడెల్లి యిందులకు వచ్చునని విన్నవించిన ॥

క॥ వినిభరతుడు రఘురాముని ♦ వనవాసాయాసమునకు వసుధాత్మజ బొం ♦

జన నెవ్వగకు సుమిత్రా ♦ తనయుని దురవస్థకపుడు తనమదిలోనన్ ॥

వ॥ యొక్కింత సేపు కటకటంబడి యంతయు కైకేయీ నెపంబున వాటిల్లెనని యంతనే రామచంద్రుండు జనకజ సుమిత్రాసుత సహితుండై సేమంబున నరుదెంచిన వాడు గావున కృతకృత్యుండనైతి నాభాగ్యంబు గణనకెక్కెనని పరమానురాగంబు నొందె నక్కాలంబున గల్గు వారందరు రఘుచంద్ర గమనంబువిని ప్రముదితాంత రంగులైరి శత్రుఘ్నుండు పరమానంద భరితుండై యుండెనప్పుడు భరతుండతని గాంచి యిట్లనియె ॥

క॥ అనఘాత్మ నీవయోధ్యకు ♦ జనిమన రాఘవుల రాకజననులతోడన్ ♦
వినుపించి పురజనంబులు వినునట్టుల చాటబంపు వే వేగమునన్ ॥

క॥ పురమును రఘురాముని మం ♦ దిరమును దేవాలయములు తెరనొప్పగ
భూ ♦ సురగృహములు మంటపములు ♦ కరమునలంకారవిధులు గావించి వెసన్ ॥

వ॥ రామచంద్రుని రాక చెప్పి భూపాలుర బిలువంబంపి యఖిలబలంబులంగూడి తల్లులం దోడ్కొని యరుదెమ్ము మనము రఘువరునింగనుంగొన బోవుట కార్యంబు॥

చ॥ అనుటయు నాతడెంతయు రయంబున నట్టులయోధ్యకేగి రా ♦ మన్న
పతిరాక తల్లుల కమాత్యులకున్ పురి వారికెల్లను ♦ బ్బున నెరిగించి తక్కగల భూప
తిమూహముతోడి తేరగా ♦ బనిచిన సంభ్రమస్థితిని పట్టణమెల్ల నలంకరింపగాన్ ॥

వ॥ తగువారల నియోగించిన వారలు కుంకుమ మృగమద పంకంబుల గోడలు పూయించి చందన సిక్త జలంబులు కలయజల్లించి ముక్తాఫలంబుల రంగవల్లులు దీర్పించి మణితోరణంబులు మెరయ కాంచన కలశధ్వజంబు లెత్తించి రాఘవాస్థాన మంటపరమ్య సదనంబులందు జలరాశి బంధనంబాదిగా గల్గు చిత్రంబగు కథలు వ్రాయించి సౌధతలంబును తక్కంగల్గు నికాంతంబులను కస్తూరి కాగరు చందన కర్పూర ధూపంబును పట్టణంబునను శృంగారింపంజేశి మరియును ॥

సీ॥ సేనాధిపతియు నక్షీణ విక్రముడైన దండనాయకముఖ దక్షులైన ♦ మం
త్రులు బాంధవుల్ మహనియ్యగుణులైన యట్టి పురోహితులఖిల మంత్రు ♦ లును
పరిజనములు ననుమోనచిత్తులై బలసిరా పౌరులా బాలవృద్ధ ♦ లాది గానడవ
వారాంగనలాడుచు పరతేరచ తురంగబలముతోడ ♦ జనములను పెరుగలయట్టి వనజ
ముఖుల ♦ నర్ఘిటీపింప నందరనందలములు♦ ను నిచిపంచ మహావాద్యనినద ఘోగిని♦
జెలగశత్రుఘ్నుడత్యంత శీఘ్రగతిని ॥

వ॥ భరతుని పాలికిజని యెనంత ॥

క॥ ధరగ్రక్కదలగసేనా ♦ పరివృతుడై బంధుమిత్ర పౌరాన్వితుడై ♦ పరమా
హ్లాదముతోడను ♦ భరతుడు రఘువరుని గొలువ పరువడి జనియెన్ ॥

వ॥ అంతనక్కడ ।

గీ॥ వసుమతీశ్వరుడా భరద్వాజు వీడు ♦ కొని మహార్హాజ్యాల మగునట్టి ఘన
విమాన ♦ మెక్కి సంభ్రమమలరంగ నేగుచుండు తరినిగనుగొని పవమాన తనయు
డపుడు ॥

చ॥ భరతునిడాసికంటె వెన్నృపాల శిఖామణి సీతతాను నం ♦ బరతల సీమవా
రయ విమానమునందు శచీసమేతుడౌ ♦ సురపతి బోలెడెందమున సొంపమరారను
దెంచుచున్న వా ♦ డు రుగతినంచుజూప నతడుబ్బుచు నద్దెసజూచి యుక్తితోన్ ॥

గీ॥ అచట రథముడిగ్గి యాపుష్పకమునకు ♦ భక్తిదనర మ్రొక్కి భరతుడపు
డు ♦ పూర్వశిఖరిమీద పొల్చుదినేశుని ♦ పగిదినొప్పు రామభద్రుగాంచి ॥

వ॥ కాంచి వినయాదరంబులు మనంబునం బెనంగొన నవ్విమానంబు శీఘ్రంబున
నెక్కి యన్నకు సాష్టాంగ నమస్కారంబు జేసి నకౌసల్యానందనుండతనినెత్తి గాఢా
లింగనంబొనరించె నప్పుడ య్యిరువురు పులకితాంగులును వానంద బాష్పలోచనులును
నైయుండిరంత శత్రుఘ్నుండు ప్రణమిల్లిన జక్కనక్కన జేర్చిరి ధరణీనందనకు
వారిరువురు మ్రొక్కిన నద్దేవి యాశీర్వదించె సౌమిత్రి వందనం బాచరించిన భరతుం
డతనిం గృచ్చి కౌగిటంజేర్చె శత్రుఘ్నుండు లక్ష్మణుని యడుగుల కెరగిన పరిరంభ
ణంబున నతని మన్నించెత దవసరంబున విభీషణ సుగ్రీవాంగద జాంబవంత సుషేణ
ముఖ్యదనుజ వానర భల్లూకవగులును భరతుడు గుహుండు శత్రుఘ్నులకు నుచిత
భంగుల వందనాది కృత్యంబులు జరిపిరంత రామచంద్రుండుగురు జనని బంధుమిత్రా
మాత్య పౌరజన దర్శనోల్లాసియై సత్వరంబున పుష్పకంబుడిగ్గి ధరణిజ సౌమిత్రి
సహితుండై వసిష్ఠునకు నతని యంగనారత్నంబునకు పణమిల్లి వారల యాశీర్వచ
నంబులుగైకొని మరియును ॥

క॥ జననులకు మ్రొక్కి వారలు ♦ కనుగవ నానంద బాష్పకణములు రాలన్
తనయుల నక్కునచేర్చిరి ♦ యనుమోదముతోడ నప్పుడంబుజ వదనా ॥

వ॥ యనంతరంబ ధరణీనందన మ్రొక్కిన యక్కునంజేర్చి యాశీర్వదించిరి
భరతలక్ష్మణ శత్రుఘ్నుల భార్యలు తనకు మ్రొక్కిన జనకనందన మన్నించెనంతరామ
చంద్రుండు మంత్రి విద్వజ్జన కవిగాయకవంది మాగధసందోహంబును పరివార వర్గం
బును పౌరజానీకంబులను నుచిత చిత్తులంగావించి యయోధ్యా గమనోన్ముఖుండై

అప్పుడు ।

క॥ పనిగల యప్పుడు తలచిన • జను డెంతువు గాకయనుచు జనకజ యప్పుడా •
ఘనమని పుష్పకమనిచిన • చనియెఁ బౌలస్త్యుజేర సత్యాన సతియున్ ।

వ॥ అంతవసిష్ఠాను మతంబున రామచంద్రుండు సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న సహితుండై జటావల్కలంబులు విడచి మంగళస్నానం బాచరించి దివ్యాంబరంబులును మణిభూషణంబులు దాల్చి యరుంధతీ విభుండు మున్నుగా రథా రోహణంబుచేసె నప్పుడు ॥

సీ॥ పావని ధవళాత పత్రంబు బట్టెను పావాలు భరతుండు భక్తిగొనియె • యినతనూజ నిశాచరేశులు వింజామరమ్ములు దాల్చిరి సెన్మితోడ • చారుకోదండ నిషంగంబులర్థితో ధరియించె శత్రుఘ్నుడురు రయమున • తాంబూలపెట్టియ జాంబవంతు డెత్తె ఘనతర ఖడ్గమంగదుడు మోచె • సరవి లక్ష్మణుండు శత్రుంజయంబను కుంజరంబు నెక్కె కొమరు మిగుల • కేతనంబు బూనె కెలకులముందర • బలములెల్ల నడిచె బంధురముగ ।

క॥ కర కెంపు నందలంబుల • తరుచరవర భామినులును దైత్యాంగనలున్ •
మెరయుచు నానందంబున • ధరణీసుతం గొలిచి చనిరి తాత్పర్యమునన్ ।

వ॥ ఇవ్విధంబున కౌసల్యాది జననులును భరత ప్రముఖ సోదరులును సుమంత్రాద్యమాత్యులును విభీషణ ముఖ్య రాత్రించరులును సుగ్రీవ ప్రభృతి వానరులును గుహాది నిషాదులును మరియు బంధుమిత్ర పరిజనంబులును కరితురగస్యందన వీరభట సందోహంబును విద్వత్కవిగాయక వందిమాగధ బృందంబును పౌరజన సమూహంబును బలసి యేతేర పుణ్యాంగనా జనంబులు సేసలిడ శంఖభేరీ మృదంగ వాద్య ఘోషంబును వందిమాగధ కైవారంబును గాయకని నదంబును కరిఘీంకార శబ్దంబును తురంగమ హేషారవంబును రథనేమిధ్వనులును నొక్కటై దిక్కులు పిక్కటిల్ల నంబరతలంబున సంగ వాయుక్తులై విమానంబులపై నిలచి రావణకుంభకర్ణాది రాక్షస సంహారదంబుగ్గడించి జయజయ ధ్వనులొసంగు వినుతులుగై కొనుచు మాన్యులగు వారిడగ్గరి యేతేర నియోగించి సరససల్లాపంబు లాడుచు యెడనెడ సందడి యెడగలుగం జడియు బ్రిద్దలవారి వారింపుచు తారాగణ పరివృతుండగు చంద్రుండునుంబోలె సురస మన్వితుండగు నింద్రుండునుంబోలె పరమోత్సవంబున తనరాకల కలంకృతంబైన యయోధ్యాపురంబు సొచ్చి యారఘూత్తముల పారావార సంపూర్ణ చంద్రుండగు రామచంద్రుండు రాజమార్గంబున నరుగు నవసరంబున ।

సీ॥ కనకసౌధములపై ననుమోదమునసల్పి కుసుమవర్షంబులు గురియువారు పరమోత్సవంబున పాటలుపాడుచు సరవితో సేసలు జల్లువారు ♦ మణిదీపకళికలు మహితభంగులనించి యేలమిసె రాజన మిచ్చువారు ♦ పట్టభద్రుండవై పాలించుమమ్మని యొనరగాదీవన లొసగువారు ♦ చొప్పడప్పక కాంక్షతో జూచువారు ♦ కరము సంభ్రమ చిత్తులై పరగువారు ♦ నగుచు పురకాంతలొప్పి రయ్యర్కవంశ ♦ తిలకుడగు రామ చంద్రుడే తెంచునపుడా ॥

వ॥ అంత ॥

సీ॥ కనకవేదికలును ఘనకేతనంబులు మణితోరణంబులు మహితనూత్న ♦ శాతకుంభంబులు సద్రత్నకలిపిత కుడ్యంబులును చారుగోపురములు ♦ పద్మరాగాంచిత భాసురస్తంభముల్ లలితచిత్రవిచిత్ర లాంఛనములు ♦ సురుచిర వైడూర్యశోభిత ద్వారముల్ కర్పూరచందనా గరుసువాసి ♦ తోక్తవరరాజ మార్గంబు లొప్పుదనరు పక్వఫల కుసుమజాలకపూర్ణలలిత ♦ భాసురోద్యాన వనములు బంధురాబ్జ ♦ కుముదకల్హార వనజాకరములు మరియు ॥

వ॥ మెడనెడంగల్గు విశేషంబులు గనుంగొనుచు ముఖంబున చిరునవ్వొలయ నరిగిముందట ॥

సీ॥ కైలాసశిఖర వికాసితంబునుసర్వ కామ ఫలప్రద కలిత పక్వ ♦ ఫలదళ కుసుమనభ్రాద పనిచయంబు రమణీయ్య మణిగణ సుమవినూత్న ♦ పల్లవతోరణ భ్రాజమానంబును వీరభటానీక వేష్టితంబు ♦ సంచిత పంచమహావాద్య శబ్ద ముగలుగు రాజద్వార మెలమి జేరి ♦ నఖిల పరివారములనెల్ల నాదరమున ♦ నచటనుండ నియోగించి యుచితజనులు ♦ మాన్యులును నాప్తవర్గము మాత్యవరులు ♦ తివిరి యేతెంచుచుండ మందిరముసొచ్చి ॥

గీ॥ క్రమము మెలర్పంగ కక్ష్యాంతరములుగడచి ♦ యొనరమ్మ మంటపమున గూర్చుండి కొంత ♦ వడికి సుందరనిండ్లకు వరుసతోడ ♦ నరగనియమించి యామోద మతిశయిల్లా ॥

వ॥ సుగ్రీవ జాంబవదంగ దాంజనేయ గుహాదులసంభావించి మందిరారామ దేశంబులు విడిదలుగావించి తగినవారి నచ్చట విడియుండని నియోగించి తాను పశ్చిమాంతర మందిరంబున కుంజనియె పౌరజనంబులు సంభ్రమంబున నిజనివాసంబుల కరిగిరి రామచంద్రుండనుజ బంధుమిత్ర సహితుండై భోజన కృత్యంబులుదీర్చి సుఖ నిద్రజెంది మరునాడు కొలువు కూటంబున ॥

క॥ భరతుడు చిన్నిజయా యనిశో ♦ భరితుడు రఘురాము పాదపంకజసేవా ♦ నిరతుడు వివర్ధిత బంధుర ♦ సుచరితుడు దినరాజ సుతునితో నిట్లనియెన్ ॥

సీ॥ కృతపుణ్యశీలున కతులధార్మికునకు కలుషదూరునకు విఖ్యాతునకును ♦ సజ్జనునకును భాస్వన్మూర్తికిన్ ఆశ్రితజనపోషునకు సత్యభాషునకు ♦ సువిచారునకు సురశత్రుహంతకంబుజ పత్రలోచనునకు భవ్యునకును ♦ క్ష్మాపాలసంఘ శిఖామణికమిత విక్రమునకు జానకీరమణునకును ♦ రామునకు నీలనీరద శ్యామునకును ♦ ఘనదయాసాంద్రునకు భాస్కరకులాబ్ధి ♦ చంద్రునకు నెల్లి పట్టంబు సమతగట్ట ♦ వలయు విధ్యుక్తముగ కపివంశతిలక ॥

క॥ సమకూరవలయు సంభా ♦ రములన్నియు నింక నీవు గ్రన్నన కపి సం ♦ ఘము బంచు వారినిధి తీ ♦ ర్థములగొని యుదయమునకెల్ల రాగలవారిన్ ॥

వ॥ అనిపల్కిన సుగ్రీవుండు మనోజవానూన సంపన్నులగు వానరవీరుల పెక్కండ్ర రావించి మీరు సాగరతటినీ సమూహంబులతోడ రామచంద్రుని పట్టాభిషేక మహోత్సవం బెరింగించి వారియందులగల్గు పావనజలంబులను దమతోత్సుపూర్వకంబు వడు గొనిరండని నియోగించిన ॥

సీ॥ కపివరులేగి సాగరముఖ్యనదులతో ♦ శ్రీరామ పట్టాభిషేక విధము ♦ వినుపింప నవిమనంబున జాలనుప్పొంగి నయమొప్పమూర్తి వంతములుదాల్చి । సురుచిర భూషణాంబరములు ధరియించి తమయందు గల్గిన విమలజలము । లలరుచు కాంచన కలశంబులను నించి మణిగణాంచితదివ్య మండనములు । నర్థిగ్రైకొని కపులతోనరుగుదెంచి । సుదయవేళకయోధ్యకు సురరయమున నటులనానావనీపాలు రతులభూషణములు గొనివచ్చిరెంతయు ప్రమదమునను ॥

క॥ మరియుం బరమమునీంద్రులు । ధరణీసురవరులు పుణ్యతరుణులు పౌరుల్ । గురువులు వృద్ధులు బాలురు । బరువడియరుదెంచిర పుడుప టుమోదమునన్ ॥

క॥ సురగరుడోరగ విద్యా । ధరకిన్నర సిద్ధసాధ్యతతిగొల్వగ నం । బరవీథినిలచెనింద్రుడు । కరమువిమానములరుచులు గనుపట్టంగన్ ॥

సీ॥ అంతకమున్న రామావనీపాలుండు మంగళతూర్యముల్ మాగధాళివినుతులు చెలగంగ వేనమేలుకని వసిష్ఠానుమతంబున యవనితనయ । తానుసుస్నాతులై మా

## పట్టాభిషేక మహోత్సవము

నిలదివ్యాంబరాభరణములు గంధాది పరిమ । ళములుమాల్యంబులు క్రమమొప్పధరి

యించి కాంచనరత్నసంఘటితరమ్య • మంటపమునకు వేంచేయ మానివర్యు | లప్పు
నవరత్నఖచిన సింహాసనమున | నతని గూర్చుండ నియమించి యమరాభంగి | నతని
నభిషిక్తుఁ జేసిరి వలను మెరసి ||

వ|| మరియును వసిష్ఠ విజయ జాబాలి కశ్యప గౌతమ కణ్వాగస్త్యాదిమునులు వే
మంత్రంబులు నుడువ మంగళతూర్యఘోషంబులు మెరయ మాగధవినుతులు చెలంగ ప
ణ్యాంగనాజనంబులు మంగళపాఠంబులు పాడుచుండ భూసురాశీర్వచనంబులొప్ప
యవాంకుర దూర్వాచూతాది మంగళౌషధీసమేతంబులగు కలశోదకంబుల నదీవల్లభ
నిఖిలబాంధవామాత్య కన్యకాజనంబు లభిషేకంబొనరించిరంత విధ్యుక్తంబుగా సది
వులు ఫాలంబున హేమపట్టంబు గట్టిరి తదనవసరంబున దేవదుందుభులు మెరసె సురలు
పుష్పవృష్టి గురియించి రంభాదిదివిజకాంతలాడిరి గంధర్వులు పరమానురాగంబున
పాడిరి జగంబు ప్రమోదంబునొందె మరియును |

సీ|| ఇంద్రాదిదిక్పతు లింతులతోఁగూడి నా రామచంద్రు పట్టాభిషేక | మెలమిగనుం
గొని పొలుపైన రత్నభూ | షణములొసంగిరి జంభవైరి కనకమాలిక నిచ్చె కౌ
మ్మరమహితాంబ రాభరణముల సొంపావహిల్ల | తటినీవిభుండు సారదమున నొసగెను
నానావనీశులనూనమైన | ప్రేమ నలుకొత్త మండనశ్రేణులిచ్చి | రపుడు రఘుచంద్రు
డసిదాల్చి యబ్జమిత్రు | కరణి పొలుపొందె తనమేని కాంతులెల్ల | దిశలయందును మిక్కి
లి దీటుకొనగ |

వ|| ఇవ్విధంబున పట్టాభిషిక్తుండై పరమోత్సవంబున నారఘునాయకుండు

క|| ధరణీసురులకు మహీతాం • బరరత్నసువర్ణధేను పరజనతురగద్విరదపరివాస
దాసా • పరిమితసంఖ్యల నొసంగె పరమప్రీతిన్ ||

క|| సకలవిబుధులకు కవిగా • యకమాగధనివహమునకు నడిగినయవి కో •
రిగ గల్గి లజ్జచే వే • డకయుండినయవియు కృపకడల్కొననిచ్చెన్ ||

చ|| వెలయఁగ నమ్మహోత్సవము వేళకు సర్వసమాజమంతయున్ • పొలిచెను
భూరుహప్రతతి పుష్పఫలంబులచే మెలంగను • జ్వలగతి తేజరిల్లెను దివాకరుడుద్ధర
యొప్పె నొక్కటన్ • జలధులుబ్బొంగె లోకములు సంతసమందెను వారిజాననా ||

గీ|| అంతరఘుకులవర్ధిష్ణు డఖిలమునుల • కును ద్విజోత్తములకు నిజజనసుల
కును • వృద్ధులకు మ్రొక్కి వారలు ప్రేమనొసగు • దీవనలు గొనియు మరియు నెంతే
మోదమున ||

క|| ఉరుగుణవంతుఁడను శ్రీ • కరుని దయానిధిని బుద్ధికౌశలుని నిరం • తరధర్మ

చిత్రా • హాసముఖాంబుజ యామునభ్రా ॥

గద్య ॥ ఇది శ్రీభద్రాద్రి రామచంద్ర వరప్రసాదలబ్ధ కవితావిచిత్రయా పస్తంబ సూత్రగిరామ నామాత్యపుత్ర గౌతమగోత్రప్రసిద్ధ సిద్ధనమంత్రి ప్రణీతంబైన శ్రీసదాశివ రామాయణంబను మహాకావ్యంబునందు రావణుండు రామబాణ భయార్తుండై కుంభకర్ణుని మేల్కొలుపుటయు కుంభకర్ణుండు రావణునకు నీతిబోధించుటయు రావణుండు కోపింప యుద్ధమునకు వెడలి వానరులమ్రింగుచు యుద్ధంబున రామునిచే నిహతుండగుటయు మహోదర మహాపార్శ్వ నరాంతక దేవాంతకులు వానరులంచే జచ్చుటయు నతికాయుని లక్ష్మణుండు బరిమార్చుటయు యింద్రజిత్తు మాయాయుద్ధంబు గావించి రామలక్ష్మణ వానరులనెల్ల మూర్ఛగావింప హనుమంతుండు సంజీవిపర్వతంబుదెచ్చి యందరంబ్రతికించుట వానరులు లంకగాల్చుట యింద్రజిత్తు యుద్ధంబున యుల్లడిగావించి హోమంబు సేయుచుండుట నదియెరింగి విభీషణుండు లక్ష్మణునితోడ్కొని పోయి వానింజంపించుట రావణుండు పుత్రశోకంబున దుఃఖితుండై కుంభనికుంభులందోలిన వారలు మడియుట రావణుడు శక్తిచే లక్ష్మణుని మూర్ఛగావించుట హనుమంతుండు రెండవసారి సంజీవపర్వతముదేబోయి మార్గంబున కాలనేమి మొదలగు దానవుల వధియించి సంజీవిందెచ్చి లక్ష్మణుని బ్రతికించుట రావణుడు శుక్రునివలన మంత్రోపదేశంబుగొని పాతాళహోమంబు గావింపుట విభీషణుండదియెరింగి హోమంబు విఘ్నంబుచేయించుమని రామునకు చెప్పుట వానరులు సేయు విఘ్నంబులకు రావణుండు చలింపకయున్న అంగదుండంతఃపురంబునుండి మండోదరినీడ్చి తెచ్చుట మండోదరి దీనత్వంబుగని హోమంబువదలి యుద్ధసన్నద్ధుడై వెడలుట రాముండు రావణుని సంహరించుట మండోదరివిలాపంబును విభీషణుండు రావణునిసంస్కరించి పిదప పట్టాభిషిక్తుండగుట సీతారాముని దర్శించుట రాముండు సీతపై దోషంబారోపించి యగ్నింబ్రవేశపెట్టుట ప్రతిహారోత్తముండు సీత నిర్దోషురాలని చెప్పి రామునకొప్పగించుట బ్రహ్మాదిదేవతలు లంకకేతెంచుట యింద్రుండమృతవృష్టిచే మృత వానరులనెల్ల బ్రతికించుట రాముండు కుబేరపుష్పకము నెక్కి విభీషణాది సపరివారముగా నయోధ్యకు పోవుట విమానంబు పోవుచుండ రాముండు సీతకు సేతుబంధనాది కార్యంబు లెఱింగింపుచు కిష్కింధం జేరి తారాదివానరపత్నుల వెంబడించి పంపాపంచవటీ చిత్రకూటంబులు చూచుచు భరద్వాజాశ్రమంబులు చేరుట హనుమంతుని గుహభరతుల పాలికిం బంపుట గుహుండు భరద్వాజాశ్రమంనకు వచ్చి రాముని సేవించుట భరతుండు రామాగమనంబు విని పట్టణంబు శృంగారించుట కనుజ్ఞ సేయుట శత్రుఘ్నుండు నగరంబెల్ల యలంకా

రంబు గావించి నందిగ్రామంబుచేరుట రాముని పురప్రవేశము శ్రీరాముని పట్టాభిషేకము • రాముండు సుగ్రీవాది సకలవిధజనంబులకు బహుమానంబులిచ్చి పంపుట శివుండు పార్వతికి ఫలశృతి వినుపించుట నను కథలంగర యుద్ధకాండ ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

॥ తేగీ ॥ గ్రంథరూపుండు భద్రాద్రి రాముడెల మి • మత్స్యరాజేంద్రవరకుల మండనునకు • భోగభాగ్యంబు సురపతి బోలుశిరులు• నాయువసగును తిర్నల రాయ మణికి ॥

పంచపాది చంపకము,

తిరుమల రాయధీమణి సుధీజన మాన్యున నుగ్రగ్రంధముగా • కరమను రక్తి వాశ్రితి యగాధజలంబుల నాంజనేయుడే • గరిమనుదాటి సీసతిని గాంచినయట్లు సుబోధకంబుగా • భరితయశుండు సిద్ధన కృపామహిమంబను నావలేక నా • తరమెక విత్వసాగరముదాటగ భద్రిగిరీశ రాఘవ ॥



శ్రీసదాశివ రామాయణము యుద్ధకాండ ౨ ఆశ్వాసముతో సర్వం సంపూర్ణము



—:( శ్రీరామచంద్రమూర్తి నివేకలవు ):—

# * విజ్ఞాపన *

మహాశయులగు పండితోత్తములార నాకు బాల్యంబునుండి యాంధ్రపద్యంబుల యందు నభిరుచియెక్కువయయిన మిక్కిలి చిన్నతనంబున పితృవియోగుడనై మాతృచే పోషింపబడి విద్యలేక నూరక వయస్సు సంప్రాప్తమై కొంతకాలంబునకు గణ యతి ప్రాస లక్షణంబులు బొత్తిగా తెలియక పండిత కవులు కృతులయందు వదలి వేసిన యెంగిలి పదంబులు సొల్లనేరిచి నేనొక కవినని చెప్పుకొనుటకు నాసాహసంబు నాకే యచ్చెరువయ్యెడి నదియునుంగాక రా! పైతిల్మలరావుగారు నిర్ణయించిన కార్యంబు నిర్వహించుటకు యెంత బాలిశబుద్ధి అయిన మొదటనె నా కవిత్వమెంత అనియెను పద్యంబున తేటపరచితిని బాలుండు బెండుయూతగొని జలంబులనీదిన భంగిసిద్ధన మంత్రి కృపాతిశయంబును శ్రీరామచంద్రమూర్తి కరుణాకటాక్షణాశక్తియు నీగ్రంథ మూలంబు నిర్వహింపజేసినది అయిన బెండువదలి జలంబులీదినయెడ బాలుని ప్రజ్ఞ తెలియును యీగ్రంథము పండితులు కటాక్షించిన దీనియందలి గుణాగుణంబులు వెల్లడియగును కావున సిద్ధనమంత్రి కూర్పునకు నాకూర్పునకు మధ్యన నక్షత్ర సంఖ్య గలగురుతు చుక్కనుంచి మధ్యవారి కవిత్వమునకు *సి* యనియు నాకూర్పునకు *న* అనియు సంకేతపరచి యుంచితిని కావున నాయొక్క కూర్పునందు గుణదోషంబులు గల్గియున్న హంసంబు నీరువదలి క్షీరంబులు స్వీకరించు విధంబున గుణంబులు స్వీకరించి దోషంబులకున్నన్ను బాధ్యునిచేయుగలరని ప్రార్థింపుచున్నవాడను.

ఇట్లు,

వెలికట్టె నరసింహాచార్యులు

